

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010011402



**SaiRealAttitudeManagement**(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ముందుమాట

భారతజాతి యావత్తూ మహదానందంగా స్వతంత్ర్య స్వర్ణోత్సవాలు జరుపుకొంటున్న సందర్భంగా ఇదివరలో మేము ప్రచురించిన సుప్రసిద్ధ విద్యావేత్త, చరిత్ర పరిశోధకులు శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యగారు రచించిన "హిందూదేశ చరిత్ర"ను పునర్ముద్రించాలని నిర్ణయించడం జరిగింది. చరిత్రకు సంబంధించిన ప్రామాణిక గ్రంథాలలో ఒకటిగా పరిగణించబడే ఈ గ్రంథం చరిత్ర పట్ల ఆసక్తి గల వారికి. విద్యార్థులకు, పరిశోధకులకు మిక్కిలి ఉపయోగకరం.

ప్రత్యేకించి పోటీ పరీక్షలకు హాజరయ్యేవారికి మరియు సివిల్ సర్వీసెస్ ప్రిలిమినరీ పరీక్షలకు హాజరయ్యే విద్యార్థులకు ఎంతైనా ఉపయోగకరం. మా ఈ ప్రయత్నానికి మీ ఆశీస్సులుంటాయని భావిస్తున్నాము.

- ప్రచురణ కర్తలు

# పీఠిక

ప్రాచీనకాలమందుండి ప్రసిద్ధి గాంచిన దేశములలో మన దేశమొకటి. అయిదారువేల సంవత్సరములకు పూర్వమే మనవారు ప్రశంసింప దగిన నాగరికతను నిర్మాణము చేయగలిగిరి. అందులోని లక్షణములలో ననేకము లిప్పటికికూడ కనుపించుచున్నవి: ఇది మన చరిత్రలో గమనించ దగిన గొప్ప విశేషము. ఈ మధ్య కాలమున మన మతములలోను, సంస్కృతిలోను అనేక మార్పులు సంభవించెను. తత్వవేత్తలు, కవులు, చిత్రకళా నిర్మాతలు, సంస్కర్తలు వారివారి ప్రజ్ఞను వారి కుచితమైన రంగములలో ప్రదర్శించిరి. వేలకొలది సంవత్సరముల క్రిందట ప్రారంభమైన ఈ పరిణామము అంతరాయము లేక ఇప్పటివరకు జరుగుచున్నది. ఇటీవలి కాలమున పరాయి ప్రభుత్వమును తొలగించి స్వరాజ్యమును సంస్థాపించుటకు మనము చేసిన ప్రయత్నము దీనిలో ఒక ప్రధానభాగము. దేశమందిప్పుడు సర్వతోముఖాభివృద్ధికై ప్రజలు, నాయకులు పాటుబడుచున్నారు. ఈ సందర్భములో దేశచరిత్రకు సంబంధించిన విజ్ఞానము ఎంతో సహాయకారి కాగలదు. ఇట్టి జ్ఞానమును లభింపజేయు నుద్దేశముతో నీ గ్రంథము వ్రాయబడినది. ఇది ఉన్నత పాఠశాలలలో విద్యనభ్యసించు విద్యార్థులకే గాక ప్రజాసామాన్యమునకు కూడ నుపయోగించగలదని విశ్వసించుచున్నాను. ఇందులోని దోషములను, లోపములను తెలియపరచిన యెడల వానిని కృతజ్ఞతాపూర్వకముగ సంస్కరించుటకు సిద్ధముగ నున్నాను.

మద్రాసు

5-8-55 మామిడిపూడి వెంకట రంగయ్య.

# విషయ సూచిక
## మొదటి భాగము

# రెండవ భాగము

# హిందూదేశ చరిత్ర

## మొదటి ప్రకరణము

## ఉపోద్ఘాతము

విషయములు: – పూర్వయుగము, సింధునాగరికత, ద్రావిడులు, ఆర్యులు, ఆర్యులమతము, ఆర్యుల రాజ్యములు, మహాభారతము.

### 1. పూర్వయుగము

పూర్వయుగము : - ప్రాచీనకాలపు దేశచరిత్రను తెలిసికొనుటకు రెండువిధములగు ఆధారములున్నవి. లిఖితములగు ఆధారములు కొన్ని; లిఖితములు కానివి కొన్ని. వేదములు, పురాణములు, ఇతిహాసములు, ధర్మశాస్త్రములు మొదలగునవి లిఖితాధారములు; పూర్వులుపయోగించిన ఆయుధములు, పనిముట్లు, వారు నిర్మించిన పట్టణములు, ఇండ్లు, వారు పూజించిన విగ్రహములు, చిత్రించిన శిల్పములు మొదలగునవి లిఖితములుకాని ఆధారములు. మనదేశపు గ్రంథములన్నిటిలో ఋగ్వేదము ప్రాచీనమైనది. అది క్రీ.పూ. 2,500 ప్రాంతమునాటిదని అనేకుల అభిప్రాయము. అది మొదలు ఇప్పటివరకు జరిగిన చరిత్రమును తెలిసికొనుటకు మనకు లిఖితములగు ఆధారములున్నవి. అంతకు పూర్వము వేలకొలది సంవత్సరముల పర్యంతము మనుష్యులు మన దేశమున నివాసము చేయుచుండిరి. వారిని గురించిన వివరములు లిఖితములు కాని ఆధారముల మూలముననే తెలిసికొనవలసియున్నది. ఆధారములలో గల యీ భేదమునుబట్టి దేశచరిత్రమును రెండు యుగములుగ విభజింపవచ్చును. లిఖితములుకాని ఆధారములు మాత్రమే మనకు సహాయకారులుగ నుండు కాలమునకు పూర్వయుగమనియు, లిఖితములగు నాధారములు సహాయకారులుగ నుండు కాలమునకు చరిత్ర యుగమనియు శాస్త్రకారులు పేర్లుపెట్టియున్నారు. ఈవిభాగము ననుసరించిన యెడల సృష్ట్యాదినుండి క్రీ.పూ. 2,500 వరకు పూర్వయుగమనియు, క్రీ.పూ. 2,500 మొదలు ఇప్పటివరకు చరిత్రయుగమనియు మనము చెప్పవచ్చును.

**శిలాయుగము:-** పనిముట్లు, ఆయుధములు మొదలగువానిని తయారు

చేయుటకు మనుష్యులుపయోగించుచుండిన సామగ్రినిబట్టి పూర్వ యుగమును శిలాయుగమనియు, లోహయుగమనియు విభజించుట కలదు. శిలాయుగములోనివారు వారి పనిముట్లను ఱాతితో చేసికొనుచుండిరి. తర్వాత చాలకాలమునకు ఱాతికిబదులు రాగి, కంచు, ఇనుము మొదలగు లోహములతో పనిముట్లను చేసికొను నేర్పు వారికి కలిగెను. ఱాతియుగమున మనదేశమందు నివసించుచుండినవారు గొడ్డలి, బొరిగె, కత్తి, కోరము, సుత్తి మొదలగు ఱాతి పనిముట్లను తయారుచేసికొని వారి ఆహారమును సంపాదించుకొనుచుండిరి. నిప్పును చేయుటకూడ వారికి తెలియనందున మాంసమును, కాయలను, కందమూలములను వంటచేయకయ్యే వారు తినుచుండిరి. వారికి వస్త్రములు లేవు. వేటాడిన మృగచర్మములను భుజములపై వేసికొని వారు తిరుగుచుండిరి. మృగములవలె వారు చెట్లక్రిందను, పొదలయందును, గుహలయందును నివాసము చేయుచుండిరి. కావలసిన ఆహారము ఒకే ప్రదేశమందు దొరకకుండుటచేత వారు దేశద్రిమ్మరులై యుండిరి.

నవశిలాయుగము : - వేలకొలది సంవత్సరములు ఈ విధముగ గడచిన తర్వాత వ్యవసాయము మూలమున ఆహారమునుత్పత్తి జేసికొనగల మనుష్యులు మనదేశమందు కనుపించిరి. వారు మొదటినుండియు మనదేశమందుండినవారో, లేక విదేశములనుండి ఇచటికి వచ్చినవారో నిశ్చయించుటకు వీలులేదు. వీరుకూడ ఱాతి పనిముట్లనే ఉపయోగించుచుండిరి. కాని, వీరి పనిముట్లు నాణ్యములుగను, నున్నవిగను ఉండుటచేత వీరిని నవశిలాయుగపు మనుష్యులని చెప్పుట కలదు. వీరు జంతువులను మచ్చికచేయ నేర్చుకొనియుండిరి. కుండలుచేయుట, బట్టలునేయుట, ఇండ్లుకట్టుకొనుట మొదలగు పనులు వీరికి తెలిసియుండెను. వీరుపయోగించుచుండిన పనిముట్లు, కుండలు మొదలగువాని శిథిలములు మనదేశమందంతట లభించినవి. వానినిబట్టి వీరు కొంతవరకు నాగరికులని చెప్పుట కవకాశమున్నది.

జాతులు : - శిలాయుగమందు మనదేశములో నివసించుచుండినవారు ఏయే జాతులకు సంబంధించియుండినవారో చెప్పుటకు వీలులేదు. శరీరముయొక్క బాహ్యలక్షణములబట్టి - అనగా కపాలము, నుదురు, ముక్కు, వెండ్రుకలు మొదలగు వానియొక్క లక్షణములబట్టి - ప్రత్యేకింపబడిన మనుష్య సముదాయమునకు 'జాతి' అని పేరు. బుద్ధి, తెలివితేటలు, యోగ్యత మొదలగు ఆంతరంగిక లక్షణములకును జాతికిని సంబంధము లేదన్నమాట మనమెన్నటికి మరువకూడదు. ప్రప్రథమమున మనదేశమందుండిన వారు "నీగ్రిటో" జాతివారని అనేకుల అభి ప్రాయము. వీరికి

తర్వాత "ఆస్ట్రలాయిడ్" జాతివారు వచ్చిరి. వీరు "ముండారి" భాషలను మాటలాడుచుండిరి. సంతాలులు, భిల్లులు, కోదులు, సవరలు వీరి సంతతివారే. నవశిలాయుగపు నాగరికతను నిర్మించినవారు వీరే. వీరికి తర్వాత వచ్చినవారు "మెడిటరేనియన్" జాతివారు. నౌకానిర్మాణమందు, సముద్ర ప్రయాణమందు, నగరముల కట్టుటయందు, వ్యవసాయమందు వీరి కెక్కువ నేర్పు. వీరు మాటలాడుచుండిన భాష ద్రావిడమని చెప్పవచ్చును. దాని నుండియే ఇప్పటి అరవము, ఆంధ్రము, కన్నడము, మలయాళము పుట్టినవి. మెడిటరేనియన్ జాతివారే ద్రావిడులు. వీరికి తర్వాత వచ్చినవారు ఆర్యులు.

ఈ వివిధ జాతులవారు మనదేశమందు వేలకొలది సంవత్సరములుగ నుండుటచేత ఒకరితో మరియొకరు కలసిపోయిరి. స్వచ్ఛమైన "మెడిటరేనియన్" లుగాని, ఆర్యులుగాని ఇప్పుడెవ్వరు లేరు. ద్రావిడ భాషలను మాట్లాడువారందరు ద్రావిడజాతివారనిగాని, హిందీ, బంగాళీ మొదలగు సంస్కృతభాషలు మాటలాడువారందరు ఆర్యులనిగాని అనుకొనుట గొప్ప పొరబాటు. భాషకును జాతికిని సంబంధము లేదు.

## 2. సింధు నాగరికత

**మొహంజోదారో, హరప్పా :-** లోహ యుగమందలి నాగరికతను వివరించుటకు మొహంజోదారో, హరప్పా అను పురాతనపట్టణములకు సంబంధించిన శిథిలములు మనకు తోడ్పడుచున్నవి. మొహంజోదారో సింధు రాష్ట్రమందున్నది; హరప్పా పంజాబు రాష్ట్ర మందున్నది. ఈ శిథిలములు 1921-22 ప్రాంతమున బలయల్పడినవి. సింధు





మొహంజోదారోలో బయల్పడిన ఒక పట్టణము.

నది ప్రవహించు ప్రదేశమందు ఈ నాగరికత వ్యాపించియుండినందున దీనికి ''సింధు నాగరికత'' అని చరిత్రకారులు పేరుపెట్టియున్నారు.

పట్టణములు : - ఈ నాగరికత క్రీ.పూ. 3,500 మొదలు వేయిసంవత్సరముల కాలము ఉన్నతస్థితియందుండెను. ఆకాలపువారు వాస్తుశిల్పమందెంతో నేర్పు గలవారు. వారి పట్టణములు, వీథులు, మేడలు, మంటపములు - అన్నియు శాస్త్రపద్ధతిని నిర్మింపబడియున్నవి. వీథులు విశాలముగను, తిన్నగను ఉన్నవి. రెండు మూడంతస్తులుగల మేడలు, అనేక స్తంభములతోగూడిన సభామంటపములు, విశాలములగు పణ్యాగారములు ఉండెను. వీథులనుండియు, ఇండ్లనుండియు మురికినీరు వెళ్లిపోవుటకు గొట్టములు, కాలువలు ఏర్పరుపబడియుండెను. స్నానముచేయుటయందు వారికెక్కువ ప్రీతి. ఇందుకైపట్టణమునందనేక ప్రదేశములందు వారు స్నానఘట్టములను నిర్మించుకొని యుండిరి. అందులో కొలనులు, కొలనులలోనికి నీరువచ్చుటకు నూతులు, కొలనుల గట్టున గదులు ఉండెను. కాల్చిన ఇటుకలతోను, సున్నపు గచ్చుతోడను వారు వారి కట్టడముల నన్నిటిని కట్టుకొనుచుండిరి.

శిల్పములందు వారికిగల నేర్పు : - వారు ప్రత్తి, గోధుమలు, యవలు మొదలగు పంటలను పండించుచుండిరి. ధాన్యములతోబాటు చేపలు, మృగముల మాంసము వారు ఆహారముగ వాడుకొనుచుండిరి. గొడ్డలి, పండ్లతో గూడిన అంపము, కత్తి, ఈటె,బల్లెము, ఉలి, చేపల గాలము, త్రాసు మొదలైన ఉప కరణములను రాగితోడను, కంచు తోడను వారు చేసికొనుచుండిరి. కదుళ్ళతో నూలువడికి, దానినుండి తయారుచేసిన నూలుబట్టలను వారు కట్టుకొనుచుండువారు. రక రకములగు కుండలు, బానలు మొదలగు మట్టిపాత్రలను చేయుట యందు వారి కెక్కువ నేర్పు. వానిపైరంగులనుపూసి, నునుపుచేసి, చిత్రాకారములనేకములను చిత్రించుచుండిరి. బంగారు, వెండి, రాగి మొదలగు లోహములతో తయారుచేయబడిన హారములు, కంకణములు, అంటుజోళ్ళు, గాజులు, ఒడ్డాణములు, అందెలు, కడియములు, ముక్కరలు మొదలగు ఆభరణములను వారు ధరించుచుండిరి. మైపూతలు, కాటుక, దువ్వెనలు, అద్దములు, పిన్నులు (Hair pins) ఆకాలపువారికి క్రొత్తలుకావు. మట్టిపిడతలు, బండ్లు, బొమ్మలు, గిలకలు ఆకాలపు పిల్లలయొక్క ఆటవస్తువులు. చదరంగము, నాట్యము, వేట, కోడిపందెములు అప్పటి వారి వినోదములు.

ముద్రలు (Seals): - వ్యవహారములు జరుపుకొనుటయందు వివిధములుగ చిత్రించిన ముద్రలను ఆకాలపువారు వాడుచుండిరి. ఈ ముద్రలపై అనేకములైన

వ్రాతలు కనుపించుచున్నవి. ఇవన్నియు చిత్రలిపియందు వ్రాయబడిన వ్రాతలు. దీని అర్థమును చరిత్రకారులింకను తెలిసికొనలేకున్నారు.




Copyright: Govt. of India.

మొహంజోదారోలో త్రవ్వబడిన వస్తువులు

A) పిల్లి తల, (B) స్త్రీయొక్క తల, (C) ముద్ర, (D) చిత్రింపబడిన కూజా

**వారి మతము:-** ఆ కాలపువారు చెక్కిన విగ్రహములనుండియు, ముద్రలనుండియు వారి మతమెట్టిదో చెప్పవచ్చును. వారెక్కువగా "అమ్మతల్లి" దేవతను పూజించుచుండిరి. లోకమాత, ఆదిశక్తి, భూదేవి, పోలేరమ్మ, నూకాలమ్మ మొదలగు పేర్లతో ఇప్పటికికూడ మనము పూజించుచుండు దేవత యీమెయే. పురుషదేవతలలో ఆ కాలపువారు పూజించుచుండిన ముఖ్యదేవతకు నాలుగు ముఖములు, మూడు కండ్లు, అనేక మృగముల పరివారము ఉండెను. ఈ దేవతకే తర్వాతి కాలమున శివుడనియు, పశుపతి యనియు, త్రినేత్రుడనియు పేర్లు కలిగెనని అనేకులు చెప్పుచున్నారు. వారు పూజించిన మరికొన్ని దేవతలు కొంతవరకు మనుష్యాకారమును, కొంతవరకు మృగాకారమును కలిగియున్నవి. నంది, పులి, ఏనుగు, మహిషము మొదలగు జంతువులను కూడ వారారాధించుచుండిరి. ఈజంతువులు పురాణములలో వర్ణింపబడియుండు కొన్ని దేవతలకు వాహనములుగ

నున్నవి. జంతువులతోబాటు రావిచెట్టు, వేపచెట్టు మొదలగు కొన్ని చెట్లను వారు పవిత్రములుగ భావించుచుండిరి. లింగమును పూజించు ఆచారముకూడ వారియందుండెను. సూర్యుని కూడ వారు పూజించుచుండిరని చెప్పవచ్చును. యోగసమాధియందున్న పురుషుల విగ్రహములు కొన్ని దొరికినందున ఆ కాలపువారు యోగాభ్యాసము చేయుచుండిరని చెప్పుటకు వీలున్నది. ధూప, దీప, నైవేద్యములతో వారు వారి ఇష్టదేవతలను ఆరాధించు చుండిరి.

తాయత్తులయందు వారి కెక్కువ నమ్మకముండెను. వానిమీద వ్యాఘ్రము, మహిషము, అజము, మకరము యొదలగు మృగములను చిత్రించి, వానిని ధరించుకొనుచుండిరి. దేవతల అనుగ్రహమును సంపాదించుటకు వారు ప్రతిమలను, బొమ్మలను దేవతల కర్పించుచుండిరి. పూజా సమయములందును, జాతరలయందును నాట్యము చేయుట, చిందులుత్రొక్కుట, తప్పెటలవాయించుట వారి ఆచారము. వీనినిబట్టి సింధు నాగరికతలోని లక్షణములు ఎన్నెన్ని యిప్పటి మన నాగరికతలో ఉన్నవో స్పష్టమగుచున్నది.

## 3. ఆర్యులు

**ఆర్యులు, ద్రావిడులు :** - సింధునాగరికతతో ప్రకాశించుచుండిన మన దేశమున క్రీ.పూ. 2,500 ప్రాంతమున 'ఆర్యులు' ప్రవేశించిరి. వారి భాష సంస్కృతము. సంస్కృతములోని కొన్ని మాటలకును, గ్రీక్, లాటిన్, జర్మన్, స్లేవోనిక్, ప్రాచీన పారశీకము మొదలగు భాషలలోని కొన్ని మాటలకును ఎంతో పోలిక యుండుటవలన యీ భాషలన్నియు ఒకే మాతృభాషనుండి పుట్టినవని చెప్పవచ్చును. అదియే ప్రాచీన ఆర్యభాష. దానిని మాటలాడుచుండినవారే ఆర్యులు. క్రీ.పూ. 2,500 ప్రాంతమున మనదేశమునకు వచ్చినవారు ఈ ఆర్యుల సంతతివారే.

ఆర్యులు ఐరోపాఖండమందలి జెకోస్లోవేకియా ప్రాంతమందు కాపురము చేయుచుండినవారనియు, అచటినుండి అనేక శాఖలుగ చీలి, ఐరోపా, ఆసియాలలోని వివిధ ప్రాంతములకు వెళ్ళిరనియు, అట్లు వెళ్ళినవారిలో కొందరు ప్రస్తుతపు ఆఫ్గన్ స్థానమును సమీపించి, కొంతకాలమచటనుండిన తర్వాత రెండు శాఖలుగ విడిపోయి, ఒక శాఖవారు పారశీక దేశమును చేరిరనియు, రెండవశాఖవారు మనదేశములోని పంజాబుకు వచ్చిరనియు అనేక చరిత్రకారులు చెప్పుచున్నారు. అప్పటికి మన దేశమందుండినవారు ద్రావిడులై ఉండవచ్చును. సింధునాగరికతను నిర్మించినవారు ఈ ద్రావిడులేమో! ఆర్యులకును, ఆర్యేతరులగు ద్రావిడులకునూ పరస్పర సంఘర్షణము,

సంపర్కము కలుగుచు వచ్చెను. ఈ కారణములచేత ఆర్యుల నాగరికతయు, ఆర్యేతరుల నాగరికతయు కలసిపోయి, రెండు నాగరికతలలోని విశేషములతో కూడిన హైందవనాగరికత యేర్పడెను.

**ఆర్యుల మతము** :- ఆర్యులు ప్రకృతిలోని మహాశక్తులకు దైవత్వ మారోపించి వానిని పూజించుచుండిరి. అట్టి దేవతలలో వరుణుడు, ఇంద్రుడు, సూర్యుడు, అగ్ని, మరుత్తు, రుద్రుడు, పర్జన్యుడు, ఉషస్సు, అశ్వినులు ప్రధానులు. వీరిలో స్త్రీ దేవతలు ఎక్కువగ లేరు. జంతువులను, వృక్షములను పూజించు ఆచారము కూడ వారియందు లేదు. ఇంద్రాది దేవతల అనుగ్రహమును సంపాదించుటకు వారు యజ్ఞయాగములను చేయుచుండిరి. అట్టి సమయములందు వారు పాలు, నెయ్యి, ధాన్యము, సోమరసము, మాంసము మొదలగువానిని అగ్నిద్వారా హోమముచేసి దేవతల కర్పించుట కలదు. ఐహికసంపదలను, దీర్ఘాయువును, పుత్రపౌత్రాభివృద్ధియు, మరణానంతరము స్వర్గసౌఖ్యములు యజ్ఞములుచేసినగాని తమకు లభింపవని వారి నమ్మకము. యజ్ఞములందు వేదమంత్రములను పఠించి, కర్మలనన్నిటిని సక్రమముగ చేయించి సామగాన మొనర్చుచుండిన బ్రాహ్మణులయందు వారికెక్కువ గౌరవముండెను. ఋగ్వేదకాలములో సులభముగ ముగియుచుండిన క్రతువులు తర్వాత కాలమందు సత్రయాగములను పేరిట నెలలకొలది, సంవత్సరములకొలది జరుగుచుండెను. యజ్ఞకలాపము పెరుగుటచేత బ్రాహ్మణుల యందు ప్రజలకుగల గౌరముకూడ పెరుగుచు వచ్చెను. యజుర్వేద, సామవేద, అథర్వణవేద కాలమందును, బ్రాహ్మణకాలమందును ఈ మార్పులు జరిగినవి.

తరువాత ఆరణ్యకములు, ఉపనిషత్తులు అను మరికొన్ని గ్రంథములు బయలుదేరినవి. వీనియందు వివరింపబడిన మతము వేదములలోని మతముకంటె కొన్ని విషయములందు భిన్నముగనున్నది. వీనిని రచించిన ఋషులు యజ్ఞయాగాదికర్మలవలన కలుగు స్వర్గసుఖము శాశ్వతము కాదనియు, శాశ్వత సుఖమును సంపాదించుటకే మనుష్యుడు ప్రయత్నము చేయవలెననియు, అదియే ముక్తి అనియు, దానికి జ్ఞానము మార్గమనియు బోధించిరి. ఈ ఋషులలో అనేకులు ప్రపంచసుఖములను వదలి, అరణ్యములకు వెళ్ళి, యోగమార్గము నవలంబించి, తపస్సుచేసి, సత్యమిదియని కనుగొనిన మహానుభావులు. ప్రతిమనుష్యునియందు ఆత్మ ఉన్నదనియు, ఆత్మకు చావులేదనియు, మనుష్యుడనుభవించు సుఖదుఃఖములకు అతడు పూర్వజన్మములోచేసిన కర్మయే కారణమనియు, ఎంతటివానికైనను కర్మఫల

మనుభవింపక తప్పదనియు, ఇందుకొరకే మనష్యుడనేకజన్మములనెత్తుచుండుననియు వారు బోధించిరి. పునర్జన్మము, కర్మ --- ఈ రెంటిని గురించిన సిద్ధాంతములు మన దేశమందు పుట్టిన మతములన్నిటికి ఆధారములయ్యెను.

**ఆర్యుల రాజ్యములు :** - పంజాబును ప్రవేశించిన ఆర్యులు అనేక తెగలుగ విభజింపబడియుండిరి. వీరిలో పూరులు, తుర్వసులు, యదువులు, అనువులు, ద్రుహ్యులు, భారతులు అనువారు ముఖ్యులు. ఒక్కొక్క తెగకు ఒక రాజుండెను. పురోహితు డతనికి కుడిభుజమై అతనిచేత రాజ్యము చేయించుచుండెను. సేనానియు, గ్రామణియు అతని ననుసరించి యుండిరి. ప్రతి రాజ్యమందును ప్రముఖులతో కూడిన సభయు, సామాన్యులతో కూడిన సమితియు రాజునకు సలహాల నిచ్చుచుండెను.

ఈ రాజులు ఆర్యేతరులగు దస్యులతో అనేక యుద్ధములుచేసి వారి పురములను, దుర్గములను నాశముగావించి, వారి రాజ్యములనన్నిటిని వశపరచుకొని, తమ అధికారమును గంగానదీ ప్రాంతమువరకు వ్యాపింపజేసిరి. ఓడిపోయిన దస్యులు ఆర్యులకు దాసులైరి. వారే శూద్రులని అనేకుల అభిప్రాయము. ఒక్కొక్కప్పుడు ఆర్యరాజులు తమలోతాము యుద్ధము చేసికొనుచుండిరి. అట్టియుద్ధము లన్నిటిలో భారతరాజగు సుదానుడు చేసిన పదిరోజుల యుద్ధ మనునది మిక్కిలి ప్రఖ్యాతిగాంచియున్నది.

ఋగ్వేదకాలము తర్వాత ఆర్యరాజ్యములు గంగా,యమునా నదులు ప్రవహించు దేశమందు వ్యాపించెను. విస్తీర్ణమందును, వైభవమందును ఈ రాజ్యములు పంజాబులోని రాజ్యములను మించియుండెను. రాజులయొక్క అధికారము, వారికి సహాయముచేయు మంత్రుల సంఖ్య, వారి సైన్యము --- అన్నియు పెరిగెను. ఇంతటి గొప్ప రాజ్యములను జయించి రక్షించిన యోధులు క్షత్రియులైరి. బ్రాహ్మణులు, క్షత్రియులుకాని ఆర్యులందరికి వైశ్యులను పేరు వచ్చెను. అప్పటి రాజ్యములలో కురురాజ్యము, పాంచాలరాజ్యము సుప్రసిద్ధములు. ఉపనిషత్తుల కాలమునాటికి తూర్పుదేశమందుకూడ ఆర్యరాజ్యములు స్థాపింపబడెను. వానిలో ముఖ్యములైనవి విదేహ, కాశీ, కోసల, అంగ, మగధ రాజ్యములు. విదేహరాజగు జనకుడు తత్త్వవేత్తయని ప్రసిద్ధిగాంచెను.

**మహాభారతము:** - కురురాజ్యమందలి కౌరవ పాండవులకు జరిగిన యుద్ధము మహాభారతమందు వర్ణింపబడియున్నది. ఈ యుద్ధము క్రీ.పూ. 1400 ప్రాంతమున జరిగి యుండవచ్చును. కాని, గ్రంథము మాత్రము తర్వాత అనేక వందల

సంవత్సరములకు పిమ్మట వ్రాయబడినది. అప్పటికి ఆర్యులందెన్నియో మార్పులు కలిగెను. సమస్త వైభవములతో కూడిన పట్టణము లనేకములను వారు నిర్మించిరి.

వ్యవసాయము, పశుపోషణము మాత్రమేగాక నానావిధములగు శిల్పములను, పరిశ్రమలను వారు నేర్చుకొనిరి. అప్పటికి దేశమందనేక రాజ్యములుండెను. శత్రువులనుండి తమకు ప్రమాదము కలుగకుండుటకై రాజులు చతురంగ బలముతోకూడిన సైన్యములను తయారుచేసికొనియుండిరి. సైనికులు వివిధములగు ఆయుధములను ధరించి, యంత్రములు, శతఘ్నులు మొదలగువాని సహాయముతో యుద్ధము చేయుచుండిరి. ప్రజలు వారివారి వృత్తులనుబట్టి నాలుగు వర్ణములుగ ఏర్పడియుండిరి. స్త్రీలకు ఆ కాలమున ఎక్కువ గౌరవముండెను. భారత రమణీమణులగు ద్రౌపది, గాంధారి, సావిత్రి, శకుంతల, దమయంతి మొదలగువారు పరమ పతివ్రతలను ప్రఖ్యాతిని గాంచిరి. రాజ్యాంగవేత్తయని పేరుగాంచిన శ్రీకృష్ణుడు, తానుచేసిన శపథమును నిలబెట్టుకొనుటకై బ్రహ్మచర్యమును పూనిన భీష్ముడు, ఎన్నికష్టములు వచ్చినను ధర్మమును విడనాడని యుధిష్ఠిరుడు, అన్నదమ్ముల ప్రేమయననేమియో చూపు పాండవులు భారతమందు వర్ణింపబడియున్నారు. క్రీ.పూ. ఎనిమిది, ఏడు శతాబ్దములలో మనదేశపు నాగరికత యొక్క లక్షణము లేవియో తెలిసికొనవలయునినిన మహాభారతమును తప్పక చదువవలెను.

## ప్రశ్నలు

1. దేశచరిత్రమును తెలిసికొనుట కాధారములేవి ?
2. (a) పూర్వయుగము, (b) చరిత్రయుగము, (c) పూర్వశిలాయుగము, (d) నవశిలాయుగము --- అననేమో వివరింపుము.
3. పూర్వశిలాయుగపు వారికిని, నవశిలాయుగపు వారికిని గల భేదము లెట్టివి?
4. జాతి అనగానేమి ? జాతికిని, భాషకును సంబంధమేమి ? ఏయే జాతులవారే క్రమమున మనదేశమునకు వచ్చిరి ?
5. ద్రావిడులను గురించి నీకేమి తెలియును ?
6. సింధునాగరికతయను పేరెట్లు వచ్చెను ? దానికి సంబంధించిన శిథిలము లెచట దొరికెను ? అచ్చటివారు నాగరికులని యనుకొనుటకు కారణములెవ్వి? వారి (1) పట్టణములు, (2) శిల్పచాతుర్యము, (3) మతము ఎట్టివి ? ఇప్పటి

మన నాగరికతకును, వారి నాగరికతకును గల సంబంధమేమి ? వారి నాగరికత నశించుటకు కారణములెవ్వి ?

7. ఆర్యులనగా నెవరు ? వారి మొదటి నివాసభూమి ఏది ? వారేమార్గమునుబట్టి మనదేశమునకు వచ్చిరి ? వారెప్పుడు వచ్చిరి ? వారి చరిత్రమును దెలిసికొనుటకు ఆధారములెవ్వి ? వారు ఇండియాలోని ఏ ప్రదేశములందు మొదట కాపురము లేర్పరచుకొనిరి ?
8. (1) ఆర్యుల మతము (2) వృత్తులు (3) రాజ్యములు ఎట్టివి ? కాలక్రమమున వీటియందు కలిగిన మార్పులెవ్వి ?
9. వర్ణభేదము లనగానేమి ? అవి ఎట్లు కలిగెను ?
10. మహాభారత మెప్పటిది ? అప్పటి (1) పట్టణములు, (2) వృత్తులు, (3) సైన్యములు, (4) నీతి ఎట్టివి ?

రెండవ ప్రకరణము

# మగధరాజ్య విజృంభణము

విషయములు :- క్రీ.పూ. ఆరవ శతాబ్దమందలి పరిస్థితులు, మగధ రాజ్యము, జైన, బౌద్ధ మతముల స్థాపన, వాయువ్య భాగమును పారశీకులు, గ్రీకులు జయించుట.

## 1. క్రీ.పూ. ఆరవ శతాబ్దమందలి పరిస్థితులు

సాంఘిక పరిస్థితులు :- సంస్కృతమున వ్రాయబడిన ధర్మశాస్త్రముల నుండియు, ప్రాకృతమున వ్రాయబడిన బౌద్ధ, జైన గ్రంథములనుండియు క్రీ.పూ. ఆరవశతాబ్దమున మనదేశపు పరిస్థితులెట్లుండెనో చెప్పవచ్చును. అప్పటి ప్రజలలో కొందరు అనార్యులుగను, కొందరు ఆర్యులుగను పరిగణింపబడుచుండిరి. అనార్యులకు దస్యులు, చండాలురు, మ్లేచ్ఛులు అను నామంతరములుండెను. వీరు నీచములని యనుకొనబడు వృత్తుల నవలంబించి, గ్రామములకు వెలుపల నివసించుచుండువారు. ఆర్యులలో కొందరు వ్యవసాయదార్లుగను, వర్తకులుగను, వడ్డీ వ్యాపారము చేయువారుగను ఉండిరి. అట్టివారు వైశ్యులు. ధనసంపాదనమందు వారిపై పోటీకివచ్చువారెవ్వరు లేరు. ఆర్యులలో మరికొందరు వడ్రంగము, కమ్మరము, నేత, ఱాతిపని, బంగారుపని, కుమ్మరిపని, దంతపుపని మొదలగు కారుకర్మలను, శిల్పములను నేర్చియుండిరి. వీరికి శూద్రులని పేరు. యుద్ధములుచేయుట, ప్రజలను రక్షించుట, రాజ్యములను పాలించుట వృత్తిగా గలవారు క్షత్రియులు. వేదాది విద్యలను నేర్చుకొని, యితరులకా విద్యలను నేర్పి, యజ్ఞయాగాది క్రతువులను చేయించు చుండెడివారు. బ్రాహ్మణులు, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములతో గూడిన సంఘము ఆర్యసంఘము.

వర్ణధర్మములు: - సాధారణముగ ఒక్కొక్క కులములోనివారు ఆకులమునకు సంబంధించిన వృత్తుల నవలంభించుచుండిరి. ఒకే వృత్తిని అనుసరించు చుండిన వారందరు ఒక వర్ణముగ ఏర్పడి తమలో తమకు వివాదములు కలిగినప్పుడు కులపెద్దల ద్వారా వానిని పరిష్కరించుకొనుచుండిరి. వర్తకము చేయువారు శ్రేణులు (Guilds) గ నేర్పడి, ఒక మహాశ్రేష్ఠి యొక్క సలహాల ననుసరించి వ్యవహారముల జరుపుకొనుచుండిరి. ధనవంతులగు మహాశ్రేష్ఠులు రాజులవద్ద కోశాధికారులుగ నుండుట కలదు. కులములు, జాతులు, వృత్తులు అనేకము లుండినను వర్ణములు మాత్రము నాలుగే. ఒక వర్ణమునకు జెందినవారు మరియొక వర్ణమువారిని వివాహము చేసికొను

విషయమునగాని, యితర వృత్తులను స్వీకరించు విషయమునగాని నిషేధము లనేకము లుండెడివి కావు. పంక్తి భోజనము నిషేధింపబడి యుండలేదు.

ఆశ్రమ ధర్మములు:- వర్ణ ధర్మములతోబాటు ఆ కాలమువారు ఆశ్రమధర్మములను కూడ అనుసరించియుండిరి. అప్పటి నాగరికతకు ఆశ్రమ ధర్మములే ప్రధాన లక్షణమనికూడ చెప్పవచ్చును. ద్విజులని చెప్పబడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు విద్యాభ్యాసము నిర్బంధముగ నుండెను. ఉపనయనము కాగానే వారు గురుకులవాసము చేసి, భిక్షమెత్తి తమ్మును పోషించుకొని, మద్యమాంసములు గంధమాల్యములు మొదలగువానిని విసర్జించి నియమపరులై గురుశుశ్రూష చేసి, విద్యల నన్నిటిని నేర్చుకొనుచుండిరి. ఇదియే బ్రహ్మచర్యాశ్రమము. విద్య పూర్తి అయిన తరువాత పెండ్లి చేసికొని, గృహస్థాశ్రమమును స్వీకరించుట ఆకాలపు ఆచారము. గృహస్థుడు ధనమును సంపాదించి కుటుంబమును పోషించుకొనుటయే గాక వృద్ధులను, అతిథులను పోషించవలసియుండెను. తన విధుల నన్నిటిని చక్కగ నిర్వహించి, కుటుంబభారమును వయసు వచ్చిన కొడుకుల కప్పగించి, గృహస్థుడు వానప్రస్థాశ్రమమును స్వీకరించుచుండెను. వానప్రస్థా శ్రమములోని వాడు భార్యతో కూడ అరణ్యవాసము చేయుచు, కందమూలముల భక్షించుచు తపస్సు చేయుచుండువాడు. ఇట్లు కొంతకాలము గడచిన తర్వాత నతడు సన్యాసియై భిక్షాటనముచేసి, స్వసౌఖ్యములను వదలి, మోక్షమార్గమును సాధించువాడు.

గ్రామములు : - ప్రజలలో చాలభాగము గ్రామములలో నివసించుచుండిరి. గ్రామములన్నియు ప్రజల కనుకూలించు పద్ధతిని కట్టబడియుండెను. ప్రతిగ్రామము చుట్టు ప్రాకారమో, చెట్లతో గూడిన కంచెయో యుండెను. దాని కావల వ్యవసాయము చేయబడిన క్షేత్రభూమియు, దానికి తర్వాత పశువులబీడు, దానికి కొంతదూరమున చిన్న అడవి ఉండెను. గ్రామసమీపమందు తోపులు, ఉద్యానవనములు, చైత్యములు ఉండెడివి. కొన్ని గ్రామములందు వేయి కుటుంబములవారు కూడ ఉండుటకలదు.

నగరములు :- గ్రామములుకాక నగరములుకూడ దేశమందనేకము లుండెను. కౌశాంబి, మిథిల, వైశాలి, చంప, కాశీ, అయోధ్య, తక్షశిల మొదలగునవి మిక్కిలి ప్రఖ్యాతిగాంచినవి. నగరములన్నియు వాస్తుశాస్త్రపద్ధతిని నిర్మింబడి యుండెను. తక్షశిల, కాశీ మొదలగు కొన్ని మహానగరములు విద్యలకు ప్రసిద్ధిగాంచియుండెను. ప్రఖ్యాతిగాంచిన అచటి విద్యాంసులవద్ద శాస్త్రాభ్యాసము చేయుటకై దూరదేశములనుండి వేలకొలది విద్యార్థులు వచ్చుచుండిరి.

తపోవనములు:- ఆకాలమందు అరణ్యములలోని తపోవనములు, ఋష్యాశ్రమములు, మునిపల్లెలు ఎక్కువ ప్రాధాన్యము వహించియుండెను. అందులోని ఋషులు ఆదర్శపురుషులు. తపస్సే వారికి ధనము, సమస్త శాస్త్రములను గురించిన వాదోపవాదము లక్కడ జరుగుచుండెను. పూర్వకాలమున శాస్త్రగ్రంథములు వ్రాసిన



వారందరు ఇట్టి ఋషులే. వారప్పుడప్పుడు రాజసభలకు వచ్చి, రాజులు చక్కగ పాలించుచున్నారో లేదో చూచుచుండువారు. ఋషుల భయమువలననే రాజులు చాలవరకు ధర్మము నతిక్రమింపక ప్రజలను రక్షించుచుండిరి.

మహాజనపదములు:- గ్రామములు, నగరములు, ఆశ్రమములు మొదలగువానితో కూడుకొని ఒకే ప్రభుత్వమునకు లోబడి ఉండు ప్రదేశమునకు ఆ కాలమున మహాజనపదమనియు, రాష్ట్రమనియు పేరుండెను. హిమాలయ, వింధ్యపర్వతములకు మధ్యనున్న ఆర్యావర్తమందు ప్రధానములైన జనపదములు పదునారున్నట్లు బౌద్ధగ్రంథములనుండి తెలియుచున్నది. వానిలో ముఖ్యములైనవి గాంధార, కాంభోజ, కురు, పాంచాల, శూరసేన, అవంతి, కాశీ, కోసల, మగధ, అంగ, మల్ల, వజ్రి జనపదములు. వీనిలో కొన్ని రాజుల అధీనమందును, కొన్ని గణప్రభుత్వముల (Republics) అధీన మందును ఉండెను.

గణప్రభుత్వములు **(Republics)** :- గణప్రభుత్వములలో అధికారము ఒకరియందుగాక అనేకులతో కూడిన మహాసభయందుండెను. ఆసభకు మహాపరిషత్తు అనుపేరు కూడ కలదు. శాక్యుల మహాపరిషత్తునందు 500 సభ్యులును, లిచ్ఛవుల మహాసభయందు 7707 సభ్యులును ఉండిరి. వీరందరు క్షత్రియులు. ఈ సభలు సంతాగారమున (Assembly Hall) సమావేశమై వ్యవహారములను చక్కబెట్టుచుండెను. ప్రతిగణమునకును మహాసభచే ఎన్నుకొనబడిన నాయకుడొకడుండెను. కొన్ని గణములలో ఒకనాయకునికి బదులు ఎనమండుగురో, తొమ్మండుగురో కలసిన కార్య నిర్వాహకసభ యుండెను. సభలయందు బహుజనాభిప్రాయమునుబట్టి కార్యనిర్ణయము చేయబడుచుండెను.

## 2. మగధరాజ్యము

సామ్రాజ్యములు :- ఋగ్వేద కాలమున ఆర్యుల రాజ్యములు చాల చిన్నవిగ నుండెను. బ్రాహ్మణముల కాలము నాటికి అవి గొప్ప రాజ్యములుగ మారెను. అట్టివి మధ్య దేశమందు (గంగా యమునా ప్రాంతముల) ప్రఖ్యాతి గాంచెను. ఉపనిషత్తుల కాలమునాటికి ఈ గొప్ప రాజ్యములలో కొన్ని బలవత్తరములై తక్కిన వానిని జయింప గలిగెను. ఒకే రాజు క్రిందనుండు అనేక రాజ్యముల సముదాయమునకు సామ్రాజ్యమని పేరు. దానిని పాలించువాడు సమ్రాట్టు, లేక చక్రవర్తి. క్రీ.పూ.600 తర్వాత సామ్రాజ్యములను స్థాపించిన వారిలో మగధరాజులు సుప్రసిద్ధులు.

మగధరాజ్యము :- మగధ రాజ్యము ప్రాచ్య రాజ్యములలో నొకటి. అది గంగాతీరమందుండుట చేత అందులోని ప్రజలు ధనధాన్యసమృద్ధి కలవారై యుండిరి. ప్రజల ఐశ్వర్యము మూలమున ప్రభువులకు ఎక్కువ పన్నులు లభించుచుండెను. అందువలన వారు గొప్ప సైన్యములను తయారు చేసి, తక్కిన రాజులను జయించి, విశాలమగు సామ్రాజ్యమునకు చక్రవర్తులు కాగలిగిరి.

**బింబిసారుడు** :- మహాభారతకాలమున జరాసంధుడు గిరివ్రజమును రాజధానిగ జేసికొని మగధను పాలించుచుండెను. తర్వాత, అనేక వందల సంవత్సరములు గడచిన పిమ్మట క్రీ.పూ.603 ప్రాంతమున బింబిసారుడనువాడు దానికి రాజమయ్యెను. ఇది మొదలు దానియొక్క ఔన్నత్యము ప్రారంభమయ్యెను. బింబిసారుడు తూర్పునందున్న అంగరాజ్యమును జయించెను. దానికి ముఖ్యపట్టణమైన చంపానగరము ఆకాలమున విదేశములతో ఎక్కువగ వ్యాపారము చేయుచు సమస్త సంపదలతో తులతూగుచుండెను. కావున, దాని సంపాదనము బింబిసారుని మరింత బలవంతునిగ చేయగలిగెను. ఇతడు కోసల, విదేహ, మాద్ర రాష్ట్ర కన్యలను వివాహమాడి, ఆయా రాష్ట్ర ప్రభువుల మైత్రిని సంపాదించెను. ఇతడు రాజగృహమను పట్టణ మొకదానిని కట్టి, రాజధానిగ చేసెను. ఇతనికి జైన, బౌద్ధమతము లందు సమానమగు గౌరవముండెను. ఇతడు క్రీ.పూ. 551 వరకు రాజ్యమేలెను.

**అజాతశత్రుడు**:- తర్వాత ఇతని కుమారుడగు అజాతశత్రుడు సింహాసన మధిష్ఠించి క్రీ.పూ. 519 వరకు పరిపాలన చేసెను. ఇతడు తండ్రికంటెను గొప్పశూరుడు. మేనమామయగు కోసలరాజుతో యుద్ధము చేసి కోసలుల వశమందున్న కాశీలోని కొంతభాగమును సంపాదించెను. అటు తర్వాత, పదునారు సంవత్సరములు లిచ్ఛవులతో పోరెను. లిచ్ఛవులు ఆకాలపు గణప్రభుత్వములలో అసమానమైన సామర్థ్యమును గలవారను పేరు పొందియుండిరి. వారికి వైశాలి ముఖ్యపట్టణము. వారి సహాయమునకై చుట్టుపట్లనున్న ముప్పదియైదు గణములవారు సిద్ధపడిరి. వీరిందరి వలన కలుగు ప్రమాదమునుండి తన రాజ్యమును రక్షించు కొనుటకై గంగా శోణానదుల సంగమసమీపమున పాటలీపుత్రమను కోటను అజాతశత్రుడు కట్టెను. ఇదిగాక మాయోపాయముల ననేకములను పన్ని, లిచ్ఛవులలో అతడు అంతర్భేదముల గలిగించెను. వారి కోటలను పడగొట్టుటకై "శిలాకంటకము" అను క్రొత్త యంత్రము నొకదానిని అతడు నిర్మించెను. ఈ ఉపాయము లన్నిటివలన తుద కతడు లిచ్ఛవులను జయించి ప్రాచ్యదేశమునకంతకు చక్రవర్తి అయ్యెను. ఆకాలపు రాజులనేకులవలె ఇతడు కూడ మోక్ష మార్గ మెద్దియో తెలిసికొనుటకై మతప్రచారకుల సందర్శనము చేసి తుదకు గౌతమబుద్ధుని ఉపదేశములందు ఎక్కువ ఆదరమును చూపి, బుద్ధుని జ్ఞాపకార్థమై రాజగృహమందు స్థూపము నొకదానిని నిర్మించెను.

**శిశునాగుడు**:- అజాతశత్రుని తర్వాత రాజ్యమునకు వచ్చిన అతని సంతతివారిని గురించి మనము తెలిసికొనదగిన విశేషములు లేవు. వారిలో ఆఖరువాడు దుర్మార్గుడగుట

చేత ప్రజలతనిపై తిరుగబడి, అతని మంత్రియైన శిశునాగునికి పట్టముగట్టిరి. శిశునాగుడు ప్రఖ్యాతపురుషుడు. ఇతడు అవంతిదేశమును పాలించుచుండిన ప్రద్యోతుని ఓడించి మగధ సామ్రాజ్యమును వృద్ధి జేసెను.

నందవంశము : - తర్వాత క్రీ.పూ. 403 ప్రాంతమున నందవంశస్థాపకుడగు మహాపద్మనందుడు రాజయ్యెను. ఇతడు శూద్రుడనియు, క్షత్రియవంశముల నాశముచేయుట యందు రెండవ పరశురాముడనియు పురాణములు చెప్పుచున్నవి. ఇందు ఇక్ష్వాకులను, పౌరులను జయించి వారి వశమందున్న కోసల, కౌశాంబి రాజ్యములను తన స్వాధీనము చేసికొనెను. కళింగదేశమును కూడ ఇతడు జయించినట్లు కనిపించుచున్నది. ఈ కారణములచేత నందవంశ కాలమందు మగధసామ్రాజ్యము పంజాబు, సింధు, కాశ్మీరములందు తప్ప ఆర్యావర్తములోని తక్కిన భాగమందంతయు వ్యాపించి యుండెనని చెప్పవచ్చును.

ధననందుడు:- నందవంశములో ఆఖరువాడగు ధననందుడు ప్రజా కంటకుడై, ప్రజలపై ఎక్కువ పన్నులను విధించి, ధనము నత్యంతముగ గడించినవాడని ప్రతీతి. ఇతని వద్ద రెండులక్షల కాల్బలము, ఇరువదివేల అశ్వబలము, మూడువేల గజబలము, రెండు వేల రథబలము ఉండెను. ఇతడింతటి బలవంతుడని తెలియవచ్చినందున అలెగ్జాండరు మగధ సామ్రాజ్యముపై దండెత్తివచ్చుటకు భయపడి వెనుకకు మరలి పోయెను. నందరాజులు జైనమతమందు గౌరవము చూపిరి.

## 3. జైన, బౌద్ధమతముల స్థాపనము

**మతోత్సాహము:-** మగధసామ్రాజ్యము విజృంభించుచుండిన కాలమున మహానుభావులనేకులు మతవిషయములందు అపరిమితమగు ఉత్సాహమును చూపు చుండిరి. తపోధనులగు ఋషులు, యోగులు, సన్యాసులు, రాజర్షులు ఆత్మవిచారమందు ఆసక్తిగలవారై సత్యమన నెద్దియో నిర్ణయించుట యందును, మనుష్య లనుభవించుచుండు బాధలను నివారించుటకు కావలసిన మార్గములను వెతకుటయందును వారి బుద్ధిబలమును వినియోగించుచుండిరి. వీరి ప్రయత్నములకు ఫలముగ వైదికమతమునుండి శాఖోపశాఖలనేకములు బయలుదేరెను. అట్టివానిలో జైన, బౌద్ధశాఖలు మిక్కిలి ముఖ్యము లైనవి.

**మహావీరుడు :-** జైనమతమును స్థాపించినవాడు మహావీరుడు. ఇతడు లిచ్ఛవుల ప్రధానపట్టణమగు వైశాలికి సమీపమున కుండగ్రామమందు క్షత్రియ

కులమున క్రీ.పూ. 618 లో పుట్టెను. బాల్యమున క్షత్రియ కుమారుల కుచితములైన విద్యల నన్నిటిని నేర్చి, ముప్పది సంవత్సరముల వయస్సు వచ్చువరకు గృహస్థాశ్రమమందుండి, తర్వాత సన్యాసియై, పండ్రెండు సంవత్సరములు ఘోరతపస్సు చేసి, పరిపూర్ణ జ్ఞానమును సంపాదించి, ముప్పదిరెండు సంవత్సరముల కాలము ఆ జ్ఞానమును ప్రాచ్య దేశము లన్నిటి యందు ను ప్రజల కుపదే శించి,అనేక శిష్యులను సంపాదించి క్రీ.పూ. 546 లో మృతిజెందెను. మహా వీరుని బిరుదు నామము "జినుడు'. జినుడనగా సమస్తమును జయించిన వాడని అర్థము. అందు చేత అతని మతము నకు జైనమతమని పేరు.



గౌతమబుద్ధుడు

**గౌతమబుద్ధుడు:-** బౌద్ధ మతమును స్థాపించినవాడు గౌతముడు. ఇతడు కూడ క్షత్రియుడు. ఇతడు క్రీ.పూ. 623 లో శాక్యవంశమున పుట్టి, రాజకుమారులు సాధారణముగ నేర్చికొను విద్యలను నేర్చి పదునారవ సంవత్సరమున వివాహమాడి, సంసారసుఖముల ననుభవించి, ఇరువది తొమ్మిదవయేట సన్యాసియై, ఆరు సంవత్సరములు తపస్సుచేసి, సంపూర్ణమగు జ్ఞానమును సంపాదించి, బుద్ధుడను

బిరుదునామమును పొంది, నలువదియైదు సంవత్సరములు కాశీ, మగధ, కోసల,కౌశాంబి మొదలగు జనపదములందు మతధర్మముల నుపదేశించి, శిష్యులనేకులను చేరదీసి, క్రీ.పూ. 543 లో దేహమును విడనాడెను. తన యుపదేశములను ప్రచారము చేయుటకుగాను ఇతడొక సంఘమును స్థాపించి, అందులో సన్యాసాశ్రమమును స్వీకరించిన పురుషులనేగాక స్త్రీలనుకూడ చేర్చెను.

**వీరి ఉపదేశములు :-** మహావీరుడు, గౌతముడు చేసిన ఉపదేశములు క్రొత్తవని యనుకొనుట పొరపాటు. అదివరకు ప్రచారములోనుండిన వైదికాచారములను కొన్నిటిని వీరు నిషేధించినను, మరికొన్ని వైదిక ధర్మములను, సిద్ధాంతములను వీరు స్వీకరించి, వానిని తమ ఉపదేశములన్నిటికి మూలాధారముగ జేసికొనిరి. పశుహింసతో కూడిన యజ్ఞయాగములను వీరు నిషేధించిరి; అట్టి క్రతువులను చేయించుచుండిన బ్రాహ్మణవర్ణమునకు అగ్రస్థాన మియ్యకూడదనిరి; పశుహింసను ప్రోత్సహించు వేదములు గౌరవార్హములు కావని చెప్పిరి. కాని ఆరణ్యకములలోను, ఉపనిషత్తులలోను ప్రతిపాదింపబడిన సిద్ధాంతములలో ముఖ్యములైన వానినన్నిటిని వీరు పరిగ్రహించిరి. కర్మ, పునర్జన్మము, యోగము, తపస్సు, సన్యాసము మొదలగువానిని గురించి అప్పటికి ప్రచారమందున్న సిద్ధాంతములను వీరంగీకరించిరి. "మనుష్యజీవితము ఒక యాత్రవంటిది. పరిపక్వమైన ఆత్మకలవాడు మోక్షమని చెప్పబడు గమ్యస్థానమును చేరగలిగియున్నాడు. ఆత్మ ఒక జన్మమున పరిపక్వము పొందజాలదు. ఒక్కొక్క జన్మమందు ఒక్కొక్క విధమైన అనుభవములను సంపాదించి, కొంతవరకు వృద్ధి కాగలిగియున్నది. ఇట్లనేక జన్మములెత్తి, పరిపూర్ణతనొంది, ఆత్మవిముక్తి గాంచుచున్నది. మరణమనిన భయపడవలసినది లేదు. చినిగిపోయిన వస్త్రమును విడనాడి క్రొత్తవస్త్రమును ధరించుటకు మరణమవకాశము కలిగించుచున్నది". ఈలాటి ఉపనిషత్తత్వమును ఆధారముగ జేసికొని గౌతముడును, మహావీరుడును వారి మతమును వ్యాపింపజేసిరి.

**ఈ మతముల సారము :-** జైనమతమునకు ప్రధాన లక్షణము అహింస. పిపీలికాది మనుష్యపర్యంతము బ్రహ్మాండ మందెన్నియో జీవరాసులున్నవి. ఎంతటి అల్పజీవమునకును ఎట్టి బాధను కలిగించకుండుటయే ఆత్మపరిపక్వమునకు మార్గమని జైనులు బోధించెదరు. బౌద్ధమతము సత్ప్రవర్తన వలననే మోక్షము లభించునని చెప్పుచున్నది. భగవంతుడున్నాడా, లేడా? ఆత్మయెక్క లక్షణము లెవ్వి? దాని పరమావధి ఏది? అను విచారము అందరికి ఆవశ్యకము కాదు. వీనియొక్క జ్ఞానము ఉన్నను, లేకున్నను సత్ప్రవర్తనము వలన ప్రతి మనుష్యునికిని మోక్షసుఖము లభించును.

సర్వజీవహితము, మైత్రి, దయ, అనుకంపము, కరుణ - ఇట్టి గుణములతో కూడినదే సత్ప్రవర్తనము. ఇది అందరికి ఆవశ్యకము.

రాజాదరణ :- జైన, బౌద్ధమతములు దేశమందు వ్యాపించుటకు రాజులయొక్క ఆదరణమే ముఖ్యమగు కారణము. అట్టి ఆదరణము జైనమతమునకు కంటె బౌద్ధమతమునకు ఎక్కువగ లభించినందున ఆ మతము మన దేశమునందే గాక దేశాంతరములందు కూడ వ్యాపించి, ఎక్కువ ప్రాముఖ్యమును పొందగలిగెను.

జైనులు చేసిన సేవ :- జైనులు మనదేశపు విజ్ఞానాభివృద్ధికిని, నాగరికతాభివృద్ధికిని ఎంతో సహాయము చేసిరి. వారు సామాన్యులు మాట్లాడుకొను దేశభాషలలో వారి గ్రంథములను వ్రాసిరి; దీని మూలమున కన్నడము, అరవము మొదలగు దేశభాషా వాఙ్మయము చాల పెంపొందెను. వారు అనేక పుణ్యక్షేత్రములందు స్థూపములను, దేవాలయములను, శిలా విగ్రహములను నిర్మించిరి. ఇవి ఎంతో సుందరములై ఇప్పటికికూడ చెక్కు చెదరకున్నవి. వేదాంత విషయములందు జైనాచార్యులు అనేకములగు క్రొత్త రహస్యములను కనుగొనిరి. పశుపోషణ విషయములో వారిప్పటి వరకు ఎంతో శ్రద్ధను చూపుచున్నారు.

బౌద్ధులు చేసిన సేవ :- జైనమతము కంటె బౌద్ధమతమునకు ఎక్కువ పలుకుబడి యుండెను. దానిని పోషించిన రాజులు, ధనికులు, సామాన్యజనులు లెక్కకుమించి యుండిరి. వారెంతో ద్రవ్యము ఖర్చుపెట్టి, చిత్రవిచిత్రములైనట్టియు, విశాలములైనట్టియు, బహుసుందరములైనట్టియు స్థూపములను, చైత్యములను, గుహావిహారములను కట్టిరి. ఈ కట్టడములందు శిల్పులు చూపిన నేర్పు అద్వితీయము. బౌద్ధభిక్షువుల వర్షాకాల నివాసమునకై కట్టబడిన విహారములు కాలక్రమమున గొప్ప విశ్వవిద్యాలయము లయ్యెను. అందు వేలకొలది విద్యార్థులు విద్యా వ్యాసంగము చేసి సమస్తకళలను, శాస్త్రములను వృద్ధిచేసిరి. మోక్షమును సంపాదించుటకు మనుష్యులందరికి సమానమగు అర్హత ఉన్నదను సిద్ధాంతమును బౌద్ధులు నొక్కి చెప్పిరి. అమరావతి, నాగార్జునకొండ, తక్షశిల, సాంచి మొదలగు ప్రదేశములందు బయల్పడిన శిథిలములు బౌద్ధమతాధిక్యతను వేనోళ్ళ చాటుచున్నవి.

## 4. పారశీకులయు, గ్రీకులయు విజయములు

పారశీకులు :- ఆర్యులు వచ్చిన తర్వాత రెండువేల సంవత్సరముల వరకు పరాయి వారెవ్వరు మన దేశమున అడుగిడలేదు. కాని మగధ సామ్రాజ్యము వ్యాప్తిగాంచుచున్న ఆరవశతాబ్దమందు పారశీకులు దండెత్తి వచ్చిరి.

పర్షియా దేశములోనివారు పారశీకులు. ఋగ్వేద కాలమునకు పూర్వము వారును, ఆర్యులును ఒకే ప్రదేశమందు అన్నదమ్ములవలె నివసించుచుండిరి. వారి మూలముననే మనదేశమునకు హిందూదేశమను పేరు వచ్చెను. క్రీ.పూ. ఆరవ శతాబ్దమున వారు పశ్చిమ ఆసియా యందంతటను గొప్ప సామ్రాజ్యమును స్థాపించిరి. ఈ ప్రయత్నములు జరుగుచుండిన కాలమందు వారి చక్రవర్తులలో నొకడగు సైరస్ (క్రీ.పూ. 558-530) ఇండియా పైకి వచ్చి గాంధారమును వశపరచుకొనెను. అటుతర్వాత డెరయస్ అను మరియొక చక్రవర్తి క్రీ.పూ. 518 లో సింధునదిని దాటి పంజాబులో చాలభాగమును జయించెను. డెరయస్ సామ్రాజ్యములో ఇరువది రాష్ట్రములుండెను. వానిలోనెల్ల అతని ఇండియా రాష్ట్రము మిక్కిలి ఐశ్వర్యవంతమై, సంవత్సరమునకు కోటిన్నర రూపాయల ఆదాయమును అతనికి సమకూర్చుచుండెను. మన పూర్వులనేకులు పారశీక సైన్యములో చేరి, ఐరోపాఖండమందును, తదితర ప్రదేశములందును పారశీక చక్రవర్తులు చేయుచుండిన యుద్ధములలో పాల్గొని, సమర్థులగు యోధులను పేరును సంపాదించిరి. క్రీ.పూ.330 వరకు పారశీకుల యధికారము పంజాబు, గాంధారములపై వ్యాపించి యుండెను. దీని మూలమున ఖరోష్టి అను లిపియు, శిలలపై శాసనముల వ్రాయు పారశీక రాజుల ఆచారమును మనదేశము లోనికి వచ్చెను.

**అలెగ్జాండరు** :- ఐరోపాఖండమందలి గ్రీసు దేశవాసులు గ్రీకులు. వారు క్రీ.పూ. 327 లో మన దేశముపై దండెత్తివచ్చిరి. వారి రాకకు వారి నాయకుడగు అలెగ్జాండరు యొక్క సామ్రాజ్యకాంక్షయే కారణము. అతడు ప్రపంచములోని యోధాగ్రేసరులలో పేర్కొనదగినవాడు. ఈజిప్టుమొదలు సింధునది పర్యంతము వ్యాపించియుండిన పారశీక సామ్రాజ్యమును కొలది సైన్యములతో అతి శీఘ్రముగ పిన్నవయస్సున జయించిన నేర్పరి. క్రీ. పూ. 327 నాటికి ఈ పారశీక విజయయాత్ర ముగిసి అతడు ఇప్పటి ఆఫ్ఘనిస్థానములో విడిసెను.

**పంజాబులోని పరిస్థితులు**:- అప్పటికి సింధునది ప్రాంతముననుు, పంజాబునందును చిన్న చిన్న రాష్ట్రములనేకములుండెను. వీని నేలుచుండినవారు పరస్పర వైషమ్యముతో కూడినవారగుటచేత కొందరు అలెగ్జాండరుతో కలసి అతనికి సామంతులుగనుండుట కంగీకరించిరి. అట్టివారిలోనెల్ల తక్షశిలరాజు ముఖ్యుడు. అనేకులు అట్లు చేయుట కిష్టపడక, పౌరుషమును వహించి, దేశాభిమాన పూరితులై, జాతిధర్మముల నిలబెట్టుకొనుటకుగాను పట్టుదలతో అతని నెదిరించిరి. ఇట్టివారిలో జీలం, చీనాబ్ నదులకు మధ్యనున్న రాష్ట్రమును పాలించుచుండిన పౌరవుడు ముఖ్యుడు.

**అలెగ్జాండరుయొక్క విజయయాత్ర** :- అలెగ్జాండరు ఆఫ్గనిస్థానమునుండి కొండలమీదుగ ప్రయాణము చేసి ఇండియాలోనికి వచ్చెను. మార్గమధ్యమున రాజులనేకులు వాని నెదుర్కొని, పర్వతవాసులకు సహజమగు ధైర్యముతో యుద్ధము చేసిరి. అతడు ముట్టడించిన పర్వత దుర్గములను రక్షించుకొనుటయందు అపరిమితమగు నేర్పును చూపిరి. ఎంతో కష్టముమీద తుద కతడు వారిని జయించి,వేలకొలది మనుష్యులను చంపి, సింధునదిని దాటి తక్షశిలను చేరెను. ఋషుల మాహాత్మ్యమును వినినటువంటి అలెగ్జాండరు ఆపట్టణ సమీపమందున్న ఋషులు తన్ను చూచుటకై రావలసినదని ఆజ్ఞాపించెను. కాని వారిలో ఒకరుతప్ప తక్కినవారెవ్వరు అతనిని లక్ష్యపెట్టరైరి. గ్రీకుల భోగపరాయణత్వమును వారు గర్హించిరట.

**పౌరవునితో యుద్ధము** : - తక్షశిలనుండి అలెగ్జాండరు జీలం నదీతీరమును చేరెను. ఆవలిగట్టున పౌరవుడను రాజు చతురంగబలసమేతుడై యుద్ధమునకు సిద్ధుడుగ నుండెను. అతనికంట పడకుండ నదినిదాటుట అలెగ్జాండరుకు సాధ్యము కాదయ్యెను. ఇట్లు కొంతకాలము జరిగెను. తర్వాత, కొన్ని రోజులకు పౌరవుని శిబిరమునకు కొన్ని మైళ్ళ దూరమున ఒక చీకటి రాత్రియందు గ్రీకుసైన్యములు నదినిదాటి తెల్లవారునప్పటికి వెనుకప్రక్కనుండి పౌరవుని సైన్యములపై బడెను. రాత్రి అంతయు వర్షము పడుచుండెను. యుద్ధరంగము బురదతో నిండియుండెను. పౌరవుని సైన్యములో ప్రధానాంగములగు గజములు, రథములు నడచుటకు వీలులేకపోయెను. యుద్ధము ప్రారంభమయ్యెను. పౌరవుడు ధైర్యమును విడువక అతిఘోరముగ పోరెను. వాని సైన్యములో చాలభాగము నష్టపడెను ; అతని కొడుకులు యుద్ధము చేయుచు మృతిచెందిరి. అయినప్పటికిని అతడు యుద్ధమును మానలేదు. తుదకు గ్రీకుల బాణమొకటి అతనికి తగులుటచేత స్మారకముతప్పి అతడు క్రింద పడిపోయెను. అప్పుడు అలెగ్జాండరుకు విజయము లభించెను. కాని, పౌరవుని పౌరుషమును అతడెంతో మెచ్చుకొని, అతని రాజ్యమును తిరిగి అతని కిచ్చివేయుటయేగాక తాను జయించిన మరికొన్ని ప్రదేశములను కూడ అందులో కలిపెను. పౌరవుడతనికి సామంతుడయ్యెను.

**అలెగ్జాండరు వెనుకకు మరలుట** :- పౌరవరాజ్యమందుండి అలెగ్జాండరు చీనాబునదిని దాటి మరికొన్ని రాష్ట్రములను జయించి రావీనదిని చేరెను. అచటికి వచ్చునప్పటికి ధననందుని గురించిన వివరము లతనికి తెలియవచ్చెను. అందుచేత అతడు తన ప్రయాణమును సాగించుట లాభకరము కాజాలదని శంకింపజొచ్చెను. అతని సైనికులుకూడ భయపడి మరి యుద్ధము చేయజాలమని చెప్పిరి.

అందుచేత తానదివరకు జయించిన ప్రదేశములతో తృప్తిగాంచి అతడు వెనుకకు మరలెను. ఈమారు వచ్చిన మార్గమునుబట్టి వెళ్లుటకుబదులు, నదులమీదుగ పడవల్లలో సింధునది ముఖద్వారము వరకు ప్రయాణముచేయ నిశ్చయించుకొనెను. వేయిపడవలు సిద్ధమయ్యెను. అలెగ్జాండరు నదీప్రయాణమును మొదలుపెట్టెను. కాని దారిపొడుగున అనేక ప్రజలు వాని నెదిరించిరి. మాళవులు, క్షుద్రకులు, అంబిష్టులు మొదలగు క్షత్రియ గణములేగాక వేలకొలది బ్రాహ్మణులుకూడ దేశధర్మముకై పోరుటయే ఉత్తమమార్గమని వారితో యుద్ధము చేసిరి. కాని యుద్ధమందతి నేర్పరియగు అలెగ్జాండరు వారినందరి నోడించి, వారి పట్టణముల నాశనముచేసి, కోట్లకొలది ద్రవ్యమును దోచుకొని, జయించిన దేశమును సామంతుల యధీనము చేసి, క్రీ.పూ. 325 లో బెలూచిస్థానముమీదుగ వెళ్ళిపోయెను. తర్వాత రెండుసంవత్సరముల కతడు మృతిచెందెను.

**అతని దండయాత్రవలని ఫలితములు :-** అలెగ్జాండరు యాత్రవలన మన నాగరికతయందు గొప్పమార్పు లేవియు కలుగలేదు. ఇంతకు అతడు మన దేశమందుండిన కాలము అతిస్వల్పము. అతని విజయము స్థిరమైనది కాదు. అతడు వెళ్ళిపోయిన తర్వాత రెండుమూడు సంవత్సరములలో గ్రీకుల అధికార మడుగంటెను. అతనిపేరే మన పురాణములందు కనుపించదు. అతని దాడివలన చిన్న రాష్ట్రములు వినాశమై గొప్ప రాజ్యముల స్థాపనమునకు అవకాశము కలిగెను; పశ్చిమ ఆసియాకును, ఇండియాకును రాకపోకలు అధికమై, వ్యాపారము వృద్ధిగాంచెను. హిందూమత రహస్యములు, సిద్ధాంతములను గ్రీకులు గ్రహించి పశ్చిమఆసియా యందును, ఐరోపాయందును ప్రవేశపెట్టిరి.

## ప్రశ్నలు

1. క్రీ.పూ. ఆరవ శతాబ్ద చరిత్రమున కాధారములెవ్వి ? అప్పటి ఆర్యులకును, అనార్యులకును భేదమెట్టిది ? ఆర్య సంఘములో చేరినవారెవరు ? వారు అనుసరించిన వృత్తులేవి ?
2. వర్ణ ధర్మములకును, ఆశ్రమధర్మములకును భేదమేమి ? ఏయే ఆశ్రమముల వారేయే ధర్మముల ననుసరించిరి ?
3. క్రీ.పూ. ఆరవ శతాబ్దిని గ్రామము లెట్లుండెను ? ఆ కాలపు నగరములను కొన్నిటిని పేర్కొనుము. ఆనగరముల ప్రసిద్ధికి కారణమేమి ?

4. తపోవనము వలని ఉపయోగమేమి ?
5. మహాజనపదము లననేమి ? వానిలో ముఖ్యములైన వాటిని పేర్కొనుము.
6. గణప్రభుత్వమునకు గల లక్షణము లేవి ?
7. సామ్రాజ్య మన నేమి ?
8. మగధరాజ్య ప్రాబల్యమున కేమి కారణములు ?
9. బింబిసారుడు మగధ రాజ్యము నెట్లు పెంచెను ? అజాతశత్రుని ప్రఖ్యాతికి కారణము లెవ్వి ?
10. శిశునాగుని మహాకార్యము లేవి ?
11. నందులు మగధరాజ్యము నెట్లు విస్తరించిరి ? వారు బలవంతులనుటకు నిదర్శనము లెవ్వి ? వారి రాజ్యభ్రష్టతకు కారణములేవి ?
12. మతమనగా నేమి ? ఆరవశతాబ్దమున మతోత్సాహ మెక్కువగ నుండెననుటకు నిదర్శనము లెవ్వి ?
13. మహావీరుని జీవితమును వివరింపుము .
14. జైనమత మను పేరెట్లు వచ్చెను ? దానిలోని ముఖ్య ధర్మములెవ్వి ?
15. గౌతమబుద్ధుని జీవితమును వివరింపుము.
16. బౌద్ధమతమను పేరెట్లు వచ్చెను ? దానిలోని ముఖ్యధర్మములెవ్వి? జైన, బౌద్ధమతములకును అంతకు పూర్వముండిన మతమునకు గల (a) సామ్యము (b) భేదము ఎట్టివి ? ఈ మతముల వ్యాప్తికి కారణములెవ్వి?
17. జైనులు, బౌద్ధులు దేశమున కెట్టి సేవచేసిరి ?
18. ప్రాచీన కాలమున ఇండియాను, పర్షియాకును ఎట్టి సంబంధముండెను ? దాని మూలమున కలిగిన ఫలితమెద్ది ?
19. అలెగ్జాండరు ఇండియాపై దండెత్తుటకు కారణము లేవి? అతడే ప్రదేశములను జయించెను? ఋషులాతని నెందుకు గర్హించిరి ? అతని నెదుర్కొనిన రాజులెవరు? అతడు వెనుకకు మరలుటకు కారణము లెవ్వి ? అతని దండయాత్ర వలన కలిగిన ఫలితము లెవ్వి ?

## మూడవ ప్రకరణము

# మౌర్య సామ్రాజ్యము

విషయములు :-చంద్రగుప్తుడు, అశోకుడు, అతని విజయములు, మౌర్య పరిపాలనా విధానము, మౌర్యసామ్రాజ్య విచ్ఛిన్నము.

## 1. చంద్రగుప్తుడు

సామ్రాజ్యస్థాపన: - క్రీ.పూ. 325 ప్రాంతమున మగధ సామ్రాజ్యమును పాలించుచుండిన నంద చక్రవర్తి ప్రజాకంటకుడుగ నుండుటయేగాక, మదాంధుడై, తన ఆస్థానములోని ప్రముఖులనేకులను అవమానపరచుచుండెను. వానిచేత నవమానింపబడిన వారిలో మహా విద్వాంసుడును, రాజనీతివేత్తయునగు కౌటిల్యుడను బ్రాహ్మణుడొకడు ; నందునివద్ద సేనానాయకుడై మౌర్యకులమున బుట్టినట్టి చంద్రగుప్తుడను క్షత్రియవీరుడు మరియొకడు. బుద్ధిబలముగల కౌటిల్యుడును, భుజబలముగల చంద్రగుప్తుడును కలిసి, నందుని సింహాసనభ్రష్టుని జేయ నిశ్చయించుకొని, కొంత సైన్యమును చేర్చి, పర్వతరాజులు కొందరి సహాయమును సంపాదించి, హఠాత్తుగా నందుని పైబడి, అతని నోడించి, అతని సామ్రాజ్యమును వశపరచుకొనిరి. చంద్రగుప్తుడు చక్రవర్తి అయ్యెను ; కౌటిల్యుడతనికి మంత్రిఅయ్యెను. ఇది క్రీ.పూ. 322 లో జరిగెను. చంద్రగుప్తుడు మౌర్యకులమందు పుట్టిన వాడగుటచేత అతని సామ్రాజ్యమునకు మౌర్యసామ్రాజ్యమను పేరువచ్చెను.

పంజాబును జయించుట:- నందరాజ్యమును జయించిన తరువాత, చంద్రగుప్తుడు పంజాబుపైకి వెళ్ళి గ్రీకు సైన్యములను, సామంత రాజులను ఓడించి, ఆ రాష్ట్రమునంతను తన సామ్రాజ్యములో చేర్చికొనెను. అదిమొదలతడు ఆర్యావర్తనమున కంతకు ఏకచ్ఛత్రాధిపతి అయ్యెను.

సెల్యూకస్ ను ఓడించుట :- తర్వాత మరొకొన్ని సంవత్సరములకు --- క్రీ.పూ. 304 ప్రాంతమున --సెల్యూకస్ అను గ్రీకుచక్రవర్తి పంజాబును తిరిగి జయించు నుద్దేశముతో ఇండియాపైకి దండెత్తివచ్చెను. చంద్రగుప్తుడు అద్వితీయమగు సైనిక బలముతో అతని నెదుర్కొనెను. అప్పుడు యుద్ధమువలన లాభముండదని గ్రహించి, సెల్యూకస్ అతనితో సంధిచేసుకొనెను. ఈ సంధిమూలమున అతని వశమందున్న

ఆఫ్గనిస్థాన బెలూచి స్థానములు చంద్రగుప్తునికి లభించెను ; అతని కుమార్తెలలో నొకతె చంద్రగుప్తుని వివాహమాడెను ; మెగాస్తనీస్ అను గ్రీకురాయబారి యొకడు చంద్రగుప్తుని ఆస్థానమునకు వచ్చెను. వీనికన్నిటికి బదులుగ చంద్రగుప్తుడు సెల్యూకసునకు 500 ఏనుగుల నిచ్చెను.

**చంద్రగుప్తుని అవసానము :-** చంద్రగుప్తుడుఇరువది నాలుగు సంవత్సరములు రాజ్యముచేసి, రాజ్యభారమును కుమారుడగు బిందుసారునకు వదలి సన్యాసాశ్రమమును స్వీకరించెను. ఇతడు జైనుడై, మైసూరు రాష్ట్రమునకు వెళ్ళి ఉపవాసవ్రతము పూని, కాలగతినొందెనని జైనగ్రంథములు చెప్పుచున్నవి.

**బిందుసారుడు (క్రీ.పూ. 298 - 274) :** - బిందుసారుడు ఇరువదినాలుగు సంవత్సరములు రాజ్యముచేసెను. ఇతనికి అమిత్రఘాతుడను బిరుదనామముండెను. ఇతడు దక్షిణాపథమును జయించి, మైసూరు ప్రాంతమువరకు మౌర్యసామ్రాజ్యమును విస్తరించెను. తండ్రివలె నితడుకూడ గ్రీకురాయబారులను తన యాస్థాన మందుంచు కొని, గ్రీకురాజులతో మైత్రికలవాడై యుండెను.

**మెగస్తనీస్:-** చంద్రగుప్తుని కాలమందు మౌర్యసామ్రాజ్య మెట్టిస్థితి యందుండెనో చెప్పుటకు మెగాస్తనీస్ వ్రాసిన గ్రీకుగ్రంథము, కౌటిల్యుడు వ్రాసిన అర్థశాస్త్రము మనకు తోడ్పడుచున్నవి. మెగాస్తనీస్ వివరించిన విషయములు ఈ క్రిందివిధమున నున్నవి.

**పాటలీపుత్రము:-** మౌర్యసామ్రాజ్యమునకు ప్రధాన పట్టణమైన పాటలీపుత్రము ఎనిమిదిమైళ్ళ పొడవును. ఒకటిన్నరమైలు వెడల్పును కలిగియుండెను. దానిచుట్టు 570 బురుజులు గల ప్రాకారముండెను. దాని కావల 600 అడుగుల వెడల్పును, ముప్పదిమూరల లోతును గల కందకముండెను. కోటలోపల రాజప్రాసాదము విశాలమై, బంగారు, వెండి స్తంభములతోడను, తీగెలతోడను, పక్షులతోడను చిత్రింపబడి యుండెను.

**చంద్రగుప్తుని సైన్యము :-** చంద్రగుప్తుని సైన్యమందు ఆరులక్షల కాల్బలము, ముప్పదివేల అశ్వబలము, తొమ్మిదివేల గజబలము, ఎనిమిదివేల రథబలము ఉండెను. ఇదిగాక ప్రత్యేకముగ నౌకాబలమొకటి యుండెను. సైన్యవ్యవహారములను చక్కబెట్టుటకై ఐదేసి సభ్యులుగల ఆరు పంచాయితీలుండెను. ఒక్కొక్క పంచాయితీ ఒక్కొక్క అంగమునకు సంబంధించిన విషయములను చూచుచుండెను. సైన్యముల రాకపోకల గురించిన వ్యవహారములను ఆరవ పంచాయితీ చక్కబెట్టుచుండెను.

**పాటలీపుత్రపాలనము:-** పాటలీపుత్రమును పాలించుటకు ఆరు పంచాయితీ లుండెను. మొదటి పంచాయితీవారు పారిశ్రామిక శిల్పముల గురించిన వ్యవహారములను, రెండవ పంచాయితీవారు విదేశములనుండి వచ్చినవారి

యోగక్షేమములను, మూడవ పంచాయితీవారు జనాభాలెక్కలను, నాలుగవ పంచాయితీవారు వర్తకవ్యాపారములను, అయిదవ పంచాయితీవారు వస్తువుల ధరలను, ఆరవ పంచాయితీవారు పన్నుల వసూళ్ళను గమనించుచుండిరి. ఈ ముప్పది సభ్యులందరు కలసి, పట్టణమునకంతకు సంబంధించిన తక్కిన వ్యవహారములను చక్కబెట్టుచుండిరి.

రాజ్యపాలన:- రాజ్యమంతటను వ్యవసాయమునకు కావలసిన నీటి వసతులుండెను; రాకపోకల కనుకూలించు రాజమార్గముల వేయుటయందు ఎక్కువ శ్రద్ధ చూపబడుచుండెను. వానిపై దూరమును తెలుపు ఱాళ్లు నాటబడియుండెను; రైతులు పంటలో నాల్గవభాగమును పన్ను చెల్లించుచుండిరి. గూఢచారులు దేశమందు తిరుగుచు వారు కనుగొనిన వివరములను రాజునకు రహస్యముగ తెలియజేయుచుండిరి.

## 2. అశోకుడు : అతని విజయములు

**అశోకుడు** : - బిందుసారుని యనంతరము అతని కుమారుడగు అశోకుడు క్రీ. పూ 274 మొదలు క్రీ.పూ 236 వరకు సామ్రాజ్యము వేలెను. ధర్మదేవతయొక్క అపరావతారమని చెప్పదగిన యీ చక్రవర్తివలె రాజ్యమును పలించినవారు ప్రాచీన భరతఖండమున మరియొకరు లేరు

కళింగయుద్ధము : - రాజ్యమునకు వచ్చిన తర్వాత నాలుగు సంవత్సరములకు అశోకునికి శాస్త్రవిహితమగు పట్టాభిషేకము జరిగెను. తర్వాత తొమ్మిది సంవత్సరముల కతడు కళింగ దేశముపై దండెత్తి, దానిని జయించి, తన రాజ్యములో కలుపుకొనెను. ఈ యుద్ధమందు వేలకొలది జనులు హతులైరి. వేలకొలది జనులు ఖైదీలైరి; లెక్కలేని జనులు రోగపీడితులై నానావిధములగు బాధల ననుభవించిరి. సామాన్య జనులేగాక సన్యాసులు కూడ ఎన్నియో కష్టముల పడవలసివచ్చెను. యుద్ధమందు జయము లభించెనను సంతోషమునకుబదులు, ఇదంతయు అశోకునికి అపరిమితమగు విచారమును కలిగించెను.అప్పుడతడు జీవహింసతోకూడిన యుద్ధములను చేయుట కంటె పాతకము మరియొకటి లేదని తలచి, మరి యుద్ధములను చేయకూడదని నిశ్చయించుకొని, తన కాలమును, శక్తిని సమస్త ప్రాణులు సుఖమనుభవించుటకై కావలసిన పనులను చేయుట యందును, ధర్మమును బోధించుటయందును వినియోగించెను.

ధర్మ ప్రబోధము:- ధర్మముప్రజలయందు వ్యాపించుటకై అశోకుడనేకములగు పనులను చేసెను. (1) ప్రజలనుసరింపవలసిన ప్రధాన ధర్మముల నన్నిటిని

శిలలపైనను, జాతి స్తంభములమీదను, కొండగుహలందును చెక్కించెను. ఈ శాసనము లతని సామ్రాజ్యములోని వివిధ భాగములందును కనుపించుచున్నవి. వీనిని బట్టియే అతని సామ్రాజ్యముయొక్క హద్దులను మనము నిర్ణయింప గలిగియున్నాము. (2) ప్రజలకు ధర్మోపదేశము చేయుటకై ధర్మ మహామాత్రులను పేరుగల ఉద్యోగులను కొందరి నతడు నియమించెను; వీరు దేశాటనముచేసి ధర్మస్థాపనము కొరకును, ధర్మవృద్ధికొరకును, ధర్మనిరతులైనవారి హితముకొరకును



అశోకుని స్తంభము : క్రింది భాగమున చిత్రింపబడిన ధర్మశాసనములను చూడనగును.

పాటుబడుచుండిరి. (3) అశోకుడు పుణ్యక్షేత్రములకు యాత్రలు చేసి, సజ్జనుల బోధనలను విని, వివిధ శాఖలకు సంబంధించిన భిక్షుకులతో సాంగత్యము సంపాదించి, తాను నేర్చుకొనిన ధర్మములను స్వయముగ ప్రజలకు పదేశించెను .(4) రథోత్సవములు, గజోత్సవములు మొదలగువాని నేర్పాటుచేసి వానిని చూచుటకై వచ్చిన జనసమూహమునకు ధర్మబోధ చేయించెను. (5) ఈజిప్టు, సిరయా, గ్రీసు, సింహళము

మొదలగు విదేశములకు ధర్మ ప్రచారకులను పంపి, దేశాంతరములందుగూడ ధర్మబోధను గావించెను.

ధర్మాచరణ :- ఇతరులకు ధర్మము నుపదేశించుటయేగాక, స్వయముగా తాను ధర్మముల నన్నిటిని ఆచరించి, ప్రజల కతడు మార్గ దర్శియై, అహింసావ్రతమును స్వీకరించి వేటాడుట మానెను, ఆహారము కొరకై రాజనగళ్ళలో గావింప బడుచుండిన జంతువధను మాన్పెను; రోగపీడితులగు మను ష్యుల యుపయోగమునకే గాక జంతువుల యుపయోగము కొరకు గూడ వైద్యశాల లనేకములను నిర్మించెను. చికిత్సయందుప యోగింపబడు ఓషధులను, వేళ్ళను విదేశములందుండి తెప్పించి తన సామ్రాజ్యమున నాటించెను; ప్రయాణీకుల సౌకార్యార్థమై మార్గము లందు చెట్లను , తోపులను పెంచి, నూతులను త్రవ్వించి, చలి పందిరులను వేయించెను.

సర్వమత సమాదరణము :- అశోకుని హృదయము మిక్కిలి విశాలమైనది. ఆకాలమందు ప్రచారములోనున్న మతములనుబట్టి మోక్షమున కొక్కటే మార్గము లేదనియు, అనేక మార్గములున్నవనియు. ఒక్కొక్కమార్గ మొక్కొక్కరికి రుచించు చుండుననియు అతనికి స్పష్టమయ్యెను. ఇట్టిసందర్భములో ఒకే మార్గము ఉత్తమమైనదనియు, తక్కినవన్ని అధమములనియు చెప్పటకంటె పొరపాటు మరియొకటి లేదని అతడు గ్రహించెను. అందుచేత అతడు బ్రాహ్మణమతము, బౌద్ధమతము, జైనమతము మొదలగువాని నన్నిటియందును సమానాదరణము కలవాడై అందరిని సమానముగ పోషించుచుండెను. ఈమతసహనము అమూల్యమగు ధర్మము. ఇది ప్రజలందరిలో వ్యాపించెను. అప్పటినుండి ఇప్పటి వరకు మనదేశము దీనికి ప్రఖ్యాతిగాంచి యున్నది. దీనికి అశోకుని ప్రవర్తనయే ముఖ్యమగు కారణము.

**అశోకుని ధర్మము** :- అశోకుడు బోధించిన, ధర్మము సర్వమతసమ్మతము, తల్లిదండ్రులయెడ భక్తి, పెద్దలయెడ గౌరవము, బంధువులయెడ ప్రేమ, శ్రమణుల యెడను, బ్రాహ్మణుల యెడను మర్యాద, దాసులయెడ దయ, సత్యము , శౌచము అహింస, దానము - ఇవియే అతని ధర్మమందలి ప్రధానాంశములు. జీవులందరిని బాధనుండి తప్పించుటకు ప్రేమయే ముఖ్యసాధనమనియు, మనష్యులందరు ప్రేమ గలిగియుండవలెననియు అతని ఉపదేశముల సారము.

**అశోకుని మతము**:- సర్వమతములందు సమానమగు గౌరవము చూపుచుండిన అశోకుని మతమేది యను విషయమున చరిత్ర కారులలో అభిప్రాయ భేదములు కలవు. కాని అనేకులు అతడు బౌద్ధుడని చెప్పుచున్నారు. కళింగ

యుద్ధానంతర మతము బౌద్ధమతోపాసకుడయ్యెననియు, తర్వాత - రాజ్యపాలనము చేయుచుండినను, సన్యాసియై కాషాయవస్త్రములను ధరించి బౌద్ధసంఘమున చేరెననియు, పాటలీపుత్రమున గొప్పసభచేసి బౌద్ధసిద్ధాంతములలో కలిగిన భేదములను పోగొట్టెననియు,విదేశములకు, మతప్రచారకులను పంపి బౌద్ధమతమును వ్యాపింపజేసెనననియు, బౌద్ధ గ్రంథములు చాటుచున్నవి.

**అశోకుని చిత్రకళా సేవ:-** చిత్రకళాభివృద్ధికై అశోకుడు చేసిన సేవ అద్వితీయము. పాటలీపుత్రమున అత్యద్భుతముగు మంటపములతో కూడిన రాజసౌధము నతడు కట్టెను. దాని సౌందర్యమును చూచి విస్మయపడిన వారది దేవనిర్మితమై యుండనోపునని తలచిరి. బౌద్ధభిక్షువులు, ఆజీవికులు మొదలగు పరివ్రాజకుల నివాసములకై అతడు



సాంచీ స్థూపము యొక్క ఉత్తరద్వారము

లెక్కలేని విహారముల గట్టెను; గుహాలయము లనేకములను తొలిపించెను. అన్నిటికంటెను అతనిచే నిర్మితములైన స్థూపములు ఎక్కువ ప్రఖ్యాతి గాంచియున్నవి. బుద్ధుని యొక్క అస్థికలు పదిలముగ నుండుటకై ఆతితో అర్ధగోళాకారముగ కట్టబడిన కట్టడములకు స్థూపములని పేరు. గొప్ప స్థూపములచుట్టు ప్రాకారములు, ద్వారములు ఉండును. వీని అన్నిటిపై బుద్ధుని జన్మమునందు జరిగిన కథావిశేషములు

చిత్రింపబడియుండును. అశోకుని స్థూపములలో సాంచీస్థూపము బార్హతు స్థూపము సుప్రసిద్ధములు. స్థూపముల వలెనే అశోకుని శిలాస్తంభములు ప్రఖ్యాతిగాంచియున్నవి. ఇవి ఏకశిలా స్తంభములు; వీని ఎత్తు ఏబది అడుగులకు మించియున్నది; వీనియొక్క నునుపుదనము అసమానమైనది. ప్రతి స్తంభము యొక్క శిఖరమున గొప్ప పద్మదళపత్రముపైన సింహములు, గజములు మొదటగు చిత్రములు చెక్కబడియున్నవి. ఈ సందర్భములన్నిటిలో సారనాధములోనిది అతిసుందరముగ నున్నది. అశోకుడు కొన్నిపట్టణముల్లను కట్టెను. వానిలో ముఖ్యములు నేపాళమందలి లలితనగరము, కాశ్మీరమందలి శ్రీనగరము.

## 3. మౌర్య పరిపాలనా విధానము

**చక్రవర్తి :** - కౌటిల్యుని అర్థశాస్త్రము నుండియు, అశోకుని శాసనముల నుండియు మౌర్య సామ్రాజ్య పరిపాలనా విధానమును గురించిన విశేషములు మనకు తెలియుచున్నవి. సామ్రాజ్యమున కంతకు చక్రవర్తి సర్వాధికారి. సాధారణముగ చక్రవర్తిత్వము వంశానుక్రమముగ వచ్చుచుండెడి పదవి. చక్రవర్తి యొక్క అధికారము నిరంకుశమైనది కాదు. అతడు చేయు పనులన్నియు ధర్మశాస్త్రానుసారముగను దేశ,జాతి,కుల, శిష్టాచార సమ్మతముగను ఉండవలసియుండెను. అతడు మంత్రులయొక్కయు, మంత్రి పరిషత్తుయొక్కయు, నగర జనపదములందలి సభలయొక్కయు సలహాలననుసరించి కార్యనిర్ణయము చేయుచుండెను. వీరితో ఆలోచించినగాని క్రొత్త శాసనముల చేయుట కతని కధికారము లేకుండెను.

**అమాత్యులు , అధ్యక్షులు :** - కౌటిల్యుని దృష్టిలో రాజ్యము బండివంటిది. బండి నడచుటకు ఒక చక్రము చాలదు రెండు చక్రములుండవలెను. అట్లే రాజ్యము నడుచుటకు రాజు మాత్రము చాలడు ; అమాత్యులు, మంత్రులు ఉండవలెను. ఈ సూత్రము ననుసరించి మౌర్యచక్రవర్తులు తమవద్ద అమాత్యులనేకుల నుంచుకొని వారి ద్వారా వ్యవహారముల జరుపుచుండిరి. పురోహితుడు, మంత్రి, సేనాధిపతి, దౌవారికుడు, సన్నిధాత మొదలగు పేర్లతో పదునెనమండుగు రమాత్యులు వారివద్ద నుండిరి. రాజ్యవ్యవహారము లన్నియు అనేక శాఖలుగ (Departments) విభజింపబడి, ఒక్కొక్కశాఖ ఒక్కొక్క అధ్యక్షుని (Superintendent) అధీన మందుండెను. కోశాధ్యక్షుడు రాజద్రవ్యమును జాగ్రత్త పెట్టువాడు; సూత్రాధ్యక్షుడు నేత పరిశ్రమను చక్కబెట్టువాడు; పణ్యాధ్యక్షుడు వర్తక వ్యాపారముల గమనించువాడు. ఈ విధముగ అనేక అధ్యక్షులుండిరి.

రాష్ట్రపాలనము:- పరిపాలనా సౌకర్యమునకై సామ్రాజ్యము అనేక రాష్ట్రములుగను, ఒక్కొక రాష్ట్రము అనేక ఉపరాష్ట్రములుగను, నగరములుగను, గ్రామములుగను విభజింపబడియుండెను. పాటలీపుత్రమునకు చాల దూరమందున్న రాష్ట్రములను రాజ కుటుంబములోని వారు రాజప్రతినిధులుగా పాలించుచుండిరి. చక్రవర్తి కాక పూర్వము అశోకుడు తక్షశిలయందు రాజప్రతినిధి (Viceroy) గ నుండెను. తక్కిన వారు ఉజ్జయినితోసలి, సువర్ణగిరి అను పట్టణములందుండువారు. పాటలీపుత్రమునకు సమీప మందున్న రాష్ట్రములను పాలించుచుండిన రాజప్రతినిధులకు రజ్జకులని పేరు. ఉప రాష్ట్రములను ప్రాదేశికులనువారు పాలించుచుండిరి. సామ్రాజ్యమున కంతకు అమాత్యులు, సభలు ఉన్నట్లే ప్రతిరాష్ట్రమందును అమాత్యులు, పౌరజానపద సభలు ఉండెను.

నగరపాలనము :- ఆ కాలమున నగరముల పరిపాలనము చక్కగా జరుగుచుండెను. ప్రతి పట్టణము ఒక పద్ధతి ననుసరించి కట్టబడియుండెను. పట్టణములోపల విశాలములగు రాజమార్గములు, జలాధారములు, వృత్తి, జాతి కులానుసారముగ నివాస ప్రదేశములు అమర్పబడియుండెను. నగరమును పాలించుటకు నాగరికుడను అధికారియుండెను. నగరవాసుల క్షేమమునకును, ఆరోగ్యమునకును, సౌకర్యమునకును ప్రస్తుత కాలమున మునిసిపాలిటీవారు చేయు పనులనన్నిటిని ఆ కాలమున నాగరికుడు చేయుచుండెను. మార్గములను, వీథులను శుభ్రముగ నుంచుట, అగ్ని, ఉదక బాధలవలన ప్రజలు నష్టము పొందకుండునట్లు చూచుట, దుర్మార్గులను బంధించుట, విదేశస్థుల రాకపోకలను గమనించుట -- ఇవి నాగరికుని పనులు.

గ్రామ పాలనము :- గ్రామముల పాలనము గ్రామస్వామి యొక్కయు, గ్రామ వృద్ధులయొక్కయు అధీనమందుండెను. గ్రామమం దల్లరులు లేకుండునట్లు చూచు పని గ్రామస్వామిది. చోర బాధనుండి ప్రజలను రక్షించుటకూడ అతని పనియే. గ్రామ వృద్ధులు వివాదములను పరిష్కరించుచు, జలాధారములను బాగుచేయుచు, దేవాలయములను, చైత్యములను మంచిస్థితియందుంచుచు, ఉత్సవములు, ప్రదర్శనములు మొదలగువానిని ఏర్పాటుచేసి నడుపుచుండిరి.

గోవుడు:- గ్రామములైదింటిపైనగాని, పదింటిపైనగాని గోవుడను

అధికారియుండెను. గ్రామకరణమువలె భూములకు సంబంధించిన లెక్కలను తయారు చేయుట. ఒక్కొక్క గృహస్థుని యొక్క ఆదాయ వ్యయములను కనుగొనుట. జనాభా లెక్కలను సిద్ధపఱచుట, దాన విక్రయములను రిజిష్టరు చేయుట మొదలగునవి గోపుని పనులు. నగరమందుకూడ ఇట్టి గోపులుండిరి. ప్రజల ఆర్థిక, సాంఘిక పరిస్థితులను గురించిన వివరములన్నియు సంపూర్ణముగ సమకూర్చుటకై గోపులు నియమింపబడి యుండిరి.

**గూఢచారులు :-** రాష్ట్రములందును, నగరములందును, గ్రామములందును నియమింపబడిన ఉద్యోగస్థులు వారివారి పనులను చక్కగ చేయుచున్నారో లేదో కనుగొనుటకును, రాజుల విషయమై ప్రజల వైఖరి ఎట్టిదో పరీక్షించుటకును, చోరులు మొదలగు దుర్మార్గులను నిరోధించుటకును సామ్రాజ్యమందంతట గూఢచారు లనేకులుండిరి. వీరు వివిధ వేషములను వేసికొని, ప్రజల మధ్య రహస్యముగ తిరుగుచు తాము వినినట్టియు, కనినట్టియు విషయములను చక్రవర్తికి తెలుపుచుండిరి. ఈ కారణముచేతనే మన పూర్వులు రాజునకు "చారచక్షువు" అను పేరు పెట్టిరి.

**చక్రవర్తుల ఆదర్శము :-** ప్రజలకేది సుఖము కలిగించునో దానినే చేయవలయునని ఆ కాలపు చక్రవర్తులు తలచియుండిరి. "ప్రజలు సుఖించినచో రాజునకు సుఖము కలుగును. ప్రజలకు హితమైనచో రాజునకు హితమగును. ప్రజలకు ప్రియమైనదే రాజునకు హితముగాని స్వప్రియము హితము కాదు" అని కౌటిల్యుడు చెప్పియున్నాడు. అశోకుని శాసనముల ధోరణికూడ ఇట్టిదే. "మనుష్యులందరు నా సంతానమే. నాస్వంత సంతానము విషయమై ....... సౌఖ్యము నెట్లు కోరుదునో, అట్లే సమస్త జనుల విషయమునగూడ కోరుచున్నాను. ........ నేను భోజనము చేయుచున్నను, కష్టము నందున్నను, వల్లకీలో నున్నను, ఉద్యానవనమందున్నను, ఎచ్చటనున్నను, ఏ కాలమందయినను జనులజనుల వృత్తాంతమును నా ఉద్యోగస్థులు నాకు తెలియజేయుచుండవలెను ...... సమస్త జనుల సౌఖ్యమును అభివృద్ధి చేయుటయే నా ధర్మమని నేను తలచుచున్నాను ...... తెలివిగల దాదికి బిడ్డ నొప్పచెప్పి 'ఈ తెలివిగల దాది నా బిడ్డను బాగుగ పోషింపగల' దని స్వస్థచిత్తముతో నుండునట్లే ఈ రజ్జకులను జానపదుల హితముకొరకును, సౌఖ్యముకొరకును నేను వినియోగించుచున్నాను."




## 4. మౌర్యసామ్రాజ్య విచ్ఛిన్నము

**సామ్రాజ్య విస్తీర్ణము:-** అశోకుడు పాలించినంతటి సామ్రాజ్యమును ప్రాచీనకాలపు మన సార్వభౌములలో మరెవ్వరు పాలించియుండలేదు. నెల్లూరికి దక్షిణమందుండు స్వల్పప్రదేశము తప్ప తక్కిన దేశము ఆఫ్‌గన్‌స్థాన బెలూచి స్థానములు అతని వంశమందుండెను. అతడు క్రీ.పూ 232 లో మరణముగాంచెను. అప్పటినుండి దాని బలము క్షీణమగుట కారంభించి, తుదకు క్రీ.పూ 184లో అది అంతరించెను.

విచ్ఛిన్నమునకు కారణములు:- మౌర్యసామ్రాజ్యము క్షీణించుట కనేక కారణములు కలవు. ఈలాటి కారణముల మూలముననే పూర్వకాలమున మనదేశమందు వన్నెగాంచిన తక్కిన సామ్రాజ్యములు కూడ క్షయమొందెను. అశోకుని మరణానంతరము అతని సామ్రాజ్యమును మౌర్యులలో నెవరో ఒకరు పాలించుటకు బదులు దానిని వారు పంచుకొనినట్లు కనుపించుచున్నది. కాబూలు ఒకరికి, కాశ్మీరము మరియొకరికి, ఉజ్జయిని ఇంకొకరికి, పాటలీపుత్రము మరియొకరికి లభించెను. ఈ పంపకము వలన సామ్రాజ్య బలము తగ్గెను. ఇదిగాక అశోకుడు తన సామ్రజ్యపు సరిహద్దు ప్రాంతములలో నుండిన ప్రజలు కొందరికి స్వాతంత్ర్యమిచ్చి యుండెను. వారిప్పుడు అతని సంతతివారిపై తిరుగబడి వారి యధీనమందుండి పూర్తిగ విడిపోయిరి. అట్టివారిలో ఆంధ్రులు ముఖ్యులు. మరికొన్ని రాష్ట్రములలోనివారు కూడ ఇట్లే తిరుగబడి స్వాతంత్ర్యమును సంపాదించుకొనిరి. వారిలో కళింగులు ప్రధానులు . సామ్రాజ్యక్షయమునకు మరియొక కారణముకూడ కలదు. ఇండియాకు ఆవలనున్న పరాయివారు కొందరు దేశముపై దండెత్తివచ్చి, కొంతరాజ్యమును ఆక్రమించుకొని, ఆఫ్గన్‌స్థానము, పంజాబు మొదలగు ప్రాంతములలో మౌర్యాధికారమును నాశనము చేసిరి. ఇట్టి సందర్భములో పాటలీపుత్రము నేలుచుండిన చక్రవర్తులుకూడ బలహీనులై సామర్థ్యము లేకుండిరి. మొదటి మగ్గురు చక్రవర్తులకుండిన బుద్ధిబలము, యోగ్యత, పౌరుషము వీరికి లేకుండెను. ఇందుమూలమునకూడ సామ్రాజ్యమునకు విచ్ఛిత్తి కలిగెను. ఇదిగాక ఆ కాలమున విశాలములగు సామ్రాజ్యములను రక్షించుకొనుట యిప్పటి కాలమున కంటె కష్టమైన పని. రాజధానినుండి తక్కిన రాష్ట్రములకు సైన్యముల పంపుటకు కావలసిన ప్రయాణ సౌకర్యములు తక్కువ; రాష్ట్రములందలి రాజప్రతినిధులు కలిగించు అల్లరులను అణచివేయుట కష్టసాధ్యము. ఇనుపదారులు, టెలిగ్రాఫులు, వాయు విమానములు మొదలగు సౌకర్యములుగల ప్రస్తుత కాలమున సామ్రాజ్యములను నిలబెట్టుకొనుట సులభము కాని, ఇట్టి సౌకర్యము లేవియు లేని పూర్వకాలమున వానిని నిలబెట్టుకొనుట చాల కష్టముగ నుండెను.

బృహద్రథుడు :- మౌర్యవంశమందు బృహద్రథుడనువాడు ఆఖరువాడు. అతనివద్ద పుష్యమిత్రుడు సేనానాయకుడుగ నుండెను. క్రీ. పూ. 184 లో, ఒక రోజున అతడు సేనలను పరీక్షించుచుండగా పుష్యమిత్రడతనిపై హఠాత్తుగ పడి, అతనిని సంహరించి, సింహాసన మెక్కెను. ఇంతటితో మౌర్యసామ్రాజ్య మంతరించెను.

# ప్రశ్నలు

1. మౌర్యసామ్రాజ్యమున కాపేరెట్లు వచ్చెను ? దానిని స్థాపించినవారెవరు? అతడెవరిని ఎప్పుడెప్పు డోడించెను ? అతనికి సహాయము చేసినవాడెవడు ? అతని రాజ్య మెంతవరకు వ్యాపించెను ? అతని రాజ్యపాలనము గురించి మెగాస్తనీస్ తెలిపిన విశేషము లేవి ?
2. బింబిసారుడు ఏ యే రాష్ట్రములు జయించెను ?
3. అశోకుడు యుద్ధము లెందుకు మానెను ? ధర్మ ప్రబోధమునకై అతడు చేసిన పనులెవ్వి ? అశోకునిలో గనుపించు విశేషము లైదింటిని పేర్కొనుము. అతడు చిత్రకళాపోషకుడనుటకు నాలుగు నిదర్శనముల జూపుము.
4. మౌర్యపరిపాలనా విధానమును తెలిసికొనుటధారము లెవ్వి ? మౌర్య చక్రవర్తులు నిరంకుశులా ? వారి కాలమున (ఎ) రాష్ట్రములు, (బి) నగరములు, (సి)గ్రామములు ఎట్లు పాలింపబడెను ? ప్రజల యుపయోగమునకై వారెట్టి పనులను చేసిరి ?
5. మౌర్యసామ్రాజ్య మెంతవరకు వ్యాపించియుండెను ? దాని విచ్ఛిన్నమునకు కారణము లెవ్వి ?

## నాల్గవ ప్రకరణము

# నానారాజ వంశములు

విషయములు :-శుంగులు, ఖారవేలుడు, ఇందోగ్రీకు రాజులు, ఇందోపార్థియన్ రాజులు, శకులు, కుషాణులు, క్రొత్త బౌద్ధమతము, ప్రాచీన దక్షిణ ఇండియా, మూడు తమిళరాజ్య ములు, ఆంధ్రులు.

## 1. నానారాజ వంశములు

**నానారాజ వంశములు** :- క్రీ. పూ. 184లో మౌర్య రాజ్యమంతరించెను; క్రీ. వె. 320లో గుప్తరాజ్య మంకురించెను. ఈ మధ్యన నుండు ఐదువందల సంవత్సరములలో దేశమునకంతకు ఒక్కడే సార్వభౌముడుండుటకు బదులు అనేక వంశముల రాజులు పాలించుచుండిరి. వీరిలో కొందరు స్వదేశీయులు, మరికొందరు విదేశములనుండి వచ్చినవారు. ఒక్కొక్క ప్రదేశమందు ఒక్కొక్క వంశమువారు పాలించుచుండిరి. ఎవరుకూడ వారి అధికారమును స్థిరముగ స్థాపించుకొనలేరైరి. వీరిలో వీరికి యుద్ధము లప్పుడప్పుడు జరుగుచుండెను; కాని మౌర్యులవలె ఏ వంశము వారుకూడ దేశమంతను జయింపశక్తి గలిగి యుండలేదు.

**శుంగులు** :- మౌర్యచక్రవర్తియగు బృహద్రథుని చంపి, సింహాసన మెక్కిన పుష్యమిత్రుడు శుంగవంశమువాడు; బ్రాహ్మణుడు; మౌర్యులకు సామంతుడై విదిశా నగర ప్రాంతభూముల నేలుచుండినవాడు. మౌర్య సామ్రాజ్యములోని మధ్యభాగమును మాత్రమే ఇతడేల గలిగియుండెను. దీనిపైకి కూడ శత్రువులు దండెత్తి వచ్చిరి. వారిలో గ్రీకుల నాయకుడగు మీనాందరు ముఖ్యుడు. ఇతడు పాంచాలమును, మధురను, సాకేతమును జయించి పాటలీపుత్రముపైనకూడ పడెను. కాని పుష్యమిత్రుడు డతనినోడించి, పంజాబులోనికి తరిమివేసెను. శత్రువు లనేకుల జయించిన దానికి గుర్తుగా పూర్వరాజులవలె నితడు అశ్వమేధయాగము చేసెను. ఇతడు వైదిక మతాభిమాని. ఇతడు చనిపోయిన తర్వాత ఇతని సంతతివారు తొమ్మండుగురు రాజ్యము నేలిరి. వీరిలో ఆఖరువాడగు దేవభూతిని మంత్రియగు వసుదేవుడు క్రీ. పూ. 73లో వధించి, కణ్వ వంశాధికారమును స్థాపించెను. కాని కణ్వులు నలువదియైదు సంవత్సరములు మాత్రమే రాజ్యము చేసిరి. క్రీ. పూ. 27లో వీరిని ఆంధ్రులు జయించిరి.

**ఖారవేలుడు** :- పుష్యమిత్రుడు పాటలీపుత్రము నేలుచుండగా కళింగ రాజ్యమును ఖారవేలుడను రాజు పాలించుచుండెను. ఇతడు చేతవంశపువాడు.

అశోకుని మరణానంతరము కళింగ రాజ్యము స్వతంత్రమయ్యెను. ఈ స్వతంత్ర రాజులలో ఖారవేలుడు మిక్కిలి ప్రముఖుడు. ఇతడు మగధ రాజ్యముపై దండెత్తి దాని ఏలిక నోడించి గంగానదిలో తన ఏనుగులను స్నానము చేయించెనట. ఇతడు రాష్ట్రికులను, భోజకులను జయించినట్లు హతిగుంపా శాసనమున చెప్పి కొనియున్నాడు. వీనినిబట్టి చూడ ఇతడు మిక్కిలి సమర్థుడని తెలియుచున్నది. ఇతడు క్రీ. పూ. 170 ప్రాంతమున రాజ్యమునకు వచ్చెను.

ఇండో గ్రీకులు:- ఇండోగ్రీకులనగా ఇండియా ధేశమును పాలించిన గ్రీకులని అర్థము. అలెగ్జాండరు సామ్రాజ్యములో చేరియుండిన బాక్ట్రియాను పాలించుచుండిన గ్రీకు గవర్నరులు క్రీ. పూ. 250 ప్రాంతమున స్వతంత్రులై, కాల క్రమమున తమ అధికారమును ఆఫ్గన్‌స్థానమందును, పంజాబునందును వ్యాపింపజేసిరి. కాబూలు, గాంధారము, తక్షశిల, శాకల మొదలగు ప్రదేశములు వీరి వశమందుండెను. క్రీ. పూ. 200 మొదలు క్రీ. పూ. 50 వరకు వీరి అధికారము వన్నెకెక్కి యుండెనని చెప్పవచ్చును.

మీనాందరు :- ఈ గ్రీకు రాజులందరిలో మీనాందరు సుప్రసిద్ధుడు. ఇతడు శాకల నగరమును (ఇప్పటి సియల్ కోట) రాజధానిగ జేసికొని, క్రీ. పూ. 160 మొదలు 140 వరకు పంజాబులో చాలభాగమును పాలించెను. ఇతడు గొప్ప యోధుడగుటయే గాక విద్వద్విషయములందెక్కువ శ్రద్ధ పుచ్చుకొనియుండెను. విద్వాంసులతో వాద ప్రతివాదముల చేయుట యందితనికి సమానుడు లేడు.

కాని ఒకప్పుడు నాగసేనుడను బౌద్ధపండితునితో ఇతనికి వాదము సంభవించెను. అందితడు ఓడిపోయి, బౌద్ధమతమును స్వీకరించి దాని నెక్కువగ నాదరించెను. మీనాందరు మొదలగు గ్రీకురాజులందరు సొగసైన నాణెములను ముద్రించిరి. వీని మూలముననే వారి చరిత్రము మనకు తెలియుచున్నది.

ఇండోపార్థియనులు :- పార్థియా చక్రవర్తికి లోబడి మనదేశములోని పశ్చిమభాగమును కొంతకాల మేలుచుండినవారే ఈ ఇండోపార్థియనులు. వీరు గ్రీకుల రాజ్యములను నాశనముచేసి, తక్షశిల, మధుర మొదలగు పట్టణములందు తమ అధికారమును స్థాపించిరి. వీరిలో క్రీ. వె. 20 మొదలు 60 వరకు తక్షశిలను పాలించిన విందపర్ణుడు సుప్రసిద్ధుడు. ఇతని కాలమున సెంట్ తామస్ అను క్రైస్తవ మతబోధకుడు మనదేశమునకు వచ్చి మతప్రచారము గావించెను. ఈరాజుల చరిత్రమునకుకూడ నాణెములే ముఖ్యములగు ఆధారములు.

శకులు :- వీరు సర్ దేరియానదికి ఉత్తరమున మధ్య ఆసియాలో ఉండినవారు.

క్రీ.పూ. రెండవ శతాబ్దములో 'యూచై' అను మరియొక తెగవారు వీరిపై బడగా వీరు దక్షిణమునకు ప్రయాణముచేసి, ఇప్పటి బెలూచిస్థానము మీదుగ మనదేశము ప్రవేశించి, సింధురాష్ట్రమందును, సౌరాష్ట్రము, కతియవారు, మాళవములలోను రాజ్యములు స్థాపించిరి. వీరికిని, ఇందోపార్థియనులకును చాల సంబంధముండెను. వారివలెనే వీరిలో కొందరు పార్థియాచక్రవర్తులకు లోబడియుండిరి. శకరాజులలో ప్రఖ్యాతపురుషుడు ఉజ్జయినినేలిన రుద్రదమనుడు. ఇతని రాజ్యకాలము క్రీ.వె. 120 మొదలు 155 వరకు. ఇతని వంశమువారు క్రీ.వె. 305 ప్రాంతమున గుప్తచక్రవర్తులచే ఓడింపబడిరి.

**విదేశములనుండి వచ్చినవారు హిందువులగుట :-** ఈ ఐదువందల సంవత్సరముల మధ్య విదేశములనుండి వచ్చిన గ్రీకులు, పార్థియనులు, శకులు మొదలగు వారందరు కాలక్రమమున హిందువులలో కలిసిపోయిరి. పూర్వకాలపు హిందూసంఘపు సౌష్ఠవమునకును, పటుత్వమునకును ఇదియే కారణము. అరంభమందు వీరు విదేశీయులైనను రానురాను భరతఖండమునే తమదేశముగా భావించి, ఇచ్చటి ఆచారములను, సంప్రదాయములను, అనుసరించిరి. వీరు హిందూ పేర్లను పెట్టుకొనిరి. హిందువులు పూజించుచుండిన దేవతలను పూజింపసాగిరి. ఆర్యులు, ఆర్యేతరులు, స్వదేశస్థులు, విదేశీయులు - వీరందరి కలయికవలన నేర్పడినదే ప్రాచీనకాలపు భరతఖండము.

## 2. కుషాణులు : క్రొత్త బౌద్ధమతము

**కుషాణులు :-** క్రీ.పూ. 170 ప్రాంతమున మధ్య ఆసియాలోని 'యూచై' తెగవారు వారి శత్రువులదాడి కోర్వజాలక బాక్ట్రియాను చేరిరి. కొంతకాల మక్కడనుండిన తర్వాత వారిలోనొక శాఖవారగు కుషాణులు బలవంతులై, తక్కిన శాఖలను జయించి, క్రీ.వె. 30 ప్రాంతమున దక్షిణ అఫ్గన్‌స్థానములోని గ్రీకు, పార్థియన్ రాజులనోడించి, ఒకరాజ్యమును స్థాపించుకొనిరి. అప్పుడు కుజులుడనువాడు వారికి రాజు. అటుపిమ్మట అతని కుమారుడైన వీముని కాలమున వారు సింధునది కావలనున్న ప్రదేశముల నాక్రమించి, కాశీవరకును కుషాణుల రాజ్యమును వ్యాపింపజేసిరి. వీముని తర్వాత క్రీ.వె. 120 ప్రాంతమున కనిష్కుడు కుషాణులకు చక్రవర్తియై క్రీ.వె. 162 వరకు రాజ్యము చేసెను.

**కనిష్కుడు :-** ఇతడు కుషాణులలోనేగాక భరతఖండము నేలినరాజులలో ప్రసిద్ధిగాంచినవాడు. ఇతడు కాశ్మీరమును జయించెను. చైనావారితో యుద్ధముచేసి కోతాన్, కాష్గరు, యార్కండు రాష్ట్రముల నాక్రమించెను. ఇతని సామ్రాజ్యము ఉత్తర

ఇండియాలో చాలభాగమున వ్యాపించి యుండెను. పురుషపురము (Peshawar) ఇతని రాజధాని.




కనిష్కుని మతము :- కుషాణులు విదేశీయులైనను ఇండియాకు వచ్చిన తక్కిన విదేశీయులవలె భారతీయాచారముల ననుసరించిరి. మొదటి రెండు రాజులు వారి నాణెములమీద శివునియొక్కయు, నందియొక్కయు విగ్రహములను చిత్రించిరి. కనిష్కు డన్నిమతములందు గౌరవము కలవాడైనను అశ్వఘోషుడను బౌద్ధపండితుని

ప్రోత్సాహముచేత బౌద్ధమతము నవలంబించెను. బౌద్ధులలో ఆకాలమందుండిన సిద్ధాంత భేదములను పోగొట్టుటకై ఇతడు పురుషపురమందొక మహాసభను గావించి, అందు సమావేశమైన పండితుల సహాయమున సిద్ధాంత సమన్వయము చేసి, వానినన్నిటిని రాగిరేకులపై వ్రాయించి ఒక జాతి పెట్టెలో పెట్టి స్థూపము నొకదానియందు దానిని పదిల పరచెను. కనిష్కుని మూలమున ఆసియాఖండపు ఉత్తర మధ్యభాగములందు బౌద్ధమతము వ్యాపించెను.

కనిష్కుని భాషాసేవ :- భాషాభివృద్ధికై కనిష్కుడెంతో పాటుపడెను. అతని ఆస్థానమందు విద్వాంసులనేకులుండిరి. వారిలో అశ్వఘోషుడును, చరకుడును పేర్కొనదగియున్నారు. అశ్వఘోషుడు సంస్కృతమున కావ్యములను, నాటకములను వ్రాయ మొదలుపెట్టినవారిలో ఒకడు. ఇతడు తత్వవేత్త అనియు, గాయకుడనియు ప్రసిద్ధిగాంచెను. చరకుడు వైద్యులలో నగ్రగణ్యుడు; చరకసంహిత యను ఆయుర్వేద గ్రంథమును వ్రాసినవాడు.

కనిష్కుని శిల్పకళా సేవ :- కనిష్కుని కాలమున శిల్పకళ నూతనవికాసమును పొందెను. ఇతడు గ్రీకుశిల్పులను రప్పించి, వారిచేత స్థూపములను, విహారములను కట్టించెను. వీరి కట్టడములలో గ్రీకు శిల్పము యొక్క లక్షణము లనేకములు



By Courtesy of Indian Museum

బుద్ధుని జన్మకథను వర్ణించు గాంధార చిత్రఫలకములోని భాగము

కనిపించుచున్నవి. ఈ కారణముచేత కనిష్కుని కాలపు శిల్పమునకు గాంధారశిల్పమను పేరును చరిత్రకారులు ప్రత్యేకముగ పెట్టియున్నారు. గ్రీకుశిల్పులు చిత్రించిన

విగ్రహములు, నిర్మించిన కట్టడములు పురుషపురమందును, తక్షశిలయందును ఎక్కువగ బయల్పడినవి.

కనిష్కుని కాలమందు వ్యాపారము :- కనిష్కుని సామ్రాజ్యము ఇండియాయందును, ఇండియాకు అవల కొన్ని రాష్ట్రములందును వ్యాపించి యుండుటచేత విదేశ వ్యాపార మభివృద్ధిగాంచుట కెక్కువ అవకాశమేర్పడెను. ముఖ్యముగ రోమ్ సామ్రాజ్యముతోటి వ్యాపారము ఎక్కువయ్యెను. ఇండియానుండి రవసెల్లాలు, పట్టుబట్టలు, సుగంధద్రవ్యములు, ఔషధములు అత్యధికముగ రోమ్ సామ్రాజ్యములోనికి ఎగుమతి యగుచుండెను. వీనికి బదులుగ రోమనులు బంగారమును పంపుచుండిరి. కనిష్కుని నాణెములు చాలవరకు బంగారపు నాణెములుగ నుండుటకిది యొక కారణము.





గాంధార శిల్పవైఖరి : గ్రీకుశిల్పులు చిత్రించిన అథీని విగ్రహము

(పురుషపురమువద్ద త్రవ్వి తీయబడినది.)

**కుషాణు సామ్రాజ్య క్షయము:-** కనిష్కుడు క్రీ. వె. 162 వరకు రాజ్యము చేసి మృతిచెందెను. తర్వాత రాజ్యమునకు వచ్చిన కుషాణులు తమ రాజ్యమును చాలకాలము

వరకు నిలబెట్టు కొనలేక పోయిరి. ఒక నూరు సంవత్సరములలో వారి అధి కారమడుగంటెను.

క్రొత్తబౌద్ధమతము:- కనిష్కుడ వలంబించిన బౌద్ధ మతమునకును, అశోకునినాటి బౌద్ధ మతమునకును చాల భేదమగ పడుచున్నది. భగవంతుడేలేడని వాదించు చుండిన బౌద్ధులు బుద్ధుడు భగవంతుని అవతార మనియు; అతని విగ్రహమును పూజించిన యెడల మోక్షము వచ్చు ననియు నమ్మసాగిరి. అవతారముల సిద్ధాంతము ను బోధించు హిందూ మతము యొక్కయు, విగ్రహముల పూజించు గ్రీకులు, కుషాణులు మొదలగువారి అచారములయొక్కయు సంపర్కము చేత బౌద్ధమతమందీమార్పుకలిగెను. బుద్ధుడు సత్ప్రవర్తన వలన మోక్షము కలుగునని చెప్పియుండెను. కాని కనిష్కుని కాలమునాటికి భక్తిమూలమున మోక్షము సులభతరముగ సంపాదింపవచ్చునను సిద్ధాంతము వ్యాపించెను. ఈ భక్తి బుద్ధునియందేగాక ఉత్తీర్ణులైన బోధిసత్వులను పేరులో ప్రసిద్ధిగాంచిన మహానుభావులందు చూపెట్టుట మంచిదని వారు నమ్ముచుండిరి. ఇదిగాక, క్రొత్త బౌద్ధమతమునకు మరియొక లక్షణముగూడ నుండెను. బుద్ధుడును, అతని శిష్యులును వారి బోధనలను ప్రజలు మాటలాడుచుండిన పాళీభాషయందు చేయుచుండిరి. బౌద్ధుల ప్రాచీన గ్రంధములన్నియు ఈ భాషయందే ఉండెను. కాని క్రొత్త బౌద్ధమత గ్రంధములను సంస్కృతభాషలో వ్రాయు అచారము ప్రారంభమయ్యెను. అట్లు చేసినగాని హిందూమతమునకుండు గౌరవము దాని కుండదని బౌద్ధవిద్వాంసులు తలచిరి. ఈ విధముగ మారిన బౌద్ధమతమునకు మహాయానమతమని పేరు. ఈమార్పులవలన బౌద్ధమతమునకును, హిందూమతమునకును గల భేదములు సన్నగిల్లెను.

## 3. ప్రాచీన దక్షిణ ఇండియా

**దక్షిణ ఇండియా** :-తుంగభద్రానదికి దక్షిణమందుండు దేశము దక్షిణ ఇండియా. ఇదియే ద్రావిడము, లేక తమిళ దేశము. ప్రాచీన కాలమందుండి ఈభాగము సిరిసంపదలతో వన్నెగాంచి యుండెను. ఇందులోని ప్రజలు వ్యవసాయమందును, నేతయందును, సముద్రము మీద ప్రయాణము చేయుటయందును ఎక్కువ నేర్పు కలవారై యుండిరి. దీని తీరమున రేవుపట్టణము లనేకములుండెను. వీనినుండి మిరియములు, అల్లము, లవంగములు మొదలగు తాంబూల ద్రవ్యములు, గంధపుచెక్క, అగరు, ముత్యములు, శంఖములు,

నవరత్నములు మొదలగు అమూల్యపదార్థములనేకములు విదేశములకు ఎగుమతి యగుచుండెను. ద్రావిడదేశపు వర్తకులు పశ్చిమమున ఈజిప్టువరకును, తూర్పున చైనావరకును వ్యాపారము చేయుచుండిరి.

**ఆర్యులతో సంబంధము :-** ఆర్యుల నాగరికతను ద్రావిడ దేశమందు ప్రవేశపెట్టినవాడు అగస్త్యుడని ప్రాచీన తమిళగ్రంధములు చెప్పుచున్నవి. అతని తర్వాత ఆర్యావర్తమునుండి బ్రాహ్మణులనేకులు వచ్చి, తమిళ దేశమున స్థిరనివాసము లేర్పరచుకొని, ఆర్యుల ఆచారములను, సంప్రదాయములను ద్రావిడులకు కొంతవరకు నేర్పిరి. కాలక్రమమున ఆర్యావర్తమునకును, ద్రావిడమునకును సంబంధ మధికమయ్యెను.మెగాస్తనీస్ తన గ్రంధమందు దక్షిణ రాజ్యములలో నొకటియగు పాండ్యరాజ్యమును వివరించియున్నాడు. ముత్యములకును, బట్టలకును పాండ్యరాజ్యము ప్రసిద్ధిగాంచినదని కౌటిల్యుడు చెప్పియున్నాడు. పాండ్య చోళ చేర రాజ్యములు తన సామ్రాజ్యపు సరిహద్దుల కావలనుండిన రాజ్యములనియు, అందులోనివారు బౌద్ధధర్మానుసారము ప్రవర్తించుచుండిరనియు అశోకుడు తన శాసనములలో చెప్పియున్నాడు. జైనమతము కూడ దక్షిణ దేశమునకు వ్యాపించియుండెను.

**మూడు తమిళ రాజ్యములు :-** అనాదిగ ద్రావిడ దేశమందు పాండ్య, చోళ, చేర రాజ్యములను పేర్లుగల మూడు రాజ్యములున్నట్లు గ్రంధములు చెప్పుచున్నవి. ఇప్పటి మధుర, రామనాధపురము, తిరునల్వేలి జిల్లాలతో కూడిన ప్రదేశమే పాండ్యరాజ్యము. దీనికిని పెన్నానదికిని మధ్య నుండిన దేశమే చోళరాజ్యము. పశ్చిమ సముద్రతీరమున ఇప్పటి తిరువాన్కూర్, కొచ్చి, మలబారులతో కూడిన దేశము చేరరాజ్యము. వీనిని పాలించుచుండిన రాజులు ఒకరితో మరియొకరు యుద్ధము చేయుచు దక్షిణ ఇండియా యందంతట సార్వభౌమత్వమును స్థాపించుటకు ప్రయత్నించుచుండిరి.

**పాండ్యరాజ్యము :-** దీనికి మధురాపట్టణము రాజధాని. దీనిని గురించి పేర్కొనదగిన గొప్పవిశేష మొకటి కలదు. క్రీస్తుశక ప్రారంభమందు ఇందు తమిళ కవుల సంఘమొకటి యుండెను. ఎవరైన కావ్యము నొకదానిని వ్రాసినపుడు దానిని విమర్శించి అది మంచి గ్రంధమా కాదాయని ఈ సంఘమువారు నిర్ణయించుచుండిరి. దీని మూలమున తక్కిన ద్రావిడభాషలకంటె ఎంతో ముందు తమిళభాషలో గొప్ప వాఙ్మయము బయలు దేరెను. ఈ సంఘపు వాఙ్మయమునుండి పాండ్యరాజ్యము మిక్కిలి

ఐశ్వర్యవంతమైనదనియు, పాండ్యరాజులు వైదిక మతావలంబులనియు, యజ్ఞ యాగముల చేయువారనియు తెలియుచున్నది. క్రీ. వె. మొదటి శతాబ్దారంభ మందుండియు పాండ్యరాజ్యమునకును, రోమ్‌సామ్రాజ్యమునకును ఎక్కువ సంబంధమేర్పడెను. పాండ్యరాయబారి యొకడు రోమ్ చక్రవర్తి ఆస్థానమునందుండెను. పాండ్యదేశమునుండి రవసెల్లాలు మొదలగునవి రోమ్ సామ్రాజ్యమున కెగుమతియగుచుండెను. వానికి బదులు రోమ్‌వర్తకులు బంగారము నిచ్చుచుండిరి. ఈ కారణముచేత రోమ్ సామ్రాజ్య నాణెములనేకములు పాండ్యరాజ్యమందు దొరకెను. రోమక యోధులు పాండ్యరాజులవద్ద నౌకరి చేయుచుండిరి.

**ప్రాచీన చోళరాజ్యము** :- దీనికి మొట్టమొదట ఉరయూరు రాజధాని. అశోకునితో సఖ్యముగ నుండిన స్వతంత్రరాజ్యములలో నిదియొకటి. క్రీ. పూ. రెండవ శతాబ్దములో చోళరాజొకడు సింహళద్వీపమును జయించినట్లు చెప్పెదరు. ప్రాచీన కాలమున చోళరాజ్యము నేలిన వారందరిలో క్రీ. వె. రెండవ శతాబ్దమువాడగు కరికాళ చక్రవర్తి సుప్రసిద్ధుడు. ఇతడు సింహళముపైకి దండెత్తి వెళ్ళి, 12,000 మందిని చెరబెట్టి తెచ్చి, వారిచేత కావేరినది నుండి కాలువల త్రవ్వించి, వ్యవసాయమున కెంతో సహాయము చేసెను. ఇతడు కావేరీ పట్టణమును కట్టి రాజధానిగ చేసెను. ఇతని తర్వాత రాజ్యమునకు వచ్చిన వారు బలహీనులు. పాండ్యులు, చేరులు కలసి వారిపైకి దండెత్తివచ్చివారి నోడించిరి. దురదృష్టవశాత్తున సముద్రపు ఉప్పెనయొకటి వచ్చి కావేరీపట్టణమును ముంచి వేసెను. ఈ కారణముల మూలమున క్రీ. వె. మూడవ శతాబ్దమునుండి చోళరాష్ట్ర ప్రతిభ నశించెను.

**చేరరాజ్యము**:- చేరరాజ్యముయొక్క సంపదకు విదేశవ్యాపారము ముఖ్యకారణము. ప్రాచీనకాలమందు దానిని పాలించుచుండిన రాజులు పాండ్యులతోడను, చోళుల తోడను యుద్ధములు చేయుచుండిరి. వానిలో విజయము పొంది స్థిరకీర్తి సంపాదించినవాడు సెంగుట్టువాన్ అనువాడు. ఇతడు ఆర్యావర్తముపైకి దండెత్తివెళ్ళి అనేక యుద్ధములందు జయము గాంచెనని ప్రాచీన గ్రంథములు చెప్పుచున్నవి.ఇంతకంటె ఆ కాలపు రాజులగురించి విశేషములు లేవు. క్రీ. వె. నాల్గవ శతాబ్దమునుండి పల్లవులనువారు దక్షిణదేశమందంతట తమ అధికారమును స్థాపింప ప్రయత్నించిరి. కాలక్రమమున వారి ప్రయత్నములు సఫలమగుటచేత పాండ్య, చోళ, చేర రాజ్యముల ఆధిక్యత తగ్గెను.

## 4. ఆంధ్రులు

దక్షిణాపథము (Deccan) :- హిమాలయ, వింధ్య పర్వతములకు మధ్యనున్న దేశమునకు ఆర్యావర్తమను పేరు ఉన్నట్లు వింధ్యకును, తుంగభద్రానదికిని మధ్యనున్న దేశమునకు దక్షిణాపథమను పేరుండెను. ఇదియే దండకారణ్య ప్రాంతభూమి. చాలకాలమువరకు వింధ్యపర్వతములను దాటుట ఆర్యులకు కష్టముగ నుండెను. అగస్త్యుని గురించిన పౌరాణిక కథలు అవిషయమునే స్పష్టపరచుచున్నవి. బ్రాహ్మణముల కాలమున విశ్వామిత్రుని సంతతివారని చెప్పబడిన ఆంధ్రులు, పుళిందులు, శబరులు మొదలగువారిందు నివసించుచుండిరి. క్రీ. పూ. ఏడవ శతాబ్దప్రాంతమున ఆర్యులీ ప్రదేశములకు వచ్చి, ఇచ్చటివారితో సంబంధ బాంధవ్యములను చేసికొని వారితో కలిసిపోయిరి. దాని మూలమున సంస్కృతభాష దక్షిణాపథములో వ్యాపించి, ఇచ్చటి మహారాష్ట్రభాషకు తల్లి అయ్యెను. ఆంధ్రమందు కూడ సంస్కృతపు మాటలు, సంప్రదాయములు ఎక్కువగనుండుట కిదియే కారణము.

ఆంధ్రులు :- ప్రాచీనకాలమున దక్షిణాపథమందు ప్రసిద్ధిగాంచిన వారిలో ఆంధ్రు లగ్రగణ్యులు. వీరు కృష్ణా, గోదావరులకు మధ్య నివసించుచుండిరి. మెగాస్తనీసు కాలమునాటికి వీరికి ముప్పది పట్టణములును, లక్ష కాల్బలమును, రెండు వేల అశ్వబలమును, వేయిగజబలమును ఉన్నట్లు తెలియుచున్నది. అశోకుని కాలమున వీరు మౌర్యసామ్రాజ్యములో చేరి, అతని ధర్మశాసనమును అనుసరించి యుండిరి. అప్పుడు వీరికి ధాన్యకటకము రాజధాని. అశోకుని యనంతరము వీరు మౌర్యచక్రవర్తులపై తిరుగబడి, స్వరాజ్యమును స్థాపించుకొనిరి.

**శాతవాహన చక్రవర్తులు** :- అట్లు స్వరాజ్యమును స్థాపించినవారు శాతవాహన వంశమందు పుట్టిన చక్రవర్తులు. వీరిలో మొదటివాడు శ్రీముఖుడు. క్రీ. పూ. 230 ప్రాంతమున రాజ్యమునకు వచ్చినవాడు. ఈ వంశమందు ముప్పదిమంది రాజులుండిరి. వారు క్రీ. వె. 225 వరకు రాజ్యము చేసిరి. అంతటి దీర్ఘకాలము దేశమును పాలించిన వంశము మరియొకటి లేదు.

**శాతవాహన విజయములు** :- శ్రీముఖుని తర్వాత సింహాసన మధిష్ఠించిన చక్రవర్తులు వారి సామ్రాజ్యమును అరేబియాసముద్ర పర్యంతము పెంచిరి. వారిలో నొకడు శుంగుల నోడించి విదర్భ, మాళవదేశముల నాక్రమించెను. క్రీ. వె. మొదటి శతాబ్దమునుండి వీరికి శకుల మూలమున ఎక్కువ ప్రమాదము కలిగెను. అది మొదలు వీరు చేసిన ప్రధాన యుద్ధములన్నియు శకరాజులతోడనే. ఈ యుద్ధము లందు క్రీ. వె. 90 మొదలు క్రీ. వె. 120 వరకు రాజ్యము చేసిన గౌతమీపుత్ర శాతకర్ణి సంపూర్ణమగు

విజయమును గాంచెను. ఇతడు శకులనోడించి వారిదివర కాక్రమించిన సౌరాష్ట్రము, మాళవము, మహారాష్ట్రము మొదలగు ప్రదేశములను తన స్వాధీనము చేసికొనెను. క్రీ. వె. 120 మొదలు 155 వరకు పాలించిన ఇతని కుమారుడు వశిష్ఠపుత్ర పులుమాయి కాలమున శకులు బలవంతులై రుద్రదమనుని నాయకత్వమున శాతవాహన సామ్రాజ్యములో కొంతభాగమును తీసికొనిరి ; అయినను రుద్రదమనుడు తన కుమార్తెను పులుమాయి కిచ్చి వివాహము చేసి అతనితో సఖ్యము కలిగియుండెను. క్రీ. వె. 165 మొదలు 195 వరకు పాలించిన యజ్ఞశ్రీ చక్రవర్తి కాలమున ఆంధ్రసామ్రాజ్యము మంచి స్థితియందుండెను. అప్పటికి వారివశమున నౌకాబలముండినట్లు కూడ తెలియుచున్నది. తర్వాత క్రీ. వె. 225 ప్రాంతమున శాతవాహన వంశమందు రెండు శాఖలు బయలు దేరుట చేత వారి ప్రాబల్యము తగ్గి, వారి అధికారము ఇతరుల హస్తగతమయ్యెను.



అమరావతిలోని చిత్రకళా ఫలకము

**శాతవాహనులనాటి ప్రతిభ**:- శాతవాహన సామ్రాజ్య కాలమందు దక్షిణాపథము సమస్తవిషయములలో మంచి స్థితియందుండెను. చక్రవర్తులు, బ్రాహ్మణులు వైదిక మతాభిమానులై అశ్వమేధయాగములను చేసి ప్రాచీన ధర్మములను నిలబెట్టిరి. వారికిని, వారి ప్రజలకు బౌద్ధమతమందు సమానమగు ఆదరణముండెను. బౌద్ధ

సన్యాసుల యుపయోగమునకై వారనేక ధర్మములను చేసి, అనేక గుహావిహారములను నిర్మించిరి. కార్ల, నాశిక, కన్హేరిలోని గుహలయ శిల్పచాతుర్యము వేనోళ్ళ పొగడదగియున్నది. అట్లే ఈ కాలమున కట్టబడిన అమరావతి స్థూపము, దానిపై చిత్రింపబడిన విగ్రహములు అద్వితీయమైన సౌందర్యము కలిగియున్నవి.

**ఆ కాలపు ఆర్థిక పరిస్థితులు :-** ఆర్థిక విషయములందుకూడ శాతవాహనుల కాలమున ప్రజలు సర్వవిధముల అభివృద్ధిగాంచిరి. వారి రెండవ రాజధానియగు ప్రతిష్ఠానము వర్తక వ్యాపారములకు పేరుగాంచి యుండెను. అప్పటి వర్తకులు శ్రేణులుగ నేర్పడి, మహాశ్రేష్ఠుల నాయకత్వమున వారి వ్యవహారములను జరుపుకొనుచు, విదేశములతో వ్యాపారము చేయుచుండిరి. ఈ కాలమున బ్యాంకులు (Banks) చేయుపనిని ఆ కాలమున ఈ శ్రేణులు చేయుచుండెను. ధర్మకార్యములకై దానశీలురిచ్చిన ద్రవ్యమును దాచి, దానిపై వడ్డీని సకాలమునకు వీరిచ్చుచుండువారు. అట్లే సాలెవాండ్రు, తెలికవాండ్రు మొదలగువారు శ్రేణులుగ నేర్పడి ఎరవెవ రెట్టిపనిని చేయవలయునో, ఎవరి కెంత కూలి నియ్యవలెనో ఏర్పాటు చేయుచుండిరి. శ్రేణు లేర్పరచిన నిబంధనలను అతిక్రమించిన వారిపై జరిమానాల వేయుటయు, ఆసొమ్మును ధర్మకార్యములకై వినియోగించుటయు ఆ కాలపు ఆచారము. గ్రామవ్యవహారములను, నగరవ్యవహారములను గ్రామపెద్దలు, నాగరిక సభలు చక్కబెట్టుచుండెను.

## ప్రశ్నలు

1. పుష్యమిత్రు దేవంశమువాడు? అతడు చేసిన గొప్ప కార్యము లేవి?
2. ఖారవేలు డెవరు ? అతని విజయము లెట్టివి ?
3. మీనాందరు ఎక్కడివాడు? అతని కీర్తికి కారణము లెవ్వి ?
4. విందపర్ణుడు, రుద్రదమనుడు - వీరిని గురించి నీకేమి తెలియును ?
5. కుషాణులెక్కడివారు? కనిష్కునికి పూర్వము వారి రాజ్యమెంతవరకు వ్యాపించెను? కనిష్కుడా రాజ్యమునెట్లు విస్తరించెను? కనిష్కుని మతమేమి? (a)) బౌద్ధమతమునకును (b) భాషకును (c) కళలకును అతడు చేసిన సేవ యెట్టిది?

6. కనిష్కుని కాలమునాటి బౌద్ధమతమునకు క్రొత్త బౌద్ధమతమను పేరేల వచ్చెను? దానికిని, ప్రాచీన బౌద్ధమతమునకును భేదము లెవ్వి ?
7. తమిళదేశ మేది? ప్రాచీన కాలమందు అందలి వ్యాపార పరిస్థితులెట్టివి ? అక్కడివారికి ఆర్యులతోటి సంబంధమెప్పుడెప్పుడెవరి మూలమున ఏర్పడెను? అందలి రాజ్యము లెవ్వి ?
8. పాండ్యరాజ్యమును గురించిన రెండు విశేషములు తెలుపుము.
9. కరికాలుని మహాకార్యము లెవ్వి ?
10. ఆంధ్రదేశమేది? ఆంధ్రులకును, ఆర్యులకును గల సంబంధమెట్టిది ? మౌర్యుల కాలమున ఆంధ్రులెట్టి స్థితియందుండిరి ?
11. శాతవాహను లెవరు? ఎప్పటివారు? వారి విజయములెట్టివి ? వారి కాలపునాటి (a) మతము (b) కళలు (c) ఆర్థిక పరిస్థితులు వివరింపుము.

## ఐదవ ప్రకరణము

# గుప్త సామ్రాజ్యము

విషయములు:- గుప్తసామ్రాజ్య స్థాపనము, సామ్రాజ్యాభివృద్ధి, సముద్రగుప్తుడు, విక్రమాదిత్యుడు, హూణులు, సామ్రాజ్య క్షయము, ఇండియాకు వచ్చిన చీనా యాత్రికులు, హర్ష సామ్రాజ్యము.

## 1. గుప్త సామ్రాజ్యము

**గుప్తరాజ్య సంస్థాపనము :-** మౌర్య సామ్రాజ్యమునకు తర్వాత మనదేశములో ప్రసిద్ధిగాంచిన సామ్రాజ్యము గుప్తసామ్రాజ్యము. దీనిని క్రీ. వె. 320 ప్రాంతమున పాటలీపుత్రవాసియగు చంద్రగుప్తుడు స్థాపించెను. పుట్టుకచేత సామాన్యుడైనను, ప్రఖ్యాతులగు లిచ్ఛవుల ఆడపడుచగు కుమార దేవిని పెండ్లాడి, వారి సహాయముచేత పాటలీపుత్రమునకును, ప్రయాగకును మధ్యనుండిన దేశమును జయించి, మహారాజాధిరాజను బిరుదును వహించి, క్రీ. వె. 335 వరకు ఇతడు రాజ్యమేలెను.

**సముద్రగుప్తుడు :-** గుప్తరాజ్యము సామ్రాజ్యముగ మార్చినవాడు యోధాగ్రేసరుడను పేరుగాంచిన సముద్రగుప్తుడు. ఇతడు చంద్రగుప్తని కుమారులందరిలో సమర్థుడగుటచేత తండ్రి ఇతనికి పట్టము కట్టవలయునని సూచించెను. తదనుసారముగ చంద్రగుప్తుని యనంతరమితడు రాజ్యమునకు వచ్చి క్రీ. వె. 385 వరకు పాలించెను.

**సముద్రగుప్తుని విజయ యాత్రలు:-** రాజ్యమునకు వచ్చినతర్వాత ఇతడు దిగ్విజయయాత్ర లనేకములను చేసెను. మొదటి యాత్రయందు గంగాపరిసర ప్రదేశములలోని రాజులను సంహరించి, వారి రాజ్యములను వశపరచుకొనెను. రెండవయాత్రయందు దక్షిణదిక్కుగ వెళ్ళి మహాకోసలము, దేవరాష్ట్రము (ఇప్పటి విశాఖపట్టణమండలము), పిష్టపురము మొదలగు రాష్ట్రముల రాజుల నోడించి వారివద్ద కప్పములను వసూలుచేసెను. ఈ యాత్రయందితడు కృష్ణానది పర్యంతము వెళ్ళెనుగాని, పల్లవరాజగు విష్ణుగోపుడనేక రాజులతో కలసి ఇతని నెదుర్కొనుటచేత వెనుకకు మరలివచ్చెను. ఈ దిగ్విజయయాత్రలో ఇతడు సముద్రతీరమున కొంతవరకు ప్రయాణము చేసినట్లును, నౌకాబల మితనికి సహాయము చేసినట్లును చెప్పుటకు అవకాశమున్నది. ఈ నౌకాబలము మూలమున హిందూమహాసముద్రములోని కొన్ని ద్వీపములితనికి లోబడియుండెను. ఇతని విజయయాత్రలు విన్న కామరూప (అసాము), నేపాళరాజులును, పంజాబులోని గణప్రభుత్వములవారు కొందరును యుద్ధమవసరము

లేకయే ఇతని సార్వభౌమత్వ మంగీకరించిరి. పశ్చిమ పంజాబు నందును, ఆఫ్గన్ స్థానమందును పాలించుచున్న కుషాణ, శకరాజులు ఇతనితో సఖ్యము వహించియుండిరి. తన సార్వభౌమత్వమును చాటించుటకై ఇతడొక అశ్వమేధయాగమును చేసి, దాని జ్ఞాపకార్థమై గుఱ్ఱపు ప్రతిమలు గల నాణెములను కొన్నిటిని వేయించెను.




సముద్రగుప్తుని ప్రావీణ్యము :-ఇతని ప్రావీణ్యము వినిన సింహళదేశపు రాజగు మేఘవర్ణుడితనికి విలువగల కానుక లనేకములను పంపి, తన రాజ్యమునుండి

వచ్చు బౌద్ధయాత్రికుల ఉపయోగమునకై బుద్ధగయలో బోధి వృక్షమువద్ద నొక గొప్ప విహారము కట్టుట కనుజ్ఞబొందెను. సముద్రగుప్తుడు యుద్ధమందేగాక సంగీత, సాహిత్యము లందు కూడ ప్రావీణ్యము కలవాడై 'కవిరాజ'ను బిరుదును సంపాదించెను.

**చంద్రగుప్త విక్రమాదిత్యుడు :-** ఇతనికి తర్వాత ఇతని కుమారుడగు రెండవ చంద్రగుప్తుడు చక్రవర్తియై క్రీ. వె. 413 వరకు సామ్రాజ్యమును పాలించెను.పరాక్రమమందితడు తండ్రిని మించినవాడు. తండ్రివలె ఇతడు కూడ దిగ్విజయములు చేసి మాళవము, సౌరాష్ట్రము మొదలగు మండలములను పాలించుచుండిన శకరాజులను రూపుమాపి, గుప్తసామ్రాజ్యమును పశ్చిమసముద్రతీరమువరకు వ్యాపింపజేసెను. ఇంతటి గొప్పవిజయము లభించినందున కితడు 'విక్రమాదిత్యు'డను బిరుదనామము వహించెను. ఈ విజయమువలన పాశ్చాత్యదేశములతోడి వ్యాపారము వృద్ధి అయ్యెను. చంద్రగుప్తుడు తన రాజధానిని పాటలీపుత్రమునుండి అయోధ్యకు మార్చెను.

**కుమారగుప్తుడు :-** చంద్రగుప్తుని తర్వాత అతని కుమారుడు కుమారగుప్తుడు చక్రవర్తియై అశ్వమేధయాగమును చేసెను. ఇతనికాలమున హూణులనువారు సామ్రాజ్యముపై దండెత్తిరాసాగిరి. కాని వారి నోడించి, వారివలన విశేష ప్రమాదము రాకుండ ప్రజలనితడు రక్షింపగలిగెను.

**గుప్తులకాలమునాటి నాగరికత :-** గుప్తసామ్రాజ్య కాలమున హిందూనాగరికత సర్వవిధముల ఉచ్చస్థితి గాంచెను. ప్రభుత్వ విధానము ప్రజలకు హితమైనదిగ నుండెను. సంస్కృతభాష సర్వజనాదరణీయమై, సర్వాంగసుందరమై ప్రకాశించెను. మతగ్రంథములన్నియు సంస్కృతమున వ్రాయబడుచుండెను. సంస్కృత కవులందరిలో సుప్రసిద్ధుడగు కాళిదాసు ఆకాలమందుండెను. అతడు ఋతుసంహారము, మేఘదూతము, రఘువంశము మొదలగు కావ్యములను, శాకుంతలము, మాళవికాగ్నిమిత్రము మొదలగు నాటకములను వ్రాసెను. ప్రఖ్యాతిగాంచిన మృచ్ఛకటికమను నాటకము ఆ కాలమునాటిదే. హిందూమత ధర్మములను పామరులు గ్రహించుటకు వీలగునట్లు ఆకాలపువారు పురాణములను వ్రాసి, అందు హృదయరంజకములగు కథలను చేర్చిరి. గుప్తులకాలమున గణితశాస్త్రము, నక్షత్రశాస్త్రము మొదలగునవికూడ ఎక్కువ అభివృద్ధి గాంచెను. వానిని వ్రాసిన ఆర్యభట్టుడు, వరాహమిహిరుడు ఆకాలపువారే. గుప్తులు హిందూదేవాలయము లనేకములను కట్టించి, వానిపై బహుసుందరములగు ప్రతిమలను చెక్కించిరి. లోహపు పనులందు ఆకాలపువారికి ఉండిన నేర్పు ఢిల్లీలోని సముద్రగుప్తుని ఉక్కుస్తంభము చాటించుచున్నది. నలందాలోని ఎనుబది అడుగుల యెత్తుగల బుద్ధుని రాగివిగ్రహము కూడ దీనికి

తార్కాణము. అజంతాగుహలలోని కొన్ని శిల్పము లీకాలమునాటివే. హిందూనాగరికత జావా మొదలగు తూర్పుద్వీపములందు వ్యాపించుట కీకాలముననే మొదలుపెట్టెను.



అజంతా గుహ (నెం. 19 రు) వెలుపలి దృశ్యము

**పౌరాణికమతము** :- ఇప్పటికాలమున హిందువు లవలంబించుచుండు పౌరాణిక మతములోని ప్రధానలక్షణములన్నియు గుప్తుల కాలమున సంపూర్ణతను గాంచెను. భగవంతు డొకడున్నాడనియు, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురు అతని మూర్తులనియు, విష్ణువు ధర్మరక్షణమునకై పది యవతారముల నెత్తెననియు, అతని యనుగ్రహము సంపాదించుటకు భక్తియే ప్రధానసాధనమనియు, దేవాలయములలో నతని విగ్రహములను ప్రతిష్ఠించి ధూప దీప నైవేద్యములతో నతనిని పూజించుట ముక్తిదాయకమనియు హిందూమతము బోధించుచున్నది. దీనికిని, ప్రకృతిశక్తులను యజ్ఞయాగములద్వారా తృప్తిపరుపవలయునని బోధించిన వైదికమతమునకు చాల భేదమున్నది. కాని, బౌద్ధులవలె హిందువులు వేదములను నిరాకరించుట లేదు; యజ్ఞయాగముల మూలమున ఉపయోగము లేనేలేదని చెప్పుట లేదు. వీనిని గౌరవించుచు వీనికంటె భగవద్భక్తి ఉత్తమమార్గమని హిందూమతము బోధించుచున్నది. దీనియొక్క తత్వమును కృష్ణవాసుదేవుడను మతసంస్కర్త భగవద్గీతయం దుపదేశము

చేసియున్నాడు. ఇతిహాసములందును, పురాణములందును ఇది సామాన్యజనులకు బోధమగునట్లు వివరింపబడియున్నది. అందుచేతనే అనేకులు దీనికి పౌరాణిక మతమని పేరు పెట్టియున్నారు. పురాణములద్వారా దీనికి ప్రచారము చేయుటకు గుప్తులకాలమునాటి మతాభిమానులు పాటుపడిరి.

## 2. హూణులు : గుప్తసామ్రాజ్యక్షయము

**హూణులు :-** గుప్త సామ్రాజ్యము క్షీణించుటకు హూణుల దాడియే ప్రధానమగు కారణము. వీరు మధ్య ఆసియాలో నివసించుచుండిన రాక్షస స్వభావులు. వారచటనుండి బయలుదేరి, నానాదేశములపై దండెత్తి, మార్గములో కనుపించిన వారి నందరిని చిత్రవధ చేయుచు, క్రీ. వె. 455 లో గుప్తసామ్రాజ్యముపై బడిరి. కుమారగుప్తుడు తన కుమారుడగు స్కంధగుప్తుని వారి నెదుర్కొనుట కంపెను. ఇతడు బహునేర్పుతో వారి నెదిరించి, దేశమునుండి తరిమివేసెను. కాని వారి దండయాత్ర లింతటితో ఆగలేదు. క్రీ.వె. 455 లో స్కంధగుప్తుడు చక్రవర్తియైన తర్వాత వీరు కొంత కాలమూరకుండిరి. కాని అతని మరణానంతరము క్రీ. వె. 484 ప్రాంతమున వీరు మరియొక పర్యాయము సామ్రాజ్యముపై బడిరి. అప్పటికి వీరు పర్షియా, ఆఫ్గన్ స్థానములను జయించి, తోరమానుడనువాని నాయకత్వమున మిక్కిలి బలవంతులైరి. ఈ కారణము చేత వీరు గుప్తులను సులభముగ నోడించి, ఇండియాలో చాలభాగమును తమ సామ్రాజ్యములో కలిపికొనిరి. తోరమానుని తర్వాత అతని కుమారుడు మిహిరగులుడు వీరికి రాజయ్యెను.

**హూణుల క్రౌర్యము :-** హూణులవంటి క్రూరులును, దుర్మార్గులును మరొక్కరు లేరు. పల్లెలు, మహాపట్టణములు, దేవాలయములు, విహారములు మొదలగువానిని వారు నాశము గావించిరి. వారు దోచికొనిన ధనమునకు లెక్కలేదు. ఆఫ్గన్‌స్థానమందు అనేక వేల సంవత్సరములుగ వన్నెకెక్కియుండిన హిందూనాగరికత వారి దండయాత్రల మూలమున వినాశము గాంచెను. వారు మధ్యదేశమును, ప్రాచ్యదేశమును కూడ జయింతురేమోయను భయము ప్రజలలో కలిగెను. కాని అదృష్టవశాత్తున మాళవరాజ్యమందాకాలమున యశోధర్ముడను శూరాగ్రేసరుడు బయలుదేరి, తక్కిన హిందూరాజులతో కలసి, క్రీ.వె.530 ప్రాంతమున వారి నోడించెను. కాని, అప్పటికి వారిమూలమున దేశమున కెంతో ప్రమాదము సంభవించెను.

**హూణుల దాడియొక్క ఫలితములు :-** వీరి దాడి వలన అనేక ఫలితములు కలిగెను. గుప్తసామ్రాజ్యము విచ్ఛిత్తిగాంచెను; జననష్టము, ధననష్టము అపరిమితముగ సంభవించెను. వీటికంటెను శాశ్వతమగు ఫలము మరియొకటి యున్నది. వీరును వీరి

వెంటవచ్చిన ఘూర్జరులు, మైత్రకులు మొదలగు విదేశీయులు దేశమందు స్థిరముగ నుండిపోయి హిందూమతావలంబకులై రాజ్యములనేకములను స్థాపించిరి. ఈ రాజ్యముల నేలుచుండిన వీరి సంతతివారే రాజపుత్రస్థానమందటుతర్వాత ప్రఖ్యాతిగాంచిన వంశములవారిలో కొందరు.

**గుప్తసామ్రాజ్యము క్షీణించుట :-** స్కంధగుప్తుని తర్వాత గుప్తసామ్రాజ్యము క్షీణించుట కారంభించెను. దీనికి కారణము లనేకములు కలవు. హూణులదాడి బలవత్తరమగు కారణము. ఇదిగాక రాజకుటుంబమందు రెండుశాఖలు బయలుదేరి సామ్రాజ్యము రెండుముక్కలయ్యెను. పాశ్చాత్యభాగము ఒకశాఖవారి క్రిందను, ప్రాచ్యభాగము మరియొకశాఖవారి క్రిందను ఉండెను. దీనిమూలమున కూడ గుప్తుల బలము తగ్గి వారి రాజ్యము అన్యాక్రాంతమయ్యెను. ఇదియే తగిన సమయమని వారి కిదివరకు లోబడియుండిన సామంతరాజులు కొందరు స్వతంత్రులైరి. క్రీ. వె. 510 నాటికి గుప్తసామ్రాజ్య మంతరించెను.

## 3. ఇండియాకు వచ్చిన చీనాయాత్రికులు : ఫాహియాన్

**విదేశములతోడి సంబంధము :-** ప్రాచీనకాలమున మనదేశమునకును, ఆసియాఖండములోని తక్కిన దేశములకును వివిధములగు సంబంధము లేర్పడియుండెను. పశ్చిమమందుండిన పర్షియా, అరేబియా మొదలగువానితో వర్తకము మూలమున సంబంధము కలిగెను. తూర్పుదిక్కున హిందూమహాసముద్రమందున్న ద్వీపములతోడను, బంగాళాఖాతమున కావలనున్న ఇండోచైనాలోని ప్రదేశములతోడను వర్తకము మూలముననేగాక విజ్ఞానముమూలముననను, రాజకీయముగను సంబంధమేర్పడెను. తామ్రలిప్తి, గోపాలపురము, మచిలీపట్టణము మొదలగు తూర్పుతీరపు రేవులనుండియు, బ్రోచి మొదలగు పశ్చిమతీరపు రేవులనుండియు వందలకొలది వర్తకులు, వైదిక మతాభిమానులగు బ్రాహ్మణులు, బౌద్ధభిక్షువులు, క్షత్రియ శూరులు బయలుదేరి, ఓడలపైనెక్కి, వారములకొలది ప్రయాణముచేసి, ఈ తూర్పు దేశములకు వెళ్ళి, హిందూమతమును, హిందూరాజ్యములను స్థాపించి, క్రీస్తుశక ప్రారంభమునుండి వేయి సంవత్సరములకాలము హిందూమహాసముద్రతీర ప్రదేశములందంతట హిందూనాగరికతను వ్యాపింపజేసిరి. వారు బర్మా, పెగూ, అనాం, కంబోడియా, సయాం, సుమత్రా, జావా, బలి మొదలగు ప్రదేశములలో గొప్ప రాజ్యములను స్థాపించుటయేగాక, వైశాల్యమందును, సౌందర్యమందును

మాతృభూమిలోని కట్టడములను మించు దేవాలయములను కట్టిరి. జావా, బలి మొదలగు ద్వీపములలో నిప్పటికికూడ పూర్వపు హిందూ ఆచారములు కొన్నియు, రామాయణ మహాభారతములందు గౌరవమును కనుపించుచున్నవి.

**చైనాతో సంబంధము :-** ఇదేవిధముగ వర్తకము మూలముననను, విజ్ఞానము మూలముననను చైనాదేశముతో మనకెక్కువ సంబంధమేర్పడెను. కనిష్కుని సామ్రాజ్యములోని కొన్ని రాష్ట్రములు చైనాకు పశ్చిమముగ నుండెను. అందతడు బౌద్ధమత ప్రచారము గావించెను. కాలక్రమమున అచటినుండి బౌద్ధభిక్షువు లనేకులు చైనాకు వెళ్ళి, వారి మతమును ఆ దేశమందు ప్రచారము చేసిరి. చైనా చక్రవర్తులు, ప్రజలు బౌద్ధమతావలంబకులై అనేక విహారములను నిర్మించిరి. చైనావిద్వాంసులు బౌద్ధభిక్షువులై మత సిద్ధాంతములను చదువసాగిరి.

**ఫాహియాన్:-** అట్టి విద్వాంసులలో ఫాహియాన్ అనువాడొకడు. ఇతడు బౌద్ధమతమునకు జన్మభూమియగు భరతఖండమునకు వచ్చి, ఇచ్చటి పండితులవద్దనుండి మతధర్మములను నేర్చికొని, బౌద్ధక్షేత్రములను దర్శించి చైనాలో దొరకని బౌద్ధగ్రంథములను సంపాదించి తీసికొనిపోవుటకు నిశ్చయించి, నిర్మానుష్యమగు గోబీ ఎడారిమార్గమున ప్రయాణముచేసి, అత్యున్నతములగు హిందూకుష్ పర్వతములను దాటి క్రీ.వె. 405 లో ఇండియాకు వచ్చెను. ఇతడారు సంవత్సరముల కాలము ఆర్యావర్తమందంతట సంచారముచేసి, తాను చూచినట్టియు, వినినట్టియు విషయములను గ్రంథరూపమున వ్రాసెను. అప్పుడు గుప్తచక్రవర్తియగు చంద్రగుప్త విక్రమాదిత్యుడు రాజ్యమేలుచుండెను.

**అప్పటి పరిస్థితులు :-** బాటసారులు దొంగలు మొదలగువారి మూలమున ఎట్టి ప్రమాదము లేక నిర్భయముగ ప్రయాణము చేయగలిగి యుండిరి. దారి పొడుగున వారి సౌకర్యములకై సత్రములు, చలిపందిరులు, వైద్యశాలలు ఉండెను. ఎచ్చట చూచినను బౌద్ధ విహారములే. వానిలో కొన్నిటియందు వేలకొలది భిక్షువు లుండిరి. రాజులు, రాజపుత్రులు విహారముల కొక్కొక్కప్పుడు స్వయముగ వచ్చి భిక్షువులకు పరిచర్యలు చేయుట గలదు. భిక్షువుల పాండిత్యము, నమ్రత, విదేశములనుండి వచ్చిన అతిథులయెడ గౌరవము ప్రశంసనీయములుగ నుండెను. మతకలహములు మచ్చుకైన కానరాకుండెను. ప్రజలు అన్ని మతములందు సమానాదరణము చూపుచుండిరి. బ్రాహ్మణులు బౌద్ధ గ్రంథములను పఠించుచు శిష్యుల కుపదేశించుచుండిరి. ఉత్సవ సమయములందు నాలుగైదంతస్థులుగల

రథములను తయారుచేసి దేవతావిగ్రహములను వానిపైనుంచి, మేళతాళములతో వాని నూరేగించుచుండిరి. ఉద్యోగస్థుల మూలమున నిర్బంధములేవియు లేకుండ ప్రజలు సుఖముగ జీవించుచుండిరి. పన్నులబాధ విశేషముగ లేకుండెను. రాజుగారి భూములను వ్యవసాయము చేయువారు మాత్రము పంటలో కొంతభాగము నిచ్చుట కలదు. నేరముచేసినవారెపై జరిమానాల విధించుటయేకాని, శరీరములకు సంబంధించిన పరుష దండనము లేదు. రాజ్యమందెవ్వరుకూడ జంతుహింస చేయకుండిరి. కల్లుత్రాగువారుగాని, ఉల్లిపాయ, వెల్లుల్లిపాయలు తినువారుగాని లేకుండిరి. కసాయి దుకాణములుగాని, కల్లుగిడ్డంగులుగాని లేకుండెను. చండాలురు మాత్రము వేటాడి మాంసవిక్రయము చేయుచుండువారు. మగధరాష్ట్రములోని పట్టణములు మిక్కిలి పెద్దవిగ నుండెను. పాటలీపుత్రమందు అశోకుడు కట్టించిన మేడలు, ప్రాకారములు, ద్వారములు దేవనిర్మితములవలె నుండెను.

**ఫాహియాన్ వెడలిపోవుట :-** ఇట్టి భరతఖండమును సందర్శించి, తామ్రలిప్తియందొక గొప్ప వర్తక నౌకనెక్కి, ఫాహియాన్ సింహళమునకు బోయెను. అచ్చట రెండేండ్లుండి మరియొక నౌకనెక్కి తనతోకూడ ప్రయాణము చేయుచుండిన హిందూవర్తకులతో కలిసి జావాకు వెళ్ళెను. అచ్చట బ్రాహ్మణు లెందరో యుండిరి. అచ్చటినుండి అతడు చైనాకు చేరెను.

## 4. హర్షవర్ధనుని సామ్రాజ్యము

**గుప్తసామ్రాజ్యము తరువాతి పరిస్థితులు :-** గుప్తసామ్రాజ్యము క్రీ.వె. 510 ప్రాంతమున క్షీణించెను. తర్వాత నూరు సంవత్సరముల వరకు సార్వభౌముడని చెప్పదగినవారెవరు ఆర్యావర్తమందు లేరైరి. ఈ మధ్యకాలమున చిన్న చిన్న రాజ్యములు కొన్ని బయలుదేరెను. వానిలో ముఖ్యములైనవి బంగాళము, కన్యాకుబ్జము, మాళవము, స్థానేశ్వరము. క్రీ. వె. 600 ప్రాంతమున శశాంకుడనువాడు బంగాళమును, మౌకరివంశస్థుడగు గృహవర్మ కన్యాకుబ్జమును, వర్ధన వంశస్థుడగు ప్రభాకరవర్ధనుడు స్థానేశ్వరమును పాలించుచుండిరి. ప్రభాకరవర్ధనుడు తన కుమార్తెయగు రాజ్యశ్రీని గృహవర్మకిచ్చి పెండ్లి చేసెను. ఈ సంబంధము వలన కన్యాకుబ్జ, స్థానేశ్వర రాజ్యములు బలిష్ఠములై శత్రువుల నోడించుటకు తగిన స్థితియందుండెను. వీని నెదిరించుటకై శశాంకుడు మాళవరాజుతో సఖ్యము చేసికొనెను. దీనిమూలమున ఆర్యావర్తమందలి రాజులు క్రీ. వె. 600 ప్రాంతమున రెండు పక్షములుగ ఏర్పడుట సంభవించెను.

ప్రభాకరవర్ధనుడు :- ప్రతాపవంతుడగు ప్రభాకరవర్ధనుడు పంజాబును, మాళవ రాజ్యములో కొంత భాగమును జయించి, స్థానేశ్వర రాజ్యమును విస్తరించెను. తర్వాత హూణుల మూలమున ప్రమాదము కలిగినందున వారి నెదుర్కొనుటకై కుమారుడగు రాజ్యవర్ధనుని పంపెను. అతడు వారి నోడించి వచ్చుటకుముందే ప్రభాకరవర్ధనుడు రోగ పీడితుడై క్రీ. వె. 604 లో మృతి జెందెను.

రాజ్యవర్ధనుడు:- తర్వాత రాజ్యవర్ధనుడు రాజయ్యెను. అప్పటికే శశాంకుడు మాళవ రాజుతో కలసి, కన్యాకుబ్జముపై దండెత్తి యుద్ధమందు గృహవర్మను చంపి, రాజ్యశ్రీని చెరబట్టెను. ఈ దఃఖవార్తను వినిన వెంటనే రాజ్యవర్ధనుడు సైన్యసమేతుడై, శత్రువినాశమునకు బయలుదేరి, మార్గమున మాళవ సైన్యములనోడించి కన్యాకుబ్జము చేరెను; కాని శశాంకుడతనిని మోసపుచ్చి చంపెను.

హర్షవర్ధనుడు:- అప్పుడు స్థానేశ్వరమందున్న మంత్రి ప్రముఖులందరు ప్రభాకరవర్ధనుని రెండవ కుమారుడగు హర్షవర్ధనుని సింహాసన మధిష్ఠింపగోరిరి. వారి కోరికను మన్నించి, అతడు రాజయ్యెను. అప్పటి కతనికి పదునెనిమిది సంవత్సరముల వయస్సు. చెల్లెలిని రక్షించుటకును, శత్రువులను సంహరించుటకును అతడు వెంటనే బయలుదేరెను. శశాంకు డప్పటికే రాజ్యశ్రీని చెఱనుండి వదలెను. కాని తనకు కలిగిన విచారము నామె భరింపలేక, వింధ్యాటవుల జేరి, అగ్నిప్రవేశము చేయ సిద్ధపడియుండెను. హర్షుడు అతివేగముగ ప్రయాణముచేసి, అగ్ని యందు దుముకుటకు సిద్ధముగనుండిన చెల్లెలి ప్రాణములను కాపాడి, ఆమెతో కూడ స్థానేశ్వరము చేరెను.

హర్షుని దిగ్విజయము :- తర్వాత గొప్ప సైన్యములను చేర్చికొని, హర్షుడు శత్రువులపైబడి, ఆరు సంవత్సరముల కాలము వారితో యుద్ధముచేసి, పంజాబు మొదలు అసాంవరకును, హిమాలయమునుండి నర్మదానదివరకును తన సామ్రాజ్యమును స్థాపించెను. ఇంతటితో తృప్తిపొందక క్రీ. వె. 620 లో అతడు నర్మదానదిని దాటి, దక్షిణాపథమునుకూడ జయించుటకు ప్రయత్నించెను. కాని చాళుక్య చక్రవర్తియగు రెండవ పులకేశుడు అతని నెదుర్కొని, యుద్ధమందోడించి, వెనుకకు తరిమెను.

హర్షుని ఆధిక్యత :- గొప్పసామ్రాజ్యమును స్థాపించు పనిని మాత్రమే హర్షుడు చేయలేదు. అంతకంటెను ప్రధానములగు కార్యము లనేకము లతడు చేసెను. అవియే వాని శాశ్వతకీర్తికి కారణములు. దిగ్విజయానంతరము ముప్పది సంవత్సరముల కాల మతడు ధర్మ సమ్మతముగా రాజ్యమును పాలించెను. రాజ్యమందంతను సంచారము చేయుచు, స్వయముగ ప్రజల కష్టసుఖములను కనుగొనుచుండెను.

అశోకునివలె వైద్యశాలలను, చలిపందిరులను నిర్మించి, రోగపీడితులకు, అనాథలకు ఎంతో సహాయము చేసెను. ఐదు సంవత్సరముల కొక పర్యాయము ప్రయాగయందు మహాసభ నొకదానిని చేసి, తాను కూడబెట్టిన ధనమంతయు విద్వాంసులకును, పేదలకును పంచిపెట్టుచుండెను. ఇతడు బౌద్ధమతస్థుడైనను మతము లన్నిటియందు




సమానమగు నాదరముకలవాడై బౌద్ధ భిక్షులకును, బ్రాహ్మణులకును, జైనులకును, తక్కిన మత ప్రచారకులకును దానధర్మములు చేయుచుండెను. హర్షుడు తన

రాజధానిని కన్యాకుబ్జమునకు మార్చి, అందు అనేక సౌధములను, గోపురములను, ఉద్యానవనములను, సరోవరములను నిర్మించెను.

హర్షుని విద్యాపోషణ :- హర్షుడు గొప్ప విద్వాంసుడు. సంస్కృతమున నాగానందము, రత్నావళి, ప్రియదర్శికయను నాటకములను, వ్యాకరణగ్రంథము నొకదానిని ఇతడు వ్రాసెను. ఇతని ఆస్థానమందు కవులు, విద్వాంసులు అనేకులుండిరి. హర్షచరిత్రమును, కాదంబరికథను వ్రాసిన బాణుడు వారిలో పేర్కొనదగినవాడు.

హర్షుని మరణము :- హిందూ మహాయుగమందు ప్రఖ్యాతిగాంచిన చక్రవర్తులలో ఆఖరువాడని చెప్పదగు హర్షుడు నలువది సంవత్సరములు రాజ్యముచేసి క్రీ.వె. 647 లో మృతిజెందెను. అంతటితో అతని సామ్రాజ్యముకూడ ముక్కలయ్యెను. అతని మంత్రులలో నొకడు అన్యాయముగ సింహాసనము నెక్కి, చైనాదేశమునుండి వచ్చిన రాయబారిని దోచి అగౌరవపరచెను. అందుమీద నతడు టిబెట్టుకు వెళ్ళి సైన్యమును తయారుచేసి, ఆ మంత్రిపైకి దండెత్తివచ్చి, అతనిని పూర్తిగ నోడించెను. ఈలాటి కారణములచేత మౌర్య, గుప్తసామ్రాజ్యములకు పట్టిన గతియే హర్ష సామ్రాజ్యమునకుకూడ పట్టెను.

## 5. ఇండియాకు వచ్చిన చీనాయాత్రికులు : హ్యూయిన్‌సాంగ్

హ్యూయిన్‌సాంగ్ :- బౌద్ధులందరికి భరతఖండము పుణ్యభూమి. అందలి క్షేత్రములను దర్శించిన యెడల తమ జీవితము పావనమగునని వారు నమ్మెదరు. అందుకై వారెన్ని కష్టములు పడుటకైన వెనుదీయరు. ఈ కారణము చేతనే చైనా దేశమునుండి యాత్రికులనేకులు పూర్వకాలమున మన దేశమునకు వచ్చుచుండిరి. గుప్తసామ్రాజ్య కాలమున ఫాహియాన్‌వచ్చినట్లు హర్షుని కాలమున హ్యూయిన్‌సాంగ్ అనువాడు వచ్చెను. ఇతడు గొప్ప విద్వాంసుడు. ఇరువది సంవత్సరముల వయస్సుననే బౌద్ధభిక్షువై చైనాలో ప్రఖ్యాతిగాంచిన విద్యాలయము లన్నిటిలో మత సిద్ధాంతములను నేర్చుకొని, తృప్తిచెందక, మతవిద్యకంతకు మూలాధారమని చెప్పదగిన మనదేశమునకు ప్రయాణమయ్యెను. మధ్యఆసియాలోని అరణ్యములు, నిర్జన ప్రదేశములు, పర్వతములు మొదలగువానిని దాటి, దొంగల వలనను దారిదోపిడి గాండ్రవలనను కలిగిన బాధలను తప్పించుకొని ఎట్లో క్రీ. వె. 630 సం॥న అతడు ఇండియాను చేరెను. అది మొదలు పదునైదు సంవత్సరాల కాల మతడు ఆర్యావర్తమందేకాక దక్షిణాపథ, దక్షిణ ఇండియాలందు కూడ సంచారము చేసి, తాను చూచిన విషయముల నన్నిటిని

గ్రంథములందు వ్రాసెను. హర్షచక్రవర్తి ఇతని నెంతో గౌరవించి తన ఆస్థానమందుంచుకొనెను. పండితులతో నితడు వాద ప్రతివాదముల చేసెను: గొప్ప విద్యాలయములకు వెళ్ళి అందలి అధ్యాపకులనుండి బౌద్ధమతమునకు సంబంధించిన రహస్యము లెన్నిటినో నేర్చుకొనెను. ఇట్లు సంచారము చేసి, 577 బౌద్ధగ్రంథములను, బంగారు, వెండి, మంచి గంధపుచెక్క మొదలగువానితో చేయబడిన బుద్ధుని యొక్కయు, బౌద్ధదేవతలయొక్కయు సుందర విగ్రహము లనేకములను, వీని అన్నిటికంటె నమూల్యముగ నెంచదగిన బుద్ధుని నూట ఏబది అస్తికలను తీసికొని, తనజన్మము సఫలమైనదను పరమానందముతో స్వదేశమునకు వెళ్ళిపోయెను. ఇట్టి మహనీయుడు తన సామ్రాజ్యమందుండినందుకు చైనా చక్రవర్తి ఎంతో గర్వపడి, సర్వవిధముల అతనిని గౌరవించెను. చైనా దేశపు తత్వవేత్తలలో హ్యూయిన్‌సాంగ్ విశేషమైన ప్రఖ్యాతిని గాంచెను.

**పరిపాలనా విశేషములు :-** హ్యూయిన్‌సాంగ్ హర్ష సామ్రాజ్యమందలి పరిపాలనా విశేషములు కొన్నింటిని గురించి ఈ విధముగ చెప్పియున్నాడు : "రాజులయొక్క భూముల నుండి వచ్చు ఆదాయము నాలుగు భాగములుగ చేయబడుచున్నది. ఒక భాగము పరిపాలన వ్యవహారములకును, ఒక భాగము మంత్రుల యొక్కయు, తక్కిన ఉద్యోగులయొక్కయు జీతములకును, ఒక భాగము పండితుల పోషణమునకును, ఒక భాగము దానధర్మములకును వినియోగింపబడుచున్నది. ప్రజల వద్ద నుండి రాజు తీసికొను పన్నులు స్వల్పముగా నుండును. వారు నిర్బంధముగ చేయవలసిన పనులుకూడ స్వల్పములుగ నున్నవి ....రాజుయొక్క భూములను వ్యవసాయము చేయువారు పంటలో ఆరవ భాగము నిచ్చుచుందురు. వ్యాపారముచేయు వర్తకులు నిరాటంకముగ ప్రయాణము చేయగలిగియున్నారు. కొద్దిరుసుము ఇచ్చిన యెడల ప్రయాణికులు నదులను, టోలు గేటులను దాటుటకు వీలగుచున్నది. ప్రభుత్వపు పనులలో వెట్టిపని చేయించుకొనుచుందురు. కాని పనికి తగిన కూలి నిచ్చుచుందురు. సైన్యములు సరిహద్దులను రక్షించుచు అల్లరుల నణచుచుండును."

**ప్రజల ఆచారములు :-** దేశములోని వారందరు నిరాడంబరులై, పరిశుభ్రముగ నుండిరి. సామాన్యులు కూడ న్యాయబుద్ధితోడను, ధర్మచింతతోడను, ప్రవర్తించుచుండిరి. పరలోకచింత వారికి మెండు; చెప్పిన మాటను తప్పువారు కారు. పాదరక్షలు లేకయే వీథుల వెంట నడుచుచుండుట వారికి అలవాటు. భోజనమైన తర్వాత మిగిలిపోయిన

అన్నమును దాచి తర్వాత తిను ఆచారము వారి యందు లేదు. ఒక పర్యాయము వాడిన కఱ్ఱపాత్రములను, జాతిపాత్రములను వారు పారవేయుచుండిరి. లోహపు పాత్రలను చక్కగ తోమి తళతళ మెరయులాగున చేయుచుండిరి.

విద్యను గురించిన విశేషములు :- విద్యావంతులకు దేశమందంతట అపరిమితమగు గౌరవముండెను. సాధారణముగ తొమ్మిది మొదలు ముప్పది సంవత్సరాల కాలము విద్యల నేర్చికొనుటయందు అప్పటివారు గడపుచుండిరి. దేశ మందు విద్యాలయము లనేకము లుండెను. విదేశములనుండి విద్యార్థులనేకు లీవిద్యాలయములకు వచ్చుచుండిరి. వీని అన్నిటిలో నలందా విశ్వవిద్యాలయము మిక్కిలి ప్రఖ్యాతి గాంచి యుండెను. అందు పదివేలమంది విద్యావ్యాసంగము చేయుచుండిరి. బౌద్ధమతగ్రంథములు, వేదములు, వేదాంగములు, హేమవిద్య, శబ్దవిద్య, వైద్యశాస్త్రము మొదలగునవి అందు నేర్పబడు చుండెను. ఈ విద్యాలయ పోషణమునకై నూరు గ్రామములను రాజులు దానము చేసియుండిరి.

సాధారణ పరిస్థితులు :- హ్యూయిన్‌సాంగ్ యొక్క వ్రాతలను బట్టి గుప్తుల కాలమునకును, హర్షుని కాలమునకును కొన్ని విషయములందు భేద మున్నట్లు కనుపించుచున్నది. ప్రయాణసౌకర్యములు కొంత తగ్గియుండెను. చోరులబాధ కొంత అధికమయ్యెను. బౌద్ధమతము క్షీణించుట కారంభించెను. హిందూమతమును ఆదరించుచుండిన వారి సంఖ్య హెచ్చుగుచుండెను. నేరముచేసిన వారిపై రాజులు విధించుచుండిన శిక్ష పూర్వము కంటె పరుషముగ నుండెను.

## ప్రశ్నలు

1. గుప్తసామ్రాజ్యము నెవ్వరు, ఎప్పుడు స్థాపించిరి? అతనికి సహాయము చేసిన వారెవరు?
2. సముద్రగుప్తుని విజయయాత్రలను వివరింపుము. ఇతని సామ్రాజ్యపు హద్దులను పేర్కొనుము. ఇతని ప్రావీణ్యమునకు మూడు నిదర్శనములను చెప్పుము.
3. చంద్రగుప్త విక్రమాదిత్యునికి 'విక్రమాదిత్యు'డను బిరుదెట్లు వచ్చెను?
4. గుప్తుల కాలమున (a) వాఙ్మయము, (b) శాస్త్రములు, (c) శిల్పము, (d) మతము ఎట్టి స్థితియందుండెను ?

5. గుప్త సామ్రాజ్యక్షయమునకు మూడు కారణములను పేర్కొనుము ?
6. హూణు లెట్టివారు ? వారి నోడించిన మహావీరుడెవడు ? వారి దాడి యొక్క ఫలితము లెవ్వి ?
7. ప్రాచీనకాలమున మనదేశమునకు(a) ఏయే దేశములతో (b) ఎట్టి సంబంధ మేర్పడియుండెను ?
8. ఫాహియాన్ ఎక్కడివాడు ? ఇండియాకు ఎందుకు వచ్చెను ? ఎప్పుడు వచ్చెను? ఏ మార్గముమీదుగ వచ్చెను ? అతడు వర్ణించిన ఇండియాలోని విశేషము లెవ్వి ? అతడే మార్గము మీదుగ చైనాకు వెళ్ళిపోయెను ?
9. హర్ష వర్ధనునికి పూర్వము స్థానేశ్వర రాజ్యము ఎవరెవరు ఎంతవరకు విస్తరింపజేసిరి ? హర్షుడేయే రాష్ట్రములను జయించెను ? అతని నోడించిన రాజెవడు? హర్షుని ఆధిక్యతను సూచించు కార్యము లైదింటిని బేర్కొనుము.
10. హ్యూయిన్ సాంగ్ ఎవడు ? అతని జీవితములోని ముఖ్య విషయముల నారింటిని వివరింపుము ? అతడు ఇండియాలో చేసిన పని ఎట్టిది ? అతడు వివరించిన విశేషములెవ్వి?
11. ఫాహియాన్ కాలపు ఇండియాకును, హ్యూయిన్ సాంగ్ కాలపు ఇండియాకును గల భేదములను నాల్గింటిని ఉదాహరింపుము ?

ఆరవ ప్రకరణము

# హర్షుని తర్వాత ఇండియా

విషయములు :-రాజపుత్ర రాజ్యముల విజృంభణము, మహమ్మదీయ మతస్థాపనము, అరబ్బులు సింధుదేశమును జయించుట, పశ్చిమ చాళుక్యులు, తూర్పు చాళుక్యులు, పల్లవులు, చోళులు.

## 1. రాజపుత్ర రాజ్యముల విజృంభణము

**రాజపుత్ర యుగము :** -- హర్షుడు క్రీ.వె. 647 లో మృతిజెందెను. క్రీ.వె. 1192 లో మహమ్మదుగోరీ పృథ్వీరాజును జయించి మహమ్మదీయ సామ్రాజ్యమును స్థాపించెను. ఈ రెంటికిని మధ్యనుండు ఐదువందల ఏబది సంవత్సరముల కాలమున మనదేశములో చాలాభాగమందు రాజపుత్ర రాజ్యములు ప్రబలి యుండెను. ఈ కారణముచేత దీనిని రాజపుత్రయుగమని చెప్పెదరు.

**రాజపుత్రులు :** - రాజపుత్రులందరు ఒక జాతివారు కారు. వారిలో కొందరు విదేశములనుండి వచ్చిన హూణులు, ఘూర్జరులు. మరికొందరు అనాదిగ దేశమందుండి హర్ష సామ్రాజ్యము విచ్ఛిన్నమైన వెంటనే స్వతంత్ర రాజ్యములను స్థాపించినవారు. విదేశీయులైనను కాకపోయినను వీరందరు రాజ్యములను సంపాదించుకొని తర్వాత ఒకరితో మరియొకరు వివాహబంధములను చేసికొని కలసిపోయిరి. అట్టి కలయిక చేత వారి ఆచారములు, సంప్రదాయములు చాలవరకు సమానములయ్యెను. వారెల్లరు క్షత్రియులనియు, కొందరు సూర్యవంశమందు పుట్టిన వారనియు, కొందరు చంద్రవంశములోని వారనియు వారి ఆస్థానములందున్న బ్రాహ్మణులు నిర్ణయించిరి.

**రాజపుత్రుల స్వభావము :-** రాజపుత్రులకు యుద్ధమందపరిమితమగు ప్రీతి. యుద్ధములో అపజయము గాంచుట కంటెను, లేక యుద్ధరంగమునుండి పారిపోవుట కంటెను, మరణమే శ్రేష్ఠమని వారినమ్మకము. ధైర్యసాహసములందును, ఆత్మగౌరవ రక్షణమందును వారికి మించిన వారెవ్వరును లేరు. అధర్మయుద్ధమునకు వారిష్టపడువారు కారు. శత్రువును మోసగించి ఏదోవిధముగ జయించుట వారి మతము కాదు. అభయము వేడిన శత్రువునుకూడ వారు కాపాడువారు. పురుషుల వలె రాజపుత్ర స్త్రీలు కూడ సాహసురాండ్రు. ఆపత్కాలములందును, యుద్ధ సమయములందును వారు చూపిన పౌరుషము, ధైర్యము, పట్టుదల అసమానము లైనవి. పాతివ్రత్యముకంటె

పరమధర్మము మరియొకటి లేదని వారి దృఢవిశ్వాసము. శత్రువుల వశమగుటకన్న అగ్ని ప్రవేశమే ఉత్తమ మని వారెంచుచుండిరి. రాజపుత్ర సంఘమందిన్ని సుగుణములుండినను వీరిలో కొన్ని లోపములు కూడ కనుపించుచుండెను. యుద్ధము వారి కొక విధమగు వ్యసనముగ పరిణమించెను. స్వల్పవిషయములకుకూడ వారు యుద్ధములలో దిగుచుండిరి. క్రోధము సాధించుకొనుటయందు వారిది మొండిపట్టు. ఈ కారణము చేత వారెల్లప్పుడు ఒకరితొనొకరు యుద్ధము చేయుచు ఐకమత్యము లేక మెలగుచుండిరి. పంద్రెండవ శతాబ్దమున వారి రాజ్యములను మహమ్మదీయులు జయించుట కిదియే ప్రబలమగు కారణము.

**రాజపుత్ర రాజ్యములు:-** రాజపుత్ర యుగమందు అనేక రాజ్యములు ప్రసిద్ధి గాంచెను. కాశ్మీరము, కన్యాకుబ్జము, మాళవము, బుందేలుఖండము, చేది, ధారా, అజ్మీరు, ఢిల్లీ, అన్‌హల్వాడు, గౌడము (బంగాళము) వీనిలో ముఖ్యములైనవి. వీనిని పరిపాలించిన కులములలో పరమారులు, ఘూర్జరులు, ప్రతిహారులు, చౌహానులు, సోలంకులు, రహటోరులు పేర్కొనదగియున్నారు. వీరి అందరియొక్క చరిత్రముగాని, వీరిలో వీరికి జరిగిన యుద్ధముల నన్నిటినిగాని వివరించుట సాధ్యమైన పనికాదు. వీరిని గురించిన విషయములలో ఒకటి రెండు మాత్రము ముఖ్యముగ గమనింపదగియున్నవి.

**రాజపుత్రుల యుద్ధములు :-** హర్ష సామ్రాజ్యమునకు రాజధానిగ నుండిన కారణము చేత ఆ కాలమందు కన్యాకుబ్జమునకు ఎక్కువ ప్రాధాన్యముండెను. రాజ్యములను జయించి, సార్వభౌమ బిరుదమును సంపాందింపగోరిన వారందరు ఆ పట్టణమును వశపరచుకొనుటకు ప్రయత్నించుచుండిరి. అట్టి ప్రయత్నములు చేసిన వారిలో కాశ్మీరరాజులు, ఘూర్జరులు, గౌడరాజ్యమును పాలించిన పాలవంశమువారు, దక్షిణాపథములోని రాష్ట్రకూటులు ప్రధానులు. క్రీ.వె. 724 మొదలు 760 వరకు రాజ్యముచేసినలలితాదిత్యుడను కాశ్మీరరాజు దానిని జయించి ఆర్యావర్తమందంతట కొంతకాలము సామ్రాజ్యమును స్థాపించెను. తర్వాత కొంత కాలమునకు రాజపుత్రస్థానములోని భీ న్మలు పట్టణము నేలుచు, మహమ్మదీయుల ప్రమాదమునుండి దేశమును రక్షించిన ఘూర్జర ప్రతిహారులు తమబలమును వృద్ధి జేసికొని , కన్యాకుబ్జమును జయించి, రెండు వందల సంవత్సరములు తమ ప్రతి భను నిలబెట్టుకొనిరి. భోజుడు ( 843 - 890), మహేంద్రపాలుడు ( 890 -910) అను ప్రతిహార రాజుల కాలమున వారి అధికారము ఉత్తర ఇండియాలో చాల భాగమందు

వ్యాపించియుండెను. క్రీ.వె. 910 తర్వాత రాష్ట్రకూటులు వీరి నోడించిరి; కాని శాశ్వతముగ తమ అధికారమును కన్యాకుబ్జములో స్థాపింపలేరైరి. ఈ కారణముచేత ప్రతిహార సామ్రాజ్యము విచ్ఛిన్నమై, మహమ్మదీయుల దండయాత్రల నాటికి అనేక చిన్న చిన్న రాజ్యములేర్పడెను.

**నాగరికతాభివృద్ధి** :- యుద్ధములందపరిమితోత్సాహము కనబరచుచుండిన రాజపుత్రుల రాజ్యములలో నాగరికత అభివృద్ధి గాంచలేదని అనుకొనుట పొరబాటు. దేశములోని వర్ణభేదముల వలన తర్వాతి కాలమందు ఎన్ని నష్టములు సంభవించినను



ఆ కాలమందు ప్రజలనుభవించిన సౌఖ్యమునకును, శాంతికిని వర్ణవ్యవస్థయే కారణమని చెప్పవలసియున్నది. యుద్ధములు చేయుచుండిన రాజులు క్షత్రియులను సంహరించు చుండిరే కాని, తక్కిన వర్ణములవారి నేవిధమైన బాధల పెట్టువారు కారు. వ్యవసాయదార్లు వ్యవసాయమును నిరాటంకముగ చేసికొనుచుండిరి. వర్తకులు వారి కులధర్మములను, బ్రాహ్మణులు వారి వృత్తులను అనుసరించుచుండిరి. రాజులు మారిననను ఈ ధర్మములకు ఎట్టి లోపము లేకుండెను. ఏకులమువారు ఆకులములోని వ్యవహారములను పరిష్కరించుకొను ఆచార ముండినందున, రాజుల యుద్ధముల వలన అట్టి వ్యవహారముల కేలాటి ప్రమాదము సంభవించ కుండెను. శత్రురాష్ట్రమంధలి ప్రజల నందరిని నాశము చేయవలయుననెడి యుద్దేశముకాని, నిరాయుధులగువారిని దోపిడీ చేయవలయుననెడి తలంపుకాని ఆ కాలపు రాజులకు లేదు. ప్రాచీన కాలమందు అసంఖ్యాకములగు యుద్ధములు జరుగుచుండినను దేశములోని నాగరికత నిలబడియుండినందుకు ఇదియే కారణము. ఇదిగాక రాజపుత్రరాజులు పురాతన రాజులవలె వాఙ్మయాభివృద్ధికిని, శిల్పకళాభివృద్ధికిని ఎంతో తోడ్పడుచుండిరి. ప్రఖ్యాతిజెందిన భవభూతి, రాజశేఖరుడు, మాఘుడు మొదలగు మహాకవులు రాజపుత్రయుగమువారే. హిందూ మతోద్ధరణమునకై పాటుపడిన శంకరాచార్యులు అప్పటివాడే. హిందీ, బంగాళీ మొదలగు దేశభాషలలో గ్రంథములు వ్రాయుటకు అప్పటివారే మొదలుపెట్టిరి. శిల్ప సౌందర్యమునకు ప్రఖ్యాతిగాంచిన కాశ్మీరములోని మార్తాండదేవాలయము, ఆబూపర్వతముమీది జైనదేవాలయుములు, ఒరిస్సాలోని భువనేశ్వరాలయము, బుందేలుఖండములోని దేవాలయములు అప్పటి రాజులు కట్టించినవే. వ్యవసాయదారుల ఉపయోగమునకై వారు జలాధారము లనేకములను నిర్మించిరి. నాగరికత విషయములందు రాజపుత్రయుగము తక్కిన యుగములకు తీసిపోవునది కాదు.

## 2. మహమ్మదీయ మత స్థాపనము

మహమ్మదు :- మహమ్మదు అను మత ప్రవక్త క్రీ.వె. 570 లో అరేబియా దేశమందు మెక్కా పట్టణమున పుట్టెను. అప్పటికి ఆ దేశములోని వారు అనాగరికులై తమలో తాము కలహించుకొనుచుండిరి. శాంతియన నేమియో వారెరుగరు. బాల్యమందుండియు మహమ్మదు మిక్కిలి ధ్యానపరుడు; పరలోకచింత గలవాడు. కావుననే అతనికి భగవత్సందేశము లభించెను. ఆ సందేశమును అరబ్బులందరికి

ఉపదేశించుట కతడు నిశ్చయించుకొనెను; కాని మెక్కాలోని పూర్వాచార పరాయణులు దానిని వినక, అతనికి పెక్కు బాధలు కలిగించిరి. క్రీ.వె. 622 లో నతడు కొందరు శిష్యులతో మదీనా పట్టణమునకు పారిపోయి, అచ్చట తన మతమును ప్రజలందరికి బోధించి, వారి సహాయమున నొక సైన్యమును తయారుచేసికొని, మెక్కాపై దండెత్తివచ్చి, యుద్ధమందా పట్టణవాసుల నోడించి తన రాజ్యాధికారమును, తన మతమును అందు స్థాపించెను. ఆ కాలమున అరేబియా కంతకు మెక్కా ప్రధాన పట్టణము. అది మహమ్మదుకు వశమగుటచేత తక్కిన పట్టణములు, పల్లెలు అతని వశములై అతని మతమును స్వీకరించెను. క్రీ.వె. 632 లో మహమ్మదు చనిపోవునప్పటికి అరేబియా అంతయు ఒక మతమును, ఒక ప్రభుత్వమును కలదయ్యెను. మతమును ప్రభుత్వముతో జోడించి, ప్రజలందరిని నొకటిగ చేయగలుగుటయే మహమ్మదుయొక్క గొప్పతనము.

మహమ్మదీయమతము:- మహమ్మదీయ మతమునకంతకుఏకత్వ నిరూపణము ప్రధానలక్షణము. పెక్కు దేవతల నుపాసన చేయుచు, ఒక దేవతకంటె మరియొక దేవత గొప్పయని కలహించుచుండిన అరబ్బులకు భగవంతుడొక్కడేయని బోధించుట అత్యవసరమయ్యెను. ధర్మమును గురించి ఒక్కొక్కరు ఒక్కొక్క విధమున చెప్పుచు ప్రజలలో లేనిపోని సందేహములుకలిగించుచుండిన కాలమందు తానొక్కడే భగవంతుని సందేశము చెప్పగలవాడనియు, తన మాటను తప్ప మరియొకరి మాటను నమ్మకూడదనియు మహమ్మదు బోధింపవలసివచ్చెను. వివిధములగు ఱాళ్ళను రప్పలను వివిధ భక్తితో ఆరాధించుచుండిన వారికి " సర్వాంతర్యామియగు భగవంతునికి ఒక విగ్రహరూపము నిచ్చి, అట్టి విగ్రహమే భగవంతుడని భావించుటకంటె పాపము వేరులేదని అతడుపదేశించెను. దేవుడొక్కడనియు, మహమ్మదొక్కడే అతని దూత అనియు, కొరాన్ ఒక్కటే మత గ్రంథమనియు నమ్మినవారందరు ఒకకుటుంబములోని సోదరులవలె నుందురు. వారిలో వారి కెట్టి భేదములు ఉండజాలవు. అట్టివారు స్వర్గసుఖమనుభవించుటకు చేయవలసిన పనులనేకములు కలవు. దినమున కైదు పర్యాయములు భగవంతుని ప్రార్థించుట, రమజాన్ మాసమందు ఉపవాసముండుట, వీలైన యెడల మెక్కా కొకపర్యాయము యాత్ర చేయుట - వీనిమూలమున ప్రతి మనుష్యుడును తరించగలడని మహమ్మదుయొక్క ముఖ్యోపదేశము.

మహమ్మదీయ మతవ్యాప్తి : - మహమ్మదుయొక్క ఉపదేశమువలన అరబ్బులు పూర్తిగ మారిపోయిరి. అతని తర్వాత రాజ్యమునకు వచ్చిన వారికి ఖలీఫులని పేరు. ఈ ఖలీఫుల ప్రభుత్వము క్రింద అరబ్బులు గొప్పయోధులై నూరు సంవత్సరములలో

విశాలమగు సామ్రాజ్యమును స్థాపించిరి. ఉత్తర ఆఫ్రికా, స్పెయిన్, సిసిలీ, ఆసియాలో పశ్చిమ భాగము, మధ్య ఆసియాలో కొంతభాగము ఖలీఫుల వశమయ్యెను. ఇంతటి స్వల్పకాలమున ఇన్ని దేశములను జయించినవారు మరొక్కరు లేరు. వీరు జయించిన దేశములన్నిటి యందును అదివరకుండిన మతములను మార్చి మహమ్మదీయ మతమును వీరు స్థాపించిరి. రాజ్య సంపాదనమునకు ముఖ్యమైన ఫలము మత వ్యాప్తి యని వీరు దృఢముగ నమ్మియుండిరి.

**మహమ్మదీయులు సింధు రాష్ట్రమును జయించుట :-** అరబ్బులు అనాదిగ మనదేశముతో వ్యాపారము చేయుచుండిరి. మనదేశపు సిరిసంపదలను గురించి వారెరిగియుండిరి. ప్రపంచములోని అనేక దేశములను జయించిన ఖలీఫులు మన దేశమును కూడ జయింప నుద్దేశించుటలో ఆశ్చర్యమేమియు లేదు. అందుకుగాను వారు సింధురాష్ట్రముపై కొన్ని సైన్యములంపిరి. కాని సింధురాజులు వారి నోడించి తరిమి వేసిరి. అందుపై క్రీ.వె. 712 లో మరింత సైన్యమును మహమ్మదు ఖాసీం అను యువకుని ఆధిపత్యమున వారు పంపిరి. సింధురాజగు దాహీరు అతిపౌరుషముతో వీనినెదుర్కొనెను. అతని సైనికులతిసాహసముతో పోరిరి. కాని లాభము లేకపోయెను. దాహీరు యుద్ధమందు చనిపోయెను. అతని భార్య సైన్యములన్నిటిని చేర్చి శత్రువుల నర్థగింపజూచెను; కాని ఆమె ప్రయత్నములు కూడ విఫలము లయ్యెను. అప్పుడామెయు, తక్కిన అంతఃపుర స్త్రీలును శత్రువుల వశమగుటకంటె అవమానము వేరొకటి లేదని అగ్నిప్రవేశము చేసిరి. అటు తర్వాత సింధురాష్ట్రములోని తక్కిన పట్టణములను, దుర్గములను మహమ్మదీయులు సాధింప మొదలిడిరి. అన్ని ప్రదేశములందును ప్రజలు వారితో అతి తీవ్రముగ యుద్ధము చేసిరి. రెండు సంవత్సరములకు గాని సింధురాష్ట్రమంతయు మహమ్మదు ఖాసీం వశపరచుకొనలేక పోయెను. క్రీ.వె. 714 నాటికి మహమ్మదీయ సామ్రాజ్యము సింధురాష్ట్రములోనికి వ్యాపించెను.

**మహమ్మదీయుల పాలన :-** సింధురాష్ట్రమును దాటి తక్కిన హిందూ రాజ్యములను కూడ వశపరచుకొనుటకు ఖలీఫులు మరికొన్ని దండయాత్రలను చేసిరి. కాని కాశ్మీర రాజగు లలితాదిత్యుడును, రాజపుత్రస్థానములోని ఘూర్జరప్రతిహారులును, దక్షిణాపథములోని చాళుక్యులును వీరి ప్రయత్నములను విఫలముగావించిరి. అందుచేత మహమ్మదీయప్రభుత్వము సింధురాష్ట్రమున కావల వ్యాపించలేదు. దండయాత్రకాలమందు మహమ్మదీయులు సింధురాష్ట్రములోని దేవాలయము

లనేకములను నాశనము చేసిరి ; పురుషుల ననేకులను చంపి, స్త్రీలను, పిల్లలను బానిసలుగా జేసిరి. వారి మతసిద్ధాంతముల ప్రకారము జయింపబడిన విగ్రహారాధకులు మహమ్మదీయ మతమునైన స్వీకరింపవలెను. లేదా ప్రాణములనైన కోల్పోవలయును ; కాని ఈ క్రూర పద్ధతిని సింధురాష్ట్ర విషయమున వారవలంబింపలేదు. జయింపబడిన హిందువులపై వారు ప్రత్యేకముగ నొక పన్నును (దీని పేరు 'జిజియా') విధించిరి. దానిని చెల్లించునంతవరకు వారి దేవాలయములకెట్టి అపాయము చేయమని చెప్పిరి.

## 3. చాళుక్యులు

**చాళుక్యులు:-** ప్రాచీన కాలమున దక్షిణాపథమందు ప్రఖ్యాతి గాంచిన సామ్రాజ్యములలో ఆంధ్ర సామ్రాజ్యము ప్రధానమైనది. క్రీ.వె. 225 ప్రాంతమున అది విచ్ఛిన్నమయ్యెను. అటుపిమ్మట కొంతకాలమువరకు ఒక సామ్రాజ్యమునకు బదులు అనేక చిన్న స్వతంత్ర రాజ్యములు బయలుదేరెను. పశ్చిమ భాగమున వనవాసిపట్టణమును రాజధానిగ చేసికొని కదంబులు, మైసూరులోని గంగులు, విదర్భలోని వాకాటకులు రాజ్యములను స్థాపించుకొనిరి. వీరందరిలో వాకాటకులు బలవంతులు. తర్వాత కొంత కాలమునకు క్రీ.వె. 550 ప్రాంతమున చాళుక్యులనువారు బయలుదేరి ఆంధ్రులవలె గొప్ప సామ్రాజ్యమును స్థాపింపగలిగిరి. వీరు దక్షిణాపథములోని పశ్చిమభాగమందలివారు. వీరికి మొట్టమొదట వాతాపియను పట్టణము రాజధాని ; తర్వాత కళ్యాణపురము రాజధాని అయ్యెను. వీరిలో ఒక శాఖవారు దక్షిణాపథపు తూర్పు తీరమందలి తెలుగు మండలముల నేలిరి. వారికి తూర్పుచాళుక్యులని పేరు.

**పశ్చిమ చాళుక్యులు:-** చాళుక్యరాజ్యమును స్థాపించినవాడు మొదటి పులికేశిరాజు. చుట్టుపట్లనున్న కదంబులు మొదలగు వారిని జయించి ఇతడు అశ్వమేధయాగము చేసెను. కాని ఈ రాజ్యమును సామ్రాజ్యముగ మార్చినవాడు క్రీ.వె. 609 మొదలు 642 వరకు పాలించిన రెండవపులకేశి చక్రవర్తి. ఇతడు తనపై కలహించిన సామంత రాజుల నణచెను ; దక్షిణాపథముపై దండెత్తివచ్చిన హర్షచక్రవర్తిని నర్మదానదీతీరమందెదుర్కొని ఓడించెను ; ఉత్తర ఇండియాపై దండెత్తివెళ్ళి మాళవ, ఘూర్జర, లాటదేశములందు తన యధికారము నిలిపెను ; కళింగులను, దక్షిణకోసలులను ఓడించెను; పల్లవులతో అనేక యుద్ధములు చేసి, వారి వశమందుండిన వేగి మండలమును జయించెను. ఈ విజయముల వలన రెండవ పులకేశి గొప్పచక్రవర్తి అయ్యెను. అతని కీర్తిని గురించి వినిన పారశీక దేశపు చక్రవర్తి రాయబారి నొకనిని అతని ఆస్థానమున కంపెను.

చైనాయాత్రికుడగు హ్యూయిన్‌సాంగ్ అతనిని సందర్శించి, అతనిని అతని ప్రజలను ఎక్కువగ స్తోత్రము చేసియున్నాడు. ఇంతటి వైభవ మనుభవించుచుండిన చక్రవర్తిపై క్రీ.వె. 642 లో పల్లవులు దండెత్తివచ్చి, అతనిని ఓడించి చంపిరి. అందుమూలమున కొన్ని సంవత్సరముల వరకు చాళుక్యసామ్రాజ్యమంద రాజకము ప్రబలెను.

రాష్ట్రకూటులు :- తర్వాత కొన్ని సంవత్సరములకు పులకేశి సంతతివారు సామ్రాజ్యమును పునరుద్ధరించిరి. కాని వారికి సామంతులుగ నుండిన రాష్ట్రకూటులు వారిపై తిరుగబడి, క్రీ.వె. 750 ప్రాంతమున వారి అధికారమును స్థాపించిరి. వారిలో కూడ ప్రఖ్యాతి గాంచిన రాజులనేకులుండిరి. వారిలో నొకడగు కృష్ణరాజు (క్రీ.వె. 757 - 800) ఎల్లోరాలో జగద్విఖ్యాతమగు కైలాస ఏకశిలాలయము కట్టెను.



ఎల్లోరా గుహలలోని కైలాసాలయము

**చాళుక్య విక్రమాంకుడు** :- క్రీ.వె. 973 ప్రాంతమున పశ్చిమ చాళుక్యలు రాష్ట్ర కూటులనోడించి, తమ అధికారమును తిరిగి సంపాదించిరి. వీరు రాజధానిని వాతాపినుండి కళ్యాణికి మార్చిరి. వీరికిని, తంజావూరు చోళులకును అనేక యుద్ధములు జరిగెను. వీరిలో క్రీ.వె. 1076 మొదలు 1126 వరకు పాలించిన విక్రమాంకుడు సుప్రసిద్ధుడు. ఇతడు చోళుల నోడించెను. ఇతని ఆస్థానమున బిల్హణుడను

మహాకవియుండెను. అతడు విక్రమాంక చరిత్రమును వ్రాసెను. ధర్మశాస్త్రముపై వ్యాఖ్యానము వ్రాసిన విజ్ఞానేశ్వరుడు కూడ ఈ ఆస్థానములోనివాడే.

**తూర్పు చాళుక్యులు** :- రెండవ పులకేశి వేగిదేశమును జయించి, తమ్ముడగు విష్ణువర్ధనుని రాజప్రతినిధిగ నియమించెను. కొంతకాలమైన తర్వాత విష్ణువర్ధనుడు స్వతంత్రుడై, తూర్పుచాళుక్య వంశకర్తయై ఆంధ్ర మండలములో చాలాభాగమును పాలించెను. తూర్పు చాళుక్యులు ఈ ప్రదేశమందు పండ్రెండవ శతాబ్దము ఆఖరువరకు ఏలుచుండిరి. తక్కిన రాజులవలె వీరుకూడ చుట్టుపట్ల నున్న పల్లవులతోడను, చోళులతోడను, రాష్ట్రకూటులతోడను పోరవలసి వచ్చెను. వీరిలో ప్రఖ్యాతి గాంచిన వాడు రాజరాజనరేంద్రుడు. ఇతని రాజధాని రాజమహేంద్రవరము. ఇతడు అనేక కవులను పోషించినవాడు. భారతమును తెనిగించి ఆంధ్ర వాఙ్మయాభివృద్ధికి సరియైన పునాదులు వేసిన నన్నయభట్టారకుడు ఇతని ఆస్థానమందుండెను. ఇతడు చోళ చక్రవర్తియగు రాజేంద్రచోళుని అల్లుడు. ఇతని కుమారుడగు కులోత్తుంగ చోళదేవుని కాలమునుండి తూర్పు చాళుక్య రాజ్యము, చోళ సామ్రాజ్యము కలిసిపోయెను.

**చాళుక్యులనాటి నాగరికత**:- చాళుక్యల కాలమందు దక్షిణాపథములోని శిల్పవిద్యయు, చిత్రకళయు ఉచ్ఛస్థితికి వచ్చెను. కొండలను తొలచి విహారములను, దేవాలయములను నిర్మించుటయందు అప్పటి శిల్పులు అద్వితీయమైన నేర్పును చూపిరి. వీనిలోని స్తంభములు, ద్వారములు, మంటపములు, విగ్రహములు, వాహనములు --అన్నియు ఒక శిలనుండియే వారు నిర్మింపగలిగియుండిరి. ఇట్టి శిలాలయములలో ఎల్లోరాలోని కైలాసాలయము సుప్రసిద్ధము. ఇది కొండయందు తొలువబడిన గుహయొక్క మధ్యభాగమందున్నది. ఆ గుహయొక్క వైశాల్యము 276 అడుగుల పొడవు, 154 అడుగుల వెడల్పు, 107 అడుగుల తోతుతో కూడియున్నది. ఇట్టి శిల్పములు నిర్మించుటకు ఎంతటి తెలివి, ఎంతటి శాస్త్రజ్ఞానము, ఎంతటి నేర్పు, ఎంతటి ఓర్పు కావలయునో ఆలోచింపనగును. ఆ కాలపు చిత్రకళయొక్క ఔన్నిత్యము అజంతా గుహలయందు చూడదగియున్నది. ఆ గుహల గోడల నలంకరించుటకై రంగులను వాడుటయందు తమకు గల నేర్పునంతను అప్పటి చిత్రకారులు ప్రదర్శించిరి. మైసూరును పాలించుచుండిన గంగవంశమువారు జైనమతావలంబకులై జైనవిగ్రహము లనేకములను నిర్మించిరి. వానిలోకెల్ల శ్రావణబెళ్గొళా యందుండు గోమతేశ్వరుని బ్రహ్మాండ విగ్రహము పేర్కొనదగినది. ఆ కాలపు రాజ్యములు, రాజులు నశించినను అప్పటివారు సృష్టించిన ఈ నానావిధములగు శిల్పములు వారి కీర్తిని స్థిరస్థాయిగ చేసియున్నవి.

# 4. పల్లవులు ; చోళులు

పల్లవులు :- శాతవాహనులకు సామంతులుగ నుండిన వారిలో పల్లవులొకరు. శాతవాహన సామ్రాజ్యము క్షీణించిన తర్వాత వీరు స్వతంత్రులై, ఆంధ్రదేశమున నొకరాజ్యమును స్థాపించుకొని, కాలక్రమమున తమ యధికారమును ద్రావిడదేశమున వ్యాపింపజేసిరి. మొట్టమొదట అమరావతి వీరికి రాజధానియై యుండినట్లు తోచుచున్నది. ద్రావిడదేశమును జయించిన తర్వాత వీరు కాంచీ పట్టణమును రాజధానిగా జేసికొనిరి. సముద్రగుప్తుడు దక్షిణ దిగ్విజయమునకై వచ్చినపుడు (క్రీ.వె.350) కృష్ణానదీతీరమున నతని నెదుర్కొనినవాడు పల్లవరాజగు విష్ణుగోపుడు.

కంచిలోని పల్లవచక్రవర్తులు :- రాజధాని కంచికి మారిన తర్వాత పల్లవ చక్రవర్తులనేకులు ప్రసిద్ధిగాంచిరి. వారిలో మొదటివాడు సింహవిష్ణువు ( క్రీ. వె. 575 - 600) . ఇతని కుమారుడగు మహేంద్రవర్మయు, మనుమడగు నరసింహవర్మయు ఎక్కువ శక్తిసామర్థ్యములను చూపిరి. పల్లవ చక్రవర్తులందరు నిరంతరము చాళుక్యులతో యుద్ధము చేయుచుండిరి. ఒకప్పుడు వారికిని, ఒకప్పుడు వీరికిని జయము లభించుచుండెను. ఆఖరుదశయందు పల్లవులు రాష్ట్రకూటుల సఖ్యమును సంపాదించిరి. పల్లవులవద్ద నౌకాబలముండెను. హిందూ మహాసముద్రపు తూర్పుద్వీపములలోను, కంబోడియా మొదలగు దేశములలోను రాజ్యములను స్థాపించిన వారు కొందరు పల్లవ రాజ్యమునుండి వెళ్ళినవారే. సింహళద్వీప సింహాసనమునకై పోరాడుచున్న ఒక రాజకుమారునికి పల్లవులు తమ నౌకాబలమిచ్చి సహాయము చేసిరి. క్రీ.వె. 750 తర్వాత పల్లవుల సామ్రాజ్యము క్షీణించుట కారంభించెను. పాండ్యులు, చోళులు కలసి దీనిని పూర్తిగ నాశనముచేసిరి.

**పల్లవుల కాలమునాటి నాగరికత :** – పల్లవులు మొదట బౌద్ధ మతాభిమానులుగ నుండిరి. తర్వాత వారిలో కొందరు వైష్ణవమతమందును, జైనమతమందును అభిమానము జూపిరి. కొందరు శైవులైరి. మొత్తము మీద వీరి కాలమున శైవమతమున కెక్కువ ప్రోత్సాహము కలిగెను. ప్రాచీనకాలపు విద్యాపీఠములలో కంచి యొకటి . హ్యూయిన్‌సాంగ్ అక్కడికి వచ్చినపుడు నూరు బౌద్ధ విహారములుండెను. పల్లవ చక్రవర్తియగు మహేంద్రవర్మ స్వయముగ కవిత్వము చెప్పుటయే గాకఅనేక సంస్కృత కవులను పోషించెను. దక్షిణాపథమందు వన్నెగాంచిన ఏక శిలాదేవాలయ నిర్మాణమును వీరు ద్రావిడ దేశమందు ప్రవేశపెట్టిరి. మహాబలిపురమందు వీరు ఈ శైలిని కొన్ని దేవాలయముల

నిర్మించియున్నారు. వానిపై చెక్కబడిన విగ్రహము లతి సుందరములుగ నున్నవి. కంచి యందును, తిరుచినాపల్లి యందును వీరి దేవాలయము లున్నవి.



మహాబలిపుర దేవాలయముపైని జూపబడిన శిల్పచాతుర్యము

(అర్జునుని తపస్సు)

చోళులు :- పల్లవుల తర్వాత ద్రావిడ దేశమునంతను జయించి వశపరచుకొనిన వారు చోళులు. వీరు పదియవశతాబ్ద ప్రారంభమందుండి పంద్రెండవ శతాబ్దాంతమువరకు సామ్రాజ్యాధికారము వహించియుండిరి. వీరిలో పేర్కొనదగిన చక్రవర్తు లనేకులున్నారు. క్రీ.వె. 985 మొదలు క్రీ.వె. 1013 వరకు పాలించిన రాజరాజ చక్రవర్తి పాండ్యులను, చేరులను జయించి, ద్రావిడదేశమంతను, తన స్వాధీనము చేసికొని, ఉత్తరమున కళింగరాజ్యమును, దక్షిణమున సంహాళమును ఆక్రమించెను. వేగిదేశమును పాలించుచుండిన విమాలాదిత్యుని కూడ నోడించెను. కాని అతనికి తనకూతురునిచ్చి వివాహముచేసి, చాళుక్యచోళ సంబంధమును బలపరచెను. రాజరాజకుమారుడగు రాజేంద్రచోళదేవుడు తన నౌకాదళముతో బంగాళాఖాతమున కావలనున్న దేశములపై జయప్రదముగ దండెత్తి వెళ్ళెను. అట్లే మఱియొక సైన్యమును బంగాళాదేశముపైకి పంపి, అచ్చటి పాలరాజుల నోడించి, గంగానదినుండి కొన్ని బిందెలతో తన రాజ్యమునకు నీరు పట్టించుకొని వచ్చి, ఈ విజయమును సూచించుటకు గంగైకొండ చోళపురమను పట్టణమును కట్టి, దానికి సమీపమందలి సాగరములో గంగానదీజలమును పోయించెను.

ఇతనికి తర్వాత రాజ్యమేలిన వారిలో కులోత్తుంగచోళుడు ప్రసిద్ధుడు; ఇతడు వేగిరాజగు రాజరాజనరేంద్రుని కుమారుడు; చోళచక్రవర్తి దౌహిత్రుడు. ఇతడు కళ్యాణపుర చాళుక్యుల నోడించి, కళింగదేశ మందలి అల్లరుల నణచి క్రీ.వె. 1084-1118 మధ్యన రాజ్యము చేసెను. ఇతడు క్రీ.వె. 1086 లో, తన రాజ్యమందలి భూములను సర్వే చేయించెను. ఇతనికి తర్వాత చోళసామ్రాజ్యము క్షీణించుట కారంభించెను. ఇంతవరకు వీరికి సామంతులుగ నుండిన పాండ్యులు బలవంతులై పదమూడవ శతాబ్దమున చోళరాజ్యమును రూపు మాపిరి.

**చోళులనాటి నాగిరికత :-** చోళుల పరిపాలనా పద్ధతి చాల బాగుగనుండెను. వారి కాలమున గ్రామపాలన మంతయు గ్రామస్థులెన్నుకొనిన మహాసభవారి చేతిలో నుండెను. వీరు న్యాయాన్యాయముల విచారణ చేయుచుండిరి. గ్రామములోని తోటలు, జలాధారములు, ఉమ్మడిభూములు, సత్రములు, విద్యాలయములు, వైద్యశాలలు మొదలగువాని వ్యవహారములనన్నిటిని వీరు పరిష్కరించుచుండిరి. ఇట్లే మండల సభలుకూడ ఉండెను. వ్యవసాయమునకుపయోగించు జలాధారములను నిర్మించుటలో చోళచక్రవర్తులకు సమానులెవ్వరు లేరు. కావేరి మొదలగు నదులపైన వారనేక ఆనకట్టలు కట్టిరి; వాస్తుపద్ధతి ననుసరించి పట్టణములను నిర్మాణముచేసిరి. ప్రతి పట్టణమునకును మధ్యన దేవాలయ ముండెను. ఈ దేవాలయములు అత్యున్నతములైన శిఖరములతో కూడుకొని యుండెను. రాజధానియగు తంజావూరిలో రాజరాజు కట్టిన బృహదీశ్వరాలయము వైశాల్యమందును, ఔన్నత్యమందును తక్కిన వానిని మించియున్నది. ఆకాలపు దేవాలయములు దేవుని పూజించుటకు మాత్రమే ఉపయోగింపబడినవికావు. పాఠశాలలు, నాట్యశాలలు వానియందే యుండినవి. పట్టణవ్యవహారములను పరిష్కరించు మహాసభలు వానియందే సమావేశమగుచుండెను. దేవాలయములను దర్శించుటకు వచ్చు యాత్రికుల యుపయోగార్థము చక్రవర్తులును, ధనికులును, సత్రములు, చలిపందిరులు, విశ్రాంతి గృహములు కట్టుచుండిరి. వైష్ణవమతోద్ధారకుడగు రామానుజు డాకాలమునాటివాడు.

## ప్రశ్నలు

1. రాజపుత్రయాగమనగా నేమి ? దానికా పేరెట్లు తగియున్నది ?రాజపుత్రులెవరు? వారిలోని (a) సుగుణములు, (b) దుర్గుణములు పేర్కొనుము. వారి రాజ్యములలో ప్రసిద్ధి గాంచినవేవి ?

2. కన్యాకుబ్జరాజ్య చరిత్రములోని ముఖ్య విషయములను పేర్కొనుము ?
3. రాజపుత్రుల కాలమున నాగరికత ఎట్లు వృద్ధిగాంచెను ?
4. మహమ్మదు జీవితములోని ముఖ్యవిషయములను పేర్కొనుము ?
   మహమ్మదీయ మతములోని ముఖ్య ధర్మము లెవ్వి ?
5. ఖలీపులెవరు ? మహమ్మదీయ మతమునకు వారెట్టి సేవ చేసిరి ?
6. మహమ్మదీయుల సింధురాష్ట్రముపై దండెత్తుటకు కారణము లెవ్వి?సింధురాష్ట్రమున కావలనుండిన దేశముల వారేల జయింపలేరైరి ? సింధురాష్ట్రమును వారెట్లు పాలించిరి?
7. ఆంధ్రుల తర్వాత దక్షిణాపథమును పాలించిన ప్రధాన వంశములను మూడింటిని పేర్కొనుము ?
8. రెండవ పులకేశి (a) విజయములను,(b) వైభవమును వివరింపుము ?
9. రాష్ట్రకూటులలో ఎక్కువ ప్రఖ్యాతి గాంచిన రాజు ఏ గొప్ప కార్యమునుచేసెను?
10. విక్రమాంకుడెవడు ? అతని ఆస్థానములోని పండితులనిద్దరిని పేర్కొనుము?
11. రాజరాజనరేంద్రు డెవరు ? అతని ప్రఖ్యాతికి కారణమేమి ?
12. చాళుక్యుల నాటి చిత్రకళ యందలి విశేషములను మూడింటిని పేర్కొనుము?
13. పల్లవులెవరు? వారిరాజధాని ఏది? వారే ప్రదేశములందు రాజ్యముచేసిరి ? వారి శత్రువులెవరు ? (1) మతమునకు (2) శిల్పవిద్యకు వారెట్టి సేవచేసిరి?
14. చోళ చక్రవర్తులలో పేర్కొనదగిన చక్రవర్తు లెవరు ? వారిలో నొక్కక్కరిని గురించి రెండు విశేషములను చెప్పుము. వారి కాలమున గ్రామములెట్లు పాలింపబడుచుండెను ? ఆ కాలపు దేవాలయముల కేకారణములచే ప్రాధాన్యము కలిగెను ? చోళుల రాజధాని ఏది ?

ఏడవ ప్రకరణము

# మహమ్మదీయ విజృంభణము

విషయములు :- గజనీమామూదు, ఘోరీ మహమ్మదు, బానిస రాజులు, ఖిల్జీలు, తుఘ్లకులు. ఢిల్లీ రాజ్యము క్షీణించుట. బహమనీ రాజ్యము.

## 1. గజనీ మామూదు

**అరబ్బుల రాజ్యవ** :- మహమ్మదీయులగు అరబ్బులు క్రీ.వె. 712 లో సింధురాష్ట్రమును జయించినను, వారి అధికారము హిందూదేశములోని తక్కిన భాగములకు ప్రాకలేదు. దీనికి రెండు కారణములున్నవి. సింధురాష్ట్రమునకును, హిందూస్థానమునకును మధ్యన దాటుటకు సాధ్యము కాని ఎడారులున్నవి. పెషావరు పంజాబుమార్గమున గంగానదీతీర దేశములకు రాగలిగినంత సులభముగ సింధురాష్ట్రము నుండి వచ్చుటకు వీలులేదు. ఇదిగాక ఎనిమిది తొమ్మిది శతాబ్దములలో హిందూస్థానమందు ప్రఖ్యాతి గాంచిన ప్రతిహార సామ్రాజ్యముండెను. దానిని పాలించిన చక్రవర్తులు మహమ్మదీయుల దాడినుండి దేశమును రక్షించుటకు సమర్థులై యుండిరి. క్రీ.వె. 970 తర్వాత ఇదంతయు మారెను . ఒక సామ్రాజ్యమునకు బదులు పెక్కు రాజ్యము లేర్పడెను ; హిందూదేశముపై దండెత్తివచ్చిన మహమ్మదీయులు పంజాబు మీదుగ వచ్చిరి.

**తురకలు**:- సింధుదేశపు దాడికిని, క్రీ.వె. 970 తర్వాత జరిగిన దండయాత్రలకును మరియొక భేదముకూడ కలదు. పదియవ శతాబ్దమునందుండి దండెత్తి వచ్చినవారు అరబ్బులుకారు. వారు మధ్య ఆసియాలోని అనాగరికులును, క్రూరస్వభావులును అగు తురకజాతివారు. వీరు ఖలీఫులు వద్ద అంగరక్షకులుగ జేరి, వారి అభిమానమును సంపాదించి, సేనానాయకులుగను, రాష్ట్రపాలకులుగను నియమింపబడి, కొంత కాలమైన తర్వాత ఖలీఫులపై తిరుగబడి, స్వతంత్ర రాజ్యములను స్థాపించుకొనినవారు. క్రీ.వె. 970 ప్రాంతమున అట్టి తురక రాజ్యమొకటి అఫగన్ స్థానములోని గజనీ పట్టణమందుండెను. దానిని క్రీ.వె. 976 నుండి సబక్తజిన్ అనువాడు పాలించుచుండెను.

**సబక్తజిన్** :- అప్పటికి పంజాబును, అఫగన్‌స్థానములోని కొంతభాగమును జయపాలుడను రాజు పాలించుచుండెను. అతనిపైకి సబక్తజిన్ దండెత్తిరాగా, కొంత కప్పమిచ్చుట కతడంగీకరించెను. కాని కప్పమును చెల్లించుటకు బదులు అతడు అజ్మీరు, ఢిల్లీ, కన్యాకుబ్జము మొదలగు రాజ్యముల నేలుచుండిన రాజపుత్రుల

సహాయమును సంపాదించి, గొప్ప సైన్యముతో సబక్తజిన్‌ను ఎదుర్కొనెను. అప్పుడు రెండుపక్షముల వారికి పెషావరు వద్ద ఘోరయుద్ధము జరిగెను; జయపాలుడోడెను. సింధునదికి పశ్చిమమందున్న అతని రాజ్యమును సబక్తజిన్ వశపరచుకొనెను.

**గజనీ మామూదు :-** క్రీ.వె. 997 లో సబక్తజిన్ చనిపోవుటచేత అతని కుమారుడు గజనీ మామూదు సుల్తానయ్యెను. ఇతడు కడు బలపరాక్రమములు కలవాడు ; యోధాగ్రగణ్యులలో నొకడు. ఇతడు పదునేడు పర్యాయములు ఇండియాపై దండెత్తివచ్చెను. ఇతని యుద్దేశము ఇండియాను జయించి, గొప్ప సామ్రాజ్యమును స్థాపించుటకాదు. దేశమును దోచి, ధనరాసులను గజనీపట్టణమునకు తీసికొనుపోవుటయు, విగ్రహారాధకులగు హిందువుల దేవాలయములను నాశముచేసి విగ్రహములను పగుల గొట్టుటయు ఇతని యుద్దేశములు. ఎన్ని విగ్రహములను బ్రద్దలుచేసిన అంత ఎక్కువగా తనజీవితము పావనమగుననియు, తన కీర్తి దిగంతములందు వ్యాపించుననియు ఇతని నమ్మకము.

**మామూదు దండయాత్రలు :-** హిందూ దేశమును దోచుటకు అవకాశములనేకము లితడు కల్పించినందున వేలకొలది తురక లితని సైన్యములో చేరి, అత్యుత్సాహముతో పోరిరి. సాధారణముగ ఏటేట ఇతడొక దండయాత్రను చేయుచుండెను. ఇతని నెదుర్కొనుటకు ఆ కాలపు రాజపుత్రులు వారిశక్తికొలది ప్రయత్నములు చేసిరి. సాధారణముగ వారిలో వారికి పరస్పర ద్వేషముండినను మామూదు దండయాత్రల వలన దేశమునకును, మతమునకును ఎక్కడలేని ప్రమాదము సంభవించునని గ్రహించి, వారు కొన్ని సమయములందు కలసి ఇతని నెదుర్కొనిరి. 1008 లో ఇతని ఆరవ దండయాత్ర సంభవించెను. అప్పుడు జయపాలుని కుమారుడగు అనందపాలుని నాయకత్వమున ఉజ్జయిని, గ్వాలియరు, కలంజరు, కనోజి, ఢిల్లీ, అజ్మీరు మొదలగు రాజ్యముల నేలుచుండిన రాజులందరు కలసి ఇతని నెదిరించిరి. వారి రాజ్యములోని స్త్రీలుకూడ వారి ఆభరణములను విక్రయించి సైనికుల కెంతో సహాయము చేసిరి. సైనికు లతిపౌరుషముతో యుద్ధము చేసినను తుదకు మామూదుకే జయము లభించెను. తక్కిన దండయాత్రలందు హిందువులిట్టి ఐకమత్యమును చూపరైరి ; అందుచేత ఇతనికి మరింత సులభముగ విజయము కలుగుచువచ్చెను.

**మామూదు దండయాత్రల లక్షణము :-** మామూదు యొక్క ప్రతిదండయాత్రను గురించిన వివరములన్నియు వర్ణింపనవసరములేదు. వాని కన్నిటికి ఒక ప్రధాన

లక్షణముండెను. అతడు ప్రతిపర్యాయము హిందువులపైబడి వారి సైన్యముల నోడించి, వేలకొలది జనుల జంపి, దేవాలయములు నాశముచేసి, అమూల్యమగు రత్నములను ,లెక్కకుమించిన వెండి,బంగారములను గజనీకి తీసికొని వెళ్ళెను. నాగరకోట, స్థానేశ్వరము, కన్యాకుబ్జము, మధుర, సోమనాధము-అన్ని పట్టణములకును ఒకేగతి పట్టెను. విగ్రహములను నాశము చేయవద్దనియు, ఎంతధనమైన నిచ్చుటకు తాము సిద్ధులుగ నున్నామనియు ప్రజలెంత బ్రతిమాలినను ఇతడుకొంచెము కూడ వినిన వాడు కాదు. వేలకొలది హిందువుల నితడు బానిసలుగ చేసి గజనీకి తీసికొనివెళ్ళెను. ఇట్లు తీసికొని వెళ్ళిన ధనరాసుల సహాయమునను, హిందూబానిసల సహాయమునను ఇతడు గజనీయందు మసీదులను, భవనములను, నరనప్పలను, పుస్తకభాండాగారములను నిర్మించెను. ఇతడనేక కవులను, విద్వాంసులను పోషించి ప్రఖ్యాతి గాంచిన మహమ్మదీయ సుల్తానులలో నొకడయ్యెను.

**దండయాత్రల ఫలము:-** మామూదు దండయాత్రల మూలమున పంజాబునందు మహమ్మదీయ ప్రభుత్వము నాటుకొనెను. పంజాబు మనదేశమునకు ద్వారమువంటిది. విదేశీయులగు తురకల కది వశమగుటచేత కాలక్రమమున వారి యధికారము దేశమందంతట వ్యాపించుట సులభమయ్యెను. ఇదిగాక, ఈ దండయాత్రల వలన రాజపుత్రుల బలము క్షీణించెను; వారి సైన్యములు పలుచబడెను; ; వారి ప్రజలు దరిద్రులైరి. మరి రెండువందల సంవత్సరముల వరకు మహమ్మదీయులనుండి వారికెట్టి ప్రమాదము కలుగకపోయినను మామూదు మూలమున వారికి సంభవించిన అపార నష్టమునుండి వారు కోలుకొనలేకపోయిరి. అందుచేతనే ఘోరీమహమ్మదు దండెత్తి వచ్చినపుడు దేశమును జయించుట అతనికి కడు సులభమయ్యెను.

## 2. ఘోరీ మహమ్మదు

**గజనీ సామ్రాజ్యము :-** గజనీ మామూదు క్రీ.వె. 1030 లో చనిపోయెను. అతని వంశస్థులు క్రీ.వె. 1186 వరకు పంజాబును పాలించిరి. కాని వీరు మామూదువంటి సమర్థులుకారు. కాలక్రమమున వారి బలము తగ్గెను. తుదకు వారి శత్రువులలో నొకరగు ఘోరీసుల్తానులు వారినోడించి గజనీపట్టణమును నాశము చేసిరి. అప్పుడు వారు పంజాబునకు పారివచ్చిరి. ఘోరీసుల్తాను తమ్ముడగు మహమ్మదు వారిని వెంటనంటి పంజాబుపైకి దండెత్తి వచ్చి 1186 లో వారిని నిర్మూలనముచేసి పంజాబునంతను తన అధీనము చేసికొనెను.

**రాజపుత్రరాజ్యములలోని పరిస్థితులు :-** మామూదు దండయాత్రల మూలమున

తమకు కలిగిన నష్టమునుండిగాని, అతని వంశస్థుల బలహీనమునుండి గాని రాజపుత్రరాజులు ఎట్టి పాఠములను నేర్చుకొనరైరి. రాజకీయ పద్ధతులందుగాని, సైనికవిధానమందుగాని, సాంఘిక వ్యవస్థలందుగాని అవసరములగు మార్పులను వారు చేసికొనరైరి. సుమారు రెండువందల సంవత్సరముల యవకాశము వారి కుండినను తురకలనుండి రానున్న ప్రమాదమును గ్రహించి దానినుండి తమ రాజ్యములను రక్షించుకొనుటకు వారెట్టి ఉపాయములను ఆలోచించరైరి. ఎప్పటివలె వారిలో వారు స్వాధికారమునకై యుద్ధములు చేయుచుండిరి. వారందరు కలిసి ఒక చక్రవర్తి అధీనమందుండుటకు ప్రయత్నించలేదు. పూర్వపు వైరములను వారు సాధించుకొనుచుండిరి. సైనిక విధానమందుకూడ వారేలాటి మార్పులను చేసికొనలేదు. అశ్వబలమును ప్రధానాంగముగ జేసికొని తురకలు యుద్ధము చేయుచుండినను రాజపుత్రులు ఏనుగులపై ఆధారపడి యుండిరి. మధ్యఆసియాలోని అసంఖ్యాకజనమును తమ సైన్యములో మహమ్మదీయులు చేర్చుకొనుచుండినను రాజపుత్రులు దేశములోని వివిధ వర్ణముల వారిని తమసైన్యములందు చేర్చుకొని వానిని బలపరచుకొనుటకు ప్రయత్నించరైరి. ఇదిగాక సైన్యముల శిక్షణ విధానమందుకూడ వారెంతో వెనుకబడియుండిరి. ప్రజలందుకూడ అవసరములగు మార్పులు కలుగలేదు. ప్రాచీన కాలపు వర్ణవ్యవస్థలో క్షత్రియు లొక్కరే యుద్ధము చేయవలసియుండెను. దేశము పరహస్తగతమగుచుండినను, దేవాలయములు నాశనమగుచుండినను తక్కిన వర్ణములవారు యుద్ధము చేయుట తమ వృత్తికాదని భావించి ఉదాసీనులైయుండిరి. రాజెవరైననేమియను భావము సామాన్య ప్రజలలో వ్యాపించియుండెను. ఇదిగాక వర్ణవ్యవస్థతో సంబంధములేని చండాలులు, అస్పృశ్యులు దేశమందంతట నుండిరి. అట్టివారిని తమ మతములో చేర్చుకొని తమ సంఖ్యను వృద్ధిపరచుకొనుటకు మహమ్మదీయులు ప్రయత్నము చేయుచుండిరి. దానిమూలమున దేశమునకు కలుగనున్న ప్రమాదమునుకూడ ఆ కాలపు రాజులు గ్రహించరైరి ; ప్రాచీన సంప్రదాయములకు దాసానుదాసులై, తమలోనున్న లోపములను సవరించుకొనక, కాలము మారినను తమ ప్రవర్తనను మాత్రము మార్చుకొనరైరి.

**ఘోరీమహమ్మదు విజయములు:-** ఘోరీమహమ్మదు మామూదువలెగాక హిందూదేశమును జయించి, అందు స్థిరమగు సామ్రాజ్యమును స్థాపింప సమకట్టెను. పంజాబును వశపరచుకొనిన తర్వాత క్రీ. వె. 1191 లో అతడు ఢిల్లీ రాజ్యముపై దండెత్తివచ్చెను. దానిని పాలించుచుండిన పృథ్వీరాజు తక్కిన రాజపుత్రుల సహాయము

కోరెను. కన్యాకుబ్జరాజగు జయచంద్రుడు తప్ప ప్రముఖులగు తక్కినవారందరు అతనికి సహాయము చేసిరి. తరేయిన్ అనుచోట రెండుపక్షములవారికి యుద్ధముజరిగెను. పృథ్వీరాజునకు పరిపూర్ణమగు జయము లభించెను. కాని మహమ్మదు మరుసటి సంవత్సరము మరింత గొప్ప సైన్యముతో పృథ్వీరాజును అదే ప్రదేశమందెదుర్కొనెను. ఈ పర్యాయము పృథ్వీరాజు ఓడిపోయెను. మహమ్మదు అతనిని చెరబట్టి చంపెను. అటుతర్వాత క్రమక్రమముగ ఒకకోటతర్వాత మరియొకటి అతని స్వాధీనమయ్యెను. వీని నన్నిటిని పాలించుటకు తన బానిసలలో సమర్థుడును, విశ్వాసపాత్రుడును అగు కుతుబుద్దీనుని రాజప్రతినిధిగ నియమించి మహమ్మదు ఘోరీ కోటకు వెళ్ళిపోయెను. తర్వాత నతడు రెండు పర్యాయములు మాత్రమే ఇండియాకు వచ్చెను. కాని, కుతుబుద్దీన్ శక్తిసామర్థ్యములు కలవాడై హిందూస్థానమందంతట అతని అధికారమును పెంపొందించెను.

**కుతుబుద్దీన్** :- ఇతడు ఢిల్లీని రాజధానిగా జేసికొని చుట్టుపట్లనున్న ప్రదేశములను జయించెను. అజ్మీరు, కలింజరు, మహోబ అను కోట లితని వశమయ్యెను. 1194 లో మహమ్మదు స్వయముగ వచ్చి, జయచంద్రునోడించి, చంపి, కన్యాకుబ్జమును పట్టుకొనెను. మహమ్మదు ఖిల్జీ అను మరియొక సేనాని 1197 లో బీహారును జయించి అందలి బౌద్ధవిహారములను నాశనముజేసెను. 1202 లో అతడు బంగాళమును కూడ జయించెను. ఓడిపోయిన రాజపుత్రులలో అనేకులు రాజపుత్రస్థానమునకు వెళ్ళి అచ్చట క్రొత్త రాజ్యమును స్థాపించుకొనిరి. క్రీ. వె.1206లో ఘోరీ మహమ్మదు చనిపోయెను. అప్పటికి హిందూ స్థానములోని ఉత్తర భాగమంతయు మహమ్మదీయుల అధీనమయ్యెను.

## 3. బానిసరాజులు

**బానిసరాజులు** :- రాజులవద్ద బానిసలుగనుండి, తమ శక్తి సామర్థ్యములచేత రాజాభిమానమును సంపాదించి, తర్వాత రాజులయిన ఢిల్లీ సుల్తానులకు బానిసరాజులని పేరు. వీరు క్రీ. వె. 1206 మొదలు క్రీ. వె. 1290 వరకు రాజ్యము చేసిరి. వీరందరు బానిసలు కారు ; కొందరు వారసత్వము చేత రాజ్యమునకు వచ్చినవారు. కాని అట్టివారు అసమర్థులై రాజ్యభారమును వహింపలేకపోయిరి. అందుచేత సామర్థ్యముగల బానిసలే రాజులు కావలసివచ్చెను. ఘోరీమహమ్మదు స్థాపించిన మహమ్మదీయ రాజ్యమునకు సుస్థిరత్వము కల్పించుటయే బానిసరాజులు చేసిన పని.

**ఆ కాలమునాటి ప్రమాదములు** :- క్రొత్తగ స్థాపింపబడిన ఢిల్లీరాజ్యమునకు పదమూడవ శతాబ్దమందనేక చిక్కులు కలిగెను. ప్రతి సుల్తానుక్రింద, రాష్ట్రములను పాలించుటకు ప్రముఖు లనేకులుండిరి. వారొక్కొక్కరివద్ద కొంత సైన్యముండెను. వారాసైన్యముతో రాష్ట్రమందు నివసించుచు అందలి అల్లరుల నణచుచు తాము వసూలు జేసిన పన్నులలో కొంతభాగమును తమ ఖర్చుల కుంచుకొని తక్కిన భాగమును సుల్తానుకు పంపవలసియుండెను. కాని వారిలో కొందరు సుల్తానుకు లోబడియుండుట కంగీకరింపక, స్వతంత్ర్య రాజ్యములను స్థాపించుటకు ప్రయత్నింపసాగిరి. వారిలో నొకడు సుల్తానుయొక్క అభిమానమును సంపాదించి, ఢిల్లీకి రాజైనయెడల తక్కినవారు అసూయాగ్రస్తులై అతనిపై తిరుగుబాటు చేయుచుండిరి. సుల్తానులకు కలుగుచుండిన ప్రమాదములలో ఇదియే మొదటిది. ఇదిగాక, యుద్ధములలో ఓడిపోయిన హిందూరాజులు, వారిప్రజలు అప్పుడప్పుడు సుల్తానులపై తిరుగబడి అల్లరులు చేయుచుండిరి. ఇదియే రెండవ ప్రమాదము. ఇంతకంటెను అపాయకరమైన ప్రమాదము మరియొకటి ఉండెను. ఆ కాలమున మధ్యఆసియాయందు మంగోలులను అనాగరిక జాతివారుండిరి. రాక్షసకృత్యము లొనర్చుటయందు వారిని మించినవారు లేరు. వారిది మహమ్మదీయ మతము కాదు. పదమూడవ శతాబ్దమందు వారు బలవంతులై చైనా దేశమును దోచి, పశ్చిమ ఆసియాలోని మహమ్మదీయ రాజ్యములపైబడిరి. అనేక రాజులను సింహాసనభ్రష్టులుగ జేసిరి. సింహాసనమును కోల్పోయిన మహమ్మదీయరాజులు ఇండియాకు తమ యనుచరులతోకూడ వచ్చి, ఢిల్లీసుల్తానుల పోషణవర్గమందు చేరుచుండిరి. దీనినంతను చూచి మంగోలులు ఇండియాపైకికూడ దండెత్తి రాసాగిరి. ఈ ప్రమాదమునుండి తమరాజ్యమును కాపాడుకొనుట బానిసరాజులకు అత్యావశ్యక మయ్యెను. ఇన్ని చిక్కులు సంభవించినను, వానిని విడదీసి, తమరాజ్యమును రక్షించుకొని, బానిసరాజులు ఇండియాలో మహమ్మదీయ ప్రభుత్వమును చిరస్థాయిగ నిలిపిరి. మహమ్మదీయ విజృంభణమునకు వారుచేసిన సేవ ఇదియే.

**కుతుబుద్దీన్ (1206 - 1210)** :- ఇతడు ఢిల్లీ సామ్రాజ్యకర్త. ఘోరీమహమ్మదు యొక్క ప్రతినిధిగ నున్నప్పుడే ఇతడు అనేక ప్రదేశములను జయించెను. సుల్తాను అయిన తర్వాత క్రొత్త రాష్ట్రములను వశపరచుకొనలేదు. ఇతడు ధైర్యసాహసములు కలవాడనియు, న్యాయపరుడనియు పేరుగాంచెను. ఇతడు ఢిల్లీయందొక మసీదును, అజ్మీరునందు మరియొక మసీదును కట్టెను.

ఇల్ టిట్‌మిష్ (1210 - 1235) :- ఇతడు మూడవ బానిసరాజు. బంగాళ మందమును, పంజాబునందును తనపై తిరుగబడిన గవర్నరులను అణచెను. రత్నభోరు, గ్వాలియరు మొదలగు కోటలలోని హిందూరాజులు కలుగజేసిన అల్లరుల నణచి, ఆకోటలను వశపరచుకొనెను. మంగోలుల మూలమున సింధునదికి తూర్పున అపాయము లేకుండుటకై కావలసిన ఏర్పాటులను చేసెను. మాళవముపై దండెత్తి, ఉజ్జయినిని తీసికొని, అందులోని పవిత్రమగు మహాకాళికా దేవాలయమును నాశము చేసెను. దక్షిణ సింధు రాష్ట్రమును తన సామ్రాజ్యములో కలిపికొనెను. ఢిల్లీ పట్టణమందు జగద్విఖ్యాతమగు కుతుబ్‌మీనార్ అను ఎత్తైన గోపురమును కట్టెను.

రజియా (1236 -1240) :- మహమ్మదీయ స్త్రీలలో రాజ్యమేలినది ఈమె ఒకతెయే. ఈమె పురుష వేషము ధరించి, యుద్ధములందు పాల్గొనుచుండెను; పర్దాను తీసి వేసి, దర్బారులలో సమస్త వ్యవహారములను పరిష్కరించుచుండెను. కాని స్త్రీయను కారణముచేతను, అబిసీనియన్ దేశపు బానిస ఒకనిపై ఆమె అభిమానము చూపెనను కారణము చేతను ప్రముఖులు కొంద రామెపై తిరుగబడి, ఆమెను చెరబెట్టి చంపిరి.



కుతుబ్‌మీనార్

బాల్బను (1266-1286):- ఇతడు బానిసరాజులలో తొమ్మిదవవాడు. ఎనిమిదవవాడగు నాసిరుద్దీన్ కాలములో మంత్రియై వ్యవహారములనన్నిటిని చక్క బెట్టినవాడు; నిష్పక్షపాతబుద్ధి కలవాడు; అవసరము వచ్చినపుడు క్రౌర్యమును, కాఠిన్యమును చూపువాడు. తాను త్రాగుడు మాని తన రాజ్యములో త్రాగుడుండకూడదని శాసించెను. గూఢచారులను నియమించి, సమస్త రహస్యములను కనుగొనుచుండెను. మంగోలులు దాడి నుండి దేశమును రక్షించుటకై వాయవ్యభాగమందనేక కోటలను కట్టెను. నమ్మకస్థులగు సైనికులను సైన్యములో చేర్చుకొని, వారిని తగిన శిక్షణయందుంచెను. బంగాళపు గవర్నరు కలహించినందున స్వయముగ తాను వెళ్ళి, అతనిని పట్టుకొని, అనుచరులతో కూడ నతనిని చిత్రవధ చేసెను. మీవారు ప్రాంతమందలి దారి దోపిడిగాండ్రను లొంగదీసి, అతి క్రూరముగ శిక్షించెను. మంగోలలు మూలమున రాజ్యములు కోల్పోయిన మహమ్మదీయ రాజులకు బత్తెము లిచ్చి తన ఆస్థానమందుంచుకొనెను. కవులు, విద్వాంసులు, అతని ఆస్థానము నలంకరించి యుండిరి. ఈ కారణములన్నిటిని బట్టి బాల్బన్ బానిస రాజులలో నగ్రగణ్యుడని చెప్పదగియున్నాడు. మంగోలులపై యుద్ధము చేయుటకు వెళ్ళిన తన కుమారుడు మరణించెనను దుఃఖవార్తను విని క్రీ.వె. 1286 లో బాల్బన్ మృతి చెందెను. తర్వాత నాలుగు సంవత్సరముల కాలము అతని మనుమడు రాజుగనుండెను. కాని అతడు దుర్వ్యసనములందు తగులుకొని రాజ్యము పాడుచేయుచుండుటచేత అతనిని తొలగించి జాలాలుద్దీన్ అను ఖిల్జీ నాయకుడు సుల్తానయ్యెను.

## 4. ఖిల్జీలు

**ఖిల్జీలు (1290-1320) : -** బానిసరాజుల తర్వాత ముప్పది సంవత్సరములు ఖిల్జీ వంశమువారు ఢిల్లీలో రాజ్యము చేసిరి. ఈ వంశమందు నలుగురు సుల్తానులుండిరి. వారిలో అల్లాయుద్దీన్ '1296-1316) అగ్రగణ్యుడు. ఘోరీ మహమ్మదుచే స్థాపింపబడినట్టియు, బానిసరాజుల కాలమున సుస్థిరత్వము చెందినట్టియు మహమ్మదీయ రాజ్యము ఖిల్జీల కాలమందు అపరిమితముగ వృద్ధిగాంచి, దేశమందంతట వ్యాపించెను. ఈ వ్యాప్తి చేతనే ఖిల్జీల కాలమునకు ప్రాముఖ్యము కలిగినది.

**జలాలుద్దీన్ (1290-1296) : -** ఇతడు సింహాసనమునకు వచ్చునప్పటికి డెబ్బది సంవత్సరముల ముదుసలి, పరమసాధువు, తనపై తిరుగబడి అల్లరిచేసిన వారిని కూడ శిక్షించుటకు వెనుదీయువాడు. అందుచేత ఎక్కడజూచినను అల్లరులధికము

కాసాగెను. అదృష్టవశమున ఇతడు చాలకాలము రాజ్యము చేయలేదు. 1296 లో అల్లుడగు అల్లాయుద్దీన్ ఇతనిని చంపించి రాజ్యమునకు వచ్చెను.

దక్కనుపై దండయాత్ర (1294) : - ఈ అల్లాయుద్దీన్ కారా, అలహాబాదు రాష్ట్రములకు గవర్నరుగనుండి దక్కనును కూడ జయించి, మహమ్మదీయ పరిపాలనలో చేర్చుటకు సమకట్టెను. 1294 లో జలాలుద్దీన్ అనుజ్ఞను పొంది దక్కనులోని రాజ్యములలో నొకటియగు దేవగిరిపై బడెను. దానిని పాలించుచుండిన యాదవారాజతనిని ఎదిరింపలేక, అపరిమితమగు ధనరాసులిచ్చి సంధి చేసికొనెను. ఇట్లు లభించిన ధనముతో అల్లాయుద్దీన్ వెనుకకు మరలివనోయెను. పరమానందభరితుడై అతనిని చూచుటకు జలాలుద్దీన్ రాగా, అతనిని చంపించి, అల్లాయుద్దీన్ ఢిల్లీ సింహాసనము నధిష్ఠించెను.

**మంగోలుల నోడించుట (1296 - 1304)** :- మోసపుచ్చి జలాలుద్దీనుని చంపెనని ఖిల్జీప్రముఖులు కొందరు అల్లాయుద్దీనుని ఎదిరించిరి కాని, దేవగిరి నుండి అతడు తెచ్చిన అపారధనమును వారందరికి పంచిపెట్టి, తన యధికారమతడు స్థిరపరచుకొనెను. రాజ్యమునకు వచ్చిన తర్వాత ఐదారు సంవత్సరముల వరకు మంగోలుల మూలమున అతని కెక్కువ ప్రమాదము కలిగెను. లక్షలకొలది జనముతో వారేటేట అతని రాజ్యముపై దండెత్తి ఢిల్లీ చుట్టుపట్లకు కూడ వచ్చుచుండిరి. క్రీ.వె. 1298 లోని వారిదాడి అతిభీకరమయ్యెను. కాని, తన వద్దనున్న సమర్థులగు సేనాధిపతులతో కలసి, అల్లాయుద్దీన్ వారి నెదుర్కొని, వారిని పూర్తిగ నోడించెను. తర్వాత కూడ వారప్పుడప్పుడు దండెత్తివచ్చుచుండిరి గాని, వారి బలమంతయు క్షీణించెను. బాల్బన్‌వలె అల్లాయుద్దీన్ సరిహద్దులలో క్రొత్తకోటలను కట్టి, నమ్మకముగల సైనికుల నందుచేర్చి, వారిమూలమున దేశరక్షణము చేసెను.

**రాజపుత్రులతో యుద్ధములు (1299 -1304)** :- గజనీమామూదు, ఘోరీమహమ్మదుల కాలమున గంగా, యమునా పరిసర ప్రదేశముల నుండిన రాజపుత్రులనేకులు రాజపుత్రస్థానము చేరి, అచటి దుర్గమములగు ఎడారులందు గొప్పకోటలను కట్టుకొని స్వతంత్రులై యుండిరి. వారిని జయించుటకు అల్లాయుద్దీన్ సమకట్టి, 1299 మొదలు వారితో యుద్ధములు ప్రారంభించెను. ఈ యుద్ధములో రాజపుత్రులు అసమానమగు సాహసమును, పౌరుషమును చూపిరి; కాని పట్టుదలగల అల్లాయుద్దీన్ నిర్భయుడై, సంవత్సరములకొలది వారికోటలను ముట్టడించి పట్టుకొనెను. క్రీ.వె. 1297 లో గుజరాతు అతని వశమయ్యెను. క్రీ.వె. 1299లో రత్నభోరుకోటయు.

క్రీ.వె. 1303 లో చిత్తూరు కోటయు, క్రీ.వె. 1304, 1305 లలో చాందరి, మాళవ, ఉజ్జయిని, ధారానగరములును అతని వశమయ్యెను. చిత్తూరునతడు స్వాధీనము చేసికొనినపుడు ప్రఖ్యాతిగాంచిన పద్మినీ దేవియు, తక్కిన స్త్రీలును అగ్నిప్రవేశము చేసిరి.




**దక్షిణదేశమును జయించుట (1308 - 1310) :-** ఉత్తర ఇండియా అంతయు వశమగుట చేత దక్షిణదేశమునుకూడ జయింప అల్లాయుద్దీన్ నిశ్చయించుకొని,

క్రీ.వె.1308లో మాలిక్ కాఫర్ అను సేనానాయకుని అచటికి పంపెను. ఆ కాలమున దక్షిణదేశమందు యాదవుల దేవగిరి, కాకతీయుల ఓరుగల్లు, హొయిసలుల ద్వారసముద్రము, పాండ్యుల మధుర-అను నాలుగు గొప్ప రాజ్యములుండెను. అందులోని కోట లతిబలిష్ఠములు; అందలి రాజులవద్ద అపరిమితములగు ధన రాసులుండెను; అచ్చటి యోధులు పరాక్రమవంతులు. కాని ఉత్తర ఇండియాలోని రాజపుత్ర రాజ్యములలో నుండిన లోపములన్నియు వీరియందుకూడ నుండెను. అందుచేత విశేష కష్టము లేకుండ మాలిక్ కాఫరు ఈ రాజ్యములను వశపరచుకొన గలిగెను. క్రీ.వె. 1309లో ఓరుగల్లు ప్రతాపరుద్రుడు కప్పము కట్టుట కంగీకరించెను. క్రీ.వె. 1310 లో హొయిసలరాజు ఓడిపోయి, ఢిల్లీ సుల్తానుకు సామంతుడయ్యెను. తర్వాత మాలిక్ కాఫరు పాండ్యరాజ్యముపైకి వెళ్ళి మధుర రామేశ్వరములలోని దేవాలయములను దోచి, విస్తారమగు ధనరాసులతో ఢిల్లీని చేరెను. క్రీ.వె. 1312 నాటికి అల్లాయుద్దీన్ రాజ్యము ఉచ్ఛస్థితికి వచ్చి, దేశమందంతట వ్యాపించెను.

అల్లాయుద్దీన్ పాలన:- దేశమును పాలించుట యందు అల్లాయుద్దీన్ ఎక్కువ సామర్థ్యమును చూపెను. తురక అమీర్లు చేయు కుట్రలన్నిటికి వారికి గల ధనమే కారణమని, అదివరకు వారనుభవించుచుండిన ఇనాములు, జాగీర్లు రద్దుచేసి వానిని తన యధీనము చేసికొనెను. ఎట్టి సందర్భములందు గూడ అమీర్లు కలియకూడదని శాసించెను. తప్పత్రాగి వారు కుట్రలు చేయుచుండుట వలన మద్యపానము నతడు నిషేధించెను. తన యనుజ్ఞ లేనిది ఒక అమీరు మరియొకరితో వివాహసంబంధములు కూడ చేయరాదని ఆజ్ఞాపించెను. గూఢచారుల నేర్పరచి అమీరుల ప్రవర్తనమును రహస్యముగ తెలిసికొనుచుండెను. హిందువులయెడ ఇంతకంటె క్రౌర్యముగను, కాఠిన్యముగను అతడు ప్రవర్తించెను. వారిని పరమదరిద్రులుగ జేసిన యెడల కలహించుటకు కావలసిన సామర్థ్య మడుగంటునని వారిచ్చుకొనవలసిన పన్నుల నధికము చేసెను. వారు పల్లకీల నెక్కకూడదనియు, గుఱ్ఱముల స్వారి చేయకూడదనియు, మంచి బట్టలు ధరించకూడదనియు, తుదకు తాంబూలము కూడ వేసికొనకూడదనియు శాసించెను. తన అధికారమునకంతకు సైన్యము ముఖ్యాధారమని గ్రహించి సైనికుల జీవితములనతడు వృద్ధి చేసి, బజారులలోని వస్తువుల ధరలను నిర్ణయించి, ఎక్కువ ధరల కమ్మినవారిని కఠినముగ శిక్షించెను. ఉద్యోగస్థులలోని లంచగొండితనమును మాన్పించెను. ఈ విధముగ సామ్రాజ్యమును విస్తరించి, పరిపాలన పద్ధతులలో ననేక మార్పులు చేసి క్రీ.వె. 1316 లోఅల్లాయుద్దీన్ మృతిజెందెను. తర్వాత అతని కుమారులలో

నొకడగు ముబారక్ సుల్తానయ్యెను. ఇతడు దుర్వ్యసనములందు చిక్కుకొని, అస్పృశ్యజాతి నుండి మహ్మదీయ మతమును స్వీకరించిన కుసురూ అను నీచుని చేతిలో కీలుబొమ్మ వలె నుండెను. తుదకు, ఈ కుసురూ అతనిని చంపి, 1320 లో సింహాసనము నెక్కెను. గొప్పవంశములోని తురక అమీర్లు దీనిని సహించక అతనిని సింహాసనము నుండి తొలగించి తుఘలక్ వంశమునకు చెందిన గాజీమాలిక్‌ను సుల్తానుగ చేసిరి.

## 5. తుఘ్లకులు

**తుఘ్లకులు (1320 - 1414) :-** తుఘ్లకు వంశమున ఎనమండుగురు సుల్తానులుండిరి. కాని మొదటి ముగ్గురు మాత్రమే వీరిలో పేర్కొనదగినవారు. ఖల్జీలకాలమందు వృద్ధిగాంచిన ఢిల్లీ సామ్రాజ్యము తుఘ్లకుల కాలమున ముక్కలు ముక్కలుగ చీలిపోయెను. ఒక సామ్రాజ్యమునకు బదులు అనేక మహమ్మదీయ రాజ్యములును, హిందూరాజ్యములును ఏర్పడెను. తుఘ్లకు పరిపాలన మూలమున కలిగిన ఫలితమిదియే.

**గయజుద్దీన్ తుఘ్లక్ (1320-25) :-** కుసురూను తొలగించిన గాజీమాలిక్, గయజుద్దీన్ తుఘ్లక్ అను పేరుతో సింహాసన మధిష్టించి ఐదుసంవత్సరములు రాజ్యము చేసెను. ఇతడతి సమర్థుడు. ముబారక్, కుసురూల కాలమున పోయిన ఢిల్లీ సామ్రాజ్య ప్రతిష్ఠను పునరుద్ధరించెను. తనపై తిరుగబడిన కాకతీయులపైకి తన కుమారుని పంపి, వారిని ఓడించి, వారి ఓరుగల్లు రాజ్యమును తన సామ్రాజ్యములో కలిపికొనెను. స్వయముగ బంగాళమునకు వెళ్ళి అక్కడి అల్లరుల నణచెను. అక్కడ నుండి ఢిల్లీకి వచ్చిన తర్వాత అతని కుమారుడు మోసము చేసి అతనిని చంపి మహమ్మదు బిన్ తుఘ్లక్ అను పేరుతో సుల్తానయ్యెను.

**మహమ్మదు బిన్ తుఘ్లక్ (1325 - 1351) :-** ఇతడు చాల శక్తి సామర్థ్యములు కలవాడు; గొప్ప పండితుడు; అనేక విద్యలందుత్తీర్ణుడు; కవి; వక్త; విరివిగ దానధర్మముల జేసినవాడు. కాని వీనితోపాటు దుర్గుణములు కూడ ఇతని యందుండెను. ఇతడు మిక్కిలి క్రూరుడు; మొండి; ఎవరి సలహాను వినువాడు కాడు. సామ్రాజ్య విచ్ఛిన్నము ఇతని కాలమందు ప్రారంభమయ్యెను.

**ఇతని నష్టకరమైన కార్యములు :-** రాజ్యమునకు వచ్చిన తర్వాత నష్టకరమైన కార్యములనేకముల నితడు చేసెను. రాజధానిని ఢిల్లీ నుండి దేవగిరికి మార్చి, ఢిల్లీ లోని ప్రజలందరు తనతోకూడ దేవగిరికి రావలసినదని అజ్ఞాపించి, వారందరు దేవగిరి

చేరిన తర్వాత తన అభిప్రాయమును మార్చుకొని, వారిని ఢిల్లీకి వెళ్ళిపొమ్మని చెప్పెను. దీనిమూలమున ప్రజలపారమగు నష్టమును పొందుటయేగాక ఢిల్లీ పట్టణము పాడుపడినట్లయ్యెను. తన రాజ్యముపై దండెత్తి వచ్చిన మంగోలులతో యుద్ధము చేయుటకు బదులు వారికి లంచములిచ్చి పంపెను; అందుచేత వారు అనేకమార్లు రాసాగిరి. దూరమందున్న పర్షియా దేశమును జయింప నుద్దేశించి నాలుగులక్షల సైన్యము చేర్చి, విస్తారధనము ఖర్చుపెట్టి తుదకా ప్రయత్నమును మానుకొనెను. హిమాలయ ప్రాంతమందలి ఒక చిన్న సామంతుని అణచుటకు లక్షసైన్యమంపగా, మంచువర్షము లోనగువాని బాధలవలన ఆ సైన్యమంతయు నశించెను. ఇట్టి ప్రయత్నముల మూలమున తన కోశమంతయ పలుచబడగా బంగారు, వెండి నాణెములకు బదులు రాగినాణెములను వేయించెను. ప్రజలపై భరింపరాని పన్నులను విధించి, చెల్లించలేని వారిని మృగములవలె వేటాడి చంపించెను. అంతయు మించి పోయి, క్షామము వ్యాపించినపుడు తాను చేసిన పొరబాటును గ్రహించి, రైతులకు అప్పులిచ్చి, ఇతర విధముల వారికతడు సమాయము చేసెను కాని సకాలమున కీ సహాయము లభింపక పోవుటచేత ఇదంతయు వ్యర్థమయ్యెను.

**అల్లరులు :-** ఇట్టిపనులు చేయుటచేత ప్రజలలో అనేకులితనిపై తిరుగబడిరి. ఇదియే తగిన సమయమని రాష్ట్రమందలి గవర్నరులు కలహించిరి. 1335లో మధురలోని గవర్నరు తిరుగబడెను; 1336లో హరిహరుడను హిందూనాయకుడు విజయనగర రాజ్యమును నిర్మించి దక్షిణ ఇండియా నుండి మహమ్మదీయుల అధికారమును తొలగించెను. 1337 లో బంగాళపు గవర్నరు స్వతంత్రుడయ్యెను. 1346 నుండి దక్కనులోని మహమ్మదీయ ప్రముఖులు కలహించి, 1347లో బహమనీ రాజ్యమును స్థాపించిరి. అదే సమయమున సింధురాష్ట్రమందు అల్లరులు బయలుదేరగా, వాని నణచుటకు అతడు అక్కడికి వెళ్ళి, యుద్ధము ముగియుటకు పూర్వమే రోగపీడితుడై 1351లో మృతిజెందెను.

**ఫిరోజిషా (1351 - 1388) :-** ఇతని తర్వాత ఇతని పినతండ్రి కుమారుడగు ఫిరోజిషా సుల్తానయ్యెను. ఇతడు పరాక్రమ శూన్యుడు. ఉద్యోగస్థులకు జాగీర్లను, ఇనాములను ఇచ్చి లేనిపోని చిక్కుల దెచ్చిపెట్టెను. బంగాళమును జయించు నుద్దేశముతో రెండు పర్యాయములు వెళ్ళి తన ప్రయత్నము పూర్తిచేసికొనక వెనుకకు మరలివచ్చెను. కలహించిన సింధురాష్ట్రపు గవర్నరు పైకి దండెత్తివెళ్ళి, విశేషముగ ధనమును, సైన్యమును, వ్యయపరచి, తగిన ఫలమును సంపాదింపక తిరిగివచ్చెను. మహమ్మదుబిన్ తుఘ్లక్

కాలమున స్వతంత్రించిన తక్కిన రాష్ట్రములను వశపరచుకొనుట కెట్టి ప్రయత్నము చేయలేదు. మహమ్మదీయకాజీల యొక్కయు, ఉలేమాల యొక్కయు బోధల ననుసరించి హిందువులను మరింత బాధించెను. ఇదివరకు జిజియాపన్నును చెల్లింపకుండిన వారిపై కూడ ఇప్పుడా పన్నును విధించెను. క్రొత్తగ దేవాలయములను కట్టకూడదని శాసించెను. కొన్ని దేవాలయములను నాశనము చేసి వాని స్థానమున మసీదులు కట్టెను. ఇతడిట్టి వాడైనను కొన్ని మంచి కార్యములు చేసెను. భూమి పన్నును తగ్గించెను; అనేక శిస్తులను రద్దు చేసెను. జీలం, సట్లెజి నదుల నుండి కొన్ని కాలువలు త్రవ్వించి వ్యవసాయము నభివృద్ధి జేసెను. తోటలను వేయించెను. అనేక పట్టణములను, రాజభవనములను, మసీదులను, సత్రములను, వైద్యశాలలను కట్టించెను; మహమ్మదీయ పాఠశాలల నేకములను స్థాపించెను.

**ఫిరోజిషాకు తర్వాతి సుల్తానులు (1388-1414) : -** ఫిరోజిషా చనిపోయిన తర్వాత అరాజకము బయలుదేరెను. రాష్ట్రములలోని గవర్నరులు మరింత స్వతంత్రులైరి. బలహీనులగు సుల్తానులు రాజ్యమునకు వచ్చిరి ; వారెవ్వరుకూడ దీర్ఘ కాలము రాజ్యము చేయలేకపోయిరి. ఇట్టి సమయములో టైమూరు అను రక్కసుడు దేశముపై దండెత్తి వచ్చెను. 1398 నాటి కితడు మధ్యఆసియా, పశ్చిమాసియాలందు గొప్ప సామ్రాజ్యము సంపాదించి, ఇండియాదేశము ధనసమృద్ధి గలదనియు, విగ్రహారాధకులగు హిందువులను దోపిడీచేసి వారిని చంపినయెడల ఇహసౌఖ్య పరసౌఖ్యములు రెండును కలుగుననియు లక్షసైన్యముతో అతడు ఇండియాను 1398 లో ప్రవేశంచెను. సింధును దాటి ఢిల్లీని చేరుటకు మధ్యన అనేక పట్టణములను, దేవాలయములను నాశము చేసి, లక్షహిందూజనమును ఖైదీలగ జేసి, 1399 లో ఢిల్లీపై బడెను. యుద్ధ మారంభమగుటకు ముందు ఖైదీల నందరిని చంపెను. తర్వాత ఢిల్లీసుల్తానుతో యుద్ధముచేసి అతని నోడించి మూడు రోజులు పట్టణములో కనుపించిన వారినందరిని చంపి, ధనమును దోచుకొని వెనుకకు మరలెను. మార్గమున హరిద్వారము మొదలగు పుణ్యక్షేత్రములను నాశముచేసి స్వదేశమునకు వెళ్ళిపోయెను. అప్పటికే శిథిలమైపోయిన ఢిల్లీ సామ్రాజ్యము టైమూరు దండయాత్ర మూలమున పూర్తిగ నశించెను. క్రీ.వె. 1414 వరకు తుఘలక్ వంశమువారు సుల్తానులుగ నుండిరి గాని వారు అధికారము ఢిల్లీపట్టణమున కావల వ్యాపించి యుండలేదు.

## 6. ఢిల్లీ రాజ్యము క్షీణించుట

**ఢిల్లీరాజ్యము క్షీణించుట :-** పూర్వకాలపు మౌర్య, గుప్త, హర్ష సామ్రాజ్యములు క్షీణించినట్లే ఢిల్లీలోని మహమ్మదీయ సామ్రాజ్యము క్షీణించెను. 1. ప్రయాణ సౌకర్యములు లేకపోవుట; 2. బలహీనులగువారు సుల్తానులగుట; 3. రాష్ట్రములలోని గవర్నరులు స్వార్థపరులై స్వతంత్రించుట; 4. సుల్తానులు హిందువులను బాధపెట్టుట; 5. మధ్యఆసియానుండి వచ్చిన తురకయోధుల సంతతి వారు తమ పూర్వుల బలమును కోల్పోవుట - ఈలాటి కారణములచేత క్రీ.వె. 1350 నాటికి ఢిల్లీసామ్రాజ్యము క్షీణించుటకు ప్రారంభించి, క్రీ.వె.1400 నాటికి ముక్కలు ముక్కలుగ విడిపోయెను.

**స్వతంత్రరాజ్యములు :-** ఒక సామ్రాజ్యమునకు బదులు అనేక స్వతంత్ర రాజ్యములు బయలుదేరెను. వానిలో కొన్ని మహమ్మదీయ రాజ్యములు; కొన్ని హిందూరాజ్యములు, మహమ్మదీయ రాజ్యములలో ముఖ్యములైనవి ఢిల్లీ, జాన్‌పూరు, బంగాళము, గుజరాతు, మాళవము, ఖాన్‌దేశము, బహమనీ రాజ్యము; హిందూరాజ్యములలో ముఖ్యములైనవి. విజయగనరము, రాజపుత్ర స్థానములోని రాజ్యములు.

**ఢిల్లీరాజ్యము (1414 - 1526) :-** క్రీ. పూ. 1414 తర్వాత ఢిల్లీ రాజ్యమును రెండు వంశములవారు పాలించిరి. క్రీ. పూ. 1414 మొదలు క్రీ. పూ. 1451 వరకు సయ్యదు వంశమువారు రాజులుగనుండిరి. ఢిల్లీ చుట్టుపట్లనున్న కొన్ని ప్రదేశములు మాత్రమే వారి అధీనమందుండెను. క్రీ. పూ. 1451లో వారిని తొలగించి లోడీ వంశమువారు సుల్తానులైరి. వీరు సయ్యదులకంటె సమర్థులు. వీరు జాన్‌పూరు, గ్వాలియరు మొదలగు రాష్ట్రములను తమ పరిపాలనలోనికి తెచ్చికొనిరి. వీరిలో ఆఖరువాడగు ఇబ్రహీంలోడీని క్రీ. పూ. 1526లో బాబరు ఓడించి మొగలాయి రాజ్యమును స్థాపించెను.

**బహమనీ రాజ్యము (1347 - 1518) :-** ఈ రాజ్యమును జాఫర్ ఖాన్ అనువాడు 1347లో స్థాపించెను. ఇతడు దేవగిరిని పాలించుటకై మహమ్మదుబిన్ తుఘ్లక్ చేత దక్కనుకు పంపబడెను. కొంతకాలమైన తర్వాత సుల్తానుపై తిరుగబడి స్వతంత్రుడయ్యెను. బీరారు మొదలు కృష్ణానది వరకును, అరేబియా సముద్రతీరమునుండి తెలంగాణాము వరకును గల దేశ మితని రాజ్యములో చేరియుండెను. ఇతని రాజ్యమునకు గుల్బర్గయను పట్టణము రాజధాని క్రీ. వె.1347

మొదలు క్రీ. వె. 1518 వరకు పదునలుగురు రాజులు దీనిని పాలించిరి. వీరిలో ననేకులు భోగపరాయణులు; దుర్వ్యసనములలో తగుల్కొనినవారు.

విజయనగరముతో యుద్ధములు :- బహమనీ రాజ్య చరిత్రలోని ముఖ్యవిషయము ఈ సుల్తానులకును, విజయనగర చక్రవర్తులకును జరిగిన యుద్ధములే. ఇట్టివి ఆరు యుద్ధములు జరిగెను. కృష్ణా తుంగభద్రానదుల మధ్యనుండు ప్రదేశమునకై వీరెక్కువగ పోరిరి. ఈ యుద్ధము లతిభీకరముగను, బీభత్సముగను ఉండెను. నిరాయుధులగువారు లక్షలకొలది మృతిజెందిరి. అనేకులు బానిసలైరి. అనేక దేవాలయములు నాశనములయ్యెను. నిరాయుధులను చంపగూడదను ఏర్పాటు రెండు పక్షములవారే చేసికొనిరి గాని దానిప్రకారము వారు నడచుకొనరైరి. ఈ యుద్ధములందొకప్పుడు సుల్తానులకును, ఒకప్పుడు విజయనగర రాజులకును జయము లభించుచుండెను.

తక్కిన యుద్ధములు :- విజయనగరములోనే గాక, బహమనీ సుల్తానులు ఓరుగల్లు రాజుతో ననేక యుద్ధములను జేసి తుదకు తెలంగాణమునంతను వశపరచుకొనిరి. ఉత్తరమున ఖాన్‌దేశము, మాళవరాజ్యములతోకూడ వీరు యుద్ధములు జేసిరి.

స్వదేశీయులు, విదేశీయులు :- బహమనీ రాజ్యములోని మహమ్మదీయులలో విదేశీయులు, స్వదేశీయులు అను రెండు కక్షలు బయలుదేరి తుదకు రాజ్యవినాశమునకు హేతువయ్యెను. ఉత్తర ఇండియా నుండియు, పారశీకము, అరేబియా మొదలగు దేశములనుండియు ఉద్యోగములకై వచ్చిన మహమ్మదీయులు విదేశీయులు. బహమనీ రాజ్యమందే పుట్టి పెరిగినవారు స్వదేశీయులు, విదేశీయులలో అనేకులు షియ్యాశాఖవారు; స్వదేశీయులు సున్నిశాఖవారు. విదేశీయులు యుద్ధమందును, పరిపాలనమందును ఎక్కువ సామర్థ్యమును చూపుచుండిరి. ఈ రెండు పక్షముల వారెల్లప్పుడు ఒకరితోనొకరు కలహించుచు సుల్తానులను చిక్కుబెట్టుచుండిరి. ఇదియే రాజ్యము బలహీనమగుటకు కారణమయ్యెను.

సుల్తానుల పరిపాలన :- సుల్తానులలో కొందరు పరిపాలనయందు సామర్థ్యమును చూపిరి. వారికంటెను వారి మంత్రులలో నొకడగు మహమ్మదుగవాన్ అనుశడు (1464-1481) పరిపాలనమందు ప్రఖ్యాతిగాంచియున్నాడు. వీరు కాలువలను, చెఱువులను, నూతులను త్రవ్వించి, వ్యవసాయదార్లకెక్కువ సహాయము చేసిరి; విదేశ వ్యాపారమును ప్రోత్సాహపరచిరి; అనేక భవనములను, మసీదులను

నిర్మించిరి. మహమ్మదీయుల యుపయోగమునకై పాఠశాల లనేకములను స్థాపించిరి. దుర్గమములగు కోటలను కట్టిరి. తక్కిన మహమ్మదీయ సుల్తానులవలె వీరుకూడ హిందువులయెడ ద్వేషమువహించి, వారిని నీచభావముతో చూచిరి. పదునైదవ శతాబ్దమందు వచ్చిన ఒక రష్యావర్తకుడు "ఈ రాజ్యము జనసమృద్ధిగలది; భూములు చక్కగ సేద్యమగుచున్నవి; మార్గములందు చోరుల బాధలేదు; రాజధాని ఉద్యాన వనములతో కూడినయున్నది" అని వర్ణించియున్నాడు. ఉద్యోగముల చేయువారు సమస్తభోగము లనుభవించుచుండిరి గాని సామాన్యప్రజలు కడు దరిద్రులుగ నుండిరి.

## 7. మహమ్మదీయ విజృంభణ కాలమందలి పరిస్థితులు

**తురకల దండయాత్రల లక్షణము :-** విదేశముల నుండి ఇండియాను జయించుటకు పూర్వకాలమందు వచ్చిన గ్రీకులు, శకులు, పహ్లవులు, కుషాణులు, హూణులు, ఘూర్జరులు మొదలగువారి దండయాత్రలకును, తురకల దండయాత్రలకును గొప్ప భేదమొకటి యున్నది. గ్రీకులు మొదలగువారు ఇండియాలో రాజ్యములను స్థాపించుకొనిన తర్వాత హిందూమతము నవలంబించి, హిందూ సంప్రదాయముల ననుసరించి, ప్రజలందరితో కలిసిపోయిరి. వారికిని, దేశములోని తక్కినవారికిని ఎట్టి భేదములు లేకపోయెను. తురక లట్లుగాక రాజ్యములను స్థాపించి, దేశమందు స్థిరనివాసము లేర్పరచుకొనినను మతవిషయములందు తమ ప్రత్యేకత్వమును నిలబెట్టుకొని, దేశమం దదివరకుండిన ప్రజలతో కలసిపోక, అరేబియా, పర్షియా మొదలగు దేశముల వారితో ఎక్కువ సంబంధమును కల్పించుకొని యుండిరి. ఈ కారణముచేత వారి రాకమూలమున దేశములోని ప్రజలందు రెండుచీలిక లేర్పడెను. ఈ చీలిక లిప్పటివరకు నిలబడియున్నవి.

**హిందువుల తిరుగుబాటు :-** హిందూ దేశములో తాము జయించిన ప్రజలు హిందువులైనను వారి మతమునుగాని, ఆచారములనుగాని సహించి ఆదరించుటకు తురక ప్రభువు లిష్టపడరైరి. పరమత సహనమును ఆ కాలపు మమమ్మదీయమత మంగీకరించ లేదు. మతధర్మములను బోధించుచుండిన ఉలేమాలు సుల్తానులపై ఎక్కువ అధికారము కలిగి రాజకీయ విషయములందు వారికి మార్గదర్శకులై, స్వమత పోషణమును, పరమత వినాశమును కర్తవ్యములని బోధించుచుండిరి. అల్లాయుద్దీన్, మహమ్మదు బిన్ తుఘ్లక్ మొదలగు సుల్తానులు కొందరు ఉలేమాల మాటలను వినక స్వతంత్రించి పరిపాలనము నడిపిరికాని తక్కినవారట్లు చేయుటకు సాహసింపరైరి. అందుచేత తురకల ప్రభుత్వము హిందువులకు దుర్భరమయ్యెను. వారు జిజియాపన్నును

ఇచ్చుకొనవలసివచ్చెను; వారు క్రొత్త దేవాలయములు కట్టుకొనుటగాని, ప్రాత వానిని మరమ్మతు చేసికొనుటగాని, బహిరంగముగ తమ ఉత్సవములను జరుపుకొనుటగాని నేరమయ్యెను. కావున సమయము వచ్చినపుడు వారు సుల్తానులపై తిరుగుబాటు చేయుచుండిరి. మహమ్మదీయ సైన్యములు సులభముగ చొరలేని ఎడారి ప్రాంతములందున్న రాజపుత్ర స్థానమునను, ఢిల్లీకి మిక్కిలి దూరమునందున్న దక్షిణ ఇండియా యందును హిందువుల తిరుగుబాట్లు సఫలములయ్యెను.

ప్రజల యోగక్షేమము:- పై విధముగ రాజకీయ విషయములందు హిందువుల స్థితి దుర్భరముగ నుండినను తక్కిన విషయములలో మహమ్మదీయ సుల్తానులు పూర్వపు రాజులవలె ప్రజల యోగక్షేమమునకై పాటుపడిరి. దొంగలను, దారిదోపిడిగాండ్రను, శిక్షించి ప్రజలను రక్షించిరి; వ్యవసాయమున కుపయోగించు నీటి సదుపాయములను గల్పించిరి; క్షామ కాలములందు ధాన్యాదులను చౌకధరలకు విక్రయించునట్లేర్పాటు గావించిరి; కార్ఖానాలను స్థాపించి, నేర్పరులగు పనివాండ్రచే నాణ్యములను, వస్తు సామగ్రిని తయారు చేయించిరి; వర్తకవ్యాపారముల ననేక విధముల ప్రోత్సహించిరి. విదేశములనుండి ఆ కాలమున వచ్చిన ప్రయాణీకులు కళ్లికోట, బ్రోచ్, కాంబే మొదలగు పట్టణముల సౌభాగ్యమును పొగడియున్నారు.

కళలు :- ఆ కాలపు సుల్తానులలో ననేకులు కళాభిమానులు; వారు మశీదులు, సమాధులు, దుర్గములు, పట్టణములు మొదలగువానిని నిర్మించి వారి రాజ్యములకు వన్నె దెచ్చిరి. ఈ నిర్మాణములందు హిందూశిల్పులను, వారి శిల్ప చాతుర్యమును వారెక్కువగ నుపయోగించిరి. అందుచేతనే వారి భవనములందు హిందూ మహమ్మదీయ సంప్రదాయ సమ్మేళనము కనుపించుచున్నది. ఢిల్లీ, అజ్మీరు పట్టణములలోని విశాలములగు మశీదులు, ఢిల్లీలోని కతుబ్‌మీనారు గోపురము, తుఘ్లక్ యొక్క సమాధి, ఫిరోజిషా కట్టిన ఫిరోజుబాద్ పట్టణము, జాన్‌పూరు, బంగాళము, గుజరాతు మొదలగు రాజ్యముల నేలిన సుల్తానులు నిర్మించిన మశీదులు, ప్రాసాదములు అప్పటి శిల్పములలో పేర్కొనదగియున్నవి. ఉద్యానవనములను నిర్మించుటయందు కూడ అప్పటి సుల్తానులెంతో శ్రద్ధవహించిరి.

వాఙ్మయము : - మహమ్మదీయ సుల్తానుల రాజ్యము లందు పర్షియన్ భాష రాజభాషగ నుండెను. ఆభాష యందు అమిరు కుస్రూమొదలగు మహాకవులు కావ్యములనేకములను వ్రాసిరి. కొందరు గ్రంథకర్తలు చరిత్ర గ్రంథములను వ్రాసి యున్నారు ; మరికొందరు సంస్కృత గ్రంథములను పర్షియన్ భాషలోనికి తర్జుమాచేసి,

హిందూ సంప్రదాయముల తత్వమును మహమ్మదీయులు గ్రహించుట కవకాశము కల్పించిరి. మహమ్మదీయులనేకులకు మాతృభాషయగు హిందూస్థానీ(ఉర్దూ) ఆకాలమున పుట్టెను. అది పర్షియన్ హిందీ భాషల సమ్మేళనము వలన పుట్టెను. రాజపుత్రయుగమందంకురించిన దేశభాషావాఙ్మయ మీకాలమున ఎక్కువగ వృద్ధిగాంచెను. కవులనేకులు దేశభాషలలో రామాయణ భారతభాగవతాది గ్రంథములను వ్రాసిరి. మతమును, ధర్మములను పామరజనమున కుపదేశించుటకై వారీ పనికి పూనిరి.

మతము :- మత విషయములందుకూడ ఆ కాలమున రెండుమూడు గొప్ప విశేషము లగుపడుచున్నవి. మహమ్మదీయ మతము హిందూదేశమలో ప్రవేశించి వ్యాప్తి గాంచుట మొదటి విశేషము. హిందువులతో గలిగిన సంబంధమువలన మహమ్మదీయుల ఆచారములు కొంతవరకు మారుట రెండవ విశేషము. ఇట్టి సంబంధము కలుగుటకు రెండు ముఖ్యకారణములుండెను. విదేశములనుండి వచ్చిన మహమ్మదీయులు స్త్రీలతో కూడ వచ్చినవారు కారు. వారు దేశమును జయించి స్థిరనివాసముల నేర్పరచుకొనిన తర్వాత హిందూ స్త్రీలను వివాహమాడసాగిరి. ఇదిగాక దేశములోని హిందువులనేకులు మహమ్మదీయులైరి; వీరు క్రొత్త మతమవలంభించినను తక్కిన విషయములందు పూర్వాచారములను వదిలినవారు కారు. ఈ రెండు కారణములచే ప్రాచీన హిందూ ఆచారములు కొన్ని మహమ్మదీయ సంఘములో వ్యాపించెను. హిందువులు, మహమ్మదీయులు ఒకే దేశమందు నివసించుట వలన కొంతకాలమునకు హిందూ సంస్కర్తలు కొందరు మహమ్మదీయ మతములోని లక్షణములను గ్రహించి హిందూమతమున నొక నూతన వికాసము గల్పించిరి. ఇదియే అప్పటి మతపరిణామమందలి మూడవ విశేషము.

హిందూమత సంస్కర్తలు:- హిందువులలోని వర్ణభేదములు వారి పరాజయమునకు కారణమని ఆ కాలపు సంస్కర్త లనేకులూహించి; అట్టి భేదములను నిర్మూలించి ప్రజలలో నైకమత్యము పురిగొల్పుటకు వారు ప్రయత్నించిరి. అట్టివారిలో రామానందుడు, వల్లభుడు, చైతన్యుడు, కబీరు, నానకు, నామదేవుడు ముఖ్యులు. మోక్షమునకు భక్తి యొక్కటే సాధనమనియు, భక్తి గలవాడు చండాలుడైనను, బ్రాహ్మణుడైనను భగవదనుగ్రహమునకు పాత్రుడగుననియు వారు బోధించిరి. కబీరు, నానకు హిందూ మహమ్మదీయ సమ్మేళనమునకై ఎక్కువ పాటుపడిరి. మతనమునకై ఒకరితోనొకరు యుద్ధము చేయుట, దేవాలయములను నాశము చేయుట మహాపాతకమని వారుపదేశించిరి. అన్ని మతముల సార మొక్కటే యనియు, అందరు

పూజించు దేవుడొక్కడేయనియు, జాతి, వర్ణ భేదములను పాటింపక ప్రతి మనుష్యునియెడల మనము క్రియా పూర్వకముగ చూపు ప్రేమయే ముక్తిమార్గమనియు వారు చాటించిరి. హిందువులేగాక మహమ్మదీయులు కూడ వారికి శిష్యులైరి. హిందువులు మహమ్మదీయపీర్లను పూజించుటయు, మహమ్మదీయులు హిందూ దైవతములకు మ్రొక్కుకొనుటయు ఆచారమయ్యెను. అప్పటి సంస్కర్తలు హిందీ, బంగాళీ మొదలగు దేశభాషలలో వ్రాసిన గ్రంథములు, పాడిన పాటలు, చేసిన ఉపదేశములు ఇప్పటివరకు కోట్లకొలది ప్రజలకు ఆత్మశాంతిని, ఆనందమును కలిగించుచున్నవి. హిందూ మహమ్మదీయ సమ్మేళనమునకు వారు బీజమునాటిరి. అక్బరు చక్రవర్తి కాలమున నది అంకురించెను. అది మహావృక్షమై ఫలితము నియ్యవలసిన కాలము ముందున్నది.

## ప్రశ్నలు

1. గజనీ ఇండియాపై దండెత్తుకు కారణమేమి ? అతని దండయాత్రల లక్షణములను పేర్కొనుము. వాని మూలమున గలిగిన ఫలితము లెవ్వి ?
2. ఘోరీ మహమ్మదు దండయాత్రలకును, గజనీమామూదు దండయాత్రలకును, భేదమేమి ? ఘోరీమహమ్మదు ఏయే రాజులను ఎప్పుడెప్పుడు జయించెను? అతని సేనాధ్యక్షులలో నిద్దరిని బేర్కొని, వారే రాష్ట్రములను జయించిరో వివరింపుము.
3. "బానిసరాజు" లను పేరెట్లు వచ్చెను ? వారు చేసిన గొప్ప పని ఎట్టిది ? ఢిల్లీ రాజ్యమున కాకాలమున కలిగిన ప్రమాదములను మూడింటిని పేర్కొనుము.
4. ఇల్ టిట్‌మిష్ జయించిన రాష్ట్రము లెవ్వి ?
5. బానిస రాజులలో బాల్బన్ అగ్రగణ్యుడనుటకు నాలుగు కారణములను చెప్పుము.
6. ఖిల్జీల కాలమున కే కారణముచే ప్రాముఖ్యము కలుగుచున్నది ? అల్లాయుద్దీన్ ఏయే రాష్ట్రములను జయించెను ? దక్షిణదేశమం దప్పుడుండిన రాజ్యము లెవ్వి?
7. అల్లాయుద్దీన్ యొక్క పరిపాలనా సామర్థ్యమును సూచించు విశేషము లైదింటిని పేర్కొనుము.

8. మాలిక్ కాఫర్ యొక్క జీవితమును సంక్షిప్తముగ తెలుపుము.
9. మహమ్మద్ తుఘ్లకునందలి (ఎ) సుగుణములు (బి) లోపములు పేర్కొనుము. ఇతడు చేసిన నష్టకార్యములు నాల్గింటిని చెప్పుము. ఇతని కాలమున ఏయే రాష్ట్రములు స్వతంత్రములయ్యెను ?
10. ఫిరోజిషా ఎట్టిరాజు ? అతడు చేసిన (ఎ) మంచి కార్యములు (బి) చెడుకార్యములు ఎవ్వి ?
11. తైమూరు దండయాత్రకు కారణమేమి ? దాని ఫలితమేమి ?
12. ఢిల్లీరాజ్యము క్షీణించుటకు కారణము లెవ్వి ?
13. క్రీ. వె. 1400 తర్వాత ప్రఖ్యాతిగాంచిన (ఎ) మహమ్మదీయ రాజ్యములను, (బి) హిందూరాజ్యములను పేర్కొనుము.
14. ఢిల్లీరాజ్య పునరుద్ధరణమునకై లోడీలు ఏమి చేసిరి ?
15. బహమనీ రాజ్య మెచ్చటిది ? దానికిని, విజయనగర రాజ్యమునకును యుద్ధము లేల సంభవించెను ? ఆ యుద్ధముల ఫలితము లెట్టివి ?
16. బహమనీ రాజ్యములో "స్వదేశీయులు, విదేశీయులు" అను భేద మెట్లేర్పడెను? దాని ఫలితము లెవ్వి ?
17. మహమ్మదు గవాన్ ఎవడు ?
18. బహమనీ సుల్తానుల పరిపాలనలో నాలుగు విశేషములను పేర్కొనుము?
19. ప్రాచీన కాలమున ఇండియాపై దండెత్తిన విదేశీయులకును. మహమ్మదీయులకును భేదమేమి ? తురకల ప్రభుత్వము హిందువులకు దుర్భర మగుటకు కారణము లెవ్వి ?
20. మహమ్మదీయ సుల్తానులు కళాపోషకులనుటకు నిదర్శనము లెవ్వి ? వారి కాలమున వాఙ్మయ మెట్లు వృద్ధి గాంచెను ? మత విషయము లందాకాలమున కలిగిన మార్పు లెవ్వి ? అప్పటి మత సంస్కర్తలను కొందరిని పేర్కొనుము. వారు గావించిన మతబోధ ఎట్టిది ?

## ఎనిమిదవ ప్రకరణము

# హిందువుల తిరుగుబాటు

విషయములు :- విజయనగర సంస్థాపనము, దాని అభివృద్ధి, దక్కనులోని మహమ్మదీయుల పంచ రాజ్యములు, తాళికోట యుద్ధము - దాని ఫలితములు.

### 1. విజయనగర రాజ్యము

విజయనగర రాజ్యము :- క్రీ. వె. 1336లో హరిహరుడు, బుక్కరాయలు అను సోదరులిరువురు విద్యారణ్య మహర్షి యొక్క యుపదేశము ననుసరించి హిందూమతోద్ధరణమునకై తుంగభద్రానదీ తీరమున విరూపాక్షదేవుని సన్నిధియందు విజయనగరమును కట్టి తమ అధికారమును స్థాపించిరి. వీరు మధురను పాలించుచున్న మహమ్మదీయ సుల్తాను నోడించి తమ రాజ్యమును తుంగభద్ర మొదలు మధుర వరకు వ్యాపింప జేసిరి. వీరి వంశమునకు సంగమవంశమని పేరు.

సంగమవంశము (1336 - 1486) :- ఇందు పదిమంది రాజులుండిరి.వీరు నిరంతరము బహమనీసుల్తానులతో యుద్ధము చేయవలసివచ్చెను.తాము మహమ్మదీయులగుట చేత మహమ్మదు బిన్ తుఘ్లకునకు లోబడి యుండిన దక్షిణ దేశపు హిందూరాజులు తమకు కప్పము చెల్లించవలసినదని ఈ సుల్తానులు వాదించుచుండిరి. ఇదిగాక కృష్ణా, తుంగభద్రా నదులకు మధ్యనున్న ప్రదేశములోని రాయచూరు, ముద్గల్లు కోటలకై వారు వివాదపడుచుండిరి. ఈ కారణముల చేత యుద్ధములు తప్పవయ్యెను. గత ప్రకరణమం దీయుద్ధముల స్వభావము వివరింపబడెను. వీనిలో కొన్నింటియందు కళింగ రాజులగు గజపతులు బహమనీసుల్తానులకు సహాయము చేసిరి. క్రీ. వె. 1421 మొదలు క్రీ. వె. 1448 వరకు రాజ్యము చేసిన రెండవ దేవరాయల కాలమున విజయనగర సైన్యములకు గొప్ప అపజయము కలిగెను; రాయలు సుల్తానుకు కప్పము కట్టవలసినవాడయ్యెను. ఈ అపజయమునకు తన సైన్యములోని లోపము కారణమని అతడు గ్రహించి, పరాక్రమవంతులగు మహమ్మదీయులతో కూడిన గుఱ్ఱపుదళము నొకదానిని తయారుచేసి తన సైన్యమందు చేర్చెను. ఇతని కాలమందు విజయనగరము సమస్త వైభవములతో ప్రకాశించుచు, విశాలములగు బజారులు, ఎత్తైన రాజభవనములు, ధనికులగు వర్తకులు లోనగువానితో కూడియుండెను. పట్టణము చుట్టు ఏడు ప్రాకారము లుండెను. పట్టణమందు తుంగభద్ర నుండి కాలువ లనేకములు ప్రవహించుచుండెను.




**సాళువవంశము (1486-1505)** :- సంగమ వంశపు ఆఖరు రాజులు బలహీనులగుటచేత గజపతులు వారి రాజ్యములో కొంతభాగమును జయించి, ఇప్పటి నెల్లూరు జిల్లాలోని ఉదయగిరికోట యందు గొప్ప సైన్యమును నిలిపియుండిరి. బహమనీ సుల్తానులు కూడ కొన్ని ప్రదేశములను స్వాధీనపరచుకొనిరి. దీనినంతను చూచి, చంద్రగిరికి గవర్నరుగ నుండిన సాళువ నరసింహుడు అప్పటి చక్రవర్తిని తొలగించి, 1486లో తానే సింహాసన మధిష్ఠించెను. అది మొదలతడు ఆరు

సంవత్సరములు రాజ్యము చేసి శత్రువుల నోడించి, రాజ్యమున కెట్టి ప్రమాదములు లేకుండ రక్షించెను. అతని తర్వాత రాజ్యమునకు వచ్చిన అతని కుమారు లిద్దరు బలహీనులు అయినను, నరసింహుని స్నేహితుడును, సేనాధిపతియునగు సాళువ నరసనాయకుడు వారికి మంత్రియై దేశమును చక్కగ పాలించెను. నరసనాయకునికి ఇద్దరు కుమారులుండిరి. పెద్దవాడు వీరనరసింహుడు; రెండవవాడు కృష్ణ దేవరాయలు. తండ్రి చనిపోయిన పిమ్మట వీరనరసింహుడు మంత్రిగ నుండుట కిష్టపడక రాజును తొలగించి తానే రాజయ్యెను. ఇది మొదలు రాజ్యము చేసినవారు తుళువ వంశమువారు.

## 2. విజయనగర సామ్రాజ్యాభివృద్ధి

**తుళువ వంశము :-** తుళువ వంశమువారి పానలో విజయనగర సామ్రాజ్యము ఉచ్ఛస్థితికి వచ్చెను. దీనికంతకు కృష్ణదేవరాయలు కారకుడు. అతడు క్రీ. వె. 1509 మొదలు క్రీ. వె. 1530 వరకు రాజ్యమేలెను. ఆ కాలమున ప్రపంచ మందుండిన అగ్రగణ్యులగు చక్రవర్తులలో నితడొకడని చెప్పదగియున్నాడు. శత్రు రాజ్యములను జయించుట యందును, జయించిన రాజ్యములను పాలించుట యందును, సమస్త కళలను పోషించుట యందును ఇతడద్వితీయమగు కీర్తిని సంపాదించెను.

**కృష్ణదేవరాయల విజయములు :-** రాజ్యమునకు వచ్చిన వెంటనే సైన్యములను తయారు చేసికొని, తనపై కలహించిన సామంతుల పైకి వెళ్ళి ఉమ్మటూరు, శివ సముద్రము, శ్రీరంగపట్టణము లోనగు కోటలను పట్టుకొని, సామంతుల అధికారము నూడబెరికి, వారుచెల్లింప వలసిన కప్పములను ప్రాత బాకీలతో వసూలుచేసెను. తర్వాత నతడు గజపతులపైకి యుద్ధమునకు వెళ్ళి, ఉదయగిరి, అద్దంకి, వినుకొండ, బెల్లంకొండ, కొండవీడు, కొండపల్లి దుర్గము లను బట్టుకొని, కృష్ణా నదిని దాటి, గజపతి సైన్యముల నోడించి, గోదావరిని దాటి, రాజ మహేంద్ర వరమును సాధించి, సింహాచల ప్రాంతమున జయస్తంభము నాటెను. కళింగ గజపతి అంతటితో యుద్ధము మాని సంధి జేసికొనెను. కృష్ణా నదికి దక్షిణమున నుండు రాజ్యమంతయు విజయనగరములో చేరెను.



శ్రీకృష్ణదేవరాయలు

రాయచూరు యుద్ధము :- క్రీ. వె. 1516 మొదలు క్రీ. వె. 1520 వరకు కృష్ణరాయలు యుద్ధములు చేయక కాలమునంతను శాంతిగ గడపెను. క్రీ. వె. 1520లో నతడు కృష్ణా తుంగ్రభద్రా నదులకు మధ్యనున్న ప్రదేశమును జయింపనెంచి బిజాపూరు రాష్ట్రముపై దండెత్తెను. ఉభయసేనలకు రాయచూరు వద్ద ఘోరయుద్ధము జరిగెను. రాయలకు పరిపూర్ణమగు జయము లభించెను. రాయచూరు దుర్గమతని వశమయ్యెను. అటుతర్వాత నతడు బిజాపూరునకు వెళ్ళి దానిని ధ్వంసము చేసి, గుల్బర్గ పట్టణమును కూడ పట్టుకొనెను. ఇంతటినుండి దక్కనులోని మహమ్మదీయ సుల్తాను లతని నెదిరింపరైరి.

పోర్చుగీసువారి సఖ్యము :- ఆ కాలమున వ్యాపారమునకై పోర్చుగీసువారు మన దేశమునకు వచ్చి అచ్చటచ్చట కొన్ని కోటలను కట్టుకొనియుండిరి. వారికిని, కృష్ణరాయలకును ఎక్కువ సఖ్యముండెను. అతని సైన్యమునకు కావలసిన గుఱ్ఱములను వారు తెచ్చి యిచ్చుచుండిరి.

కృష్ణదేవరాయల పరిపాలన :- పరిపాలన విషయమున కృష్ణరాయలు ఎక్కువ సామర్థ్యమును చూపెను. ఉద్యోగుల మూలమున ప్రజలకు అన్యాయము కలుగకుండ తగిన విచారణ చేయుచుండెను. వ్యవసాయమున కుపయోగించు నట్లతడు కాలువలను, చెరువులను త్రవ్వించెను. దక్షిణ దేశమందు క్రొత్త దేవాలయము



హంపీ విజయనగరములోని విష్ణ్వాలయముపై గల చిత్రరచన (16వ శతాబ్దారంభము)

లనేకముల నతడు కట్టెను. పుణ్యక్షేత్రములగు తిరుపతి, కాళహస్తి, శ్రీశైలము మొదలగువాని యందలి దేవాలయములను మంచిస్థితియందుంచి వాని పోషణకై అనేక గ్రామములను దానము చేసెను. దేవాలయము లనేకములకు ద్వార గోపురములను కట్టించెను. నేర్పరులగు శిల్పులను రప్పించి విజయనగర మందనేక దేవాలయములను, రథములను, శిలా విగ్రహములను నిర్మించెను. విఠలస్వామి దేవాలయము, నరసింహస్వామి విగ్రహము, అంతఃపురగోడల మీద చిత్రింపబడిన రామాయణకథ - వీనిలో పేర్కొనదగియున్నవి. కృష్ణరాయలు కవిత్వము చెప్పుటయే గాక ఆంధ్ర, ద్రావిడ, కర్ణాటక కవుల ననేకులను పోషించెను. ప్రాచీనకాలమునాటి విక్రమాదిత్య, భోజమహారాజులను మించినవాడను ప్రసిద్ధి నితడు సంపాదించెను.

పాలన విధానములోని లోపములు :- హిందూ చక్రవర్తులందరివలె కృష్ణదేవరాయలు సనాతనముగ వచ్చుచున్న సంప్రదాయములను బట్టి వెళ్ళినవాడేగాని క్రొత్తమార్పులను చేసినవాడు కాడు. రాష్ట్రములోని గవర్నరులు నిరంకుశాధికారము గలవారై తమతమ సేనలతో ఇష్టమువచ్చినట్లు ప్రవర్తించుచుండిరి. సామ్రాజ్యము యొక్క స్థిరత్వమంతయు వారిపైననే ఆధారపడియుండెను. సైన్యములను తర్ఫీదు చేయుట యందు పోర్చుగీసువారి నుండియు, తురకల నుండియు, పారశీకుల నుండియు నేర్చుకొనవలసిన విషయము లనేకములుండినను వానిని నేర్పుట కెట్టి ఏర్పాటులు రాయలవారు చేయరైరి. ప్రజలపై విధింపబడిన పన్ను లధికముగనుండెను. ఎవరో కొందరు ప్రముఖులు, గవర్నరులు, ఉద్యోగస్థులు ధనవంతులై యుండిరి. గాని జన సామాన్యము దరిద్ర మనుభవించుచుండెను. భావిపురోభివృద్ధికి కావలసిన మార్పులను చేసికొనుట యందు తగిన ఉత్సాహము చూపకపోవుట చేత తక్కిన సామ్రాజ్యములవలె విజయనగర సామ్రాజ్యము కూడ విచ్ఛిన్నము కావలసివచ్చెను.

## 3. దక్కనులోని మహమ్మదీయ రాజ్యములు

బహమనీరాజ్యము ముక్కలగుట :- ఆకాలపు తక్కిన రాజ్యముల వలెనే బహమనీ రాజ్యముకూడ కొంతకాలమునకు ముక్కలుగ చీలిపోయెను. సుల్తానులు భోగపరాయణులగుట చేతను, రాష్ట్రపు గవర్నరులు స్వలాభపరులగుట చేతను, మహమ్మదీయులలో స్వదేశీయులు, విదేశీయులు అను భేదములు బయలుదేరుట చేతను ఈ చీలిక తప్పదయ్యెను. దీని మూలమున బీదరు, బీరారు, అహమదునగరము, గోలకొండ, బిజాపురమను ఐదు రాజ్యములు స్థాపితములయ్యెను.

బీదరు:- బీదరు పట్టణము బహమనీరాజ్యమునకు రాజధాని. అఖరు

సుల్తానులవద్ద మంత్రిగ నుండినవాడు క్రీ. వె. 1526లో స్వతంత్రుడై సింహాసనమునెక్కెను. ఇతని వంశమువారు క్రీ. వె. 1609 వరకు రాజ్యముచేసిరి. వీరిని గురించి తెలిసికొనదగిన విశేషములేమియు లేవు. క్రీ. వె. 1609లో బిజాపూరు సుల్తాను బీదరును జయించి వశపరచుకొనెను.

బీరారు :- బహమనీ రాజ్యమునుండి చీలిపోయిన రాష్ట్రములలో నిదియే మొదటిది. ఇమాద్ షా అనువాడు క్రీ. వె 1484లో ఈ రాజ్యమును స్థాపించెను. ఇతడు కర్ణాటకము నుండి వచ్చిన హిందువు; మహమ్మదీయ మతమును స్వీకరించి ముందుకు వచ్చినవాడు. క్రీ. వె. 1574లో ఈ రాజ్యము అహమ్మదు నగరమందు కలసిపోయెను.

అహమ్మదునగరము :- బీదురులో స్వదేశీయ మహమ్మదీయులకు నాయకుడైన నైజాముల్ ముల్క్‌భారీ అనువాడు ఈ రాజ్యమును క్రీ. వె. 1498లో స్థాపించెను. దీనిని పాలించిన సుల్తానులలో కొందరు విజయనగర చక్రవర్తుల సహాయమును సంపాదించి బిజాపూరుతో యుద్ధముచేసిరి. క్రీ.వె. 1600లో మొగలులు ఈ రాజ్యమును వశపరచుకొనిరి.

గోలకొండ :- ఈ రాజ్యమును క్రీ.వె. 1518లో కుతుబుల్ ముల్కు అనువాడు స్థాపించెను. ఇతడు తెలంగాణమునకు గవర్నరుగ నుండినవాడు. తాలికోట యుద్ధమునకు పూర్వము ఈ రాజ్యమును గురించి తెలిసికొనదగు విశేషములు లేవు.

బిజాపురము:- దక్కనులోని మహమ్మదీయ రాజ్యములలో మిక్కిలి ప్రఖ్యాతిగాంచినది బిజాపుర రాజ్యము. దీనిని క్రీ. వె. 1489లో యూసఫ్ ఆదిల్ షా అనువాడు స్థాపించెను. ఇతడు కాన్‌స్టాంటినోపిల్ సుల్తాను యొక్క కుమారుడు. అన్న సింహాసన మెక్కి, తమ్ములనందరిని చంపవలయునని ఆజ్ఞాపించగా, తల్లియొక్క ఉపాయముచే చావును తప్పించుకొని, ఒక వర్తకునితోకూడ పర్షియా దేశమునకు వచ్చి, విద్యాభ్యాసముచేసి, అకాలపు విదేశీయ మహమ్మదీయులనేకులవలె ఉద్యోగమునకై బీదరు పట్టణమునకు వచ్చెను. మహమ్మదు గవాన్ మంత్రి ఇతని శక్తి సామర్థ్యములకు మెచ్చి ఉద్యోగమిచ్చెను. కొంతకాలమున కొక సేన కధిపతియై సుల్తానులు బలహీనులగుట చూచి, క్రీ. వె. 1489లో బిజాపురమున స్వతంత్ర రాజ్యమును స్థాపించుకొనెను.

యూసఫ్ ఆదిల్ షా (1489 - 1510) :- ఇతడు మిక్కిలి సమర్థుడు. ఇతని శత్రువులకు సహాయము చేయుటకై వచ్చిన విజయనగర సైన్యములను ఇతడోడించెను; తక్కిన శత్రుసైన్యములనుకూడ ఇతడు నాశనముచేసి, తన రాజ్యమును నిలబెట్టుకొనెను. ఇతనిది షియ్యామతము; దాని యందెక్కువ గౌరవమును చూపుచు సున్నీల నితడు

నిరాదరించుచుండెను. అందుచేత వారు కలహించిరి. అప్పుడు రెండు మతములను సమానముగ నాదరించుట కంగీకరించెను. ఇతడొక మహారాష్ట్ర స్త్రీని వివాహమాడి, హిందువుల యందుకూడ కొంచెము మర్యాదగ ప్రవర్తించి వారికి కొన్ని గొప్ప ఉద్యోగము లిచ్చెను. క్రీ.వె. 1510లో పోర్చుగీసు వారి వశమందున్న గోవా పట్టణము నితడు తీసికొనెను. కాని ఇతనికి తర్వాత రాజ్యమునకు వచ్చినవారి కాలములో పోర్చుగీసువారు దానిని తిరిగి జయించిరి.

**తర్వాత వచ్చిన సుల్తానులు** :-ఇతని కుమారుడగు ఇస్మాయిల్ షా కృష్ణ దేవరాయల సమకాలికుడు; అతనితో అనేక యుద్ధములను చేసినవాడు. తర్వాత రాజ్యమునకు వచ్చిన ఇబ్రహీం ఆదిల్ షా సున్నీ మతమును రాజమతముగ నంగీకరించి, విదేశీయ మహమ్మదీయులను ఉద్యోగములనుండి తొలగించెను. వీరిలో కొందరు విజయనగర రాజుల వద్ద చేరిరి. ఇతడొక పర్యాయము విజయనగరమునకు వెళ్ళి అందాకాలమందున్న రెండు పక్షములలో ఒకపక్షపు నాయకునికి సహాయము చేసెను. రామరాజు ఆ కుట్రను గ్రహించి విజయనగరము నుండి ఇతనిని పంపివేసెను. ఇతడుకూడ రివిన్యూ శాఖయందు హిందువులకు కొన్ని గొప్ప యుద్యోగములిచ్చి, మహారాష్ట్ర భాషలో కొన్ని రాజకీయ వ్యవహారములను జరుపుచుండెను. ఇతని తర్వాత రాజ్యమునకు వచ్చిన ఆలీఆదిల్ షా షియ్యామతమును రాజమతముగ స్థాపించెను. క్రీ.వె. 1558లో విజయనగర చక్రవర్తి యొక్క సహాయముతో అహమ్మదునగరముపై దండెత్తెను. ఆ సమయమున హిందూసైనికు లనేక దుండగములను చేసి, మసీదులను నాశనముగావించి రక్కసులవలె ప్రవర్తించిరి. అందుపైన అతని కాగ్రహము కలిగి, హిందూరాజ్య వినాశమునకు మార్గము వెదకునట్లు చేసెను. దీనికి ఫలితముగ తక్కిన మహమ్మదీయ సుల్తాను లితనితో కలియుటయు, తాళికోట యుద్ధమున విజయ నగరమును ఓడించుటయు సంభవించెను. ఆలీ ఆదిల్ షా క్రీ. వె. 1579లో మృతిజెందెను. అటు తర్వాత రాజ్యమునకు వచ్చిన సుల్తానుల చరిత్ర మొగలు చక్రవర్తుల చరిత్రముతో సంబంధించియున్నది. బిజాపురపు కోటయు, అందులోని మసీదులు, గోరీలపైని కట్టడములు చాల ప్రశస్తములుగ నున్నవి.

## 4. తాలికోట యుద్ధము

**అచ్యుతరాయలు (1530-1542)** :- కృష్ణదేవరాయల తర్వాత అతని తమ్ముడగు అచ్యుతరాయలు రాజ్యమునకు వచ్చి క్రీ. వె. 1542 వరకు పాలించెను. కాని ఇతడు మిక్కిలి అసమర్థుడు; పౌరుషములేనివాడు; రాజ్యమునంతను బావమరదుల అధీనముచేసి వారి చేతిలోని బొమ్మవలె నుండెను. అప్పుడు విజయ నగరములో

రెండు కక్షలు బయలుదేరెను. ఒక కక్షవారు అచ్యుతరాయల నభిమానించిరి. రెండవ కక్షవారికి కృష్ణదేవరాయల అల్లుండ్లగు రామరాజు, తిరుమలరాజు నాయకులైరి. ఈ రెండు పక్షములవారికి వాదప్రతివాదములు జరుగచుండ అచ్యుతరాయలు చనిపోయెను. అప్పుడు రామరాజు బలవంతుడై ప్రతిపక్షమువారి నోడించి సదాశివరాయనికి పట్టముగట్టెను.

**సదాశివరాయలు (1542- 1568) :-** పేరునకు సదాశివరాయలు చక్రవర్తిగాని నిజముగ సామ్రాజ్యమును పాలించినవాడు రామరాజే. రామరాజు అధికారమునకు వచ్చునప్పటికి దక్కనునందు ఐదు మహమ్మదీయ రాజ్యము లుండెను. వీరిలో వీరికి పరస్పర కలహములు సంభవించుచుండెను. ఆ కారణముచేత వీరిలో కొందరు రామరాజు సహాయమును సంపాదించి తక్కినవారితో యుద్ధముచేసి వారి నోడించుచుండిరి. రామరాజు ఒకరిపక్షమే అవలంబింపక, సమయమును బట్టి ఒకప్పుడు బిజాపుర సుల్తానులతోడను, మరియొకప్పుడు గోలకొండ సుల్తానులతోడను, ఇంకొకప్పుడు అహమదునగర సుల్తానుల తోడను చేరుచుండెను. దీని మూలమున విజయనగర సామ్రాజ్యము యొక్క అధికారమును, ప్రాధాన్యమును హెచ్చగుచు వచ్చెను.

**రామరాజుయొక్క సంకుచిత దృష్టి :-** రానురాను రామరాజు మిక్కిలి గర్వించినవాడయ్యెను. సుల్తానుల సహాయార్థమై అతడు పంపిన సైన్యములు మసీదులను కూలద్రోసి, ఖురాను గ్రంథములను చింపిపారవేసి, స్త్రీలను పరాభవించి, రాక్షసకృత్యము లనేకములను గావించుచుండిరి. వారివద్ద నుండి వచ్చిన రాయబారులను అతడు తగురీతిని మర్యాద చేయుట మానెను. అందుచేత సుల్తానులు తమలో తాము ద్వేషించుకొనుటచేత రామరాజు తమ్ము నింత పరాభవింపగలిగెనని గ్రహించి, తామందరు కలసి విజయనగర సామ్రాజ్యమును నాశనముచేయ తీర్మానించు కొనిరి. అది మొదలు వారు రహస్యముగ సైన్యములను తయారుచేసి, వాని నన్నిటిని చేర్చుకొని 1565లో కృష్ణానదీ తీరమున శిబిర మేర్పరచుకొనిరి.

**తాలికోట యుద్ధము:-** రామరాజు ఈసమాచారము తెలియగనే సైన్య సన్నాహముచేసి,కృష్ణానది ఈవలిగట్టుచేరి శత్రువులు నదిని దాటి రాకుండ చాలరోజుల వరకు అడ్డెను. కాని వారెట్లో దాటి అతని సైన్యములపై బడిరి. అప్పుడు రెండుపక్షములవారికి అతిఘోరమగు యుద్ధము జరిగెను. కొంతకాలమువరకు హిందువులకు జయమువచ్చునట్లుగపడెను. కాని తుదకు మహమ్మదీయులకే జయము లభించెను. రామరాజు శత్రువులచేతిలో బడెను. వారతని శిరస్సును ఛేదించిరి. విజయనగర సైనికులు చెల్లాచెదరై పారిపోయిరి. వారిని వెంటనంటి చేతికిచిక్కిన వారినందరిని శత్రువులు చంపిరి. అంతటితో ఊరకుండక వారి సైన్యములు విజయనగరముపై బడెను.

విజయనగర వినాశము :- సైన్యములన్నియు తాలికోట యుద్ధమందు నష్టమగుటచేత రాజధానిని రక్షించుట కెవ్వరు లేకపోయిరి. తిరుమలరాయలు ఎట్లో తప్పించుకొని విజయనగరమునకు వచ్చి, సదాశివరాయలను వెంటబెట్టుకొని పెనుగొండకు పారిపోయెను. రెండు శతాబ్దములనుండి సమస్త భోగభాగ్యములతో తులతూగుచున్న పట్టణము అనాధ యయ్యెను. మహమ్మదీయులు పురప్రవేశము చేసి ఇష్టము వచ్చినట్లు దోచిరి. అంతటితో నిలువక, ఆరుమాసముల కాల మచట నుండి, తమ చేతనైనంతవరకు పట్టణములోని భవనములను, దేవాలయములను, విగ్రహములను నాశము చేసిరి. లక్షల కొలది ప్రజలతో కలియుగ వైకుంఠమువలే నుండిన నగరము శ్మశానవాటికగ మారిపోయెను.

**తాలికోట యుద్ధఫలితములు :** - ఇంతటితో విజయనగర ప్రభ అస్తమించెను. కాని దీని మూలమున మహమ్మదీయుల రాజ్యములకు స్థిరమగు లాభము కలుగలేదు. విజయనగర సామ్రాజ్యమున్నంతవరకు సుల్తానులు కొంతవరకైన ఐకమత్యము కలిగియుండిరి. ఆ సామ్రాజ్య మదృశ్యమైన వెంటనే వారు యథాప్రకార మొకరితో నొకరు యుద్ధము చేసికొనుచు, తమ బలమునంతను కోల్పోయి తుదకు మొగలులకు వశమయిరి. తాలికోట యుద్ధము వలన దక్షిణ ఇండియా యందు అరాజకము ప్రబలెను. వ్యాపారమున కపరిమితమగు నష్టము కలిగెను. దక్షిణదేశమందుకూడ మహమ్మదీయుల ఆధిక్యము వ్యాపించుట కవకావశ మేర్పడెను.

## ప్రశ్నలు

1. విజయనగరమును స్థాపించినవారెవరు ? వారి యుద్దేశములెవ్వి? అవి ఎంతవరకు నెరవేరెను ?
2. రెండవ దేవరాయలు, సాళువ నరసింహుడు విజయనగర సామ్రాజ్యమున కెట్టి సేవ జేసిరి? కృష్ణదేవరాయల విజయములను వివరింపుము ? అతని పరిపాలన విశేషముల నైదింటిని పేర్కొనుము. అతని పరిపాలనమందు లోపములుండెనా? అవి ఎట్టివి?
3. బహమనీ రాజ్యము చీలిపోవుటకు కారణము లేమి ? ఆ చీలిక వలన ఏర్పడిన రాజ్యము లెవ్వి ?
4. యూసఫ్ ఆదిల్‌షా ఎవడు ? ఇతని గొప్పతనమును సూచించు విశేషములను నాల్గింటిని పేర్కొనుము ?
5. రామరాజు విజయనగర సామ్రాజ్య ప్రాధాన్యమును ఎట్లు వృద్ధిజేసెను ? మహమ్మదీయ సుల్తాను లతని విరోధము వహించుటకు కారణములేవి ?
6. తాలికోట యుద్ధము ఎవరెవరికి జరిగెను ? దాని ఫలితము లెట్టివి ?

# రెండవ భాగము

## తొమ్మిదవ ప్రకరణము

## మొగలాయీ సామ్రాజ్యము

**విషయములు :** - బాబరు, హుమాయూను, షర్షా ; అక్బరు, అతని విజయములు, అతని రాజనీతి, అతని పరిపాలనా విధానము, జహంగీరు, షాజహాను, దక్కను విషయమై మొగలాయీ లనుసరించిన మార్గము, ఔరంగజేబు, అతని రాజనీతి: శివాజీ, మహారాష్ట్ర రాజ్యోత్పత్తి; దక్కనులోని యుద్ధములు, మొగలాయీ సామ్రాజ్యక్షయము, కడపటి మొగలాయీ చక్రవర్తులు, పీష్వాలు, మహారాష్ట్రుల సామ్రాజ్యవ్యాప్తి, పానిపట్టు యుద్ధము.

### 1. బాబరు

బాబరు :- హిందూదేశమున మొగలాయీ సామ్రాజ్యమును స్థాపించినవాడు బాబరు . అతడు పదునాల్గవ శతాబ్దాంతమందు మన దేశముపై దండెత్తి వచ్చిన తైమూరు యొక్క వంశమున పుట్టినవాడు. జాతిని బట్టి బాబరు తురక; కాని, ఆ కాలమున మధ్య ఆసియానుండి వచ్చినవారినందరిని మొగలాయీలని పిలుచుటచేత బాబరు మొగలాయీ జాతి వాడనియు, అతడు స్థాపించిన సామ్రాజ్యము మొగలాయీ సామ్రాజ్యమనియు వ్యవహారములోనికి వచ్చెను. మధ్య ఆసియాలోని ఫర్గానా రాజ్యము బాబరుకు పిత్రార్జితము క్రీ. వె. 1504 లో నతడీ రాజ్యమును కోల్పోయి, కాబూలు



బాబరు

రాజ్యమును జయించెను. భీమ బలుడును, రణకోవిదుడును, అపరిమితమగు సామ్రాజ్యకాంక్ష గలవాడును అగు బాబరుకు చిన్నదియును, సారహీనమైనదియునగు కాబూలు రాజ్యము తృప్తి కలిగింప లేకుండెను. హిందూదేశము విశాలమైనది; సమస్త సిరిసంపదలతో కూడినది; బలాఢ్యులగు మధ్య ఆసియా యోధులచే సులభము

గజయింపబడినది; ఒకప్పుడు కొంత వరకు తైమూరు సామ్రాజ్యంలో కలిసి యుండినది. ఈ కారణములచేత బాబరు హిందూదేశమును జయించుటకు నిశ్చయించుకొనెను.

**హిందూదేశపు పరిస్థితులు:** - అప్పటి హిందూదేశపు పరిస్థితులుకూడ అతని కెంతో అనుకూలించియుండెను. దేశమందంతట నొకే సామ్రాజ్యముండుటకు బదులు పరస్పరవైషమ్యములతోకూడిన చిన్న చిన్న రాజ్యములనేకములుండెను. వీటిలో కొన్ని ఢిల్లీ, బంగాళము, మాళవము, గుజరాతము లోనగునవి. మహమ్మదీయ రాజ్యములు, మరికొన్ని రాజపుత్ర స్థానములోనివి, హిందూ రాజ్యములు, మహమ్మదీయ రాజ్యములలో నొకటియగు ఢిల్లీ రాజ్యము పూర్వపు వైభవమును కోల్పోయి అసమర్థుడును, ప్రముఖులగు ఆఫ్గన్ నాయకుల యభిమానమునకు దూరుడునగు ఇబ్రహీంలోడీ వశమందుండెను. మీవాడు రాజ్యమును పాలించుచుండిన సంగ్రామ సింహుడు చుట్టుపట్లనున్న రాజ్యములను వశపరుచుకొని హిందూసామ్రాజ్య పునఃప్రతిష్ఠాపనకై ప్రయత్నించుచుండెను. ఇట్టి సందర్భములో భరతఖండమును జయించుట సులభమని బాబరుకు తోచెను. క్రీ.వె. 1525 లో ఇబ్రహీంలోడీపై తిరుగబడిన ప్రముఖులు కొందరు అతని సహాయమును కోరిరి. తగిన సమయమునకై నిరీక్షించుచుండిన బాబరు వారి కోరికను మన్నించి, పంజాబుపై దండెత్తి లాహోరు మొదలగు పట్టణములను పట్టుకొని ఢిల్లీకి ప్రయాణమయ్యెను.

**పానిపట్టు యుద్ధము (1526):** - ఇబ్రహీంలోడీ లక్ష సైన్యముతో పానిపట్టువద్ద బాబరు నెదుర్కొనెను. బాబరు వద్ద పండ్రెండు వేల సైన్యము మాత్రమే యుండెను. కాని అందులోని వారు దృఢకాయులు; బాగుగ తర్ఫీదైనవారు; వ్యూహముల నేర్పరచుటయందును, సైనికులను నడుపుటయందును బాబరుకుగల నేర్పు అసమానము. ఇదిగాక, అతని సైన్యమందు తుపాకుల నుపయోగింపగల యోధులనేకులుండిరి. అప్పటివరకు హిందూదేశపు సైన్యములలో తుపాకులే లేవు. ఈ కారణముల చేత పానిపట్టు యుద్ధమున బాబరుకు పరిపూర్ణ జయము లభించెను. ఇబ్రహీం లోడి ప్రాణములు కోల్పోయెను. కొన్ని రోజులలో ఢిల్లీ, ఆగ్రా పట్టణములును, వానియందుండిన ధనరాసులును బాబరు వశమయ్యెను. దీనిమూలమున మొగలాయీ సామ్రాజ్యమునకు పునాదు లేర్పడెను.

**కాణ్వాహ యుద్ధము (1527):** - ఇంతటితో బాబరు యొక్క కష్టములు తొలుగలేదు. చలిదేశమగు కాబూలునుండి వచ్చిన మొగలాయీ ప్రముఖులనేకులు హిందూదేశపు వేడిని భరింపలేక వెనుకకు వెళ్ళిపోవ సమకట్టిరి. అట్టివారికి నయ

భయములతో బుద్ధి చెప్పి, జాగీరులిచ్చి, ధనమును పంచిపెట్టి బాబరేదో విధమున వారిని హిందూదేశములో నుండునట్లు చేసెను. తైమూరువలె దేశమును దోచుకొని పోవుట మాత్రమేగాక, శాశ్వతముగ సామ్రాజ్యమును స్థాపింప బాబరు సంకల్పించెనని తెలియగనే సంగ్రామసింహుడు సైన్యముల నన్నిటిని గూర్చుకొని అనేక రాజుల సహాయముతో బాబరు నెదుర్కొనుటకు వచ్చెను. రాజపుత్ర నాయకుని ధైర్య సాహస



ములను వినిన మొగలాయీ సైనికులతనితో యుద్ధము చేయభయపడిరి. బాబరు వారికి ధైర్యము చెప్పి కాణ్వాహా అనే ప్రదేశమున వారిచేత యుద్ధము చేయించెను. సంగ్రామసింహుడు అపజయముగాంచి పారిపోయెను; హిందూ సామ్రాజ్యమును పునరుద్ధరించుటకై అతడు చేయుచుండిన ప్రయత్నములు విఫలములము లయ్యెను. దానికి బదులు మొగలాయీ సామ్రాజ్యమునకు కొంత స్థిరత్వము కలిగెను.

గోగ్రా యుద్ధము (1529) :- కాణ్వాహా యుద్ధము తర్వాత రాజపుత్ర దుర్గములలో బలిష్ఠమని ప్రఖ్యాతిగాంచిన చందరి దుర్గమును ముట్టడించి బాబరు వశపరచుకొనెను. ఇంతలో ఇబ్రహీంలోడి యొక్క బంధువులును, అనుచరులును ఆగు ఆఫ్గన్ ప్రముఖులనేకులు తూర్పు రాష్ట్రములకు పారిపోయి, బంగాళమును పాలించుచుండిన సుల్తానుయొక్క సహాయమును సంపాదించి, బాబరు కనేకములగు నిబ్బందులను కలిగించుచుండిరి. బాబరు వారిపైకి వెళ్ళి, మొట్ట మొదట కనోజివద్దను (1528), తర్వాత గోగ్రా నదీతీరమందును (1529) వారి నోడించెను. అంతటితో బీహారంతయు నతని స్వాధీనమయ్యెను. బంగాళ సుల్తాను కూడా నతనితో సందిజేసికొని శత్రువులకు సహాయము చేయకుండట కంగీకరించెను. ఈ విధముగ మొగలాయీ సామ్రాజ్యమును స్థాపించి క్రీ.వె. 1530 లో బాబరు మృతిజెందెను.

## 2. హుమాయూను

హుమాయూనుయొక్క చిక్కులు :- బాబరు తర్వాత అతని పెద్ద కుమారుడగు హుమాయూను చక్రవర్తి అయ్యెను. కాని తండ్రి సంపాదించిన రాజ్యమునతడు నిలుపు కొనలేకపోయెను. దీని కనేక కారణములు కలవు. బాబరు దేశములో చాల భాగమును జయించెనేగాని, రాజ్యమును చక్కగ పాలించుటకును, నిలుపుకొనుటకును కావలసిన కట్టుదిట్టములను చేయలేదు; అట్టి పని కతనికి వ్యవధి లేకపోయెను. ఇంతే గాక, తన చేతికి జిక్కిన ధనరాసులను కష్టకాల మందుపయోగ పడునట్లతడు దాచికొనక, వెంటనే అనుచరు లందరికి పంచిపెట్టెను. ఈ లోపముల వలని ఫలితములను హుమాయూను అనుభవింపవలసి వచ్చెను. హుమాయూను పట్టుదలయు, మన స్థైర్యము



హుమాయూను

నులేనివాడు; ఏపనిని గాని పూర్తియగువరకు చేయువాడు కాడు; తొందరగ చేయవలసిన రాచ కార్యము లున్నప్పుడు కూడ సోమరియై విలాసము లందు ప్రొద్దుపుచ్చుట అతనికి స్వభావము. దీనికి తోడు రాజ్యము నంతను తన స్వాధీన మందుంచు కొనక, కొన్ని ముఖ్యములైన రాష్ట్రములను కాబూలు, పంజాబు అతడు తమ్ముల వశము చేసెను. వారు అన్నయందు కృతజ్ఞత చూపుటకు మారు కృతఘ్నులై,అతని వినాశమునే కోరువారైరి. బీహారులోని ఆఫ్గనులకు షర్ఖానుడను ప్రఖ్యాత పురుషుడునాయకుడై పానిపట్టు యుద్ధము మూలమున అంతరించిన ఆఫ్గన్ సామ్రాజ్యమును తిరిగి స్థాపించుటకు ప్రయత్నించు చుండెను. గుజరాతమును పాలించుచుండిన బహదూరుషా ప్రబలుడై చుట్టుపట్ల నున్న రాజ్యములను వశపరుచుకొని, హుమాయూను యెడల విరోధము వహించిన వారిలో ననేకులకు సహాయము చేయు చుండెను.

**బహదూరు షా తోయుద్ధము** :- ఇట్టి పరిస్థితులలో నూరకుండుట యుక్తము కాదని క్రీ. వె. 1534లో హుమాయూను బహదూరుషాపైకి దండెత్తివెళ్ళి మండసూరు యుద్ధమున (1535) నతని నోడించి, అతని స్వాధీనమందున్న మండు, చంపనీరు దుర్గములను పట్టుకొని క్రీ. వె. 1536 లో గుజరాతములోని చాలాభాగమును జయించెను. కాని జయించిన దేశమును పూర్తిగ స్వాధీనము చేసుకొనకయే అతడు వెనుకకు మరలెను. అందుచేత నతని విజయములన్నియు వ్యర్థములయ్యెను.

**షర్ఖానుతో యుద్ధము** :- హుమాయూను గుజరాతమునం దున్నప్పుడు షర్షాన్ అను ఆఫ్గన్ నాయకుడు బీహారులో ప్రబలుడై దక్షిణ భాగమునంతను జయించి వశపరచుకొని, బంగాళా రాజ్యముపై దండెత్తి రాజధానిని ప్రవేశించి, అపరిమితమగు ధనమును సంగ్రహించెను. ఈ వార్తను విని హుమాయూను బంగాళముపై దండెత్తెను. షర్షాను డతని నెదిరింపక, నిరాటంకముగ నతనిని బంగాళమును ప్రవేశించునట్లుచేసి, అతడు వెనుకకు మరిలి వచ్చు చుండినపుడు చౌసా అను ప్రదేశములో నతని నడ్డగించెను. అచట జరిగిన యుద్ధమందు (1539) హుమాయూను అపజయముగాంచి, అతికష్టము మీద ఆగ్రాకు పారిపోయెను. షర్ఖాను, షర్షా అను బిరుదు నామముతో చక్రవర్తిత్వమును వహించెను. హుమాయూను ఎట్లో కొంతసైన్యమును చేర్చుకొని కనోజి వద్ద (1540) షర్షాను ఎదుర్కొనెను ; కాని ఈ యుద్ధమందుకూడ నతడోడిపోయెను. అంతటితో నతడు రాజ్యభ్రష్టుడై దేశదిమ్మరి కావలసివచ్చెను.

# 3. షర్షా

**షర్షాయొక్క విజయములు :-** కనోజి యుద్ధము జరిగిన పిమ్మట షర్షాహుమాయూనును వెంటనంటి ఆగ్రా ఢిల్లీలను వశపరచుకొని, అచట నుండి పంజాబు పైకివెళ్లి ఆ రాష్ట్రమునుకూడ స్వాధీనపరచు కొనెను. తర్వాత నతడు బంగాళము లోని అల్లరుల నణచి తన యధి కారము నచట నెలకొల్పెను. అటుపిమ్మట మాళవము, సింధు రాష్ట్రము అతనికి లోబడెను. తదనంతర మతడు రాజపుత్ర స్థానముపై దండెత్తి, మార్వారు రాజు నోడించి, చిత్తూరు కోటను పట్టుకొని రాజపుత్రుల మూలమున తన రాజ్యమునకు ప్రమాదముకలుగకుండ చూచెను. తర్వాత నతడు బటిష్ఠమగు కలింజరు కోటను ముట్టడించి వశపరచు కొనెను; కాని ముట్టడి సమయమున తుపాకి మందు ప్రేలుట చేత గొప్ప గాయములు తగిలి, దుర్గము స్వాధీనమైన కొద్ది రోజులలో ప్రాణములను గోల్పోయెను (1545). అప్పటికి కాశ్మీరముతప్ప హిమాలయ, వింధ్య పర్వతములకుమధ్యనున్న హిందూ స్థాన మంతయు నతని సామ్రాజ్యములోచేరి యుండెను.



షర్షా

**షర్షాయొక్క పరిపాలనము :-** మొగలాయీల నోడించి, ఆఫ్గన్ సామ్రాజ్యమును పునరుద్ధరించిన షర్షాహిందూదేశమును పాలించిన ప్రఖ్యాత మహమ్మదీయ చక్రవర్తులలో నొక్కడని చెప్పదగియున్నాడు. యుద్ధములు చేయుట యందతనికి గల ప్రజ్ఞ కంటె పరిపాలనమందతడు చూపిన దక్షతయే యీ ప్రఖ్యాతికి కారణము. తాను మహమ్మదీయుడైనను, రాజకీయ విషయములందు మత సంప్రదాయములను బట్టి ప్రవర్తించుట ధర్మము కాదని గ్రహించి హిందువుల యెడ సహనమును, ఆదరణను చూపెను. ఇబ్రహీంలోడీ రాజ్యమును కోల్పోవుటకును, బాబరు రాజ్యము సంపాదించుటకును లోడీ సుల్తానుల క్రింద పనిచేయుచుండిన ఆఫ్గన్ ప్రముఖుల స్వార్థపరత్వము, పరస్పర వైషమ్యము, రాజద్వేషము కారణములని గ్రహించి, అట్టి ప్రముఖులనందరిని క్రమమార్గమందుంచుటకు కావలసిన ఏర్పాటులను చేసెను. రాజకీయ వ్యవహారములకు సంబంధించిన వివరములన్నిటిని స్వయముగ

చూచుకొనుచు, న్యాయవిరుద్ధముగ నడచిన ఉద్యోగస్థులను కఠినముగ శిక్షించెను. ఉద్యోగస్థులు బలవంతులై తన్నెదిరింపకుండుటకై రాజ్యమును అనేకములైన చిన్న చిన్న పరగణాలుగ విభజించెను. పరిపాలనను నడుపుటకై జాగీర్దారులను జమీందారులను, నియమింపక, తనకు లోబడి, తన యాజ్ఞలను శిరసావహించి, తానిచ్చిన జీతములను పుచ్చుకొను ఉద్యోగస్థుల నేర్పరచెను. ప్రతిరైతు యొక్క పొలమును కొలచి, సారమును బట్టి భూముల తరమును నిర్ణయించి, పంటల విలువను బట్టి రైతులియ్యలసిన శిస్తుల నేర్పాటు చేసెను. శిస్తులు ధనరూపముగ నిచ్చునట్లును, శిస్తులను వసూలు చేయు అధికారము మధ్య వర్తులగు జమీందారులకు గాక చక్రవర్తిచే నియమింపబడిన ఉద్యోగస్థులకుండ వలెననియు చట్టములను చేసెను. దేశమందనేక దుర్గములను కట్టెను. సైన్యములను కూర్చుటయందదివరకు ప్రముఖులు చేయుచుండిన దురాచారములను మాన్పెను. అల్పులు, అధికులు అనే వివక్షలేక నిష్పక్షపాతముగ న్యాయాన్యాయములను విచారించెను, గ్రామములందుగాని, పరగణాలయందుగాని జరుగు దొంగతనములకు ఉద్యోగస్థులు పూచీదార్లనియు, దొంగలను పట్టుకొనలేనపుడు వారు నష్టపరిహారము చేయవలెననియు శాసించెను. ప్రయాణీకుల సౌకర్యమునకై విశాలములగు రోడ్లను నిర్మించి, ఇరుప్రక్కల వృక్షములను పెంచి, అచ్చటచ్చట సత్రములను కట్టి, హిందువులకును, మహమ్మదీయులకును వారి వారి ఆచారములకు తగినట్టి వసతులను కల్పించెను. అనేక విషయములలో అక్బరు చక్రవర్తి షర్షా సూచించిన మార్గమునుబట్టి నడచుకొనెను.

**షర్షా సంతతివారు** :- ఇంతటి గొప్ప చక్రవర్తి అయిదేండ్లకంటె నెక్కువగ రాజ్యము చేయలేదు. అతనికి పిమ్మట నతని రెండవ కుమారుడు రాజ్యమునకు వచ్చి క్రీ . వె. 1554 వరకు దేశమును పాలించెను. కాని ప్రముఖులలో కొందరతనిపై ద్వేషమువహించుటచేత వారిని శిక్షించుట యందును, వారి మూలమున కలిగిన అల్లరుల నణచుట యందును అతడు కాలము గడపవలసినవాడయ్యెను. అతడు చనిపోయిన తర్వాత సింహాసనమునకై బంధువు లనేకులు పోరాడిరి. ఎవరుగాని సామ్రాజ్యమునంతను వశము చేసికొనలేకపోయిరి. క్రీ. వె. 1555 నాటికి సికందరు షా అనువాడు గంగా సింధు నదుల మధ్యనున్న భాగమునకును, మహమ్మదు షా అనువాడు తూర్పు రాష్ట్రములకును పరిపాలకులుగ నేర్పడిరి.

**హుమాయూనుని పునరాగమనము:** - క్రీ. వె. 1540లో రాజ్యమును కోల్పోయిన హుమాయూను అనేక రాష్ట్రములలో తిరుగ వలసిన వాడయ్యెను. అట్లు తిరుగుచు

సింధుదేశములోని అమర్కోటయందుండగా నతని భార్య జగద్విఖ్యాతుడగు అక్బరు కుమారుని కనెను (1542). అచటి నుండి హుమాయూను పారశీకమునకు వెళ్ళి, దేశపు రాజు ఇచ్చిన సైన్యముతో క్రీ. వె . 1545 లో కాందహారు కోటను, కాబూలును జయించి, మరియెక మారొక చిన్న రాజ్యమున కధిపతియై, హిందూదేశమును జయించుటకు తగిన సమయమునకై నిరీక్షించుచుండెను. క్రీ. వె. 1555లో షర్షా సంతతివారి అంతః కలహముల వలన నట్టి సమయ మతనికి లభించెను. వెంటనే అతడు హిందూదేశముపై దండెత్తి, సర్హిందు వద్ద సికందరు షా నోడించి, ఢిల్లీ సింహాసనము నధిష్ఠించెను. కాని ఎంతో కాల మత డీవైభవము ననుభవింపలేదు. ఒక సంవత్సరము పూర్తిగాకముందే అతడు చనిపోయెను (1556). అప్పటికి సింధునదికిని, ఆగ్రాకును మధ్యనున్న ప్రదేశము మాత్రమే అతని యధీనమందుండెను.

## 4. అక్బరు : అతని విజయములు

**పానిపట్టు యుద్ధము (1556)** :- తండ్రి చనిపోయినప్పుడు అక్బరు పంజాబు నందుండెను. అప్పటికతని వయస్సు పదునాలుగు సంవత్సరములు మాత్రమే. తండ్రినుండి అతనికి లభ్యమైన రాజ్యము మిక్కిలి చిన్నది. దానిని గూడ శత్రువులు మ్రింగివేయ జూచుచుండిరి. వారిలోనెల్ల హేమూ అను హిందువు ప్రధానుడు. ఇతడు తూర్పు రాష్ట్రములకు రాజైన మహమ్మదు షా వద్ద మంత్రియై గొప్ప సైన్యములను జేర్చుకొని,ఆగ్రా, ఢిల్లీలను పట్టుకొని అక్బరు పైకి ప్రయాణ మయ్యెను. బాలుడ య్యును అక్బరు ధైర్యమును విడువలేదు. అతని వద్ద అనుభవశాలియు, విశ్వా సార్హుడును అగు బైరంఖానుడు మంత్రిగ నుండెను. ఉభయ పక్షములకు పానిపట్టు వద్ద యుద్ధము జరిగెను (1556); అందు హేమూ ఓడిపోయెను. ఢిల్లీ ఆగ్రా పట్టణములు అక్బరు చేతిలో పడెను. అదివర కతని నెదిరించుటకై పంజాబులో సన్నాహము చేయుచుండిన సికందరు షా కూడ నిప్పుడతనికి లోబడి పోయెను. పానిపట్టు వద్ద గలిగిన విజయముల వలన తండ్రియొక్క రాజ్యము అక్బరు నిలుపుకొనగల వాడయ్యెను.



అక్బరు

సామ్రాజ్య సంపాదనము : - అది మొదలు సుమారు ఏబది సంవత్సరములు అక్బరు రాజ్యపాలనము చేసెను. సింహాసనమునకు వచ్చినప్పుడు పంజాబురాష్ట్ర మొక్కటియే అతని యధీనమందుండెను ; అతడు కాలధర్మ మొందునాటికి ఉత్తర హిందూదేశము మాత్రమేగాక దక్కనులో కొంతభాగమును ఆఫ్గనిస్థాన, బెలూచి స్థానములలో చాలభాగమును అతనికి వశమయ్యెను. అక్బరు కీర్తికి గల కారణములలో




ఇంతటి విశాలమగు సామ్రాజ్యమును సంపాదించుట యొకటి. యుద్ధముల మూలమున పర రాష్ట్రములను జయింపని రాజు రాజను పేరున కర్హుడు కాడనియు,

అట్టివాడు పరరాజులకు చులకనై తనకున్న రాజ్యమును కూడ పోగొట్టుకొనుననియు, అట్టివాని సైన్యములు ఉత్సాహపౌరుషములను కోల్పోయి సులభముగ శత్రువుల వశమగుననియు అతడు నమ్మి, సామ్రాజ్య సంపాదనమునకు ప్రయత్నించెను. చంద్రగుప్తుడు, సముద్రగుప్తుడు మొదలగు మహావీరులవలె నతడు దేశమందతట ఏకచ్ఛత్రాధిపత్యము స్థాపింప నిశ్చయించుకొనెను.

**ఉత్తరహిందూస్థానమును జయించుట (1558 - 1576) :-** బైరంఖానుడు మంత్రిగ నుండిన కాలమందు అక్బరు విజయములు ప్రారంభమయ్యెను. అతడు గొప్ప సైన్యములను పంపి, గ్వాలియర్,అజ్మీరు దుర్గములను సాధించి తూర్పునందున్న జాన్ పూరు రాష్ట్రమును జయించెను. క్రీ. వె. 1560 లో అక్బరతనిని ఉద్యోగమునుండి తొలగించి, సమస్త వ్యవహరములను స్వయముగ చక్కబెట్టుకొనసాగి, క్రీ. వె. 1561 - 1562 లో మాళవ రాష్ట్రమును స్వాధీనపరచుకొనెను. వీరవనితయగు దుర్గావతి మహారాణిచే పాలింపబడుచుండిన గాంద్వానారాజ్యము నతడు క్రీ. వె. 1564 లో హరించెను. ఆమెయు, ఆమె సైనికులును బొందిలో ప్రాణమున్నంతవరకు పోరిరి. గాని లాభము లేదయ్యెను. అప్పటికే అక్బరు కొందరు రాజపుత్ర రాజులతో వివాహసంబంధముల జేసికొని, వారిపై తన అధికారమును స్థాపించెను. కాని, వారందరిలో నగ్రగణ్యుడును, సంగ్రామసింహుని సంతతివాడును అగు చిత్తూరు రాణా మాత్రమిట్టి సంబంధమున కంగీకరింపక అక్బరును తిరస్కరించెను. అందుచేత అక్బరు చిత్తూరు కోటను స్వయముగ ముట్టడించి, ఎనిమిదివేల రాజపుత్ర శూరులను, ముప్పదివేల సైనికులను సంహరించి, కోటను పట్టుకొ నేలమట్టము చేసెను (1568). అప్పటికిని చిత్తూరు రాణా అతనికి వశము కాలేదు. అతనితోడను, అతని కుమారుడు ప్రతాపసింహుని తోడను తుది వరకు అక్బరు యుద్ధము చేయవలసియే యుండెను. కాని చిత్తూరు పడిపోయిన తర్వాత తక్కిన రాజపుత్ర రాజులందరు అక్బరుకు సామంతులైరి. క్రీ .వె. 1569 లో రత్నభోరుకోటయు, కాలంజరు కోటయు అతనికి లభించెను. సింహాసనమునకై పోటీచేయుచున్న వారిలో నొకరు అక్బరు సహాయము కోరగా నతడు క్రీ. వె. 1572లో గుజరాతముపై దండెత్తి, రాజధానియగు అహమదాబాదును, గొప్ప రేవు పట్టణములగు కాంబే, సూరతు పట్టణములను పట్టుకొని, ఆరాష్ట్రమునంతను తన రాజ్యములో చేర్చుకొని, తనపై తిరుగబడిన ప్రముఖులనందరిని అతివేగముగ నణచివేసెను. క్రీ.వె. 1574 లో అక్బరు బీహారును జయించెను ; క్రీ .వె. 1576 లో బంగాళమును వశపరచుకొనెను. ఢిల్లీ సుల్తానులు బంగాళరాజ్యమును జయించుట

కెన్నియో ప్రయత్నములు చేసిరిగాని, అది చాల దూరమందుండుట చేతను, రాష్ట్రమంతయు జలమయమై సైన్యముల రాకపోకలకు సాధ్యము కానిదగుట చేతను వారి ప్రయత్నములు వ్యర్థములగుచు వచ్చెను. ఇందుచేత అక్బరుకు కలిగిన జయము అపూర్వమని చెప్పదగియున్నది. తర్వాత కొన్ని సంవత్సరములకు ఒరిస్సా రాష్ట్రముకూడ అక్బరువశమయ్యెను (1592).

**వాయవ్యరాష్ట్రములను జయించుట : (1580 - 1596) :** - ఉత్తర హిందూస్థానము లోని సామ్రాజ్యముల కెల్లప్పుడు మధ్య అసియాలోనుండి ఆఫ్ఘనిస్థానము మీదుగ హిందు దేశమును ప్రవేశించు యోధుల మూలమున ప్రమాదము సంభవించు చుండెను. దానినుండి తప్పించుకొనుటకు వాయవ్య సరిహద్దులలోని కొండ రాష్ట్రములన్నిటిని జయించి వశపరచుకొనుట తప్ప వేరు మార్గము లేదు. అక్బరు దీనిని గ్రహించి క్రీ. వె. 1585 లో కాబూలును, క్రీ.వె. 1586 లో యూసఫ్‌జీలను, కాశ్మీరమును, క్రీ. వె. 1591 లో సింధు రాష్ట్రమును, తర్వాత నాలుగు సంవత్సరములలో బెలూచిస్థానమును, కాందహారుకోటను జయించెను. ఈ రాష్ట్రము లిది మొదలు సమారు నూట ఏబది సంవత్సరముల కాలము మొగలాయీ సామ్రాజ్యమందు చేరియుండుట చేత, ఆ దిక్కునుండి మొగలాయీ చక్రవర్తుల కెట్టి భయము లేకపోయెను. అందువలన వారు వారి యావచ్ఛక్తిని దక్కను దక్షిణ ఇండియాలను జయించుటయందు వినియోగింపగలిగిరి.

**దక్కను రాజ్యములను జయించుట (1596 - 1601) :** - ఉత్తర భాగమందలి శత్రువుల నణచిన తర్వాత అక్బరు దక్కనులోని రాజ్యములపై బడెను. క్రీ.వె. 1595 లో నతడు అహమ్మదు నగరమును ముట్టడించెను. చాంద్‌బీబీ అను మహాశూరురాలు కోటను రక్షించుట కెంతో ప్రయత్నము చేసెను గాని లాభము లేకపోయెను. క్రీ. వె. 1596లో జరిగిన సంధి వలన బీరారు అక్బరుకు లభించెను ; క్రీ. వె. 1600 లో అహమ్మదు నగర రాజ్యములో చాల భాగము కూడ నతని దయ్యెను. ఆ సమయము ననే అతడు ఖాండిషు రాజ్యముపై దండెత్తి, క్రీ. వె. 1601 లో అసిర్‌ఘర్ దుర్గమును పట్టుకొని రాజ్యమునంతను వశపరచుకొనెను. దక్కనునంతను జయించుటకు కావలసిన ప్రయత్నముల నతడు చేయుచుండెను గాని, కుమారుడగు సలీం తిరుగుబాటు చేత నా ప్రయత్నములను వదలవలసిన వాడయ్యెను. ఈ విజయములన్నిటి వలన ప్రపంచమం దాకాలమున నుండిన సామ్రాజ్యములన్నిటిలో వైశాల్యమందును భోగభాగ్యములందును, పరిపాలనా సౌష్ఠవమందును అక్బరు సామ్రాజ్య మగ్రగణ్య మయ్యెను.

## 5. అక్బరు : అతని రాజనీతి

**అపూర్వమగు రాజనీతి :** - హిందూదేశమును పాలించిన మహమ్మదీయ చక్రవర్తులలో విశాలమగు సామ్రాజ్యమును స్థాపించిన వారెందరో కలరు ; కాని సామ్రాజ్యమును నిలుపుకొనుటకు కావలసిన రాజనీతి ఏదియో తెలిసికొని, దాని ననుసరించి పాలించినవారు ఒక్కరుకూడ లేరైరి. షర్షా కొంతవర కట్టి ప్రయత్నము చేసెను గాని, అతడు చాలకాలము రాజ్యము చేయక పోవుట చేత నా ప్రయత్నము పూర్ణముగ ఫలించలేదు. ప్రజలందరు మహమ్మదీయులుగ నుండు దేశమును పాలింపవలసిన పద్ధతికిని ప్రజలలో నెక్కువ భాగము నాగరికత గాంచిన మహమ్మదీయేతరులుండు దేశమును పాలింపవలసిన పద్ధతికిని భేదమున్నదను విషయమును ఢిల్లీ సుల్తానులు గ్రహింపరైరి. అక్బరు రాజనీతి యందలి అపూర్వ విశేషము ఈ భేదములను గ్రహించుటయే. అతని కీర్తి శాశ్వతముగ నిలబడియుండుట కిదియే కారణము.

**రాజపుత్రులను చేరదీయుట :** - ఈ నీతికి ఫలితముగ నతడు రాజపుత్రులను చేరదీసెను. మొగలాయీలు పరాయి దేశమువారు; వారియొక్కయు, వారి అనుచరులయొక్కయు సంఖ్య చాల తక్కువ. మతమునుబట్టి వారు మహమ్మదీయు లైనను,ఇండియాలో వారినెదిరించినవారు హిందువులకంటె మహమ్మదీయులే ఎక్కువ. బాబరుతో యుద్ధము చేసిన వారిలో ననేకులును, హుమాయూనుని రాజ్య భ్రష్టునిగా జేసినవారును, అక్బరుకు చిక్కులు కలిగించినవారును ఇండియాలోని మహమ్మదీయులే. ఇట్టి సందర్భములో సామ్రాజ్య సంపాదనమునకును, సంరక్షణమునకును మహమ్మదీయు లొక్కరిని మాత్రమే నమ్ముకొనియుండుట తగని కార్యమని అక్బరు నిశ్చయించి, హిందువులందరిలో మహాశూరులను ప్రఖ్యాతిగాంచిన రాజపుత్రుల సఖ్యమును సంపాదించుట లాభకారియనియు, రాజధర్మమనియు నమ్మెను. రాజపుత్రులను రూపుమాపుట సాధ్యము కాని పనియని చరిత్రవల్ల నతనికి స్పష్టమయ్యెను. మొగలాయీ సామ్రాజ్యము మహమ్మదీయ సామ్రాజ్యముగ నుండక, హిందూ మహమ్మదీయ సమ్మేళనముచే నుద్ధరింపదగిన సామ్రాజ్యముగ మారవలెనని అతడు సంకల్పించెను. అతని రాజనీతిలోని సూక్ష్మమును ఆ కాలపు రాజపుత్రులు గ్రహించి, మహమ్మదీయుడని అతనిని నిరసింపక అతని ననుసరింప సిద్ధపడిరి. వారి కన్యకల నతనికిచ్చి వివాహము చేసిరి. అక్బరు వారిని బంధువులవలె మర్యాద జేసి, వారిని తన కొలువులో చేర్చికొని మంత్రులుగను సేనాపతులుగను, రాష్ట్రాధీశులుగను

వారిని నియమించెను. తమ పరిపాలనా శక్తికిని, క్షాత్రమునకును తగిన వినియోగము కలిగినదని వారు సంతోషించి మొగలాయీ సామ్రాజ్యపు పేరుప్రతిష్ఠలకు ఆధారభూతులైరి.

ప్రజలను తండ్రివలె పాలించుట :- తండ్రి తన కుటుంబములోని వారిని సమానముగ రక్షించునట్లు అక్బరు తన రాజ్యములోని ప్రజలనందరిని హిందువులు, మహమ్మదీయులు అను వివక్షలేక సమానముగ నాదరించెను. హిందువులపై నదివరకు ప్రత్యేకముగ విధింపబడిన జిజియా పన్నును, యాత్రికుల పన్నును రద్దు చేసెను; వారికి ఉన్నతోద్యోగముల నిచ్చెను; దేవాలయములు కట్టుకొనుటకును, ఉత్సవములు చేసికొనుటకును వారి కనుజ్ఞ నొసంగెను. సంస్కృతభాషను, సంస్కృత పండితులను ఆదరించెను : హిందూ సంప్రదాయములలోని సుగుణములను గ్రహించెను. తమ్ము పాలించుచుండిన చక్రవర్తి మహమ్మదీయుడను మాటను వారు మరచునట్లు ప్రవర్తించెను.

సర్వమత సమత్వము :- అక్బరు బాల్యమునుండి సత్యాన్వేషణయందును, జ్ఞానసంపాదనమందును అత్యంతాసక్తిగలవాడు; ఈ విషయములో ప్రాచీన కాలపు జనకుడు మొదలగు రాజర్షులతో పోల్చదగినవాడు. క్రీ. వె. 1575 వరకు నతడు మహమ్మదీయ మతమందు పూర్తి నమ్మకము కలిగియుండెను. కాని కాలక్రమమున నీ నమ్మకము సడలెను. మహమ్మదీయ మతములో సున్నీ, షియ్యా శాఖలకు గల భేదము దీనికొక కారణము. అక్బరు కొలువలోని భేదములను సమర్థించుటకై మహమ్మదీయ పండితు లొకరినొకరు ఖండించుకొనుచు అతి తీవ్రముగ వాద ప్రతివాదములు చేయుచుండిరి. వానిని వినినప్పుడు అక్బరుకు లెక్కలేని సందేహములు కలుగుచుండెను. రాజపుత్ర స్త్రీలను వివాహమాడుటవలనను, రాజపుత్రులతో సాంగత్యము చేయుటవలనను అతని మనస్సు మారిపోయెను. ఇదిగాక క్రీ. వె. 1574 ప్రాంతమున ముబారక్ అను సూఫీ వేదాంతియు, అబుల్‌ఫజల్, అబుల్‌ఫైజై అనే విద్వాంసులగు నతని కుమారులును అక్బరుకొలువున చేరి వారి సిద్ధాంతములను బోధింపసాగిరి. మహమ్మదీయ మతవిషయములలో ఉలేమాలకు అభిప్రాయభేదములు కలిగినప్పుడు వానిని పరిష్కరించి, సిద్ధాంత మిదియని నిర్ణయించుటకు పాదుషాకు అధికారము కలదని వీరు నిర్ణయించిరి. రానురాను మతమునకు సంబంధించిన సత్యములను తెలిసికొనుటయందు అక్బరున కుత్సాహ మభివృద్ధిగాంచెను. అందుకై అతడు బ్రాహ్మణులను, జైనులను, పారసీలను, క్రైస్తవులను రప్పించి వారి ప్రసంగములను వినెను. వాని ఫలితముగా సత్యమొక మహమ్మదీయ మతమందు మాత్రమే లేదనియు,

అన్ని మతములందు సత్యమున్నదనియు నతడు నిర్ణయించెను. ఇంతేగాక, అన్నిమతములలోని సారము నాధారము జేసికొని క్రొత్తమతమొక దాని నతడు స్థాపించెను. పూర్వాచార పరాయణులగు మహమ్మదీయు లనేకులు దీనిని సహింపక, తమకుగల ఆధిక్యత తగ్గుచున్నదని తలచి, అతనిపై తిరుగబడిరి. కాని, అతడా తిరుబాటుల నణచి, సర్వమత సహనము నాధారముగ జేసికొని సామ్రాజ్యపాలనము జరిపెను. మతము పేరిట నాకాలమందు ఐరోపాలో నెన్నియో యుద్ధములు జరుగుచుండెను. అట్టి కాలమున సర్వమత సమానత్వము నాధారముగ జేసికొని, కోట్లకొలది ప్రజలను పాలించిన అక్బరు యుగపురుషుడని చెప్పుటలో నతిశయోక్తి లేదు.

## 6. అక్బరు : పరిపాలనా విధానము

కేంద్ర ప్రభుత్వము :- సామ్రాజ్యమును పాలించుచుండిన పాదుషా యొక్క అధికారము నిరంకుశము. దానిని అడ్డగల చట్టము లేవియు లేవు.మహమ్మదీయ మతగ్రంథములలోని సిద్ధాంతములను బట్టిగాని, వాని యర్థమును నిర్ణయించు పండితుల(ఉలేమాల) అభిప్రాయములను బట్టిగాని అతడు నడచుకొనుట మానెను. రాజకీయ వ్యవహారము లందేగాక మహమ్మదీయమత విషయములందు కూడ నతడు సర్వాధికారమును వహించెను. అతనికిని, అంతకు పూర్వము రాజ్యము చేసిన ఢిల్లీ సుల్తానులకును గల భేదమిదియే. పరిపాలన చేయుట యందతని కనేక మంత్రులుండిరి. ప్రధానమంత్రి వకీలు (వజీరు); రెవిన్యూమంత్రి దివాను ; సైనిక వ్యవహారములందు సలహాలనిచ్చువాడు బక్షి; న్యాయాన్యాయ విచారము చేయువాడు ప్రధానకాజీ; ధర్మాదాయముల విషయమునను, మతవ్యవహారము లందును సలహానిచ్చువాడు సదర్. వీరు గాక మరికొందరు మంత్రులుకూడ నుండిరి. వీరందరు సలహాదార్లుమాత్రమే. ఎట్టి వ్యవహారమునుగాని స్వయముగ పరిష్కరించుటకు పాదుషా కధికారము కలదు.

రాష్ట్రప్రభుత్వము : - పరిపాలనా సౌకర్యమునకై సామ్రాజ్యము పదునైదు సుబాలుగను, ఒక్కొక్క సుబా కొన్ని సర్కారులుగను, ఒక్కొక్క సర్కారు కొన్ని పరగణాలుగను విభజింపబడి యుండెను. సుబాను పాలించువాడు సిఫాసాలారు (సుబేదారు ); సివిల్ మిలిటరీ అధికార మతనికి సంపూర్ణముగ నుండెను. రెవిన్యూ అధికార మతనిది కాదు. అందుకై దివాన్ అను ప్రత్యేకాధికారి ఉండెను. సర్కారును పాలించువాడు ఫౌజుదారు. అల్లరుల నణచి, ప్రజల క్షేమమును కాపాడుట అతని పని.

పట్టణమును పాలించువాడు కొత్వాలు. మౌర్యుల కాలము నాటి నాగరికునివలె నితడు పట్టణమునకు సంబంధించిన వ్యవహారములన్నిటిని చక్కబెట్టువాడు. గ్రామ వ్యవహారములు గ్రామోద్యోగస్థులయొక్కయు, గ్రామ వృద్ధులయొక్కయు అధీనమందుండెను. చక్రవర్తులెవ్వరైనను గ్రామ పరిపాలన విధానమందెట్టి మార్పులు సంభవింపలేదు. ప్రాచీన నాగరికతయు, సంప్రదాయములును శిథిలములుగాక దేశమున నిలబడియుండుట కిదియే కారణము. పరగణాలలో నేరము చేసిన వారిని శిక్షించుటయందును, వివాదములను పరిష్కరించుటయందును చట్టనిర్ణయము చేయుటకై కాజీలుండిరి.

సైన్యము : మన్‌సబ్దారులు :- పాదుషా యొక్క అధికారమునకు సైన్యము ప్రధానాధారము. అందులో అశ్వబలము ముఖ్యమైన అంగము. సైన్యమునకు కావలసిన గుఱ్ఱపుదళములను సమకూర్చుపని మన్‌సబ్దారులను బిరుదుగల ఉదోగస్థులు చేయుచుండిరి. సామ్రాజ్యములో ప్రముఖులని చెప్పదగినవారు వీరే, పాదుషాయొక్క అభిమానమునకు పాత్రులైనవారి కీబిరుదు లభించుచుండెను. ఏయే మన్ సబ్దారెన్నెన్ని గుఱ్ఱములను సిద్దపరచవలెనో పాదుషా నిర్ణయించుచుండెను. దానిని బట్టి వారి నెల జీతము లేర్పాటు చేయబడుచుండెను. ఈ పద్ధతి వలన నష్టము లేకుండుటకై అక్బరు ఒకటి రెండు మార్పులను జేసెను. మన్‌సబ్దారులకు జాగీరులిచ్చుటకు బదులు నెల జీతము లేర్పరచెను. అందుచేత వారు స్వతంత్రులుగాక, ఎల్లప్పుడతనిని కనిపెట్టుకొని యుండవలసిన వారైరి. ఒక్కొక్కప్పుడు వారు నిర్ణీత సంఖ్యకంటే చాల తక్కువగ గుఱ్ఱములను తయారుచేయటకలదు. అట్టి దురాచారమును మాన్పుటకును, యుద్ధములో పనికి వచ్చు గుఱ్ఱములను మాత్రమే వారు సిద్ధపరచుటకును కావలసిన ఏర్పాట్ల నతడు చేసెను. సామ్రాజ్యములోని ఉద్యోగములన్నియు మన్‌సబ్దారుల అధీనమందుండెను. మన్‌సబ్దారులు కానివార్వెరిని గొప్ప ఉద్యోగములలో నియమించుట లేదు.

భూమిశిస్తు :- ప్రజలనుండి అక్బరు వసూలుచేయు చుండిన పన్నులన్నిటిలో భూమిశిస్తు ముఖ్యమైనది. అతని మంత్రియగు తోడర్‌మల్లు సల్లా సూచించిన మార్గమునాధారము చేసికొని ఈ పన్నును నిర్ణయించుటలోను, వసూలు చేయుటలోను ఉపయోగకరములగు మార్పులను కొన్నిటిని గావించెను. వ్యవసాయయోగ్యమగు భూమినంతను అతడు కొలిపించి, సారమునుబట్టి దానిని నాలుగుతరగతులుగ విభజించి, ఏయే రకపు భూమిలో ఏయే ధాన్యములెంతెంతపండునో అంచనా

వేయించెను. పండినపంటలో మూడవవంతును ప్రభుత్వమువారి కియ్యవలసిన శిస్తుగా నిర్ణయించెను. సాధారణముగ ఈ శిస్తును ధనరూపముగ చెల్లించున ట్లతడేర్పాటు గావించెను. గతించిన పదిసంవత్సరముల ధాన్యపు ధరల నాధారముచేసికొని, మూడవవంతు పంట కెంత ధనమియ్యవలసినది ఉద్యోగస్థులు లెక్కవేయుచుండిరి. సామాన్యముగ రైతులు శిస్తులను జమిందారులకుగాక పాదుషాచే నియమింపబడిన ఉద్యోగస్థులకు చెల్లించున ట్లేర్పాటు చేయబడెను. పొలమును సాగుచేయుట కారంభించినప్పుడే తాను ఎంత శిస్తు చెల్లించవలసినది రైతుకు తెలిసియుండెను; తోడరుమల్లు చేసిన మార్పువలనరైతుకు కలిగిన లాభమిదియే. రైతులు చెల్లించుచుండిన ఇతర శిస్తులనేకములను అక్బరు రద్దుచేసెను. రైతుల వ్యవసాయ ఖర్చులకు అప్పులనిచ్చియు, బీడుపొలములను సాగుచేసినవారినుండి కొన్ని సంవత్సరములవరకు శిస్తులు వసూలుచేయకయు వారికెంతో సహాయము చేసెను. కార్ఖానా లనేకములను పెట్టించి, చేతిపనులయందును, కళలయందును నేర్పుగలవారినతడు పోషించెను. రహదారిసుంకములను తగ్గించి వ్యాపారము నభివృద్ధిజేసెను. ప్రయాణీకులకు చోరులవలన భయము లేకుండున ట్లేర్పాట్లు అనేకములను చేసెను. టంకశాలలలో స్వచ్ఛమైన రూపాయలను, ఇతర నాణెములను ముద్రింపించెను. ఈ విధముగ ప్రజల యోగక్షేమాభివృద్ధికై ఎంతోపాటుబడి, అగ్రగణ్యులని పేరుగాంచిన చక్రవర్తులలో నొకడను శాశ్వతకీర్తిని అక్బరు సంపాదించెను.

## 7. జహాంగీరు

జహాంగీరు :- అక్బరు తర్వాత అతని కుమారుడగు జహాంగీరు క్రీ.వె. 1605 మొదలు క్రీ. వె. 1627 వరకు రాజ్యముచేసెను. ఇతడు దృఢకాయుడు ; ఉదార స్వభావుడు; అల్పులు, అధికులు అను వివక్ష లేక న్యాయ శాస్త్రానుసారముగ వివాదములను పరిష్క రించు వాడు; ప్రజలందరి అందు పాటున ఉండిన వాడు; వివిధ విషయములను తెలిసి కొనుట యందు త్సాహము గలవాడు; కళాభి మాని; ముఖ్యముగ చిత్రలేఖన మందెక్కువ యభిరుచిగలవాడు; పలుభాష లెరిగినవాడు; గ్రంథకర్త; మహమ్మదీయ మతముపై నెక్కువ యభిమానము చూపెట్టినను



జహాంగీరు

మొత్తముమీద అక్బరు సూచించిన మార్గము ననుసరించినవాడు ; దీపావళి మొదలగు

హిందువుల పండుగల నాసక్తితో జరుపువాడు; క్రైస్తవ మతబోధకులనేకులను దగ్గరకు చేర్చి వారి ప్రసంగములను వినినవాడు. కాని. మితిమీరి త్రాగుటచేత కొంతకాలమున కితడు తొంటి బలమును, ఆరోగ్యమును గోల్పోయి, వ్యవహారములనన్నింటిని భార్యయగు నూర్జహాను చేతిలో వదలవలసిన వాడయ్యెను.

నూర్జహాను :- ఈమె ఒక పారశీకుని కుమార్తె. బహు చక్కనిది. ఆ కాలమున విదేశములనుండి మహమ్మదీయులనేకులు ఉద్యోగములకై మనదేశమునకు వచ్చుచుండువారు. ఈమె తండ్రికూడ అట్టివాడే. అతడు అక్బరు కొలువులో నొక మన్‌సబ్దారుడయ్యెను. చిన్నతనమున నామెను జహాంగీరు చూచి ప్రేమించి వివాహమాడగోరెననియు, అక్బరందు కంగీకరింపక మరియొకని కామెనిచ్చి వివాహము చేసెననియు, పాదుషా అయినతర్వాత జహాంగీరామెభర్తను చంపించి, క్రీ.వె. 1611లో ఆమెను వివాహమాడెననియు కొన్ని గాథలు కలవు. కాని, ఇవి యెంతవరకు సత్యములో చెప్పుటకు వీలులేదు. ఏది ఏట్లైనను వివాహము జరిగిన తర్వాత జహాంగీరు నూర్జహానుల పరస్పరానురాగము గాఢమయ్యెను. సౌందర్యమునకు తోడు రాజకీయ విషయములందామె కెంతో నేర్పుగలదు. ఎంతటి చిక్కు వ్యహారములనైనను విడదీయు సామర్థ్యమామెకుండెను. క్రీ.వె. 1611 తర్వాత ఆమెతో కలసి జహాంగీరు రాజ్యము చేసెనని చెప్పవచ్చును. నాణెములపైనను, శాసన పత్రములందును వారిద్దరి నామములు లిఖింపబడెను. ఆమె యభిమానములేక ఎంతటివాడును ముందుకు రాలేకుండెను. కొంతకాలమున కధికారమంతయు నామెవశమయ్యెను. ఆమె యొక్క బంధువులు ఉన్నత పదవులకు వచ్చిరి; పేరునకు మాత్రమే జహాంగీరు పాదుషాగా నుండెను.

**కొన్ని తిరుగుబాటులు:-** మొగలాయీ రాజ్యాంగ పద్ధతిలో నొక లోపముండెను. తండ్రి తర్వాత నతని పెద్దకుమారుడు రాజ్యమునకు రావలెనను ఆచారము వారియందు లేదు. అందుచేత అన్నదమ్ములు, తండ్రికొడుకులు సింహాసనమునకై పోట్లాడుట తప్పదయ్యెను. అక్బరంతటి మహామహుని యవసానకాలమందతని కుమారుడు జహాంగీరు కలహించెను. ఈ కలహము నతడు సులభముగ నణచివేసినను, కొందరు ప్రముఖులతని తర్వాత జహాంగీరు పాదుషా కాకూడదనియు, జహాంగీరు కుమారుడగు కుస్రూ సింహాసనార్హుడనియు తలచిరి. కాని అట్టిది జరుగక జహాంగీరే పాదుషా అయ్యెను. కుస్రూ మాత్రము తన యుద్దేశమును మానక క్రీ. వె. 1606 తండ్రిపై తిరుగబడెను. జహాంగీరతని నోడించి జీవితమంతయు నతడు చెఱలో గడుపునట్లు చేసి, అతని యనుచరులను చిత్రవధ గావించి, అతనికి కొంత ద్రవ్యసహాయముచేసిన

శిక్కుల గురువగు అర్జునుని శిరశ్ఛేదము చేయించెను. శిక్కులకును, మొగలాయీలకును గలిగిన ద్వేషమున కిదియే అంకురము. క్రీ. వె. 1622లో జహాంగీరు కుమారులలో మరియొకడగు షాజహాను కలహించెను. అన్నదమ్ములందరిలో నితడు సమర్థుడు; అనేక యుద్ధములందు జయము గాంచినవాడు; నూర్జహానుయొక్క అన్నయగు అసఫ్ఖానుని యొక్క కూతురును పెండ్లాడి ఆమె యభిమానమున కదివరకు పాత్రుడైనవాడు. జహాంగీరు తర్వాతనతడే పాదుషా కాగలవాడని అందరు తలచుచుండిరి. కాని, నూర్జహానందుకిష్టపడక, తన యధికారము నెట్లైన నిలుపుకొనదలచి, ప్రథమ భర్త వలన నామెకు పుట్టిన కుమార్తెను షరయా రను జహాంగీరు యొక్క మరియొక కుమారునకిచ్చి వివాహముచేసి, అల్లుడగు నాతనిని పాదుషాగాచేయ సంకల్పించెను. ఇందుచేత షాజహాను కలహించెను. కాని సమర్థురాలగు నామె వెంటనే అతని నెదుర్కొనుటకు సేనలఁబంపి అతని నోడించెను; తుదకతడు కలహము మానుకొని క్రీ. వె. 1625లో తండ్రి శరణుజొచ్చెను. అటుతర్వాత మరుసటి సంవత్సరమున మహబత్ ఖానుడను సేనాధిపతి తిరుగుబాటుచేసి, జహాంగీరుని చెఱబెట్టెను, ఉపాయశాలినియగు నూర్జహాను అతనినికూడ నోడించి, భర్తను చెఱనుండి విడుదల చేయగలిగెను.

యుద్ధములు:- జహాంగీరుకాలమున జరిగిన ప్రధాన యుద్ధములలో రెంటియం దతనికి జయమును, రెంటియం దపజయమును కలిగెను. మీవాడు రాజ్యమును పాలించుచుండిన ప్రతాపసింహుని కుమారుడు అమరసింహుడు మొగలాయీలతో యుద్ధముచేసి, తన పూర్వులవలె కొంత ప్రతాపము చూపెనుగాని తుదకు క్రీ. వె. 1614లో జహాంగీరునకు సామంతుడగుట కంగీకరించెను. ఇదిగాక, శత్రువులకభేద్యమని ప్రసిద్ధిగాంచినట్టియు, అక్బరుకూడ వశము చేసికొనలేక పోయినట్టియు పంజాబులోని కాంగ్రా అను దుర్గము జహాంగీరు వశపరచుకొన గలిగెను. ఇదియే అతనికి గలిగిన రెండవ జయము. కాని, మిక్కిలి ముఖ్యమైన కాందహారుకోటను పర్షియాదేశపు రాజు క్రీ. వె. 1622లో ముట్టడించి వశపరచుకొనెను. దీనిని తిరిగి సంపాదించుటకు కావలసిన ప్రయత్నములను జహాంగీరు చేయలేకపోయెను. ఇట్లే అహమ్మదు నగర రాజ్యమునకు మంత్రియైన మలికాంబ రనువాడు ప్రబలుడై మొగలాయీ సైన్యములననేక పర్యాయములోడించెను.

యూరోపియన్ వర్తకులు :- వర్తకముచేయ నుద్దేశించివచ్చినను, తుదకు మన దేశమునంతను జయింపగలిగినట్టి ఇంగ్లీషువారు జహాంగీరు కాలమున వారి వ్యాపారమును ప్రారంభించిరి. వారికిని, పోర్చుగీసు, డచ్చివారలకును ఎక్కువ పోటీ

జరుగుచుండెను. పాదుషావద్ద నుండి కొన్ని వ్యాపార వసతులను సంపాదించుటకై హాకిన్స్ అనువాడు వారి తరపున క్రీ. వె. 1608లో జహాంగీరును సందర్శించి మూడు సంవత్సరముల కాలమతని నాశ్రయించెను; కాని పోర్చుగీసు వారికెక్కువ పలుకుబడియున్నందున వాని యాశ్రయము ఫలింపలేదు. క్రీ. వె. 1612లో ఇంగ్లీషువారికిని, పోర్చుగీసువారికిని సూరతు పట్టణమువద్ద నొక నౌకాయుద్ధము జరిగెను; అందు ఇంగ్లీషువారు గెలిచిరి. అంతటితో జహాంగీరుకు వారియెడల కొంతగౌరవము కలిగెను. మొగలాయీలకు నౌకాబలమే లేనందున సముద్రముపై పోర్చుగీసువారి నెదుర్కొనుటకు భయపడి, వారు పెట్టుబాధలకన్నిటికి నోర్చియుండిరి. ఇంగ్లీషువారి విజయమువలన నాభయము కొంతతగ్గెను. కావున క్రీ. వె. 1615లో ఇంగ్లీషురాజగు మొదటి జేమ్సువద్ద నుండి వచ్చిన సర్ తామస్ రో అను రాయబారిని జహాంగీరు బాగుగ మర్యాదచేసి, ఇంగ్లీషు వర్తకులకు కావలసిన సౌకర్యములను కొన్నిటిని ప్రసాదించెను. రో వ్రాసిన గ్రంథమునుండి ఆ కాలపు మొగలాయీసామ్రాజ్య పరిస్థితులు కొన్ని విశదమగుచున్నవి.

## 8. షాజహాను

షాజహాను :- జహాంగీరు మృతిజెందిన తర్వాత (1627) సింహాసనమునకై మామూలు కుట్రలు, పెనగులాటలు తప్పవయ్యెను. తుదకు షాజహాను దాయాదు లందరిని చంపించి, సింహాసనా రూఢుడై క్రీ.వె. 1627 మొదలు క్రీ. వె. 1658 వరకు రాజ్యమును పాలించెను. ఇతడు రాజ్యము నకు వచ్చిన క్రొత్తలో బందల్ ఖండము నేలుచుండిన సామంత రాజొక డును, దక్కనులో మొగలాయీ ప్రతినిధిగ నుండిన ఖాంజహాను లోడీయొకడును తిరుగుబాటు చేసిరి; కాని సకాలమున వారి నెదుర్కొను టకు సైన్యములను పంపి, వారి కలహముల నణచి, ఇబ్బందులేవియు లేక నతడు నెమ్మదిగ ప్రజలనేలగలిగెను. షాజహానుని కాలమున మొగలాయీ సామ్రాజ్యము సాటిలేని వైభవమును గాంచెను. అది అతడు నిర్మించిన కట్టడములందు కనబడుచున్నది. అతని కీర్తి స్థిరస్థాయిగనుండుట కిదియే కారణము.



షాజహాను

యుద్ధములు :- క్రీ. వె. 1632లో నతడు పోర్చుగీసువారితో నొక యుద్ధము చేసెను. వారు బంగాళరాష్ట్రమున హుగ్లీయను కోటను కట్టుకొని, సామ్రాజ్యములోని వ్యాపారమునకును, సుంకములవలన పాదుషాకు రావలసిన ఆదాయమునకును భంగము కలిగించుటయేగాక ప్రజలను నిర్బంధించి క్రైస్తవ మతములో కలుపుకొనుచుండిరి. ఇదిగాక, వారు సముద్రపు దొంగలతో చెలిమిచేసి, సముద్రతీర ప్రాంతములందున్న ప్రజలను పట్టుకొని బానిసలుగ విక్రయించుచుండిరి. అందుచే షాజహాను ఒకటిన్నరలక్ష సైన్యమును తయారుచేసి, కోటను మూడుమాసములు ముట్టడివేసి, పట్టుకొని నాశనము చేసెను. అప్పుడతనిచేతిలో నాలుగువేల క్రైస్తవులు చిక్కిరి. వారిలో ననేకుల నతడు చిత్రవధ గావించి మిగిలినవారిని మహమ్మదీయ మతములో కలిపికొనెను. ముట్టడి సమయములో కోటను రక్షించుచుండిన పోర్చుగీసు సైనికుల సంఖ్య వేయిమాత్రమే! అంతటి స్వల్ప సైన్యము నోడించుటకు పాదుషాచేసిన సన్నాహము, పడ్డ కష్టము చూడ, ఫిరంగుల నుపయోగింపగల విదేశీయులతో యుద్ధముచేయుటకు కావలసిన సామర్థ్యము మొగలాయీ సైన్యమున లోపించి యుండెనని స్పష్టమగుచున్నది. ఇట్టి లోపమే కాందహారును వశపరచుకొనుటకై షాజహాను చేసిన ప్రయత్నములన్నిటిలో కనబడుచున్నది. పర్షియానుండి ఇండియాకు వచ్చు మార్గమున నీకోటయుండుటచే దీని కనాదిగ నెక్కువ ప్రాముఖ్యముండెను. క్రీ. వె. 1622లో పర్షియారాజు దీనిని జయించెను. క్రీ. వె. 1638లో షాజహాను కోటలోని పారశీక సేనాధిపతికి కొంత లంచమిచ్చి దానిని తన యధీనములోనికి తెచ్చుకొనెను. తర్వాత పదిసంవత్సరములకు పర్షియారాజు దానిని తిరిగి జయించెను. అటుపిమ్మట మూడు పర్యాయములు దానిని ముట్టడించి తీసికొనుటకై షాజహాను గొప్ప సైన్యములను పంపి కోట్లకొలది ద్రవ్యమును ఖర్చుపెట్టెను; కాని ఎట్టి లాభము లేకపోవుటయేగాక, మొగలాయీల నోడించుట సులభమను నమ్మకము పర్షియా రాజులలో కలిగెను. క్రీ. వె. 1645 ప్రాంతమున మొగలాయీల జన్మస్థానమగు బాక్, బదక్షాన్ రాష్ట్రములను జయింపవలెనను ఉద్దేశము షాజహానుకు కలిగెను. అందుకై అతడనేక సైన్యములను పంపి, నాలుగు సంవత్సరములకాల మచ్చటి రాజులతో యుద్ధము చేసెనుగాని, తుదకు సైన్యములను కోల్పోయి వెనుకకు మరలవలసిన వాడయ్యెను. విదేశములలో నతడు చేసిన యుద్ధములం దోడిపోయినను దక్కనును జయించుటకై అతడు గావించిన పోరాటములలో మొత్తముమీద నతినికి లాభము కలిగెను. క్రీ. వె. 1658 నాటికి అహమ్మదు నగరరాజ్యము మొగలాయీ సామ్రాజ్యములో కలసిపోయెను;

బీజాపూరు, గోలకొండ సుల్తానులు పాదుషాకు సామంతులై కప్పము గట్టుట కంగీకరించిరి.

**పరిపాలనము :-** షాజహానుని పరిపాలనమందు రెండు మూడు విశేషములు గమనింపదగియున్నవి. ఇతడు తండ్రి తాతల రాజనీతికి విరుద్ధముగ పరమతావలంబకుల ననాదరణ చేయసాగెను. షియ్యాలయందితనికిగల ద్వేషము మెండు; కాశీరాష్ట్రములోని హిందూ దేవాలయములనేకముల నితడు నాశము జేసెను; ఆగ్రాలోని క్రైస్తవ దేవాల యములకు గూడ నీగతియే పట్టెను. ఇతని కాల యందం కురించిన యనాదరణము ఇతని కుమారుడగు ఔరంగజేబు కాలమున మహావృక్షమై మొగలాయీ సామ్రాజ్య వినాశమునకు కారణ భూతమయ్యెను. అపరిమితమగు ధనము నితడు కట్టడము లకై ఖర్చుపెట్టెను; ఇతని పరిపాలన మందలి రెండవ విశేష మిదియే. వీనిలో ఆగ్రా పట్టణములోని



ముంతాజ్ మహల్

తాజ్‌మహల్ జగద్విఖ్యాతమైనది. భార్యయగు మంతాజ్‌మహల్ యొక్క జ్ఞాపకార్థమై ఇతడీభవనమును నిర్మించెను. దీనిని పూర్తి చేయుట కిరువది రెండు సంవత్సరములు, మూడు కోట్ల రూపాయలు పట్టెను. ఇట్టి సుందర భవనము ప్రపంచమున మరియొకటి లేదు. ఇదిగాక ఆగ్రా, ఢిల్లీ పట్టణములలో ననేక సభామంటపములను, మసీదులను అతడు నిర్మించెను. రత్నఖచిత సింహాసనము లనేకముల నతడు తయారుచేయించెను; వానిలో ముఖ్యమైనది నెమలి సింహాసనము, గొప్ప గొప్ప పట్టణములందతడు కార్ఖానాలను కట్టించి, నేర్పరులగు కర్మకారు లనేకులనురప్పించి, వారిచేత వివిధములగు వస్తుసామగ్రిని తయారుచేయించెను. అతని నిర్మాణములలో సామాన్య ప్రజల కుపయోగించు కాలువలు, రోడ్లు మొదలగువాని సంఖ్య చాల తక్కువ. ఈ వైభవములకు కావలసిన ద్రవ్యమునంతను అతడు ప్రజలపై పన్నులు విధించి సంపాదించెను. వీని భారమును భరింపలేక అనేక రైతులు వ్యవసాయమును మానుకొనిరి; వర్తకులు తమ ధనమును బహిరంగపరచుటకు భయపడి దాచుకొనిరి. న్యాయపరిపాలనమందును, ప్రజలనధర్మముగ హింసించిన ఉద్యోగస్థులను శిక్షించుటయందును షాజహాను కడు శ్రద్ధగలవాడై యుండెను.

**అన్నదమ్ములలో యుద్ధము :-** క్రీ. వె. 1657లో షాజహాను జబ్బుపడెను.

వెంటనే అతని నలుగురు కుమారులు - దారా, షూజా, ఔరంగజేబు, మూరాదు - రాజ్యమునకై పోరసాగిరి. వారిలో పెద్దవాడును, అక్బరువలె సర్వమత సమానత్వమును గ్రహించినవాడును అగు దారా తండ్రివద్దనే యుండెను. బంగాళ రాష్ట్రమును పాలించుచుండిన షూజా అతనిపైకి దండెత్తిరాగా, మార్గమున దారా యొక్క సైన్యములతని నోడించి తరిమెను. ఇంతలో, దక్కనును పాలించు చుండిన ఔరంగజేబు



తాజ్‌మహల్

నతడు పూర్తిగ నోడించలేకపోయినను క్రీ. వె. 1686లో బిజాపురమును, క్రీ. వె. 1687లో గోలకొండను ముట్టడించి తీసికొని, ఆ రెండు రాజ్యములను తన సామ్రాజ్యములో కలిపికొనెను. ఇంతటితో మొగలాయీల ప్రభుత్వము తాత్కాలికముగ దక్కను నందును, దక్షిణ ఇండియాలో చాల భాగమందును స్థాపింపబడెను.

ఫలితములు :- ఈ యుద్ధముల మూలమున మొగలాయీ సామ్రాజ్యము వైశాల్యమందుచ్ఛస్థితికి వచ్చెను. కాని దానితోపాటు సామ్రాజ్యముయొక్క దౌర్బల్యముకూడ నధికమయ్యెను. ప్రయాణ సౌకర్యములు లేని ఆ కాలమందంతటి గొప్ప రాజ్యము నొక కేంద్రమునుండి ఒక చక్రవర్తి పాలించుట దుస్సాధ్యమయ్యెను. బిజాపూరువలన భయము లేక మహారాష్ట్రులు మొగలాయీలను నిరాటంకముగ నెదుర్కొన గలిగిరి. దక్కనులోని షియ్యాలనేకులు మహారాష్ట్ర సైన్యములందు చేరిరి. మహారాష్ట్రులతోటి యుద్ధము ఔరంగజేబునకు తప్పదయ్యెను. ఇందతడు గాంచిన అపజయము మొగలాయీ సామ్రాజ్య పతనమునకొక ముఖ్య కారణమయ్యెను.

## 10. ఔరంగజేబు : అతని రాజనీతి

ఔరంగజేబు :- తండ్రిని చెఱబెట్టి, అన్నదమ్ములను, దాయాదులను చంపి, సింహాసనము నధిష్ఠించిన ఔరంగజేబు క్రీ. వె. 1658 మొదలు క్రీ. వె. 1707 వరకు రాజ్యము చేసెను. ఇతడు సాటిలేని శక్తిసామర్థ్యములు గలవాడు ; ధైర్యశాలి ; విసుగు విరామము లేక పనిచేయువాడు ,తొట్రుపాటన నేమియో యెరుగనివాడు; దైవభక్తి సంపన్నుడు ; స్వమతా చారపరుడు. ఇన్ని సుగుణము లితని యందుండినను వీనితోపాటు రెండు గొప్పలోపములు కూడ నుండెను. ఎంతటి గొప్ప యుద్యోగి యందు నితనికి విపరీతమగు అపనమ్మకము; అందుచేత సమస్త వ్యవహారములను స్వయముగ చక్కబెట్టుకొన ప్రయత్నించెను ; దీనిమూలమున పరి పాలనా పాటవము చాల వరకు లోపించెను.



ఔరంగజేబు

ఇదిగాక పరమతములందితని కెంతో ద్వేషము; ఇదియే సామ్రాజ్య విచ్ఛిత్తికొక ప్రబల కారణ మయ్యెను. ఇతని రాజ్యకాలమును రెండుదశలుగ విభజింప వచ్చును.

మొదటిదశలో ( 1658 - 1681 ) నితడు ఉత్తర ఇండియా యందును, రెండవదశలో (1681 -1707 ) దక్కను నందును కాలము గడపెను. ఉత్తర ఇండియా యందున్న కాలమున నితడు అస్సాములో కొంతభాగమును, చిట్టగాంగును వశపరచుకొని ( 1661 - 66 )., బంగాళాఖాత తీరమందలి సముద్రపు దొంగలనణచెను; ఇదిగాక, వాయవ్య సరిహద్దులందు ప్రబలులై ప్రజలను దోచుచుండిన యూసఫ్‌జీలను, ఆఫ్రిడీలను ఓడించి, వారివలన ప్రమాదము రాకుండ సామ్రాజ్యమును కాపాడెను. రెండవ దశయందితడు దక్కనుజేరి, అనేక యుద్ధములను జేసి, రాజధానికి రాకుండ నచటనే కాలధర్మమొందెను.

రాజనీతి :- మహానుభావుడగు అక్బరుయొక్క రాజనీతిని తొలగద్రోచి, ఔరంగజేబు మహమ్మదీయ మతసంప్రదాయములను తూచాలు తప్పక అనుసరించి హిందూ దేశమును పాలింపబూనెను. క్రొత్త హిందూ దేవాలయ నిర్మాణము నితడాపెను. కాశీ, మధుర మొదలగు పుణ్యక్షేత్రములలోని పురాతన దేవాలయములను, విద్యాపీఠములను పడగొట్టించి వానిస్థానమున మశీదులను గట్టించెను. హిందూసంస్థల పోషణార్థమై ఇయ్యబడిన ఇనాముల నపహరించెను. మహమ్మదీయ వర్తకులు చెల్లింపవలసిన సుంకములను మాన్పి, హిందూవర్తకులు చెల్లింపవలసిన సుంకములను రెట్టింపు జేసెను. దరిద్రులు, ధనికులను వివక్షలేక హిందువులందరిపై జిజియా పన్నును విధించి, అది యధర్మమని విన్నవించుకొనుటకై కూడిన ప్రజలను ఏనుగులచే త్రొక్కించెను. హిందూమతమును విడనాడి మహమ్మదీయ మతములో జేరినవారిని మేళతాళములతో నూరేగించి, ఉద్యోగముల నట్టివారికే ఇచ్చెను. హిందువుల పండుగలను, ఉత్సవములను నిషేధించెను. వారు పల్లకీలను, ఏనుగులను, గుఱ్ఱములను ఎక్కరాదనియు, ఆయుధముల నుపయోగింపరాదనియు శాసించెను. రాజపుత్రులతో చెలిమి జేసికొనుటకు బదులు వైరముబెట్టుకొనెను. మొగలాయి సేనలకు నాయకుడై, వాయవ్య సరిహద్దులలో యుద్ధము జేయుచు, సామ్రాజ్య సంరక్షణార్థమై తన ప్రాణములను గూడ నర్పించిన జోధపుర రాజగు జస్వంతసింగు మరణించగనే అతని రాజ్యము నపహరించి, అతని కుమారుని చెఱబెట్టెను. ఇట్టి యపచారములను భరింపలేక హిందువులు పాదుషాపై తిరుగబడసాగిరి.

తిరుగుబాటులు :- క్రీ. వె. 1669 లో మధురానగరమునకు చుట్టుపట్లనున్న జాటులును, క్రీ. వె. 1672లో మీవారు నగరప్రాంతమందలి " సత్యనాము" లును కలహించిరి ; ఎంతో కష్టముమీదగాని ఔరంగజేబు వారి నణచలేక పోయెను. క్రీ. వె.

1675 లో నతడు శిక్కుల గురువగు తేజ్‌బహదూరును పట్టుకొని చంపగా, వారు రోషావేశులై, యుద్ధమునకు దిగి, పంజాబులోని మొగలాయీల అధికార వినాశమునకు కారకులైరి. జస్వంతసింగు మరణానంతరము రాజపుత్రులందరు ఉదయపూరు రాణాయొక్క నాయకత్వమున పాదుషాపై ఎదురుదిరిగిరి ( 1679); ఈ దెబ్బనుండి తట్టుకొనుట కతనికి సాధ్యము కాదయ్యెను. రెండుసంవత్సరములు యుద్ధము చేసినను అతడు వారి నోడింపజాలడయ్యెను. ఈ అపజయములకు తన కుమారుడును, సైన్యాధ్యక్షుడును అగు అక్బరుయొక్క అసమర్థత కారణమని యనుమానించి, అతనిని ఉద్యోగమునుండి తొలగించెను. అందుచే నతడు కూడ తండ్రిపై కలహించి, సింహాసనము నధిష్ఠింపగోరి, రాజపుత్రులతో కలసెను. ఔరంగజేబు గొప్ప మోసముచేసి, రాజపుత్రులకును, అక్బరునకును మధ్య భేదము కల్పించెను. దాని ఫలితముగ అక్బరు రాజపుత్రులను వదలి మహారాష్ట్రులవద్దకు పారిపోయెను. అప్పటికి కూడ రాజపుత్రులు పాదుషాకు లొంగరైరి, కొందరుమాత్ర మతనితో సంధిజేసికొనిరి. కాని అదిమొదలు రాజపుత్రనాయకులు మొగలాయీలతో చేరుట మానిరి; వారికి సహాయముచేసి వారి సామ్రాజ్యమును నిలబెట్టుటకు బదులు దాని వినాశమునకై సర్వప్రయత్నముల గావించిరి. ఔరంగజేబు యొక్క రాజనీతి ఈ విధముగ సామ్రాజ్య విచ్ఛిత్తికి కారణమయ్యెను. మహారాష్ట్రులును, అక్బరును కలియుటవలన నెక్కువ ప్రమాదము సంభవింపనున్నదని యూహించి క్రీ. వె. 1681లో నతడు దక్కనుకు పయనమయ్యెను.

## 11. శివాజీ : మహారాష్ట్రరాజ్య స్థాపనము

మహారాష్ట్రులు :- ఔరంగజేబు దక్కనులో రాజప్రతినిధిగ నుండి క్రీ. వె. 1657లో ఢిల్లీకి వెళ్ళిపోయిన నాటికిని, క్రీ. వె.1681 లో నతడు పాదుషాగా దక్కనుకు తిరిగివచ్చిన నాటికిని మధ్యకాలమున అచ్చటి రాజకీయ పరిస్థితులలో గొప్ప విప్లవము సంభవించెను మహామహుడగు శివాజీ మహారాష్ట్రులకు నాయకుడై, స్వతంత్రరాజ్యమును స్థాపించి, మొగలాయీలను కూడ నెదిరించి యోడించుటకు కావలసిన శక్తిసామర్థ్యములు తమకు గలవను నమ్మకము వారిలో పుట్టునట్లు జేసెను.మహారాష్ట్ర దేశము దక్కనులోని పశ్చిమ భాగమందున్నది ; అది పర్వతమయము; అందులోని దుర్గము లభేద్యములు. మహారాష్ట్రులు దృఢకాయులు ; శీతాతపములను లక్ష్యపెట్టక, కష్టపడి పనిచేయువారు తుకారాం, రామదాసు మొదలగువారుపదేశించిన భక్తిమార్గము నవలంబించి, వర్ణ భేదములను పాటింపక, పండరీపురములోని విఠలస్వామి నారాధించుచు తామందరొక్క జాతివారను భావముతో మెలగుచుండిరి. వారి దేశము సారవంతము కానందున

వారిలో ననేకులు వ్యవసాయము చేయుట మాని, జీవనోపాధికై అహమ్మదునగర, బిజాపూరు సుల్తానుల సైన్యములందు జేరి, యుద్ధము చేయుటయంద పరిమితమగు నైపుణ్యమును సంపాదించిరి. వారిలో తెలివి తేటలుగల వారీ సుల్తానుల కొలువులో ప్రవేశించి, రాజకీయ వ్యవహారములం దెక్కువ యనుభవము గలవారైరి. వారందరికి నొక నాయకుడు లేడన్న మాటయేగాని, స్వతంత్రరాజ్యమును స్థాపించుకొనుటకు కావలసిన తక్కిన హంగులన్నియు వారికుండెను. శివాజీ మూలమున నాయకుడు లేడను లోపముకూడ తీరెను. అప్పటికి దక్కనులోని మహమ్మదీయ సుల్తానులు తమ బలమును కోల్పోయి యుండుటవలన శివాజీ యొక్క యుద్యమము సులభతరముగ సఫలతగాంచెను.

**శివాజీ :** - శివాజీ క్రీ . వె. 1627 లో పుట్టెను.ఇతని తండ్రియగు షాజీ మొదట అహమ్మదు నగర సుల్తానుల యొక్కయు,తర్వాత బిజాపూరు సుల్తానుల యొక్కయు కొలువున నుండి పూనా పట్టణమునకు చుట్టుపట్ల జాగీరులను సంపాదించినవాడు. శివాజీని పెంచి పెద్దవానిని చేయు భారమంతయు నతని తల్లియగు జీజీబాయిపై పడెను. ఆమె దానినెంతో సామర్థ్యముతో నిర్వహించి, హిందూధర్మమందును, ప్రాచీన కాలపు హిందూశూరులందును విస్తారమగు భక్తి గౌరవము అతనికి కలుగునట్లు జేసెను. చదువుటకు వ్రాయుటకును నతడు నేర్చుకొనలేదు గాని, యుద్ధము చేయుట యందెంతో నేర్పును సంపాదించి, పందొమ్మిది సంవత్సరముల వయస్సు వచ్చునప్పటకి మహారాష్ట్ర సైనికు లనేకులను తనచుట్టు చేర్చుకొని; తక్కిన వారివలె సుల్తానులకొలువు ప్రవేశించు టకు బదులు స్వతంత్రముగ యుద్ధము చేయసాగి బిజాపుర రాజ్యములోని తోరణ, రాయగడ, సింహగడ, పురంధర్ మొదలగు దుర్గములను పట్టుకొనెను. క్రీ. వె. 1657 వరకు మొగలాయీల వలని బాధ ఎక్కువ గనుండుటచేత బిజాపూరు సుల్తాను అతని నేమియు చేయలేకుండెను. ఔరంగజేబు సామ్రాజ్య సంపాదనమునకై ఉత్తర ఇండియాకు వెళ్లినందున నీ బాధ తగ్గెను. అందుచేత క్రీ. వె. 1659లో బిజాపురపు సైన్యాధిపతులలో నగ్రగణ్యుడగు అఫ్‌జుల్ ఖానుడు శివాజీపైకి వెళ్లెను. కాని శివాజీ మాయోపాయముచే నతనినిచంపి, అతని సైన్యము నోడించి చెదరగొట్టెను. ఈ విధముగ మహారాష్ట్ర నాయకుడు ప్రబలుడగుచుండుట జూచి ఔరంగజీ బతని నణచు నుద్దేశముతో క్రీ. వె. 1660లో షేస్టఖానుని పంపెను. ఇతడు రెండు సంవత్సరములకాలము శివాజీతో యుద్ధము చేసి, కొన్ని కోటలను పట్టుకొనెను గాని తుద కతనిచేత దెబ్బలు తిని వెనుకకు మరలిపోయెను. క్రీ. వె. 1664లో శివాజీ

సూరతు రేవుపట్టణమును దోచి విస్తార ధనమును సంపాదించెను. క్రీ. వె. 1666లో మొగలాయీ సైన్యముల కధిపతిగ నుండిన రాజసింహుడు నయభయములచే శివాజీని కొంత వరకు లొంగదీసి, ఔరంజీబునకు సామంతుడై, ఢిల్లీకి వెళ్లి పాదుషాను దర్శించున ట్లతని నొప్పించెను. ఒప్పుదల ప్రకారము శివాజీ పాదుషాను దర్శించెను కాని



శివాజీ

వారిద్దరికి మనస్పర్థలు వచ్చుటవలన శివాజీ కారాగృహమం దుంచబడెను. ఉపాయ శాలియగుటచే నతడు బహునేర్పుతో చెఱనుండి తప్పించుకొని క్రీ. వె. 1667లో పూనాను చేరెను. తర్వాత రెండు సంవత్సరము లూరకుండి, క్రీ. వె. 1670లో మరియొక మారు మొగలాయీలతో యుద్ధములకు దిగి, కొంకణము నుండి వారి ఫౌజుదారుని తరిమివేసి సూరతును రెండవ పర్యాయము కొల్లగొట్టెను; ఎన్ని ప్రయత్నములు చేసినను అతని నోడించుట వారికి సాధ్యము కాదయ్యెను. అంతటి విజయములను

సంపాదించినవాడగుటచేత క్రీ. వె. 1674లో శివాజీ శాస్త్ర సంప్రదాయానుసారముగ పట్టాభిషిక్తుడై, ఛత్రపతి యను బిరుదును వహించి, స్వతంత్ర రాజ్యమును స్థాపించినట్లు ప్రపంచమునకంతకు ప్రకటించెను. క్రీ.వె. 1677-78 లో నతడు కర్ణాటకముపై దండెత్తి జింజి, వేలూరు లోనగు దుర్గములను సాధించి మరలివచ్చెను. క్రీ. వె. 1680లో నతడు కాలధర్మము నొందునాటికి సూరతు, గోవాలకు మధ్యనున్న సముద్రతీర ప్రాంతమును ఇప్పటి సతారా, కోలాపూరు జిల్లాలును, మైసూరు, మద్రాసు రాష్ట్రములలోని కొంతభాగమును అతని రాజ్యమున చేరియుండెను. హిందువులలో సామ్రాజ్యనిర్మాణశక్తి నశించలేదని అతడు ఋజువుచేసెను.

శివాజీ పరిపాలనము :- ప్రాచీన కాలపు రాజులవలె శివాజీ తనరాజ్యమును సర్వాధికారముతో పరిపాలించెను. అందతనికి సహాయము చేయుట కెనిమిది మంత్రులతో కూడిన పరిషత్తు ఉండెను. వారందరిలో 'పీష్వా' ముఖ్యుడు. రాజ్యము నతడు మూడు రాష్ట్రములుగ విభజించి, ఒక్కొక దాని నొక రాజప్రతినిధి వశమందుంచెను. మంత్రులలో న్యాయాధీశుడును, పండితరావు అనువారలు తప్ప తక్కిన అర్హురును. రాజ్యములోని తక్కిన యుద్యోగస్థులును మొగలాయీ మన్ సబ్దారుల వలె సైన్యాధికారులై యుండిరి ; వీరి మూలమున రానురాను కొన్ని చిక్కులు సంభవించెను.ఉద్యోగస్థులకు జాగీరులిచ్చుటకు బదులు నెల జీతము లేర్పాటు చేయబడెను.ఉద్యోగములు వంశపారంపర్యముగ నుండకూడదని అతడు శాసించెను: జమీందారీపద్ధతిని మాని, తోడరుమల్లు పద్ధతిననుసరించి రైతుల నుండి శిస్తులు



శివాజీ కోట

వసూలు చేసెను; రైతులకు అప్పులిచ్చియు, క్షామబాధను నివారించియు అనేక విధముల సహాయము చేసెను. తన రాజ్యమున కావలనున్న శత్రురాష్ట్రములలోని ప్రజలనుండి చౌత్, సర్ దేశ్ ముఖి అను పన్నులను రెంటిని వసూలు చేయసాగెను; వానిని చెల్లించిన వారిని దోచుట మానెను. రాజ్యమందంతట బలవత్తరములగు దుర్గము లనేకములను నిర్మించి, దుర్గపరిపాలనమునకై రెండు మూడు వర్ణములకు జెందిన ఉద్యోగస్థులంద రొకేవర్ణము వారైన యెడల నొక్కొక్కప్పుడు ప్రమాదము కలుగునని అతడు తలచినవాడు. సైన్యమందతడు హిందువులనేగాక నేర్పరులగు మహ్మదీయులను గూడ జేర్చికొనెను. సైనికుల దౌర్జన్యము మూలమున స్త్రీలకు గాని, మశీదులకుగాని, కొరాను మొదలగు మతగ్రంథములకు గాని ఎట్టి ప్రమాదము కలుగకుండ ఏర్పాట్లు గావించెను. ఇట్టి ఘనకార్యములు చేయుట చేత శివాజీ యొక్క కీర్తి చిరస్థాయి కాగలిగెను.

## 12. దక్కనులోని యుద్ధములు

**ఔరంగజీబు దక్షిణ దిగ్విజయము :-** క్రీ. వె. 1681 లో ఔరంగజీబు దక్షిణ దిగ్విజయమునకై బయలు దేరెను. శత్రువర్గములో చేరి, మహారాష్ట్రుల సహాయమున ఢిల్లీ సింహాసనమును సంపాదింపనెంచిన అక్బరు రాకుమారుని పట్టుకొనుట అత్యవసరమయ్యెను. షియ్యాసుల్తానులచే పాలింపబడుచుండిన బిజాపూరు, గోలకొండ రాజ్యములను హరించి, మొగలాయీ సామ్రాజ్యములో కలిపికొను నంతవరకు ఔరంగజీబునకు నిద్రపట్టదయ్యెను. శివాజీచే స్థాపింపబడిన మహారాష్ట్ర రాజ్యమును విధ్వంసము చేయుట కతడువ్విళ్లూరుచుండెను. ఈ మూడు ఉద్దేశములను సాధించు కొనుటకై అతడు స్వయముగ సైన్యముల నన్నిటిని కూర్చుకొని క్రీ.వె. 1682 లో దక్కను జేరెను.

**యుద్ధములు క్రీ. వె. 1700 : ప్రథమదశ ( 1682 - 1690 ) :-** మొదటి రెండు మూడు సంవత్సరములలో నతడు మహారాష్ట్రుల కోటలను కొన్నిటిని పట్టుకొనెనుగాని అక్బరు కుమారుడు మాత్ర మతనికి చిక్కక పర్షియా దేశమునకు పారిపోయెను. పశ్చిమ మహారాష్ట్రపు శీతోష్ణములను భరింపలేక అతని సైనికులలో ననేకులు ప్రాణముల గోల్పోయిరి. అంతట నతడు షియ్యారాజ్యములపైబడి, క్రీ. వె.1685లో బిజాపూరును, క్రీ. వె. 1687లో గోలకొండను స్వాధీనపరచుకొని మహమ్మదీయ రాజ్యములను రెంటిని తన పాలనలోనికి తెచ్చుకొనెను. అప్పటి కతని శత్రువులలో మహారాష్ట్రులొక్కరే మిగిలిపోయిరి. శివాజీ మృతిజెందిన తర్వాత నతని కుమారుడు శంభాజీ రాజ్యమునకు

వచ్చెను. తండ్రివలె నతడు ధైర్య సాహసములు గలవాడైనను దుర్మార్గుల సహవాసముచే దుర్వ్యసనములందు చిక్కుకొనియుండెను. క్రీ. వె. 1689లో మొగలాయీ లతనిని పట్టుకొనిరి. ఔరంగజీబు అతనిని మహమ్మదీయమతములో చేరగోరెను. కాని అతడా కోరికను నిరాకరించినందున పాదుషా అతనిని చిత్రవధ గావించి, అతని చిన్న కుమారుడగు సాహూను చెఱలో బెట్టెను. ఈ విధముగ క్రీ. వె.1690 నాటికి దక్కనులోని



పరిస్థితులన్నియు ఔరంగజేబునకు మిక్కిలి యనుకూలించినట్లగుపడెను. అతని సామ్రాజ్యము హిమవంతము మొదలు కన్యాకుమారి వరకు వ్యాపించెను; అతని నెదిరించగలవారొక్కరుకూడ లేరని యనుకొనుట కవకాశమేర్పడెను. కాని, నిజముగ నప్పటినుండియే అతని కష్టము లధికములయ్యెను.

యుద్ధములు :- ద్వితీయదశ ( 1690 - 1707 ) :- రాజు యొక్క వధయు, రాజ కుమారుని చెఱయు మహారాష్ట్రులను భయపెట్టుటకు బదులు వారి క్రోధమును, స్వాతంత్ర్యరక్షణ మందు వారికి గల పట్టుదలను వేయిరెట్లు హెచ్చగునట్లు చేసెను. ఎన్నటికికూడ వారు మొగలాయీలకు లోబడకూడదను నిశ్చయములోనుండిరి. వారికి తగిన నాయకులు కూడ లభించిరి. కొన్ని సంవత్సరముల వరకు శివాజీ రెండవ కుమారుడగు రాజారాం, తర్వాత రాజారాం భార్యయగు తారాబాయి శౌర్య సాహసములతో మహారాష్ట్ర పాలనను, సైన్యములను నడపిరి. సామ్రాజ్య వైశాల్య మందును, సైనికుల సంఖ్యయందును, ధనబాహుళ్యమందును ఔరంగజేబు వారికంటె నెంతో అధికుడైనను తుదకు వారినోడించుట యతని కసాధ్యమయ్యెను. దీని కనేక కారణములు కలవు. అతని సేనానాయకు లైకమత్యము లేక స్వార్థపరులై మెలగిరి; రాకపోకలు సులభములుకాని కొండదేశములందు విరామములేక యుద్ధము చేయవలసి వచ్చుట చేత అతని సైనికులు నిరుత్సాహులైరి; మహారాష్ట్రములోని దుర్గములు కొండ శిఖరములపై నుండుటచేత సంవత్సరముల పర్యంతము ముట్టడించినగాని అవి మొగలాయీలకు వశపడవయ్యెను; జింజికోటను ఏడు సంవత్సరముల కాలము (1691-98) వారు ముట్టడించిరి; సతారాకోటను వశపరచుకొనుట కొక సంవత్సరము పట్టెను. మహారాష్ట్రుల వశమందు వందలకొలది దుర్గములుండుట చేత వాని నన్నిటిని సాధించుట మొగలాయీల తరము కాదయ్యెను. మహారాష్ట్రుల యుద్ధపద్ధతి కూడ విచిత్రముగ నుండెను. వారు చిన్న చిన్న గుంపులుగ కూడి "వానర యుద్ధక్రమము" ననుసరించి శత్రుసైన్యముల వెంటనంటి పరుగిడుచుండిరేగాని, ఒక చోట నిలబడి యుద్ధము చేసినవారు కారు. ఈ ప్రతికూలములకు తోడు నదీ ప్రవాహముల మూలముననను, క్షామముల మూలముననను, వ్యాధుల చేతను మొగలాయీ సైనికులపరిమిత నష్టమును పొందిరి. ఇట్టి పరిస్థితులలో ఔరంగజేబు రోగపీడితుడై క్రీ. వె. 1707లో మృతిగాంచెను. ఇరువదియారు సంవత్సరముల కాల మతడు దక్కనులో నున్నందున ఉత్తర ఇండియాలో నతనికి గలిగిన కష్టము లధికమయ్యెను. దూరమందుండిన పాదుషాయొక్క అనుజ్ఞల ననుసరింపక, అతని యుద్యోగస్థులు

విచ్చలవిడిగ సంచరింపసాగిరి; సామంతులు, జమీందారులు తిరుగుబాటు చేసిరి; శిక్కులు, జాటులు, రాజపుత్రులు లోనగువారు ప్రబలులైరి; వాయవ్యసరిహద్దులలోని అల్లరులు హెచ్చును; కోశము పలుచబడెను. దక్కను యుద్ధముల వలన దక్షిణదేశము శాశ్వతముగ నతనికి లభింపక పోవుటయేగాక ఉత్తర ఇండియాలోని మొగలాయీ సామ్రాజ్యముకూడ శిథిలము కాసాగెను. ఉలేమా కాదగ్గవాడు సింహాసనారూఢుడగుట చేత ఇట్టి ప్రమాదమ్ము సంభవించెను.

## 13. మొగలాయీ సామ్రాజ్యము క్షీణించుట

**సామ్రాజ్యము క్షీణించుట :-** ఔరంగజీబు మృతి జెందిన తరువాత నలుబది సంవత్సరముల లోపల మొగలాయీ సామ్రాజ్యము విచ్ఛిన్నమయ్యెను. అందులో కొంతభాగమును విదేశీయులును, కొంతభాగమును మహారాష్ట్రులును, కొంతభాగమును రాష్ట్రములలోని సుబేదారులును వశపరచుకొనిరి. హిందూ దేశములో నంతకు పూర్వము స్థాపింపబడిన సామ్రాజ్యములకు పట్టిన గతియే మొగలాయీ సామ్రాజ్యమునకు కూడ పట్టెను. దేశముయొక్క బాహుళ్యమగు వైశాల్యము, సైన్యముల శీఘ్రగమనమునకు కావలసిన ప్రయాణ సౌకర్యములు లేకపోవుట, రాష్ట్రములోని రాజప్రతినిధుల స్వార్థపరత్వము-ఇవి అన్ని సామ్రాజ్యముల విచ్ఛిన్నమునకును సామాన్యములగు కారణములు. ఇవిగాక మొగలాయీ సామ్రాజ్యము క్షీణించుటకు విశేష కారణములు కొన్ని యుండెను.

**ప్రజల ప్రాతికూల్యము :-** మొగలాయీలు పరాయి దేశము నుండి వచ్చినవారు. వారి సామ్రాజ్యమున కాధారము ప్రజల అనురాగము కాదు. ప్రజలు ఉపేక్షభావమును వహించునంత వరకే అది నిలబడియుండుటకు వీలయ్యెను. ఔరంగజీబు యొక్క దుర్నీతి వలన హిందువులందరు ఉపేక్షను మాని ప్రాతికూల్య భావమును వహించిరి. వారిలో యుద్ధనిపుణులగు రాజపుత్రులు, మహారాష్ట్రులు, శిక్కులు మొదలగువారు చక్రవర్తులపై తిరుగుబాటు జేసిరి. వారి నణచటకు కావలసిన సామర్థ్యము క్రీ.వె 1707 తర్వాత సింహాసనమునకు వచ్చిన పాదుషాలకు లేదయ్యెను. ఆ పాదుషాలు తెలివితేటలు లేనివారు; భోగపరాయణులు; అల్పకాలము మాత్రమే అధికారము ననుభవించినవారు; మంత్రుల చేతిలోని కీలుబొమ్మలు, ప్రజ్ఞావంతులగు చక్రవర్తులుండవలసిన కాలములో ప్రజ్ఞాహీనులు సింహాసనాధిష్ఠితులగుట సామ్రాజ్యము యొక్క దురదృష్టమును సూచించుచున్నది.

**రాజ్యాంగపద్ధతులందలి లోపములు :-** సింహాసనము నధిష్ఠించు విషయమున

క్రమపద్ధతి లేనందున రాజ్యమునకై పెనుగులాటలు అధికముగ నుండెను. తండ్రి కొడుకులలోను, అన్నదమ్ములలోను పరస్పర ద్వేషము హెచ్చుయ్యెను. మొగలాయీ పరిపాలనంతయు పర్షియా మొదలగు విదేశములనుండి ఉద్యోగమునకై మన దేశమునకు వచ్చిన మహమ్మదీయ ఉద్యోగస్థులద్వారా జరుగుచుండెను ; వీరిలో ననేకులు షియ్యాలగుట చేత ఔరంగజేబు యొక్క క్రోధమునకు గురియైరి. ఈ కారణము చేత సమర్థులగు ఉద్యోగస్థుల సంఖ్య తగ్గి పరిపాలనా సౌష్ఠవము నశించెను. దీనికి తోడు క్రీ. వె. 1681 తర్వాత జరిగిన యుద్ధములలో మొగలాయీ ప్రముఖులనేకుల ప్రాణములను గోల్పోయిరి. ఔరంగజేబు కాలము నుండి సైన్యముల పటుత్వము కూడ తగ్గిపోయెను. మధ్య ఆసియాలోని చలిదేశముల నుండి వచ్చు చుండిన దేహదార్ఢ్యముగల సైనికులు వచ్చుట మానిరి. మన్‌సబ్దారులు స్వాతంత్ర్యమును వహింపసాగిరి. నిలుపులేక యుద్ధములు జరుగుచుండుట చేత పాదుషాలకు కాలవసినధనమునకు మితిమేరలు లేకుండెను. ప్రజలు చెల్లించవలసిన పన్నుల సంఖ్యయు, వాటి భారమును విపరీతమయ్యెను. దేశములోని దారిద్ర్యము హెచ్చెను. ఉద్యోగస్థులు ప్రజలను పీడింపసాగిరి. ఇట్టి ఆర్థిక దుస్థితికూడ సామ్రాజ్య పతనమున కొక కారణమయ్యెను. ఇట్టి సందర్భములలో విదేశరాజులు సామ్రాజ్యముపై దండెత్తివచ్చి, ప్రజలను దోపిడి జేసి, వాయవ్య భాగమందున్న రాష్ట్రములను హరించిరి. వర్తకమునకై వచ్చిన ఐరోపియనులు రాజకీయ వ్యవహరము లందు జోక్యము కలుగ జేసికొని బంగాళమందును, కర్ణాటక మందును అధికారమును సంపాదింప ప్రయత్నించిరి. పాదుషాల వద్దగాని, వారి సుబేదారుల వద్దగాని నౌకాబలము లేనందున అట్టి ప్రయత్నములు సఫలములయ్యెను.

## 14. కడపటి మొగలాయీ చక్రవర్తులు

బహదూరుషా : - ఔరంగజేబు తర్వాత నతని కుమారులు సింహాసనమునకై పోట్లాడిరి. తుదకు వారిలో పెద్దవాడు తక్కిన వారిని చంపి బహదూరుషా అను బిరుదు నామముతో చక్రవర్తియై క్రీ. వె. 1712 వరకు రాజ్యము చేసెను. ఇతడు స్వమతమందు దురభిమానము లేక నెమ్మదిగ పాలింపదలచి రాజపుత్రులతోడను, మహారాష్ట్రుల తోడను రాజీ చేసికొని తనపై తిరుగబడిన శిక్కులతో మాత్రము యుద్ధము గావించి కొంతవరకు వారి బలము నణచెను. ఇతని యనంతరము జహాందరుషా అనువాడు పదునొకండు నెలలు రాజ్యము చేసెను. క్రీ. వె 1713 లో ఫరుక్‌సయ్యరనువాడాతనిని చంపి, సయ్యదులను ఇద్దరు సోదరుల సహాయ్యమున సింహాసనమెక్కెను.

సయ్యదు సోదరులు :- సయ్యదు లిద్దరు అన్నదమ్ములు. ఆ కాలమున మహమ్మదీయ ప్రముఖులు మూడు పక్షములుగ విభాగమై యుండిరి. మొదటినుండి ఇండియాలో పుట్టిపెరిగినవారు హిందూస్థానీ పక్షమునకును, మధ్య ఆసియా ప్రాంతము నుండి వచ్చినవారు తురానీ పక్షమునకును, పర్షియా ప్రాంతమునుండి వచ్చినవారు ఇరానీ పక్షమునకును చెందియుండిరి. సయ్యదు సోదరులు హిందూస్థానీ పక్షము లోనివారు. వీరు సర్వాధికారమును వహించి, ఫరుక్ సయ్యరును తమ చేతిలోని కీలుబొమ్మవలె నాడించుచు, తమ యధికారమును నిలబెట్టుకొనుటకై మహారాష్ట్రులతో సఖ్యముజేసి, వారి సైన్యములు ఉత్తర ఇండియాకు వచ్చుటకు కూడ నవకాశము కల్పించిరి. వారి యధికారమందుండి తప్పించుకొనగోరి ఫరుక్ సయ్యరు వారిపై కుట్రలు జేయసాగెను. అందుచేత క్రీ.వె.1719 లో వారతనిని సింహాసనము నుండి తొలగించి చంపి, వరుసగ మరియిద్దరికి పట్టము గట్టి, తుదకు వారిని కూడ సింహాసనభ్రష్టుల గావించి, ఆఖరున మహమ్మదుషా అనువానిని చక్రవర్తిగ జేసి, 'రాజనిర్మాత' లను బిరుదమునకు తగినవారైరి. విరోధిపక్షములలోనివారు దీనినంతను సహింపక, రహస్యముగ వారిపై కుట్రలు గావించి క్రీ. వె. 1722లో చక్రవర్తిని స్వాధీనపరచుకొని వారిద్దరిని చంపించిరి.

మహమ్మదుషా:- సయ్యదుసోదరుల అధికారమంతరించినను మహమ్మదుషాకు మాత్రము స్వాతంత్ర్యము లభింపలేదు. కొంతకాలము వరకతడు తురానీ పక్షమునకు నాయకుడైన నైజాముల్ ముల్కు చేతిలో నుండెను. ఇతడు పాదుషా చేత చక్కగ రాజ్యము చేయించనెంచెను. గాని విరోధిపక్షములలోని నాయకులాతని ప్రయత్నము లను భంగపరచిరి. అంతటితో నతడు విసుగుచెంది, దక్కనుకు సుచేదారుడుగ వెళ్ళి, క్రీ. వె. 1724 లో స్వతంత్రుడై ఇప్పటి హైదరాబాదు సంస్థానమునకు మూల పురుషుడయ్యెను.ఇదేవిధముగ బంగాళము, అయోధ్య, రోహిలు ఖండరాష్ట్రములను పాలించుచుండిన వారుగూడ స్వతంత్రులైరి. సామ్రాజ్య మిట్లు కృశించుచుండు సమయము న పర్షియా దేశపు చక్రవర్తియగు నాదరుషా



నా ద ర్షా

ఇండియా పై క్రీ. వె. 1739 లో దండెత్తి, పానిపట్టుకు సమీపమున మహమ్మదుషా

యొక్క సైన్యములనోడించి, ఢిల్లీని వశపరచుకొని, అతిక్రూరముగ నాపట్టణవాసులలో ననేకులను హత్యజేసి, కోట్లకొలది ద్రవ్యము నపహరించి, సింధురాష్ట్రమును, సింధునదికి పశ్చిమమున నున్న మొగలాయీ రాష్ట్రములను తన సామ్రాజ్యములో చేర్చికొని, స్వదేశమునకు వెళ్ళిపోయెను. ఈ దెబ్బనుండి మొగలాయీ సామ్రాజ్యము తట్టుకొనలేక పోయెను. క్రీ. వె. 1748 లో మహమ్మదుషా మృతిజెందెను.

**ఆఖరుచక్రవర్తులు:-** మహమ్మదుషా తర్వాత రాజ్యమునకు వచ్చిన అహమ్మదుషా (1748 - 1754), రెండవ అలంగీర్ల (1754 - 1759) కాలములో స్వాధికారమునకై పెనగులాడు వివిధ పక్ష నాయకులతో ఢిల్లీ పట్టణము నిండియుండెను. దీనికితోడు అహమ్మదుషా అబ్దల్లీ అనువాడు దేశముపై దండెత్తిరాసాగెను. ఇతడు నాదరుషావద్ద సేనానిగ నుండి, అతడు మృతిజెందిన తర్వాత అఫ్గన్ స్థానము నందొక స్వతంత్రరాజ్యమును స్థాపించినవాడు. ఇతడనేక పర్యాయములు దండెత్తివచ్చి తుదకు పంజాబును వశపరచుకొనెను. పాదుషావద్ద మంత్రులుగ నుండినవారు కొందరు మహారాష్ట్రుల సహాయముతో నితని నెదిరింపజూచిరి. దానికి ఫలితముగ క్రీ. వె. 1761లో మూడవ పానిపట్టు యుద్ధము జరిగెను. అంతటితో మొగలాయీ సామ్రాజ్యమదృశ్యమయ్యెనని చెప్పవచ్చును. అప్పటికి షా ఆలం అనువాడు పాదుషా బిరుదమును వహించియుండెను. గాని అతనిని లక్ష్యపెట్టువారు దేశమందెవ్వరు లేరైరి. కొంతకాలము మహారాష్ట్రుల యొక్కయు, మరికొంతకాలము ఇంగ్లీషువారి యొక్కయు రక్షణలో నుండి క్రీ. వె. 1807 లో నితడు కాలధర్మమొందెను.

## 15. మహారాష్ట్ర రాజ్యాభివృద్ధి

### పీష్వాలు - మూడవ పానిపట్టు యుద్ధము

**సాహూ (1708-1749) :-** మొగలాయీ సామ్రాజ్యము క్షీణించుచుండిన కాలమున మహారాష్ట్ర రాజ్య మభివృద్ధిగాంచు చుండెను. ఇరువదియైదు సంవత్సరము లెడతెగక ఔరంగజీబు వంటి గొప్ప చక్రవర్తితో యుద్ధము చేసి గెలుచుట వలన స్వశక్తి యందు మహారాష్ట్రుల కెంతో నమ్మకము కలిగెను. క్రీ. వె. 1708 లో బహదూరుషా వారి రాజగు సాహూను చెరనుండి విడుదల చేసెను. యుద్ధముచేయుట యందు విస్తారమైన నేర్పులేనివాడైనను మహారాష్ట్ర సామ్రాజ్యవ్యాప్తికి సాహూ రెండువిధముల తోడ్పడెను. సమర్థులగు వారిని పీష్వాలుగ (మంత్రులుగ) నియమించి వారి ద్వారా వ్యవహారముల నన్నిటిని చక్కగ నడిపించుచుండెను. సింహాసనమునకై తనతో వివాదపడుచుండిన తారాబాయి కుమారుడగు శంభాజీతో సంధిజేసికొని, కృష్ణకు దక్షిణమందున్న రాజ్యము

నతనికిచ్చి, దానికి ఉత్తరమందున్న ప్రదేశముతో నతడు తృప్తిపడి యుండెను. ఇందువలన అంతఃకలహములు తప్పెను. అతని యధీనములో నుండిన రాజ్యము మిక్కిలి చిన్నది యగుటచేతను, దక్షిణముగ దానిని వృద్ధిజేయుటకు వీలుపడకపోవుటచేతను పీష్వాలు మహారాష్ట్ర రాజ్యమును ఉత్తర ఇండియాలోనికి పెంచవలసినవారైరి.

పీష్వా బాలాజీ విశ్వనాథుడు (1714-1720) :- ఇతడు మొదటి పీష్వా. ఇతడు మహారాష్ట్ర రాజ్యమునకు రెండవ మూలపురుషుడని చెప్పదగియున్నాడు. ఇతడు సయ్యదు సోదరులకు సహాయము చేయ నంగీకరించి మహారాష్ట్ర నాయకుల దృష్టిని ఉత్తర ఇండియావైపు మరల్చెను. సయ్యదుసోదరుల మూలమున నితడు ఫరుక్ సయ్యరుతో సంధిజేసికొని దక్కనులోను, దక్షిణ ఇండియాలోను చౌతు, సర్దేశ్ ముఖి పన్నులను వసూలు చేయుటకును, శివాజీకాలము నాటి రాజ్యమును స్వతంత్రరాజ్యముగ ననుభవించుటకును హక్కులను సంపాదించెను. తక్కినవారెవ్వరు లోబరుచు కొనుటకు భయపడుచుండిన అంగ్రియా అను మహారాష్ట్ర నౌకాదళనాయకుని బాలాజీ విశ్వనాధుడు లోబరచుకొని, అతని మూలమున కలుగనున్న ప్రమాదము నుండి రాజ్యమును రక్షించెను. చౌతు వసూలు చేయుట కను మిషపై మహారాష్ట్ర ఉద్యోగులనేకులను మొగలాయి రాష్ట్రములందు ప్రవేశపెట్టి కాలక్రమమున వానియందు మహారాష్ట్రుల అధికారము వ్యాపించునట్లు జేసెను.

మొదటి బాజీరావు (1720-1740) :- విశ్వనాథుని తర్వాత నతని కుమారుడు బాజీరావు పీష్వా అయ్యెను. ఇతడు గొప్పయోధుడు. ఇతడు ఉత్తరిండియాలో కొన్ని రాష్ట్రములను జయించి మహారాష్ట్రనాయకుల అధీనము చేసెను. ఈ విధముగ ముందుకు వచ్చినవారిలో ఇందూరు పాలకుడైన హోల్కారు, గ్వాలియరు పాలకుడైన సింధియా, బరోడా పాలకుడైన గయక్వారు, బీరారు పాలకుడైన భాన్స్లే ముఖ్యులు. క్రీ. వె. 1737 లో నితడు ఢిల్లీ పట్టణముపై పడి, మొగలాయి సైన్యము నోడించి, అనేక ప్రముఖులను చంపెను. మొగలాయి నాయకులలో నెల్ల నగ్రగణ్యుడుగ నుండిన నైజామును ఇతడనేక పర్యాయము లోడించి, అతని వశమందున్న ప్రదేశము లనేకముల నపహరించెను. పోర్చుగీసువారితో యుద్ధముచేసి వారివద్దనుండి బాసీన్ పట్టణమును తీసికొనెను. ఇతని కాలమునుండి పూనాపట్టణము మిక్కిలి ప్రఖ్యాతి గాంచినది.

బాలాజీ బాజీరావు (1740-1761) :- ఇతడు బాజీరావు యొక్క కుమారుడు. ఇతని కాలమందు మహారాష్ట్రులు కర్ణాటక నవాబుల నోడించిరి; బంగాళముపై దండెత్తి, ఒరిస్సాను జయించి, బంగాళ రాష్ట్రములో చౌతును వసూలుచేయు హక్కును

సంపాదించిరి; ఉద్గీరనుచోట నైజాముతో గొప్ప యుద్ధము చేసి, అతని నోడించి, అతని రాజ్యములోని చాలభాగము నపహరించిరి (176[illegible]). ఎచ్చట జూచినను వారి నడ్డువారు లేకుండిరి. కొలదికాలమున వారు దేశమునకంతకు పాలకులగు చిహ్నము లగుపడుచుండెను. దీనికి తార్కాణమో యన్నట్లు ఢిల్లీలో నొకపక్షమునకు నాయకుడుగ నుండిన గయజుద్దీన్, అహమ్మదుషా అబ్దల్లీ వల్ల కలుగుచుండిన ప్రమాదమునుండి తప్పించుకొనుటకు బాలాజీబాజీరావు సహాయమును కోరెను. వెంటనే పీష్వా తన సోదరుడగు రఘునాధరాయని గొప్పసైన్యముతో పంపెను. ఇతడు పంజాబులో కొంతభాగమును జయించి, లాహోరులో నొక దండును నిలిపి, పూనాకు వచ్చి చేరెను (1759). అహమ్మదుషా క్రోధావేశుడై పంజాబుపైబడి, మహారాష్ట్ర సైన్యముల నోడించి తరిమెను (1760). అప్పుడు పీష్వా మరియొక గొప్ప సైన్యమును తయారుచేసి అహమ్మదుషాపైకి పంపెను. దీనికి అసమర్థుడును, వివేకహీనుడును అగు సదాశివబౌ అనువాడు సేనాని అయ్యెను. ఇతని ప్రవర్తనవలన యుద్ధసమయమందు మహారాష్ట్రనాయకుల లోను, మిత్రులలోను అభిప్రాయభేదములు కలిగి వారి అపజయమునకు తోడ్పడెను.

**మూడవ పానిపట్టు యుద్ధము (1761):-** మహారాష్ట్రుల నెదుర్కొనుటకై వచ్చియుండిన అహమ్మదుషా అబ్దల్లీకి అయోధ్యనవాబు, రోహిలాలు, మరికొందరు మహమ్మదీయ ప్రముఖులు సహాయపడిరి. సదాశివబౌ సంప్రదాయ సిద్ధముగ వచ్చుచుండిన "వానర యుద్ధపద్ధతుల"ను మాని కొత్తయుద్ధమునకు పూనెను. రెండుపక్షములవారు పానిపట్టు వద్ద నెదుర్కొనిరి. అందు మహారాష్ట్రులు పూర్తిగ నోడిపోయిరి. వారి సేనానాయకులు, ప్రముఖులలో ననేకులు, వేలకొలది సైనికులు ప్రాణముల గోల్పోయిరి ; లక్షలకొలది ద్రవ్యము నష్టమయ్యెను. ఈ దెబ్బనుండి వారు తేరుకొనుట కష్టసాధ్యమయ్యెను. మొగలాయీల తర్వాత మహారాష్ట్రులు సామ్రాజ్యాధీశులగుదురను వాక్యము కల్ల యయ్యెను. ఇది మొదలు పీష్వా యొక్క అధికారము క్షీణింప సాగెను. హోల్కారు, సింధియా మొదలగువారు స్వతంత్రులు కాసాగిరి. ఈ కారణము లన్నిటివలన ఆంగ్లేయ సామ్రాజ్యము దేశమందు వ్యాపించుట సులభమయ్యెను. ఇవియే మూడవ పానిపట్టు యుద్ధమువలన కలిగిన ఫలితములు.

## ప్రశ్నలు

1. ఇండియాకు రాకపూర్వము బాబరు ఏమి చేసెను? అతడు ఇండియాపై నెందుకు దండెత్తెను? అతని విజయములకు కారణమేమి? మొదటి

పానిపట్టుయుద్ధము, కాణ్వహాయుద్ధము, గోగ్రాయుద్ధము - ఇవి యెప్పు డెవరెవరికి జరిగెను? వీని ఫలితము లేవి?

2. బాబరు సంపాదించిన రాజ్యమును హుమాయూను ఏల కోల్పోయెను? షర్ఖాను డెవడు? హుమాయూను నోడించుటలో అతడెట్టి నేర్పును చూపెను?
3. షర్షా ఇండియాలో నేయే రాష్ట్రముల నేలెను? రాజ్యపద్ధతులలో నతడు గావించిన మార్పుల నైదింటిని చెప్పుము. హుమాయూను రాజ్యమును తిరిగి యెట్లు సంపాదించెను?
4. రెండవ పానిపట్టుయుద్ధము ఎప్పు డెవరెవరికి జరిగెను ? దాని ఫలితమేమి? అక్బరు సామ్రాజ్యమును సంపాదించుటకు కారణములేవి? అతడు జయించిన రాష్ట్రములను పేర్కొనుము. రాజపుత్రస్థానము, గుజరాతము, వాయవ్యసరిహద్దు రాష్ట్రములు-ఇవి వశపడుటవలన కలిగిన లాభమేమి?
5. అక్బరు రాజనీతి అపూర్వమని చెప్పుటకు కారణమేమి? అక్బరు రాజపుత్రుల నెందుకు చేరదీసెను? ఎట్లు చేరదీసెను? దాని ఫలితమేమి? అక్బరు హిందువుల నెట్లాదరించెను? అక్బరు సర్వమత సమత్వమును గ్రహించుటకు మూడు కారణములను చెప్పుము. మహమ్మదీయు లతని నెందు కిష్టపడరైరి?
6. అక్బరు నిరంకుశుడనుట కేమి కారణము? సుబా అనగా నేమి? సుబాలోని ఉద్యోగస్థులెవ్వరు? వారి అధికారము లెట్టివి? మన్‌సబ్దారు అనగా నెవరు? అతని పని యేమి? సైన్యవిధానములో అక్బరు గావించిన మార్పులేవి? భూమి శిస్తు విధానములో నతడేమార్పులు గావించెను?
7. జహాంగీరు పరిపాలనమందలి లక్షణములను నాలుగింటిని చెప్పుము. నూర్జహాను తెలివితేటలను సూచించు నిదర్శనములను రెంటిని చెప్పుము.
8. సర్ తామస్‌రో ఎవడు? అతడు ఇండియాకు ఎందుకు వచ్చెను?
9. షాజహాను కాలమున సామ్రాజ్యము సాటిలేని వైభవము గాంచెననుటకు మూడు నిదర్శనములను సూచింపుము. ఆ కాలమున మొగలాయీ సైన్య సౌష్ఠవము తగ్గెననుటకు కారణములేవి? అతని పరిపాలనా విశేషములను మూడింటిని పేర్కొనుము.
10. మొగలాయీలు దక్కనును జయింపనెంచుటకు మూడు కారణములను జెప్పుము. వారి జయములకు మూడు కారణములను బేర్కొనుము. దక్కనులో

నేయే రాష్ట్రము లెప్పుడెప్పుడు మొగలాయీల వశమయ్యెను? దక్కనును జయించుటవలన మొగలాయీ సామ్రాజ్యమునకు కలిగిన ఫలితములెవ్వి?

11. ఔరంగజేబు రాజ్యమున కెట్లు వచ్చెను? అతనిలోని ప్రధాన లోపము లేవి? అక్బరు రాజనీతికిని, ఇతని రాజనీతికిని భేదమేమి? ఈ భేదమును సూచించుటకు నాలుగు ఉదాహరణములను చెప్పుము. ఔరంగజేబు రాజనీతియొక్క ఫలితములేవి?

12. శివాజీ కాలమునాటి మహారాష్ట్రుల లక్షణము లైదింటిని పేర్కొనుము. శివాజీ బాల్య మెట్టిది ? క్రీ. వె. 1667కు పూర్వము శివాజీకి కలిగిన విజయములేవి? క్రీ. వె. 1667 తర్వాత నతడే ప్రదేశములను జయించెను ? క్రీ. వె. 1680 నాటికి మహారాష్ట్ర రాజ్య విస్తీర్ణమును వివరింపుము. శివాజీ పరిపాలనములోని ఆరు విశేషములను చెప్పుము.

13. ఔరంగజేబు దక్కను కేలవచ్చెను ? అతనికి కలిగిన విజయములను పేర్కొనుము. ఔరంగజేబు మహారాష్ట్రుల నోడింపలేకపోవుటకు నాలుగు కారణములను జెప్పుము. ఔరంగజేబు దక్కనులో నుండుట వలన కలిగిన ఫలితమెట్టిది?

14. మొగలాయీ సామ్రాజ్యము క్షీణించుటకు నాలుగు కారణములను జెప్పుము.

15. సయ్యదు సోదరు లెవరు ? "రాజనిర్మాత" లను బిరుదు వారికేల వచ్చెను? నైజాముల్ ముల్కు ఎవడు ? నాదర్‌షా దండయాత్ర వలన కలిగిన ఫలితమేమి?

16. సాహూ మహారాష్ట్ర రాజ్యవ్యాప్తి కెట్లు తోడ్పడెను ? పీష్వా లెవరు ? బాలాజీ విశ్వనాథుడు మహారాష్ట్ర రాజ్యమునకు రెండవ మూలపురుషుడెట్లయ్యెను? బాజీరా వెవరితో పోరెను ? ఏయే రాష్ట్రముల నతడు జయించెను ? బాలాజీ బాజీరావు కాలమున మహారాష్ట్రులకు కలిగిన విజయములేవి ? చౌతు, సర్దేశ్ ముఖి - అనగానేమి ?

17. మూడవ పానిపట్టు యుద్ధమునకు కారణములెవ్వి ? అందు మహారాష్ట్రు లేల యోడిరి ? దాని ఫలితములెవ్వి ?

## పదియవ ప్రకరణము

# బ్రిటీషు సామ్రాజ్యాంకురము

విషయములు :- ఇండియాకు సముద్రమార్గమును కనుగొనుట, ప్రాగ్దేశములలో పోర్చుగీసు, డచ్చివారల చరిత్ర, ఇంగ్లీషువారి రాక; పోర్చుగీసు, డచ్చివారల క్షయము, ఇండియాలోని ఫ్రెంచివారు, ఇంగ్లీషు, ఫ్రెంచివారల మొదటి ప్రదేశములు; వారి పరస్పర వైషమ్యము, కర్ణాటక యుద్ధములు. ఇంగ్లీషు వారు బంగాళమును జయించుట.

### 1. ఇండియాకు సముద్రమార్గమును కనుగొనుట; పోర్చుగీసువారు

**యూరోపియనుల ప్రాబల్యము** :- ప్రస్తుత కాలమున ప్రపంచములో చాలభాగము యూరోపియనుల పరిపాలనలోనున్నది. అధునిక ప్రపంచ చరిత్రమునకు గల లక్షణ మిదియే. ఈ మార్పు క్రీ. వె. 1500 తర్వాత జరిగినది. అంతకు పూర్వము వేయి సంవత్సరముల నుండి ఆసియాఖండ వాసులగు హూణులు, మంగోలులు, తార్తారులు, మహమ్మదీయులు మొదలగువారు ఐరోపా ఖండముపై దండెత్తి, అందులోని కొన్ని దేశములను జయించి పాలింపగలిగియుండిరి. మహమ్మదీయులలో నొకరగు తురక జాతివారు క్రీ. వె. 1453లో కాన్‌స్టాంటినోపిల్ పట్టణమును పట్టుకొని, బాల్కన్ రాష్ట్రములనన్నిటిని జయించి, మధ్యధరా సముద్రతీర దేశములవారికి హడలు పుట్టించుచుండిరి. పదునైదవ శతాబ్దాంతమున ఇండియాకు సముద్రమార్గమొకటి లభ్యపడుటచేతను, అమెరికా ఖండము కనుగొనబడుటచేతను ఈ పరిస్థితులు మారి, యూరోపియనుల ప్రాబల్యమధికమై, ప్రపంచములో నెక్కువభాగము వారి వశమగుట కవకాశము కలిగెను. ఇట్టి యవకాశ ముపయోగించు కొని, బ్రిటీషువారు ఇండియాను జయింపగలిగిరి.

**ప్రాచీన వ్యాపార మార్గములు** :- పదునైదవ శతాబ్దాంతమువరకు యూరప్, ఇండియాలకు మధ్య జరుగుచుండిన వ్యాపారము మూడు మార్గముల నడచి ఈజిప్టు, సిరియా, టర్కీ దేశములలోని అలెగ్జాండ్రియా, అంటియోక్, స్మర్నా, కాన్‌స్టాంటినోపిల్ లోనగు రేవుపట్టణముల నుండి మధ్యధరా సముద్రము మీదుగ ఇటలీలోని వెనీసు, జినోవా పట్టణముల జేరుచుండెను. ఈ మార్గముల గురించి తెలిసికొనదగిన విశేషములు మూడు కలవు. వీనిలో రెండు మెరక మార్గములు; దక్షిణమందున్న మూడవ మార్గములో

కూడ చాలభాగము మెరక మార్గము. నేలతో సంబంధములేని పూర్తి జలమార్గము వీనిలో లేదు. ఇదియే మొదటి విశేషము. ఇండియా నుండి మధ్యధరా సముద్రము వరకు ఈ వ్యాపారమంతయు మహమ్మదీయుల వశమందుండెను. వ్యాపారము చేసి మహమ్మదీయ వర్తకులును, సుంకములను విధించి సుల్తానులును విశేషలాభము గడించుచుండిరి. సుల్తానులు యూరపు ఖండములోని దేశములను జయించగలుగుటకు కొంతవరకీ లాభమే కారణము. ఇది రెండవ విశేషము. మధ్యధరా సముద్రముమీద జరుగుచుండిన వ్యాపారము వలని లాభమును వెనీసు, జినోవా పట్టణములలోని వర్తకు లనుభవించుచుండిరి. అట్లాంటిక్ సముద్ర తీరమందలి పోర్చుగల్, ఫ్రాన్సు, ఇంగ్లండు మొదలగు దేశములలోనివారు ఈ లాభములో పాల్గొనుట కవకాశము లేకుండెను. ఇది మూడవ విశేషము.

**పోర్చుగీసువారు కనుగొనిన క్రొత్తమార్గము :-** పదునైదవ శతాబ్ద ప్రారంభమందుండి ఇండియాకు మహమ్మదీయులతో సంబంధనులేని మార్గము నొకదానిని కనుగొనవలెననెడి సంకల్పము పోర్చుగీసువారికి కలిగెను. ఇందుకై వారిలో రెండు ఉద్దేశములు పురికొల్పెను. ఈ మార్గమున వ్యాపారముజేసి, విశేషలాభమును సంపాదింపవలె ననెడి యుద్దేశము మొదటిది. చాల కాలమునుండి తమకు గర్భశత్రువులుగనుండి, క్రైస్తవ మతమున కపకారము చేయుచున్న మహమ్మదీయులపై బడి, వారి మతమును, రాజకీయాధికారమును నాశముచేసి, క్రైస్తవ మతమును తూర్పు దేశములన్నిటియందు వ్యాపింప జేయవలె ననెడి యుద్దేశము రెండవది. ఇట్టి యుద్దేశములతో ప్రపంచ పటము లనేకములను తయారు చేయించి, నౌకాశాస్త్ర పరిశోధనము చేసి, గొప్ప అలల తోడను, తుపానులతోడను గూడిన మహాసముద్రములందు అన్ని ఋతువులలో ప్రయాణముచేయ యోగ్యములైన విశాలములగు నౌకల నిర్మించి, తమ్ము నెదిరించు శత్రువులను నాశము చేయుటయందుపయోగించు ఫిరంగులను తమ నౌకలలో నుంచుకొని, పట్టుదల విడువక, నూరు సంవత్సరములకాలము సముద్రమార్గమును కనుగొనుటకై ప్రయత్నించిరి. తుదకు క్రీ. వె. 1497లో వాస్కోడిగామా అను నావికుడు లిస్బన్ పట్టణమున బయలుదేరి, ఆఫ్రికాచుట్టును మహాసముద్రములపై ప్రయాణముచేసి, క్రీ. వె. 1498లో మలబారుతీరమందలి కళ్లికోటను చేరి, క్రొత్త మార్గమును కనుగొనుటయందు ధన్యుడయ్యెను.

**పోర్చుగీసువారి ప్రతిభ :-** అది మొదలొక నూరు సంవత్సరములు పోర్చుగీసువారి

ప్రతిభ ప్రపంచమందంతటను అద్వితీయముగ వెలిగెను. ఏటేట వారు నౌక లనేకములను ఇండియాదేశపు పశ్చిమతీరపు రేవుల కంపి, మిరియాలు, లవంగములు, జాజికాయ, జాపత్రి, సుగంధ ద్రవ్యములు, వస్త్రములు, ఔషధములు మొదలగువానిని కొని, యూరపుఖండమున విక్రయించి, కోట్లకొలది లాభమును సంపాదింపసాగిరి. అదివరకు వ్యాపారము చేయుచుండిన మహమ్మదీయులకును, వీరికిని విరోధము సంభవించెను. ఇతరులతో నేట్టిపోటీలేక, వ్యాపారమునంతను తమ యధీనము చేసికొనవలెనని వీరిలో నొక్కొక్క పక్షమువారు ప్రయత్నించిరి. ఈ కారణముచే యుద్ధములు తప్పవయ్యెను. పోర్చుగీసువారి నౌకలు పెద్దవగుటచేతను, అవి ఫిరంగులతో కూడినవగుటచేతను, యుద్ధములలో వారికే విజయము కలిగెను. మహమ్మదీయ వర్తకులకు సహాయముగ వచ్చిన కళ్లికోట రాజుయొక్క నౌకాదళమును క్రీ. వె.1506లోను, ఈజిప్టు సుల్తాను యొక్క నౌకాదళమును క్రీ. వె. 1509లోను వారోడించిరి. హిందూమహాసముద్రముపై వారి ఏకచ్ఛత్రాధిపత్యము స్థాపితమయ్యెను. అందు వ్యాపారము చేయదలచిన వర్తకులపై వారు సుంకములను విధించి విశేషలాభము గడించుచుండిరి. తమ యనుజ్ఞను పొందక వ్యాపారము చేయువారి యోడలను దోచుచుండిరి. వారికి రాజప్రతినిధిగ వచ్చిన అల్బూకర్కు అనువాడు (1509 - 1515) వ్యాపార సంరక్షణార్థమై కొంత సామ్రాజ్యము సంపాదింపదలచి, వర్తకమునకు కేంద్రస్థానములుగ నుండిన అర్మజు, గోవా, మలాకా మొదలగు ప్రదేశములను జయించెను. పోర్చుగీసు సైనికులకు అల్పజాతి ఇండియా స్త్రీలతో వివాహ సంబంధములను కల్పించి, వారికి పుట్టిన సంతతి ద్వారా ఈ సామ్రాజ్యమును రక్షించుట కితడు సంకల్పించెను. ఇతని తర్వాత వచ్చిన రాజప్రతినిధులు గుజరాతు తీరమందలి డయ్యూ మొదలగు రేవు పట్టణములను, సింహళద్వీపమును, మరికొన్ని ప్రదేశములను జయించిరి. పోర్చుగీసు వారితర మతములందెట్టి సహనము లేనివారు. ఈ విషయమున వీరాకాలపు మహమ్మదీయులతో పోల్చదగియున్నారు. వీరు క్రైస్తవేతరులను బలాత్కరించి తమ మతములో కలుపుకొనుచుండిరి; అట్లు కలియని వారిని చిత్రవధ గావించుచుండిరి. ఇతరులను పాలించుటకు కావలసిన సుగుణము లేవియు వీరియందు లేవు. రానురాను ఉద్యోగు లవినీతిపరులై, లంచములను పుచ్చుకొని, కాలమునంతను దుర్వ్యసనములందు గడపసాగిరి.

**పోర్చుగీసువారి క్షయము :-** క్రౌర్యము, మత విషయములందలి అసహనము, అవినీతి మొదలగువాని మూలమున వీరి అధికారము తగ్గుచు వచ్చెను. పోర్చుగల్

దేశపు జనసంఖ్య చాల తక్కువగుటచేత, జయించిన సామ్రాజ్యమును రక్షించుటకు కావలసిన సైనికులు దొరకరైరి. హిందూదేశపు స్త్రీలవలన పుట్టిన మిశ్రజాతివారి యందు యోధులకుండవలసిన గుణములు కనుపించవయ్యెను. దీనితో పాటు క్రీ.వె. 1580 లో పోర్చుగల్ స్పెయిన్ రాజుల వశమయ్యెను. అది మొదలు డచ్చివారియొక్కయు, ఇంగ్లీషువారియొక్కయు పోటీ పోర్చుగీసువారికి తగిలెను. ఈ పోటీని ఎదుర్కొని నిలబడుటకు వారికి శక్తిలేనందున క్రీ.వె. 1600 నాటికి వారి వైభవమంతయు క్షీణించెను. ఇండియాను అనుభవించు అదృష్టము నౌకాబలముగల యూరోపియనులదేయని వీరు స్పష్టపరచిరి. వీరి చరిత్రము వలన బయల్పడిన రహస్యమిదియే.

## 2. డచ్చివారు : ఇంగ్లీషువారు : ఫ్రెంచివారు

పదునారవ శతాబ్దమందుండి ఐరోపాఖండమునకు, ఇండియాకును గొప్ప అనుబంధమేర్పడెను. యూరోపియనుల చర్యలనుబట్టి హిందూ దేశ చరిత్రములో మార్పులు కలుగుట కారంభమయ్యెను. పదునారవ శతాబ్దపు చివర భాగమున హాలెండు దేశపువారగు డచ్చివారు సముద్రమార్గమున ప్రాగ్దేశములతో వ్యాపారము చేయ నిశ్చయించుకొనిరి. వారు ఆరితేరిన నావికులు. క్రీ.వె. 1580 కు పూర్వము వారు పోర్చుగల్ రాజధానియగు లిస్బన్ పట్టణమునకు వెళ్ళి, ప్రాగ్దేశపు సరకులను కొని, యూరపు ఖండపు ఉత్తరభాగములోని దేశములలో అమ్మి, చాల లాభము గడించుచుండిరి. ఈ మారు బేరము వారి కాదాయకరముగ నుండుటచేత ప్రాగ్దేశములకు వారు రావలసిన జరూరు లేకుండెను. క్రీ.వె. 1580 లో పోర్చుగల్ దేశము స్పెయిన్ రాజు వశపరచుకొనుట చేత నీ బేరమునకు భంగము కలిగెను. స్పెయిన్ రాజు హాలెండుకుకూడ ప్రభువైనను, డచ్చివారు స్వతంత్రసంపాదన దీక్షాపరులై అతనితో యుద్ధమునకు దిగిరి. కొన్ని సంవత్సరములనుండి ఘోరమగు పోరాటము జరుపు చుండిరి. వారాతని శత్రుకోటిలోని వారగుటచే లిస్బన్ పట్టణమునకు రాకుండునట్లు వారినతడు నిషేధించెను. రెండుమూడు తరములుగ వారి ఐశ్వర్యమున కాధారముగ నుండిన మారు బేరమంతరించుటచేత వారు స్వయముగ ప్రాగ్దేశములకు వెళ్ళి కావలసిన సరకులను తెచ్చుకొనుటకు తీర్మానించుకొనిరి.

డచ్చి వ్యాపారమందలి విశేషములు : -- ప్రాగ్దేశములతోడి వీరి వ్యాపారము క్రీ.వె. 1595 లో ప్రారంభమయ్యెను. వీరు మొదటినుండి హిందూమహాసముద్రపు తూర్పుభాగమందున్న జావా, బోర్నియో, అంబాయినా మొదలగు ద్వీపములతో

వ్యాపారమునకు దిగిరి; ఇండియా తోడి వ్యాపారము వీరి కప్రధానముగ తోచెను. ఐరోపాఖండవాసులు కాంక్షించిన వాసనద్రవ్యము లనేకములు ఈ లంకలలో పండుచుండెను. అచటికి వెళ్ళి వానిని కొనుగోలు చేయుట యెక్కువ లాభకరముగ నుండునని డచ్చివారు తలచిరి. ఇదిగాక పోర్చుగీసు వారి ప్రాబల్యము మలబారు తీరమందుండినంత అధికముగ నీ లంకలలో నుండినది లేదు. కావున డచ్చివారు ఈ ద్వీపములకు వెళ్ళి, అందు వర్తకశాలలను కట్టుకొని, కోటలను నిర్మించి అచటి రాజులను వశపరచుకొని, యితరుల పోటీ విస్తారముగ లేకుండ తమ వ్యాపారమును బలపరచుకొనిరి. పోర్చుగీసువారు వీరిని నిరోధంచుటకు ప్రయత్నించిరిగాని, డచ్చివారి నౌకాధిక్యతచేత వీరి ప్రయత్నములు విఫలమయ్యెను. వీరి వశమందున్న సింహళము, మలాకా మొదలగు ప్రదేశములను డచ్చివారు స్వాధీనపరచుకొనిరి. కొంతకాలమైన తర్వాత ఇండియాతో వ్యాపారముచేయుటకు డచ్చివారు మొదలిడిరి. ఇచట తయారగుచుండిన వస్త్రములను తూర్పులంకలలోని వారు విశేషముగ వాడుచుండుటయే దీనికి కారణము. ఈ బేరమును వృద్ధి జేసికొనుటకై డచ్చివారు ఇండియాకు వచ్చి పులికట్, మచిలీపట్టణము, నాగపట్టణము, చిన్‌సురా, సూరత్ మొదలగు పట్టణములలో వర్తకశాలలను నిర్మించుకొనిరి. మరియొక విషయమందుకూడ పోర్చుగీసువారికిని, డచ్చివారికిని భేదమగపడుచుండెను. డచ్చివారికి స్వమత మందు దురభిమానమును, పరమతములందు ద్వేషమును లేకుండెను. ఇతరులను బలాత్కరించి క్రైస్తవమతములో కలుపుకొనుటకు వారు ప్రయత్నించినవారు కారు. అందుచేత తూర్పుద్వీపములలో వారు స్థాపించిన సామ్రాజ్య మిటీవలివరకు నిలబడ గలిగెను.

ఇంగ్లీషువారి రాక :- పోర్చుగీసు, డచ్చివారలవలె ఇంగ్లీషువారు కూడ ప్రాగ్దేశములతోడి వ్యాపారమునకై క్రీ.వె. 1600 లో " తూర్పు ఇండియా సంఘము' అను పేరనొక వర్తకసంఘమును స్థాపించి, వారి యేలికయగు ఎలిజబెత్ మహారాణి యనుజ్ఞనుబొంది వ్యాపారమునకు దిగిరి. ప్రప్రథమున వీరుకూడ తూర్పులంకలతో వ్యాపారము చేయసాగిరి. కాని డచ్చివారు వీరి వ్యాపారము కనేకములగు చిక్కులను కలిగింపదొడగిరి. ఇంగ్లీషువారు మాత్రము కొన్నిసంవత్సరములవరకు నిరుత్సాహులుగాక పట్టుదలతో నాద్వీపములకు వెళ్లుచు, వ్యాపారమును సాగించుచును యుండిరి; ఇంతేగాక డచ్చివారితో కలిసి పనిచేయుటకుకూడ సిద్ధపడి యుండిరి. కాని డచ్చివారు వీరి పోటీని నిర్మూలముచేయ సమకట్టి, వీరిపై లేనిపోని నేరములు మోపి, వీరిలో

కొందరిని క్రీ.వె. 1623 లో అంబాయనా యనుచోట పట్టుకొని చంపిరి. అంతటితో ఇంగ్లీషువారు తూర్పు ద్వీపములతోడి వ్యాపారమును తగ్గించుకొని, మనదేశముతో వ్యాపారము చేయుట యందెక్కువ శ్రద్ధవహించిరి. ఇండియాలో ఇంగ్లీషువారి వ్యాపారమును, సామ్రాజ్యమును స్థాపితమగుటకీ విధముగ డచ్చివారు కారకులైరి.

ఇంగ్లీషువారి వర్తకశాలలు :- తూర్పు ఇండియా సంఘపు వర్తకులు క్రీ.వె. 1608 లో మన దేశమునకు వచ్చిరి. మొగలాయీ చక్రవర్తులయొక్కయు, తక్కిన రాష్ట్రాధిపతులయొక్కయు అభిమానమును సంపాదించుటకు వారు చేసిన ప్రయత్నములన్నిటికి పోర్చుగీసువారు అడ్డు తగులుచుండిరి. కాని క్రీ.వె. 1612 లో ఉభయుల నౌకాదళములకు సూరతు పట్టణసమీపమున యుద్ధము జరిగెను; అందు ఇంగ్లీషువారు గెలిచిరి. అట్లే క్రీ.వె. 1614 లో జరిగిన మరియొక యుద్ధమందుకూడ ఇంగ్లీషువారికే జయము లభించెను. ఇదిగాక పోర్చుగీసువారికి సుంకములు చెల్లించి, వారివద్ద అనుమతి పత్రములు పుచ్చుకొని, సముద్రముమీద ప్రయాణము చేయుచుండిన ఓడలుకొన్నిటిని ఇంగ్లీషువారు దోచిపట్టుకొనుచుండిరి. వీనిమూలమున నౌకాబలమందు పోర్చుగీసువారి కంటె ఇంగ్లీసువారే అధికులనియు, వారి బెదరింపులకు భయపడవలసినది లేదనియు దేశములోని పాలకులకు స్పష్టమయ్యెను. దీనికి ఫలితముగ ఇంగ్లీషువారు వర్తకశాలలను కట్టుకొనుటకు వారనుజ్ఞ దయచేసిరి. క్రీ.వె. 1611 లో మచిలీపట్టణమందును, క్రీ.వె. 1612 లో సూరతునందును, క్రీ.వె. 1650 లో హుగ్లీయందును, కాలక్రమమున బాలసూరు, పాట్నా, కాసింబజారు మొదలగు ప్రదేశములందును వారి వర్తకస్థానము లేర్పడి వారి వ్యాపారము వృద్ధియగుచుండెను. సముద్రముమీద యుద్ధము చేసి, పోటీదార్లను ఓడించినవారికే వర్తక సదుపాయములు లభింపగలవని పై చర్యలవల్ల ఋజువయ్యెను.

కోటలు :- వ్యాపారమునకై వచ్చిన యూరోపియన్ వర్తకులు మన దేశమున వర్తకశాలలనేగాక కోటలనుగూడ కట్టుకొన తీర్మానించుకొనిరి. ఈ పద్ధతిని పోర్చుగీసువారు ప్రారంభించిరి; డచ్చివారు, ఇంగ్లీషువారు దీని ననుసరించిరి. విదేశములనుండి వచ్చిన వర్తకులను రక్షించు బాధ్యత తప్పునని దేశములోని రాష్ట్రాధీశులు కోటలను కట్టుకొన ననుజ్ఞనొసగిరి. క్రీ.వె. 1639 లో చంద్రగిరి రాజు ఇప్పటి మద్రాసువద్ద సెంటు జార్జి కోటను కట్టుకొనుటకు ఇంగ్లీషువారి కనుజ్ఞనిచ్చెను. క్రీ.వె. 1661 లో బొంబాయిపట్టణము ఇంగ్లీషువారి వశమయ్యెను. అంతకుపూర్వ మది పోర్చుగీసువారి అధీనమందుండెను. ఇంగ్లండు దేశపు రాజగు రెండవ ఛార్లెసు పోర్చుగల్ రాజుయొక్క కుమార్తెను వివాహ

మాడగా, ఈ పట్టణమామెకు అరణముగ నియ్యబడెను; పిమ్మట రెండవ ఛార్లెసు దీనిని తూర్పిండియా సంఘమువారి కిచ్చివేసెను. క్రీ.వె. 1690 లో ఔరంగజేబు చక్రవర్తి ఇంగ్లీషు వారిపై దయదలచి, కలకత్తాలోని విలియం కోటను కట్టుకొనుటకు సెలవిచ్చెను. ఈలాటి కోటలలో ఇంగ్లీషువారు కొలదిపాటి సైన్యమునుంచుకొని యితర యూరోపియనులవలనను, దేశములోని దోపిడిగాండ్రమూలమునను, వారిని ఎప్పుడైన పీడించు ఉద్యోగస్థుల మూలమునను కలుగు ప్రమాదములనుండి రక్షించుకొనుచుండిరి. కాలక్రమమున వారితో వ్యాపారము చేయదలచిన దేశీయవర్తకులు, నేతగాండ్రు, ఇతర విధములగు పనులను చేయువారు కోటల వెలుపలనుండు పేటలలో చేరి వారిచే రక్షింపబడుచుండిరి. ఈ విధముగ కొంతకాలమునకు మద్రాను, బొంబాయి, కలకత్తా మొదలగునవి గొప్ప పట్టణములయ్యెను. ఈ పట్టణములలో పన్నులబాధ అధికము కాకుండుట చేతను, న్యాయపరిపాలనము సక్రమముగ జరుగుచుండుట చేతను, తమతమ మతముల ననుసరించుటయం దాటంకములు లేకుండుట చేతను ప్రజలనేకులు వచ్చి కాపురము చేయసాగిరి.

**ఫ్రెంచివారి రాక** :- డచ్చివారు తూర్పుద్వీపములందును, ఇంగ్లీషువారు ఇండియాయందును వర్తకశాలలను, కోటలను కట్టుకొనుట ప్రారంభించిన తర్వాత చాలకాలమునకు ప్రాగ్దేశములతో వ్యాపారము చేయవలెననెడి కోరిక ఫ్రెంచివారికి కూడ కలిగెను. ఇందుకై క్రీ.వె. 1664లో వారొక తూర్పుఇండియా సంఘమును స్థాపించి, క్రమక్రమముగ మచిలీపట్టణము, సూరతు మొదలగు చోట్ల వర్తకశాలలను, పుదుచ్చేరి, చంద్రనగరములందు కోటలను నిర్మించుకొనిరి. కాని వ్యాపారమందు డచ్చి, ఇంగ్లీషువారల కున్నంత నేర్పు, సాహసము ఫ్రెంచివారికి లేనందున చాలకాలమువరకు వారికి నష్టమేగాని లాభము రాకుండెను. క్రీ.వె. 1720 తర్వాత వారి స్థితి కొంచెము చక్కబడసాగెను.

## 3. ఇంగ్లీషు, ఫ్రెంచివారల స్పర్థ : కర్ణాటక యుద్ధములు

**అధికార కాంక్ష** :- ఇంగ్లీషువారు మనదేశమునకు వచ్చిన తర్వాత సుమారు నూటనలువది సంవత్సరముల వరకు వర్తకముచేసి, లాభము సంపాదించు నుద్దేశముతోడనే యుండిరి. ఒకప్పుడు మాత్రము వారు దూరమాలోచింపక, క్రీ.వె. 1686 లో ఔరంగజేబుతో యుద్ధమునకు దిగి, కొన్ని ప్రదేశములను జయింప ప్రయత్నించిరి; కాని అందు వారపజయముగాంచుట చేత అట్టి ప్రయత్నములను

మానుకొనిరి. వర్తకరక్షణమునకు కావలసిన కోటలు, కోటలలోని స్వల్పసైన్యముల పోషణకు కావలసిన ఖర్చులకొరకు చుట్టుపట్లనున్న కొన్ని గ్రామములపై పెత్తనము - వీనిని మాత్రము వారు సంపాదించి తృప్తిపడియుండిరి. ఫ్రెంచివారు కూడ క్రీ.వె. 1740 వరకు ఇట్టి స్థితియందే యుండిరి. కాని క్రీ.వె. 1740 నాటికి మనదేశములోని రాజకీయ పరిస్థితులు తారుమారయ్యెను. మొగలాయీ సామ్రాజ్యము విచ్ఛిన్నమయ్యెను. మహారాష్ట్రులు కొంత దేశమును మాత్రమే జయింపగలిగిరి, తక్కిన భాగములను దోపిడి చేయుచుండిరి. దేశమంతయు తనదియని చెప్పుకొనగల చక్రవర్తి లేడయ్యెను. అనాథయగు దేశమున బలవంతులగు వారనేకులు యుద్ధములజేసి రాజ్యములను సంపాదించుచుండిరి. హైదరాబాదు నేలుచుండిన నిజాముగాని, అయోధ్య, బంగాళము, రోహిలఖండము మొదలగు రాష్ట్రముల నేలుచుండిన నవాబులుగాని న్యాయానుసారముగ రాజ్యమునకు వచ్చినవారు కారు; చక్రవర్తులను ధిక్కరించి స్వభుజబలము చేత రాజ్యములను సంపాదించినవారు. తమకు లభ్యపడిన రాజ్యములతో తృప్తిగాంచక, వాటిని విస్తరింపజేసికొనుటకై వారు పరస్పరము పోరాడుచుండిరి. దేశమందనేక రాజులున్నను అరాచకము వ్యాపించెను. నెమ్మదిగ వర్తకము చేసుకొనుటకు వీలులేదయ్యెను. ఇట్టి పరిస్థితులలో విదేశ వర్తకుల వ్యాపారమును రక్షింపగల రాజులు లేరైరి. వారిని వారే రక్షించుకొనవలసివచ్చెను. ఏలాంటి హక్కులు లేని వారందరు రాజ్యములను సంపాదించుచుండ తాముమాత్రమూరకుండుట యేల యని ఇంగ్లీషువారు, ఫ్రెంచివారు ఆలోచింపసాగిరి. అధికార కాంక్ష వారియం దుదయించెను.

**ఇంగ్లీషు, ఫ్రెంచివారల స్పర్థ :-** ఈ కాంక్ష ఉదయించిన తర్వాత కూడ కొన్ని సంవత్సరముల వరకు వీరు రాజ్యములను సంపాదించి, స్వయముగ రాజ్యము చేయ నిష్టపడలేదు. తమకిష్టులైనవారిని రాజులుగ జేసి, వారి యభిమానము మూలమున తమకు కావలసిన వ్యాపారానుకూలములను, తదితర లాభములను పొందగోరిరి. ఈ ప్రయత్నములో వీరిద్దరికి స్పర్థ తప్పదయ్యెను. ఒకరి పోటీ రెండవవారు సహింపరైరి. ఇదిగాక క్రీ.వె. 1689 మొదలు క్రీ.వె. 1815 వరకు ఐరోపాఖండమందు ఇంగ్లీషువారికిని, ఫ్రెంచివారికిని అనేక యుద్ధములు జరిగెను. ఒకరిని మించి యొకరు తమ వ్యాపారమును, సామ్రాజ్యమును ప్రపంచమందంతట వ్యాపింపజేయ జూచుచుండిరి. అందుచే ఐరోపాలో యుద్ధము ప్రారంభమైనప్పుడెల్లా ఇండియాలోకూడ నీ రెండు పక్షములవారికి యుద్ధము సంభవించుచుండెను. క్రీ.వె. 1740 తర్వాత ఇండియాలో

అట్టి యుద్ధములు మూడు జరిగెను. నెల్లూరు మొదలు తిరుచినాపల్లి వరకు వ్యాపించిన కర్ణాటక రాజ్యమీ యుద్ధములకు ప్రధాన రంగమగుటచే, వీటికి కర్ణాటక యుద్ధములను పేరు వచ్చెను. మద్రాసు, పుదుచ్చేరిపట్టణములు కర్ణాటక రాజ్యములోనివే. అర్కాటు పట్టణమును రాజధానిగ జేసుకొని ఆ రాజ్యము నేలుచుండిన నవాబు హైదరాబాదు నిజాముక్రింద సామంతుడుగ నుండెను.

**మొదటి కర్ణాటక యుద్ధము (1746 - 1748) :-** క్రీ.వె. 1744లో ఐరోపాఖండమున "ఆస్ట్రియా వారసత్వపు యుద్ధ" మను పేర ఇంగ్లీషువారికిని, ఫ్రెంచివారికిని యుద్ధమారంభమయ్యెను. ఆ సందర్భమున క్రీ.వె. 1746 లో ఫ్రెంచివారు మద్రాసు పట్టణమును పట్టుకొని, క్రీ.వె. 1747 లో పుదుచ్చేరిని పట్టుకొనుటకై వచ్చిన ఇంగ్లీషువారిని తరిమిరి. క్రీ.వె. 1748 లో రెండు పక్షములవారికి ఐరోపాలో సంధిజరుగుటచే మద్రాసు ఇంగ్లీషువారి కిచ్చివేయబడెను.




కర్ణాటక, మైసూరు యుద్ధములను సూచించు పటము

డూప్లే :- మొదటి యుద్ధమువలన నేపక్షమువారికి రాజ్యలాభము కలుగలేదుగాని, ఫ్రెంచి గవర్నరగు డూప్లే యొక్క మనోభావము మాత్రము పూర్తిగ మారి, రాజ్యాధికార సంపాదనమునకై అతనిని పురికొల్పెను. ఇట్టి మార్పాతనిలో కలుగుటకు ప్రబలకారణము కలదు. క్రీ.వె. 1746 లో మద్రాసును ఫ్రెంచివారు పట్టుకొనిన వెంటనే కర్ణాటక నవాబగు అన్వారుద్దీ న్ తన యనుమతిలేక విదేశవర్తకులు తన రాజ్యములో యుద్ధము చేయ కూడదని ప్రకటించి ఫ్రెంచి వారిపై కొక గొప్ప సైన్యమంపెను. అప్పుడు డూప్లే వద్ద స్వల్ప మగు యూరోపియన్ సైన్యము ను, కొద్దిపాటి సిపాయి సైన్యము నుండెను. నవాబు యొక్క గొప్ప సైన్యమునకును, ఫ్రెంచివారి చిన్న సైన్యమునకును యుద్ధము జరిగి, అందులో ఫ్రెంచివారికి పూర్ణమైన జయము లభించెను. ఇందుమూలమున డూప్లే మారిపోయెను. చక్కగ తర్ఫీదుపొంది, నిలుకడ గలిగి, తుపాకులతోడను, ఫిరంగులతోడను యుద్ధముచేయగల యూరోపియన్ సైన్యముల యెదుటను, యూరోపియ న్ నాయకులచే శిక్షితులైన సిపాయిసైన్యముల యెదుటను స్వదేశరాజులసైన్యము లెంత గొప్పవైనను ఎందుకును పనికిరావను నమ్మక మతనికి కలిగెను. స్వదేశరాజులను లక్ష్యపెట్టక తన యిష్టమువచ్చినట్లు సంచరింపవచ్చునని యతడు తలఁచెను. వర్తకము మూలమున వచ్చు లాభముకంటె తన వద్దనున్న సైన్యములతో స్వదేశరాజులకు సహాయముచేసి, యుద్ధములందు వారిని గెలిపించినచో నెక్కువలాభము వచ్చునని అతనికి తోచెను. డూప్లేలో కలిగిన యీ మార్పే రెండవ కర్ణాటక యుద్ధమునకు కారణమయ్యెను.



డూప్లే

**రెండవ కర్ణాటక యుద్ధము (1749 - 1755) :-** క్రీ.వె. 1748 లో హైదరాబాదు రాజ్యమును ప్రతిష్ఠాపించిన నైజాముల్ ముల్కు మృతినొందెను. వెంటనే ఆ రాజ్యమునకై నాజర్‌జంగు, ముజఫర్ జంగు అనువారలు పోరాడసాగిరి. అదే సమయమున కర్ణాటక రాజ్యమునకై చందాసాహేబు అన్వారుద్దీనుతో యుద్ధమునకు దిగెను. తన యుద్దేశములు కొనసాగుటకు తగిన తరుణము లభించినదని డూప్లే ముజఫర్ జంగు, చందాసాహేబుల పక్షమవలంబించి, క్రీ.వె.1749లో అంబూరువద్ద అన్వారుద్దీను నోడించి చంపి,

చందాసాహేబుకు పట్టముగట్టెను. చందాసాహేబు కృతజ్ఞతా సూచకముగ డూప్లేకు ఎనుబది గ్రామములను, చాల ధనమును ఇచ్చెను. అన్వారుద్దీన్ కుమారుడగు మహమ్మదాలీ అనేక కష్టములకు లోనై తిరుచినాపల్లికోట జేరెను. ఫ్రెంచివారు, చందాసాహేబు అతని నాకోటలో ముట్టడించిరి. కర్ణాటకములోని పరిస్థితు లిట్లుండగా, డూప్లే మరియొక సైన్యమును తయారుచేసి, బుస్సీఅను గొప్ప యోధుని నాయకత్వమున ముజఫర్ జంగు సహాయార్థ మంపి, అతనిని నిజాముగ జేసెను. అందుకు బదులుగ నతడు ఫ్రెంచివారికి ఉత్తర సర్కారులనిచ్చెను. ఈ విధముగ క్రీ.వె. 1750 నాటికి ఫ్రెంచివారు ఉచ్ఛస్థితికి వచ్చిరి. వారి కిష్టులగువారు దక్షిణ ఇండియాకు ప్రభువులైరి. ఇంగ్లీషువారి వ్యాపారము నిర్మూలమగునట్లుండెను.

క్లైవు :- ఇట్టి సందర్భములో ఇంగ్లీషువారు మహమ్మదాలీ పక్షమవలంబింపక తప్పదయ్యెను. వారి ఉద్యోగములో నుండిన రాబర్టు క్లైవు ఒక సైన్యమును తీసికొని, ఆర్కాటు పట్టణమును పట్టుకొనెను. రాజధాని శత్రువశమగుటచేత తిరుచినాపల్లిని ముట్టడించుచుండిన సైన్యములో చాలభాగమును చందాసాహేబు ఆర్కాటును స్వాధీనపరచు కొనుటకు పంపెను. క్లైవు మహాపౌరుషముతో ఆర్కాటును రక్షించి, చందాసాహేబు సైన్యములను పూర్తిగ నోడించెను (1751). మరియొక ఇంగ్లీషు సైన్యము తిరుచినాపల్లి వద్ద నున్న ఫ్రెంచి సైన్యముల నోడించి, మహమ్మదాలీని సురక్షితుని జేసెను. చందాసాహేబు శత్రువుల వశమై ప్రాణములను గోల్పోయెను. ఇంతటితో డూప్లే యొక్క ప్రయత్నములు భగ్నములయ్యెను. ఇతని చర్యలవలన వ్యాపారమునకు నష్టము కలిగెనని ఫ్రెంచి అధికారులు వానిని ఉద్యోగము నుండి



క్లైవు

తొలగించి (1754), మరియొకనిని గవర్నరుగ నియమించిరి. క్రీ.వె. 1755లో ఇరుపక్షముల వారికి సంధి జరిగెను. కర్ణాటక రాజ్యమునకు ఇంగ్లీషువారి కిష్టుడైన మహమ్మదాలీ నవాబగుటకు ఫ్రెంచివారంగీకరించిరి. అంతటితో కర్ణాటకములోని ఫ్రెంచి ప్రతిభ అడుగంటెను.

**మూడవ కర్ణాటక యుద్ధము (1758 - 1761)** :- క్రీ.వె. 1756లో ఐరోపా

ఖండమున సప్తసంవత్సర యుద్ధము ప్రారంభమయ్యెను. అప్పుడు ఇంగ్లీషు సైన్యములు క్లైవు నాయకత్వమున బంగాళమందుండెను. వెంటనే ఫ్రెంచివారు యూరపునుండి దక్షిణ ఇండియాకు వారిసైన్యములను పంపియుండినయెడల కొంత వరకైన వారికి జయము లభించు అవకాశముండెడిది. వారట్లు చేయక, రెండు సంవత్సరములు ఆలస్యము గావించి, క్రీ.వె. 1758 నాటికి వారి సైన్యములను లాలీ అనువాని నాయకత్వము క్రింద పంపిరి. అతడు క్రీ.వె. 1758లో సెంటు డేవిడ్ కోటను పట్టుకొనెను. అతనికి కలిగిన విజయమిది యొక్కటే. తర్వాత నతడు మద్రాసును ముట్టడించెనుగాని పట్టుకొనలేకపోయెను. అంతటితో నిలువక హైదరాబాదులో నుండిన బుస్సీని సైన్యముతో తన సహాయార్థము పిలిపించెను. దీనికి ఫలితముగ ఫ్రెంచివారి పలుకుబడి ఆ రాజ్యమున తగ్గెను. అప్పటికి క్లైవు బంగాళమందు ఇంగ్లీషువారి అధికారమును స్థాపింపగలవాడయ్యెను. అందుచే ఇంగ్లీషు సైన్యములను కొన్నిటిని అచటినుండి ఉత్తర సర్కారులకు పంపి, ఫ్రెంచి వారిని ఆ సర్కారుల నుండి తరిమివేసెను (1759). అందుపై నిజాం ఇంగ్లీషు వారితో సఖ్యముజేసికొని ఉత్తర సర్కారులను వారికిచ్చెను. క్రీ.వె. 1760 లో ఇంగ్లీషువారు వందవాసి వద్ద లాలీని ఓడించి, క్రీ.వె. 1761 లో పుదుచ్చేరిని ముట్టడించి పట్టుకొనిరి. క్రీ.వె. 1763 లో జరిగిన సంధివల్ల పుదుచ్చేరిని తిరిగి ఫ్రెంచివారి కిచ్చిరి. కాని ఇండియాలో ఎచ్చటను వారు కోటలను గట్టగూడదనియు, సైన్యములను చేర్చగూడదనియు ఒక షరతు విధింపబడెను. ఇంతటితో ఫ్రెంచివారి ఆశలు అడుగంటెను. ఇండియాలో సామ్రాజ్యమును స్థాపింపగల యూరోపియనులు ఇంగ్లీషువారొక్కరేయనుట నిశ్చితమయ్యెను. మూడవ కర్ణాటక యుద్ధ ఫలితము లివియే.

**ఇంగ్లీషువారి విజయ హేతువులు :-** ఫ్రెంచివారితో గావించిన యుద్ధములందు ఇంగ్లీషువారికి విజయము లభించుటకు రెండు మూడు ప్రధానకారణములున్నవి. ఇంగ్లీషువారికి నౌకాబల మెక్కువగనుండెను. అందుచే వారు ఐరోపానుండి సైన్యములను, యుద్ధ సామగ్రిని సులభముగ ఇండియాకు తెచ్చుకొనగలిగిరి. వారి నడ్డగించుటకు తగినంతబలము ఫ్రెంచివారికి లేదు. ఇదిగాక యుద్ధము చేయుటయందు క్లైవు మొదలగు ఇంగ్లీషునాయకులకున్నంత నేర్పు ఫ్రెంచివారికి లేదు. దీనికితోడు మొదటినుండియు ఇంగ్లీషువారి వ్యాపారము చాల లాభకరముగ నుండినందున వారివద్ద యుద్ధములకు కావలసినంత ద్రవ్యముండెను. ఈ కారణములచే ఇంగ్లీషువారికి జయమును, ఫ్రెంచివారికి పరాజయమును లభించెను.

## 4. ఇంగ్లీషువారు బంగాళమును సంపాదించుట

బంగాళరాష్ట్రము :- హిందూదేశములోని ధనధాన్య సమృద్ధిగల రాష్ట్రములలో నాకాలమందు బంగాళ మగ్రగణ్యమై యుండెను. అందు డచ్చివారు, ఫ్రెంచివారు, ఇంగ్లీషువారు అనేక వర్తకశాలలను నిర్మించుకొని విశేషలాభము గడించుచుండిరి. డచ్చివారికి చిన్సురా పట్టణమందును, ఫ్రెంచివారికి చంద్రనగరమందును, ఇంగ్లీషువారికి కలకత్తా యందును కోటలుండెను. ఇంగ్లీషువారికి పూర్వము మన దేశముపై దండెత్తివచ్చిన వారందరు సైన్యములను ప్రధానాధారముగ జేసికొని, మెట్టమార్గమున పంజాబుమీదుగ దేశములోపలికి ప్రవేశించినవారు. అట్టి వారికి బంగాళ రాష్ట్రము చాల దూరమందుండుటచేత దానికి జయించుట కష్టసాధ్యముగ నుండెను. ఇదిగాక, ఉత్తర ఇండియాకును, దక్షిణ ఇండియాకును మధ్య దుర్గమములగు ఎడారులు, పర్వతములు, అరణ్యములు ఉండుటచేత వాటి నన్నిటిని దాటి, దక్షిణభాగమును జయించి, దేశమంనంతట ఏకచ్ఛత్రాధిపత్యము స్థాపించుట కూడ అట్టివారికి సులభసాధ్యము కాకుండెను. కాని, నౌకాబలమే ప్రధాన సాధనముగా గలిగి, జలమార్గమున దేశములోనికి చొచ్చుకొని రాదలచిన ఇంగ్లీషువారి కీకార్యము సులభమయ్యెను. కలకత్తా మొదలగు రేవు పట్టణములు సముద్రమున కనతిదూరమందుండుటయు, గంగానది మీదుగ నౌకలు రాష్ట్రములోపలికి ప్రయాణముచేయ వీలుండుటయు, బంగాళ నవాబులవద్ద నౌకాబలము లేకుండుటయు ఇంగ్లీషువారి విజయముల కనుకూలించెను. బంగాళమును, అందలి ధనధాన్యములను వశపరచుకొనినవారికి తక్కిన రాష్ట్రములను జయించుట సులభతరమయ్యెను.

సురాజుదౌలా :- క్రీ.వె. 1755లో రెండవ కర్ణాటక యుద్ధము ముగిసెను. తర్వాత మూడు సంవత్సరములకు గాని మూడవ కర్ణాటక యుద్ధము ప్రారంభము కాలేదు. ఈ రెండు యుద్ధములకు మధ్యన, ఫ్రెంచివారి మూలమున ఇంగ్లీషువారికి ప్రమాదములేని కాలమున, బంగాళ రాష్ట్రమును సంపాదించుటకు ఇంగ్లీషువారికి సమయము దొరకెను. ఇదియే వారి అదృష్టము. క్రీ.వె. 1756లో సురాజుదౌలా అను యువకుడు బంగాళమునకు నవాబయ్యెను. అప్పుడే ఐరోపా ఖండమందు ఇంగ్లీషువారికిని, ఫ్రెంచివారికిని సప్తసంవత్సరయుద్ధము ప్రారంభమగు నను వదంతి పుట్టెను. అందుపై కలకత్తాలోని ఇంగ్లీషువారు తమ కోటను మరమ్మతు చేసి బలపరచుకొనుటకు మొదలిడిరి. సురాజుదౌలా దీని కిష్టపడలేదు. కర్ణాటక రాజ్యమందు ఇంగ్లీషువారును, ఫ్రెంచివారును రాజకీయవిషయములందు జోక్యము కల్పించుకొని,

నవాబులను ధిక్కరించి, యుద్ధములలో దిగి, ఇష్టమువచ్చిన వారిని సింహాసనము నెక్కించుచుండిన కథనంతను అతడు విని యుండెను. అట్టి ప్రమాదమే తన రాజ్యమందుకూడ కలుగునని అతడనుమానపడి, కలకత్తాకోటను మరమ్మత్తు చేయకూడదని శాసించెను. ఇంగ్లీషువారతనిని తిరస్కరించిరి. అందుపై అతడు కాసింబజారులోని వారి వర్తకశాలలను వశపరచుకొని, కలకత్తాను ముట్టడించి పట్టుకొనెను (1756). బంగాళములో ఇంగ్లీషువారి వ్యాపారమడుగంటునట్లాయెను.

**బంగాళముపై ఇంగ్లీషువారి దండయాత్ర :-** ఈ వార్త తెలియగనే మద్రాసులోని ఇంగ్లీషువారొక సైన్యమును తయారుచేసి, క్లైవుయొక్క నాయకత్వమున దానిని బంగాళమున కంపిరి. అతనికి సహాయముచేయుటకై అతనితోకూడ నొక నౌకాదళము వచ్చెను. క్లైవు సునాయాసముగ బంగాళమును ప్రవేశించి, కలకత్తాను స్వాధీనపరచుకొని (1757), నవాబు సైన్యముల నోడించెను. అప్పుడు సురాజుదౌలా వారి వర్తకశాలల నిచ్చివేయుటకును, తన చర్యల వలన వారికి కలిగిన నష్టమునకు పరిహారమిచ్చుటకును,




క్లైవు కాలమునాటి బంగాళము

కలకత్తాకోటను వారు బలపరచుకొనుటకును అంగీకరించెను. కాని క్లైవుకు మాత్రము నవాబుపై ఆగ్రహము తగ్గలేదు. నవాబుకూడ స్థిరచిత్తుడు కాక ప్రజలు ద్వేషించు

కార్యము లనేకములు చేయుచుండెను. చంద్రనగరములో ఫ్రెంచివారి సహాయమును సంపాదించుటకు బదులు ఆ కోటను పట్టుకొని, నాశము చేయుటకు ఇంగ్లీషువారి కనుమతి యొసగెను. అతనిని ద్వేషించిన వర్తకులు, ఉద్యోగస్థులు అతనిపై కుట్రలుజేసి, అతని సేనానాయకుడగు మీర్జాఫరును నవాబు గావింప రహస్యముగ ప్రయత్నించుచుండిరి. క్లైవు కోరినదికూడ నిదియే. అతడీ కుట్రదారులతో కలసి, సురాజుదౌలాను రాజ్యభ్రష్టుని జేసి, ఇంగ్లీషువారి అధికారమును బంగాళములో స్థాపించుటకు సమకట్టెను.

**ప్లాసీ యుద్ధము (1757) :-** నవాబును తొలగించుటకు కావలసిన ఏర్పాటులన్నియు పూర్తియైన వెంటనే క్లైవు తన సైన్యములను చేర్చుకొని, క్రీ.వె. 1757 లో ప్లాసీవద్ద సురాజుదౌలాను ఎదుర్కొనెను. సురాజుదౌలా యొక్క సైన్యములు సంఖ్యయందు గొప్పవే; కాని క్లైవు సైన్యములు సుశిక్షితములై, ఫిరంగుల నుపయోగించుటయం దారితేరియుండెను. ఇందుకు తోడు నవాబుయెడ ద్రోహ చింతగల మీర్జాఫరు శత్రువిజయమును కోరుచుండెను. అందుచేత ప్లాసీయుద్ధములో ఇంగ్లీషువారికి పరిపూర్ణ జయము లభించెను. సురాజుదౌలా శత్రువులచేజిక్కి, ప్రాణములను గోల్పోయెను. మీర్జాఫరు బంగాళమునకు నవాబయ్యెను. ఇంగ్లీషువారి యెడల తనకుగల కృతజ్ఞతను సూచించుటకై అతడు వారికి "ఇరువదినాలుగు పరగణాల"ను ఇచ్చి, క్లైవు మొదలగు ఉద్యోగస్థులకు లక్షల కొలది ధనమును వంచిపెట్టి, బంగాళమందలి ఇంగ్లీషువారి సైన్యములకగు ఖర్చులను భరింపనంగీకరించెను. ఇంగ్లీషువారి సహాయముచే నతడు నవాబగుటచే ఇది మొదలు బంగాళమందంతట వారి అధికారము నాటుకొనెను. ఇచ్చట సన్నాహము చేసిన సైన్యములతోడను, సంపాదించిన ధనరాసుల తోడను వారు దక్షిణ ఇండియాలోని ఫ్రెంచివారి నోడించి, కాలక్రమమున వారి అధికారమును దేశమందంతట వ్యాపింపజేసిరి. కావుననే ఇండియాలో బ్రిటిషు సామ్రాజ్య సంస్థాపనమునకు ప్లాసీయుద్ధము మూలమని చెప్పదగియున్నది.

**డచ్చివారి నోడించుట:-** మీర్జాఫరు సర్వస్వతంత్రమును కోల్పోయి, పేరునకు మాత్రము నవాబుగ నుండెను. అతడు దోపిడిచేయ నెంచిన ధనకులగు గొప్ప హిందూ ఉద్యోగస్థులను ఇంగ్లీషువారు రక్షించుచుండిరి. అందుచేత నతడు వారిపై రహస్యముగ కుట్రలు చేయసాగెను. చంద్రనగరము పడిపోయిన తర్వాత ఫ్రెంచివారతనికి సహాయము చేయు స్థితిలో లేకుండిరి. కావున నతడు డచ్చివారి సహాయమును

కోరెను. వారందుల కియ్యకొని, తూర్పులంకల నుండి నౌకాదళమును, సైన్యములను బంగాళమునకు పంపిరి. అతిజాగరూకుడగు క్లైవు వారి యుద్దేశములను గ్రహించి, యుద్ధములో వారి నెదుర్కొని, వారి బలములను నాశనముచేసెను. యూరోపియనులవలన కలుగనున్న ప్రమాద మింతటితో నంతరించెను.

మీర్కాసీం (1760 - 1764) :- క్రీ.వె. 1760 లో క్లైవు ఇంగ్లండునకు వెళ్ళెను. తాను భరింపనంగీకరించిన సైన్యపుఖర్చుల నిచ్చుకొనలేక మీర్జాఫరు ఇంగ్లీషువారికి ఋణపడియుండెను. అతని అల్లుడగు మీర్కాసీం రాజ్యముపై కన్నువేసి, అతనికి చిక్కులు కలిగించుచుండెను. నవాబులను మార్చినయెడల తమకు బహుమానములు లభించునని ఇంగ్లీషువారు ధనతృష్ణతో నుండిరి. ఈ సందర్భముల కలయికవలన క్రీ.వె. 1760 లో కలకత్తాలోని ఇంగ్లీషు అధికారులు మీర్జాఫరును తొలగించి, మీర్కాసీమును నవాబుగ జేసిరి. అందుకై అతడు వారికి సుమారు ఇరువది లక్షల రూపాయలు పంచిపెట్టి, బర్ద్వాన్, మిద్నపూరు, చిట్టగాంగు జిల్లాలను వారి అధీనము చేసెను. మీర్కాసీం పేరునకు మాత్రము నవాబుగ నుండుట కిష్టపడలేదు. తమ సైన్యసహాయములేక ఎవరుగాని నవాబుగనుండుట సాధ్యము కాదను నమ్మకముతో అప్పటి ఇంగ్లీషు ఉద్యోగస్థులు చట్టవిరుద్ధముగ వర్తించి, అన్యాయముగ విశేషలాభము సంపాదించుచుండిరి. వారు నవాబుకు, చెల్లింపవలసిన సుంకములను చెల్లించుట మానిరి; నవాబులచే నిషేధింపబడిన వ్యాపారమును చేయుట మానరైరి. ఈ దుండగముల నణచుటకు మీర్కాసీం తీర్మానించి, సొంతసైన్యములను కూర్చుకొని యుద్ధసామగ్రులను తయారు చేసికొనెను. ఇట్టి పరిస్థితులలో ఇంగ్లీషు వారూరకుండుట కిష్టపడక, మీర్జాఫరువద్ద బహుమానములను పుచ్చుకొని, మరియొక పర్యాయ మతనిని సింహాసనమెక్కించి, మీర్కాసీంతో యుద్ధమునకు దిగిరి.

బక్సారు యుద్ధము (1764) :- యుద్ధ మారంభమైన వెంటనే రెండు ప్రదేశములందు మీర్కాసీముకు అపజయము కలిగెను. అందువలన అతడు బంగాళమును వదలి అయోధ్య నవాబుయొక్కయు, షా ఆలం చక్రవర్తియొక్కయు సహాయమును సంపాదించి, క్రీ.వె. 1764లో ఇంగ్లీషువారిపై దండెత్తివచ్చెను. ఇంగ్లీషువారీ ముగ్గురను బక్సారు యుద్ధమందెదుర్కొని ఓడించిరి. షా ఆలం చక్రవర్తి వారికి వశుడయ్యెను; పారిపోయిన అయోధ్య నవాబును వారు వెంటనంటి, అతని రాజ్యములో చాల భాగము నాక్రమించిరి; మీర్కాసీం చనిపోయెను. ఇంగ్లీషువారి అధికారము ఢిల్లీ వరకు వ్యాపించు సూచన లగుపడెను. బంగాళరాష్ట్రమందు ప్లాసీయుద్ధము మూలమున లభించిన అధికారము బక్సారు యుద్ధమువలన సుస్థిరమయ్యెను.

క్లైవు గావించిన యేర్పాటులు (1765 -1767) :- బంగాళములోని తమ నౌకర్లు అడుగడుగునకు నవాబులను మార్చుటయు, నవాబులు మారినప్పుడెల్ల బహుమానములను తీసికొనుటయు, చట్టవిరుద్ధముగ వ్యాపారము చేయుటయు మిక్కిలి అసంగతమని ఇంగ్లండులోని అధికారులు భావించి, ఈ లోపములను సరిచేయగలవాడు క్లైవు ఒక్కడేయని అతనిని బంగాళమునకు గవర్నరుగ పంపిరి.



అతడు క్రీ.వె. 1765 లో బంగాళమును చేరెను. షాఆలం చక్రవర్తియు, అయోధ్య నవాబును, ఇంగ్లీషువా రెట్లు చెప్పిన అట్లు నడుచుకొనుటకు సిద్ధులైయుండిరి. బంగాళ రాష్ట్రములో పన్నులు వసూలు చేయుటకు కావలసిన దివానీ అధికారమును చక్రవర్తినుండి అతడు సంపాదించి, దానికి బదులుగ ఏటేట నిరువదియారులక్షల రూపాయల కప్పము కట్టుటకును, అయోధ్యలోని జిల్లాలను రెంటిని అతని కిచ్చుటకును క్లైవు సమ్మతించెను. ఇది మొదలు తూర్పిండియా సంఘమువారు బంగాళమునకు దివానులైరి. పన్నులవసూలు, సివిల్ వ్యవహారముల పరిష్కారము వారి ఆధీనమయ్యెను. ఇట్లే క్లైవు అయొధ్య నవాబుతో సంధిజేసికొని, ఏబదిలక్షల రూపాయలు తీసికొని అతని రాజ్యమతని కిచ్చెను. ఇది మొదలతడు ఇంగ్లీషువారికి మిత్రుడై పడమటి దిక్కునుండి బంగాళముపైకి శత్రువులు దండెత్తి రాకుండ సహాయము చేయ సంసిద్ధుడయ్యెను. అటుతర్వాత క్లైవు సంఘపు ఉద్యోగస్థుల జీతములను వృద్ధి చేసి వారెవ్వరు స్వదేశ రాజుల వద్ద బహుమానములను పుచ్చుకొనగూడదని శాసించెను; సైన్యపు ఖర్చులలో అనవసరములని తోచిన భాగములను తగ్గించెను. ఇట్లు జరూరైన ఏర్పాట్లు కొన్నిటిని చేసి అతడు క్రీ.వె. 1767 లో ఇంగ్లండునకు వెళ్ళిపోయెను. ఇదిమొదలు బంగాళ ప్రభుత్వములో కొంత అధికారము ఇంగ్లీషువారిదిగను, కొంత అధికారము నవాబుదిగను ఉండుటచేత నీ పద్ధతికి ద్వంద్వప్రభుత్వమను పేరు వచ్చెను.

ద్వంద్వ ప్రభుత్వ ఫలితములు :- దివానీ అధికారము వచ్చుటచేత నవాబులతో సంబంధములేక తమకు కావలసిన ద్రవ్యము తామే సమకూర్చుకొని ఇంగ్లీషువారు కొంత లాభమును పొందినను ప్రజలు మాత్రమనేక బాధలకు లోనైరి. రాష్ట్రమును పాలించు బాధ్యత ఇంగ్లీషువారు వహింపరైరి. వివాదములను పరిష్కరించుట, దుష్టులను శిక్షించుట మొదలగు పనులను చేయవలసిన పూచీ నవాబుపై నుండెను. కాని యీ పనులను చక్కగ చేయుటకు కావలసిన అధికారముగాని, ద్రవ్యోపపత్తిగాని అతనికి లేకుండెను. . దౌర్జన్యమునకు దిగిన ఇంగ్లీషు ఉద్యోగస్థులను శిక్షించుట కతడు బొత్తిగ నసమర్థుడై యుండెను. అధికారమున్న వారికి బాధ్యతయు, బాద్యతయున్నవారికి అధికారమును లేకపోవుటచేత ద్వంద్వ పరిపాలనము హానికరమయ్యెను. ఇట్టి స్థితిలో క్రీ.వె. 1770లో విపరీతమగు క్షామము సంభవించి లక్షలకొలది ప్రజలు మృత్యువువాత బడిరి. అట్టి సమయమున కూడ ఇంగ్లీషు ఉద్యోగస్థులు దయాదాక్షిణ్యములులేక ప్రజలను పీడించుచుండిరి.

## ప్రశ్నలు

1. ఇండియానుండి ఐరోపాకు ప్రాచీన వ్యాపార మార్గములెవ్వి ? ఈ మార్గముల వలన లాభమెవ రనుభవించుచుండిరి ? పోర్చుగీసువారు క్రొత్తమార్గమును కనుగొనుట కేల ప్రయత్నించిరి ? వారు కనుగొనిన మార్గమేది ? దాని మూలమున కలిగిన మార్పులేవి ? పోర్చుగీసువారి వ్యాపార ప్రాబల్యమున కేమి కారణము ? వారి క్షయమున కేమి కారణము ?
2. డచ్చివారెవరు ? వారేల ప్రాగ్దేశములకు వచ్చిరి ? వారి వ్యాపారమునకును, పోర్చుగీసువారి వ్యాపారమునకును భేదములెవ్వి ? ఇంగ్లీషువారికి డచ్చివా రెట్టి చిక్కులను గలిగించిరి ? ఇండియాలో ఇంగ్లీషు వారి వర్తకశాలలెవ్వి ? వర్తకులకు కోట లెందుకు కావలసివచ్చెను ? వారిముఖ్యమైన కోట లెవ్వి? ఆ కోటలు గొప్ప పట్టణము లెట్లయ్యెను ? ఫ్రెంచివారి ప్రధాన కోటలెవ్వి?
3. యూరోపియన్ వర్తకులు రాజ్యము సంపాదింప ప్రయత్నించుటకు కారణములెవ్వి ? ఇంగ్లీషు, ఫ్రెంచివారల స్పర్థకు కారణము లేమి ? కర్ణాటక యుద్ధము లెప్పుడెప్పుడు, ఎవ్వరెవ్వరికి జరిగెను ? వాని ఫలితము లెవ్వి? డూప్లే యుద్దేశములెట్టివి ? ఫ్రెంచివా రోడుటకు కారణము లెవ్వి?
4. సురాజుదౌలాకు ఇంగ్లీషువారి యెడల విరోధమేల కలిగెను ? క్లైవు బంగాళము నెట్లు జయించెను ? మిర్కాసీమునకు ఇంగ్లీషువారితో యుద్ధ మెందుకు సంభవించెను ? బక్సారు యుద్ధ ఫలితములెవ్వి ? దివానీ అధికారమన నేమి? ద్వంద్వప్రభుత్వ మననేమి ? దాని ఫలితము లెట్టివి ?

పదనొకండవ ప్రకరణము

# మొదటి గవర్నరు జనరలులు

విషయములు :- వారన్‌హేస్టింగ్సు. రెగ్యులేటింగ్ ఆక్టు. హేస్టింగ్సు యొక్క పరిపాలనము. పిట్టుయొక్క ఇండియా చట్టము. కారన్‌వాలీసు ప్రభువు. వెలస్లీ ప్రభువు. విప్లవము గాంచిన ఫ్రాన్సుకును, ఇంగ్లండుకును పరస్పర సంఘర్షణము. సైన్యసహకారపద్ధతి. మైసూరు, మహారాష్ట్ర యుద్ధములు. హేస్టింగ్సు ప్రభువు. మహారాష్ట్రాధికార వినాశము.

## 1. వారన్ హేస్టింగ్సు

**మొదటి గవర్నరు జనరలులు (1773 - 1823) :-** ఇండియాలోని బ్రిటిషు సామ్రాజ్యమునకు క్లైవు పునాదులను వేసెను. శత్రువుల వలన వాటికి భంగము కలుగకుండ ప్రథమ గవర్నరు జనరలైన వారన్ హేస్టింగ్సు వాటిని రక్షించెను. ఈ విధముగ గట్టిపడిన పునాదులపై కారన్‌వాలీసు (1786 - 1793), వెలస్లీ (1798 - 1805), హేస్టింగ్సు ప్రభువు (1813 - 23) విశాలమగు సామ్రాజ్య భవనమును నిర్మించిరి. మొదటి గవర్నరు జనరలులలో ప్రఖ్యాతి గాంచిన యీ నలుగురు చేసిన మహాకార్యమిదియే.

**వారన్ హేస్టింగ్సు :-** ఇతడు క్రీ. వె. 1772 - 73 లో బంగాళమునకు గవర్నరుగను, క్రీ. వె. 1773 - 1785 లో గవర్నరు జనరలుగను పనిచేసెను. అంతకు పూర్వమిరువది సంవత్సరముల కాల మితడు తూర్పు ఇండియా సంఘపు ఉద్యోగిగా ఇండియాలో నుండుటచేత విశేషానుభవము కలవాడయ్యెను. ప్రజలు పడుచున్న బాధలన్నిటికి ద్వంద్వ పరి పాలనము మూలకారణమని గ్రహించి, ఆపద్ధతిని రద్దుచేసి ప్రజలను పాలించు భారమును సంఘమువారు వహించు నట్లుగావించెను. ప్రతి జిల్లా యందు ఇంగ్లీషు కలెక్టరును, అతనికి సహాయముగ నొకఇండియన్ దివానును నియమించెను. సివిల్, క్రిమినల్ వ్యవహారములను పరిష్కరించుటకు వేరువేరుగా



వారన్ హేస్టింగ్స్

జిల్లా న్యాయస్థానములను స్థాపించి, అపీళ్లను విచారణచేయుటకు కలకత్తాలో రెండు న్యాయస్థానము లేర్పరచెను. సంప్రదాయ సిద్ధముగ వచ్చుచుండు హిందూ, మహమ్మదీయ చట్టముల ననుసరించి, దేశములోని పండితుల సహాయమున న్యాయపరిపాలనము గావింప నేర్పాటులు చేసెను. సంస్కృతపండితులను, పర్షియన్ పండితులను పోషించి, ఇంగ్లీషుఉద్యోగస్థులిట్టి ఇండియన్ భాషలను నేర్చుకొనునట్లు ప్రేరేపణజేసి, వీనిలోని ఉత్తమ వ్యవహార గ్రంథములను ఇంగ్లీషు భాషలోనికి తర్జుమా గావింపదొడగెను. సుంకముల సంఖ్య తగ్గించి వ్యాపారము నభివృద్ధిజేసెను. రైతులనుండి భూమిశిస్తును వసూలుచేయు అధికారమును ఎక్కువమొత్తమును చెల్లించుట కంగీకరించిన ఇజారాదార్లకు అయిదు సంవత్సరముల కౌలున కిచ్చెను. రాజ్య సంపాదనముకంటె ప్రజలను చక్కగ పాలించుట ముఖ్యమైనపని యని హేస్టింగ్సు నమ్మియుండెను. బాహ్య వ్యవహారములలో మహారాష్ట్రుల ప్రాబల్య మధికముకాకుండ చేయుటయే యితని ప్రధానోద్దేశము. కనుకనే ఇతడు మహారాష్ట్రులకు విధేయుడై ప్రవర్తించుచున్న షా ఆలం చక్రవర్తి కదివర కిచ్చుచున్న కప్పము నిచ్చుట మానెను; ఆతని వశమందున్న రెండు జిల్లాలను తీసికొని, ఇంగ్లీషు వారికి మిత్రుడగు అయోధ్యనవాబునకు విక్రయించెను. రోహిలాలతో యుద్ధమునకు దిగిన అయోధ్య నవాబునకు సహాయముచేసి, రోహిలఖండమును అయోధ్యరాజ్యములో కలిపి, మహారాష్ట్రుల వశము కాకుండ జేసెను. ధనలాభమే ప్రధానోద్దేశముగ బెట్టుకొన్న ఇంగ్లండులోని అధికార్లకీ చర్యలవలన చాల లాభమువచ్చెను.

సంఘవు వ్యవహారముల పరిశీలనము :- క్రీ. వె. 1600 లో ఇండియాతో వ్యాపారము చేయదలచిన ఇంగ్లీషు వర్తకులు తూర్పుఇండియా సంఘముగ నేర్పడిరి. సంఘ సభ్యులెన్నుకొనిన డైరెక్టర్ల సభవారు సంఘవ్యవహారముల నన్నిటిని పాలించు అధికారము కలిగియుండిరి. ఇండియాలోని ఇంగ్లీషు ఉద్యోగస్థులందరు ఈ డైరెక్టర్లచే నియమింపబడి వారి ఆజ్ఞలకు బద్ధులైయుండిరి. సంఘమువారి వర్తకముమీద గాని, వారి నౌకర్లు సంపాదించిన రాజ్యముమీద గాని ఇంగ్లండు నేలుచుండిన ప్రభువులకును, పార్లమెంటు సభవారికిని ఎట్టి ప్రత్యేక అధికారము లేకుండెను. ప్లాసీ యుద్ధము తర్వాత ఈ విషయములలో ఇంగ్లండునందు ప్రముఖుల అభిప్రాయము మార్పుగాంచ దొడగెను. వర్తకసంఘమువారు రాజ్యము సంపాదించుటయు, దానిమూలమున కలిగిన లాభమునంతను వారే అనుభవించుచుండుటయు, స్వల్ప జీతములతో వారి క్రింద పని చేయుచుండిన నౌకర్లు లక్షాధికారులై, ఇంగ్లండుకు వచ్చి నవాబులవలె ప్రవర్తించు

చుండుటయు, బంగాళములోని ప్రజలు అరాచకమువలన బాధపడుచుండుటయు, పార్లమెంటు సభ్యులలో విస్మయమును, అసూయను, విషాదమును కలిగించెను. అందుపై వారు తూర్పు ఇండియా సంఘపు చర్యలను పరిశీలింపదొడగిరి. ఈ పరిశీలన ఫలితముగ క్రీ. వె. 1773 లో రెగ్యులేటింగ్ ఆక్టు చేయబడెను.

**రెగ్యులేటింగ్ ఆక్టు** :- ఈ శాసనమువలన బంగాళ రాష్ట్రముయొక్క పరిపాలనమునకై 'గవర్నరు జనరలు' అను అధికారి నియమింపబడెను. పరిపాలన విషయములలో నీతనికి సలహానిచ్చుటకు నలుగురు సభ్యులుగల సభయొకటి స్థాపింపబడెను. అందులోని అధికసంఖ్యాకు లెట్లుచెప్పిన అట్లు గవర్నరు జనరలు నడుచుకొనవలసియుండెను. గవర్నరు జనరలుయొక్క అనుమతి లేక మద్రాసు, బొంబాయి ప్రభుత్వములవారు యుద్ధములలో దిగకూడదనియు, సంధిచేసి కొనకూడదనియు శాసింపబడెను. బ్రిటిషు ప్రజలకు సంబంధించిన వివాదములను, వ్యవహారములను పరిష్కరించుటకు కలకత్తాయందొక ఉన్నత న్యాయస్థాన మేర్పరుపబడెను. ఇంగ్లండులోని డైరెక్టర్లు ఇండియాలోని నౌకర్లకు పంపు ఉత్తరములలోని విషయములను మంత్రివర్గము వారికి తెలియజేయవలసినట్లు విధింపబడెను. ఈ శాసనము ననుసరించి వారన్ హేస్టింగ్సు మొదటిగవర్నరు జనరలయ్యెను.

**హేస్టింగ్సు పరిపాలనము** :- గవర్నరు జనరలైనప్పటి నుండి హేస్టింగ్సు యొక్క చిక్కులు వృద్ధిగాంచెను. అతనికి సలహానిచ్చుట కేర్పడిన సభలో ముగ్గురతనికి విరోధులై, అతడదివరకు చేసిన పనులను అది మొదలు చేయదలచుకొనిన పనులను ఖండించుటయేతమకర్తవ్యమని భావించిరి. అతని కాలమంతయు వారితోటి వివాదములతో వ్యర్థమయ్యెను. పరిపాలనా సౌష్ఠవమునకై అతడదివరకు తలపెట్టిన కార్యములనతడు పూర్తిచేయలేక పోయెను. ఇట్టివివాదముల కవకాశము కల్పించుటయే రెగ్యులేటింగ్ ఆక్టులోని మొదటి లోపము. క్రీ. వె. 1780 నాటికి హేస్టింగ్సు యొక్క విరోధులలో నిద్దరు మృతిచెందిరి ; మూడవవాడు ఇంగ్లండుకు వెళ్ళిపోయెను. వారి స్థానమున నియమింపబడిన వారతనికి మిత్రులగుటచే నదిమొదలతని యిష్టానుసారముగ వ్యవహారములు నడువసాగెను.. ఉన్నత న్యాయస్థానము యొక్క అధికార మెట్టిదో స్పష్టపరుపక పోవుట రెగ్యులేటింగ్ ఆక్టులోని రెండవ లోపము.దీని మూలమున హేస్టింగ్సుకు అనేక చిక్కులు కలిగెను. న్యాయస్థానమువారు అతడదివరకు స్థాపించిన న్యాయస్థాన కార్యములందును, రెవిన్యూ వ్యవహారములందును జోక్యము కలిగించుకొని, హిందూదేశమున కన్వయించని ఇంగ్లీషు చట్టముల

నములులోనుంచుటకు ప్రయత్నించిరి. ఇదేవిధముగ బొంబాయి, మద్రాసు ప్రభుత్వములవారు హేస్టింగ్సు యొక్క అనుమతినిపొందక, అకాలములందు యుద్ధములకు దిగి, కార్యము మించిపోవుసమయములోనతని సహాయ మపేక్షింప సాగిరి. వారి తొందరవలనను, దూరదృష్టిలోపము చేతను అతడనేక కష్టములనెదుర్కొన వలసివచ్చెను. కాని చిక్కు లెన్ని కలిగినను అతడు ధైర్యమును, స్థైర్యమును విడువక, తదేకదీక్షతో వ్యవహారములను నడిపి, బ్రిటిషు సామ్రాజ్య చరిత్రమం దతివిషాదకరమైన దశలో ఇండియాలోని సామ్రాజ్యమును చెక్కు చెదరక నిలబెట్ట గలిగెను. అతని కీర్తికిదియే కారణము.

**మొదటి మహారాష్ట్ర యుద్ధము :-** మద్రాసు, కలకత్తా ప్రభుత్వములవారు స్వదేశసంస్థాన వ్యవహారములలో జోక్యము కల్పించుకొని రాష్ట్రములను సంపాదించుటయు, తామట్లుచేయలేకుండుటయు చూచి, బొంబాయి ప్రభుత్వమువారు మిక్కిలి విచారగ్రస్తులై యుండిరి. ఇది గాక మహారాష్ట్రల వశమందుండినట్టియు, బొంబాయికి కడుసమీపమున నున్నట్టియు సాల్సెట్టు ద్వీపము, బాసీన్ కోటలపై వారు చిరకాలము నుండి కన్ను వేసియుండిరి. క్రీ.వె. 1775 ప్రాంతమున వారి యుద్దేశము కొనసాగుట కవకాశమేర్పడెను. తక్కిన స్వదేశ సంస్థానముల దుర్గతికి కారణమైన కుటుంబకలహములు పూనాలోని మహారాష్ట్రులలో కూడ జనించెను. న్యాయమగు వారసత్వముచే పీష్వాపదవికి వచ్చిన నారాయణరావుకు విరోధిగ రఘునాధరావనువాడు పీష్వా అగుటకు సర్వప్రయత్నములు చేయుచు, తుదకు బొంబాయి ప్రభుత్వమువారి శరణుజొచ్చి, వారికి సాల్సెట్టు, బాసీనులనిచ్చుట కొడంబడెను.అందుపై వారాతనికి సహాయము చేయ నిశ్చయించి, కలకత్తాలోని గవర్నరు జనరలుయొక్క అనుమతినిగూడ పొందక, మహారాష్ట్రులతో యుద్ధమునకు దిగిరి (1775). ఇంగ్లండులోని డైరెక్టర్లుకూడ నీ విషయమై మిక్కిలి పట్టుదల వహించినందున, వారన్ హేస్టింగ్సు ఈ యుద్ధమున కంగీకరింపవలసివచ్చెను. తమపట్టుగెలిచెను. గదాయని బొంబాయి ప్రభుత్వమువారు హేస్టింగ్సు పంపనున్న సేనలు వచ్చువరకు వేచియుండక, తొందరపడి, పూనాను పట్టుకొనుట కొక సైన్యమంపిరి (1778). పీష్వా వద్ద ప్రధానిగ నున్నట్టియు, బహుమేధావియు నగు నానా ఫర్నవీసు మహారాష్ట్ర సైన్యమును దీని నెదుర్కొనుటకంపెను. ఈ సేన ఇంగ్లీషు సైన్యమును చుట్టవేసి కదలకుండ జేసెను. ఇంగ్లీషు సేనాధిపతికి మార్గాంతరము లేకుండుట చేత, మహారాష్ట్రులు విధించిన షరతులన్నిటికి నొప్పుకొని, రఘునాధరావును త్యజించుట కొడబడెను. ఇది జరిగిన

కొద్దిరోజులకు హేస్టింగ్సు పంపిన సైన్యములు మహారాష్ట్రమును చేరెను. అవమానకరమగు నాఒడంబడిక కతడంగీకరింపక, యుద్ధముచేయనిశ్చయించుటయేగాక, తనకుగల తెలివితేటలను మహారాష్ట్రులలో చీలికలు గల్పించుట కుపయోగపరచెను. ఈ ప్రయత్నములవలన నాగపూరు రాజగు భాన్స్లే పూనాలోని మహారాష్ట్రులతో చేరుట మానెను; బరోడా పాలకుడగు గాయక్వారు ఇంగ్లీషువారితో చేరి పీష్వాతో యుద్ధమునకు దిగెను. సింధియా మాత్రము కొంతవరకు ఇంగ్లీషువారితో యుద్ధముచేసెనుగాని వారతని ప్రధానదుర్గమగు గ్వాలియరును పట్టుకొని, ఒకటి రెండు ప్రదేశములందతని నోడించుటచేత, నతడు ధైర్యమును కోల్పోయి, సంధిజేసికొనుటకు నిశ్చయించెను. పూనాలోని నానాఫర్నవీసు మాత్రము యుద్ధము చేయుటయందును, హేస్టింగ్సు యొక్క చిక్కులను వృద్ధిచేయుట యందును ఎక్కడ లేని నేర్పును చూపి, మైసూరు సుల్తానగు హైదరాలీని, నిజామును ఇంగ్లీషువారిపైకి లేవదీసెను. క్రీ. వె. 1781 లో పూనాను పట్టుకొనుటకై వచ్చుచుండిన ఇంగ్లీషు సేన నతడు పూర్తిగ నోడించెను. అప్పటికి ఫ్రెంచివారుకూడ వారినౌకాదళముతో ఇండియాను చేరిరి. ఇట్టి విషమ పరిస్థితులలో యుద్ధము లాభములేదని, హేస్టింగ్సు సాల్బేవద్ద మహారాష్ట్రులతో సంధి జేసికొనెను (1782). రఘునాధరావు పక్షమును విడనాడుటకును, మహారాష్ట్రులవద్దనుండి తాము తీసికొనిన స్థలములలో సాల్సెట్టుతప్ప తక్కినవాని నన్నిటిని వారికిచ్చి వేయుటకును ఇంగ్లీషువారంగీకరించిరి. రఘునాధరావునకు సంవత్సరమునకు మూడులక్షల రూపాయల భరణము నిచ్చుటకు మహారాష్ట్రులొప్పుకొనిరి. తమతో సమానముగ మహారాష్ట్రులు యుద్ధము చేయగలరనియు, వారి నాయకులలో గల పరస్పర భేదముల నభివృద్ధిజేయుటయే వారిని జయించుటకు మార్గమనియు మొదటి మహారాష్ట్ర యుద్ధమువలన ఇంగ్లీషువారు తెలిసికొనిరి..

**రెండవ మైసూరు యుద్ధము :-** వారన్ హేస్టింగ్సు గవర్నరు జనరలుగ నున్న కాలములో మైసూరు రాజ్యము హైదరాలీ పాలనమందుండెను. అతడు యుద్ధమందు కడునేర్పరి ; మైసూరు హిందూరాజువద్ద సామాన్య సిపాయిగ నుండి, స్వశక్తిచే సేనానాయకుడై, తుదకు రాజ్యాధికారమును సంపాదించెను. ఆ కాలమందలి కర్ణాటక నవాబు, నిజాము, అయోధ్య నవాబు మొదలగు మహమ్మదీయ పరిపాలకులవలె నితడు ఇంగ్లీషువారనిన భయపడక, వారితో సరిసమానముగ యుద్ధము చేయగలిగి యుండెను. చుట్టు ప్రక్కలనున్న రాష్ట్రములనేకములను జయించి, తన రాజ్యమభివృద్ధి జేసికొని, క్రీ. వె. 1767లో ఇంగ్లీషువారితో యుద్ధమునకు (మొదటి మైసూరు యుద్ధము)

దిగి, కర్ణాటకముపై దండెత్తి, ఇంగ్లీషుసైన్యములనోడించి, మద్రాసుపైకి దాడివచ్చెను. అందుపై ఇంగ్లీషువారతనితో సంధిగావించుకొని (1769), శత్రువులెవరైననతని రాజ్యముపై దండెత్తివచ్చి నపుడు అతనికి సహాయముచేయనంగీకరించిరి. క్రీ. శె. 1770 లో మహారాష్ట్రులతని రాజ్యముపై బడిరి. అప్పుడతడు ఇంగ్లీషు వారి సహాయముకోరెను; కాని వారూరకుండిరి. అందుచేత నతడు వారిపై రోషమువహించి, వారినెదుర్కొనుటకు తగిన సమయమునకై నిరీక్షించుచుండెను. క్రీ. వె. 1780 లో వారు మహారాష్ట్రయుద్ధమందు మునిగియుండిరి; ఐరోపాలో ఇంగ్లీషువారు ఫ్రెంచివారితో యుద్ధమారంభించి, ఇండియా కొక నౌకాదళమును, సైన్యమును పంపసిద్ధపడిరి. ఇదే సమయమని హైదరాలీ రెండవ మైసూరు యుద్ధము ప్రారంభించి, కర్ణాటకముపై దండెత్తి, గ్రామములను కాల్చి, ప్రజలను దోచి, నానాభీభత్సము చేయసాగెను. మద్రాసు ప్రభుత్వమువారతనిపైకి సైన్యములంపిరిగాని వారినోడించి, ఆర్కాటు మొదలగు పట్టణముల నతడు పట్టుకొనెను. హేస్టింగ్సు అతి కష్టముమీద కలకత్తా నుండి సైన్యములను పంపెను; వీటికి పోర్టోనోవో, పాలిలూరు, షోలింగరు , షోలింగరు యుద్ధములలో కొంతజయము లభించినను హైదరుబలము మాత్రము తగ్గలేదు. గోరుచుట్టుమీద రోకటి పోటన్నట్లు ఫ్రెంచి నౌకాదళము ఇండియాకువచ్చి, ఇంగ్లీషువారిని బాధపెట్టసాగెను. దాని సహాయమున నతడు కడలూరును పట్టుకొనెను. తర్వాత కొంతకాలమున కతడు మృతి జెందెను (1782); కాని, అతని కుమారుడు టిప్పుసుల్తాను వెనుదీయక, యుద్ధము సాగించెను. క్రీ. వె. 1782 లో మహారాష్ట్రులతోడి సంధిజరుగుట వలన హేస్టింగ్సుకు కొంత తెరపి దొరకెను. మరికొన్ని సైన్యములనతడు టిప్పూపైకి పంపగలిగెను. అవి అతని వశమందున్న కోటలను కొన్నిటిని పట్టుకొనెను గాని, అతడుకూడ మంగుళూరు మొదలగు కోటలు వశపరచుకొనెను. రెండుపక్షముల వారి బలాబలములు సమానములుగ నుండెను. ఇదిగాక, ఆ రోజులు ఇంగ్లీషువారు అమెరికన్ కాలనీలతో యుద్ధము జేసి, పరాజయముగాంచి, వారి సామ్రాజ్యములో చాలభాగమును కోల్పోయిన రోజులు; ఉన్నది ఉండిన చాలునని వారూహించుచుండిరి. తొందరపడి సాల్బేసంధిని చేసికొనుటకుకూడ ఈ ఊహయే కారణము. ఇప్పుడు కూడ వారట్లేభావించి, టిప్పూతో మంగుళూరువద్ద సంధిజేసికొనిరి. (1784). ఉభయపక్షములవారు తాము గెల్చిన స్థలములను వదలిపెట్టుట కంగీకరించిరి. అమెరికాలోని సామ్రాజ్యమును కోల్పోయి నపుడు ఇండియాలోని సామ్రాజ్యమును నిలబెట్టిన వాడగుటచేత వారన్ హేస్టింగ్సును ఇంగ్లీషు చరిత్రకారులు ప్రశంసించుచుందురు..

హేస్టింగ్సుయొక్క దౌర్జన్యము :- అనేక విధముల హేస్టింగ్సు ప్రశంసా పాత్రుడైనను, ధనమును సంగ్రహించుటయందు మాత్రము మంచి చెడ్డలాలోచింపక దుష్కార్యములను కొన్నిటిని చేసెను. ఇదంతయు నతని లోపము కాదు. కంపెనీ డైరెక్టర్లకు లాభమొక్కటియే ప్రధానముగ నుండెను. పూర్వమువలె వారు ఇండియాలోని సరకులగొనుటకు ఇంగ్లండునుండి ధనమును పంపుటమాని, ప్రజలనుండి వసూలైన పన్నులతో సరకులను కొనవలసినదిగ నేర్పరచిరి. వారిదృష్టిలో రాజ్యము కూడ వ్యాపారమువంటి దయ్యెను. ఇదిగాక మహారాష్ట్ర, మైసూరుయుద్ధముల కెంతటిధనమును చాలకపోయెను. కావున ధనసంగ్రహణమునకై వారన్ హేస్టింగ్సు కొన్ని అవినీతిమార్గముల ననుసరింపవలసి వచ్చెను. షాఅలం చక్రవర్తికి ఒప్పందలపడిన కప్పమును నిలిపివేయుట, అయోధ్య నవాబువద్ద ఏబది లక్షలు పుచ్చుకొని దూరమందున్న రోహిలాలతో యుద్ధము చేయుట, ఒడంబడికలకు విరుద్ధముగ కాశీరాజగు చైత్రసింహుని పీడించి ధనమును లాగుటయేగాక నతనిని రాజ్య చ్యుతునిజేసి ఎక్కువ కప్పమునిచ్చుట కంగీకరించిన మరియొకనికి ఆ రాజ్యమిచ్చుట, అతి క్రౌర్యముతో అయోధ్య రాణీలవద్దనున్న లక్షలకొలదిధనము నపహరించుట మొదలగు పనులు చాలవరకు గర్హింపదగినవే. క్రీ. వె. 1785 లో హేస్టింగ్సు ఇంగ్లండునకు వెళ్ళిపోయెను. తర్వాత కొంతకాలమునకు పార్లమెంటు సభవారిలో కొందరు అతనిపై అనేక దౌర్జన్యములగావించెనను నేరమునారోపించిరి. కాని దీర్ఘవిచారణముచేసి పార్లమెంటువారతడుగావించిన దుష్కార్యములన్నియు కంపెనీ వారియొక్కయు, ఇంగ్లండు దేశముయొక్కయు లాభమున పేక్షించి చేసినందున నతడు నిర్దోషియని తీర్మానించిరి.

పిట్టు ఇండియా చట్టము (1784) :- ఇండియా వ్యవహారము లప్పటికంటె బాగుగ జరుగుటకై క్రీ. వె. 1784 లో పిట్టుఅను ప్రధానమంత్రి సలహాపైని పార్లమెంటు వారుపిట్టుఇండియా చట్టమును గావించిరి. దీనిమూలమున ఇంగ్లండులో డైరెక్టర్లపై మంత్రివర్గమునకు గల అధికారమును, ఇండియాలో గవర్నరు జనరలుయొక్క అధికారమును పెంపొందెను. ఇద్దరు మంత్రులు, నలుగురు ఇతరసభ్యులు గల అధికారసభ యొకటి ఇంగ్లండులో స్థాపింపబడెను. ఈ సభవారి ఉత్తరువులననుసరించి డైరెక్టర్లు ఇండియాకు సంబంధించిన వ్యవహారములను నడుపవలసినట్లేర్పాటు చేయబడెను. కలకత్తాలోని ఉన్నతసభలోని సభ్యులోని సభ్యులసంఖ్య నాలుగునుండి మూటికి తగ్గింపబడెను. అందుచేత గవర్నరుజనరలుకు ఎక్కువ అధికారము కలిగెను.

బొంబాయి, మద్రాసు ప్రభుత్వముల వారిపై గవర్నరుజనరలుకుగల అధికారముకూడ వృద్ధిచేయబడెను. క్రీ. వె. 1786లో ఈ శాసనమును సవరించి, ఉన్నతసభయొక్క తీర్మానములకు వ్యతిరేకముగకూడ గవర్నరు జనరలు వ్యవహరింపవచ్చునని పార్లమెంటువారేర్పరచిరి. అది మొదలు ఉన్నతసభ సలహాగసభగమారెను; గవర్నరు జనరలు చెయ్యిపైదిగను, సభయొక్క చెయ్యి క్రిందిదిగను ఏర్పడెను.

## 2. కారన్‌వాలీసు (1786 - 1793)

**క్రొత్త సంప్రదాయము** :- సర్వాధికారము ననుభవించిన గవర్నరు జనరలులలో కారన్‌వాలీసు మొదటివాడు. ఇతనికి ఇండియాతోటి ఎట్టి పరిచయము లేకున్నను, ఇంగ్లండులో నా కాలమున ప్రాబల్యము వహించిన అధికారవర్గమునకు జెందిన ప్రముఖుడును, మంత్రులకు విశ్వాసపాత్రుడును అగుటచేత నీ యున్నతపదవికి నియమింపబడెను. ఇండియాలో కంపెనీ ఉద్యోగమందు చాలకాలము పనిచేసి విశేష అనుభవమును సంపాదించినవారు లంచగొండులనియు, అవినీతి వరులనియు, సంకుచిత హృదయులనియు, ఇంగ్లండులో అవ్వాడొక అభిప్రాయముండెడిది. క్రీ. వె.1784 తర్వాత మంత్రి వర్గము వారు ఇండియా వ్యవహారము లను దిద్దుబాటు చేయుటయందెక్కువ శ్రద్ధ వహించి, అల్పబుద్ధిగల కంపెనీ ఉద్యోగస్థుని గవర్నరు జనరలుగ నియ మించుట కంటె, ఇంగ్లండులోని ప్రముఖు లలో నొకనికి ఈ యుద్యోగమిచ్చుట ఉత్తమ మార్గమని



కారన్ వాలీస్

నిశ్చయించిరి. ఇది మొదలీ పద్ధతి సాంప్రదాయమయ్యెను. ఇట్టివారు ఇండియాను గురించిన అనుభవము లేక పరిపాలన మందు పొరబడెదరను భయముపోవుటకు, కలకత్తాలోని ఉన్నత సభయందలి సభ్యులు కంపెనీ ఉద్యోగస్థులుగ నుండవలెనను ఏర్పాటు గావింపబడెను. అనుభవవేత్తలగు ఉద్యోగస్థుల సలహాలను విని, ఇంగ్లీషు ప్రముఖుడగు గవర్నరు జనరలు దేశమును పాలింపసాగెను. బ్రిటిష్ పరిపాలన కాలమందంతనీ సంప్రదాయము ననుసరించియే మన దేశపు ప్రభుత్వము జరుగుచు వచ్చెను.

కారన్ వాలీసు సంస్కరణములు :- కారన్‌వాలీసు పరిపాలనా విధానమును సక్రమముగను, సులభముగను చేయునుద్దేశముతో చాలవరకు ఇంగ్లండులోని పద్ధతుల ననుసరించి అనేక సంస్కరణములను ప్రవేశపెట్టెను. (1) అతనికి పూర్వము కంపెనీ ఉద్యోగస్థుల జీతములు చాల తక్కువగ నుండెను. అందుచేత వారు అక్రమమార్గములలో దిగి ధనార్జనము చేయుచుండిరి. ఉద్యోగస్థులు నీతిపరులు కానియెడల పరిపాలనమునకు సౌష్ఠవముండదని కారన్‌వాలీసు వారి జీతములను వేలకొలదిగ వృద్ధిజేసి, లంచగొండితనము మొదలగు అక్రమ మార్గములను నిర్మూలము గావించెను. కాని దీని మూలమున భారతీయుల కొకనష్టము తప్పినది కాదు. గొప్ప జీతములతో కూడుకొనిన ఉద్యోగములు చేయుటకు ఇంగ్లీషువారొక్కరే అర్హులని కారన్‌వాలీసు యొక్క నమ్మకము; పార్లమెంటు వారుకూడ అట్టి అర్థము నిచ్చు శాసనము నాకాలమున చేసియుండిరి. కావున ఉన్నతోద్యోగముల ననుభవించి తద్వారా దేశ సేవ చేయుటకు భారతీయుల కవకాశము లేకపోయెను. (2) అదివరకు కలెక్టర్లకు రివిన్యూ వసూలు చేయు నధికారమే కాక మాజిస్ట్రేటు అధికారము, పోలీసు అధికారముకూడ నుండెను. ఇందు మూలమున వారు నిరంకుశులగుచున్నారని తలచి, కారన్‌వాలీసు ఈ అధికారములను తీసివేసెను. (3) ప్రజల యోగక్షేమములకు చట్టములు, న్యాయస్థానములు, న్యాయాధిపతుల తీర్పులు మూలాధారము లని కారన్‌వాలీసు మతము. కలెక్టర్లు మొదలగు ఉద్యోగస్థులు కూడ చట్టములకు బద్ధులై, కోర్టుల నిర్ణయముల ననుసరించి నడచుకొనవలయునేగాని తమ యిష్టానిష్టములబట్టి పరిపాలనము చేయకూడదని అతని నమ్మకము. ఇంగ్లండులోని సంప్రదాయమిదియే. ఇండియాలో మాత్రము చాలకాలమునుండి న్యాయాధీశుల కన్నవ్యవహారాధికారము గల రెవిన్యూ ఉద్యోగస్థులు ఎక్కువ ప్రాధాన్యము వహించియుండిరి. కాని ఇంగ్లీషు పద్ధతులే సర్వోత్కృష్టములని అతని అభిప్రాయమగుటచేత నతడు తరతమ భేదములబట్టి నాలుగు వరుసల కోర్టులను స్థాపించెను ; వాద ప్రతివాదములను నడుపుట, సాక్షులను పరీక్షజేయుట మొదలగు విషయములలో ఇంగ్లీషు కోర్టులలోని క్లిష్టములగు విచారణ పద్ధతుల నన్నిటిని ప్రవేశపెట్టెను ; ఇంగ్లండులోని చట్టముల శైలి ననుసరించి ఇండియా పరిపాలనమునకు కావలసిన శాసనములను వ్రాయించెను. న్యాయపరిపాలనమంతయు ఇంగ్లీషు మయమగుటచేత ఇంగ్లీషువారు మాత్రమే జడ్జీ పదవులకు అర్హులైరి. ఈ సంస్కరణముల మూలమున ధనికులకేగాక దరిద్రులకును, అధికులకేగాక అల్పులకును, ఉద్యోగస్థులకేగాక సామాన్యులకును న్యాయము దొరుకుననియు, చట్టము నతిక్రమించినవాడు ఎంతటివాడైనను శిక్షింపబడుననియు నతడు తలచెను.

కొంతవరకిది జరిగినను, మొత్తముమీద నీ పద్ధతులు ఇండియాకు సమన్వ యింపనందున కొన్ని నష్టములు కూడ సంభవించెను. ప్రజలయందు అనవసరముగ కోర్టుల కెక్కుట, తప్పుడు సాక్ష్యములు చెప్పుట మొదలగు అలవాటులు పుట్టెను ; ప్లీడర్ల సహాయము లేక వివాదములను పరిష్కరించుకొనుట అసాధ్యమయ్యెను ; సంవత్సరములకొలది వేచియున్న గాని ఒక్కొక్కప్పుడు జడ్జీలు తీర్పులు చెప్పలేకుండిరి. (4) న్యాయాధికారులందు కారన్‌వాలీసున కెక్కువ గౌరవమున్నందున పోలీసు మాజిస్ట్రేటు అధికారముల నతడు వారి కొసంగెను.

శాశ్వత శిస్తువిధానము :-(5) పదునేడవ శతాబ్దమందుండి బంగాళ రాష్ట్రములో జమీందారులను ప్రముఖులు రైతులవద్ద భూమిశిస్తులను వసూలుజేసి, అందులో కొంత భాగము తాము ఉంచుకొని, తక్కిన మొత్తమును ప్రభుత్వము వారికి చెల్లించుట ఆచారమయ్యెను. ఈ జమీందారీ హక్కు వంశపారంపర్యముగ వచ్చుచుండెను. జమీందారులు రైతుల వద్దనుండి యెక్కువ మొత్తములను వసూలు చేసి, స్వల్పమొత్తములను మాత్రమే ప్రభుత్వమునకు చెల్లించుచున్నారని శంకించి, హేస్టింగ్సు ఈ పద్ధతిని మార్చి, శిస్తువసూలు చేయు అధికారమును వేలముపాటకు పెట్టి, హెచ్చు మొత్తము పాడిన వారికా యధికారము నియ్యసాగెను. కాని వేలములో పాడిన వారు పాటమేరకు పైకమును చెల్లింపక, కంపెనీవారికి బకాయి పెట్టుటయే కాక రైతుల నపరిమితముగ పీడింపసాగిరి. దీనితోపాటు కలెక్టర్లు వేలంపాటదార్లతో షరీకై, లంచములు పుచ్చుకొని కంపెనీని మోసము చేయుచుండిరి. ఈ కారణములచేత వేలముపాడు పద్ధతి లోపభూయిష్ఠమని డైరెక్టర్లు తీర్మానించి, భూమిశిస్తును జమీందారుల ద్వారా వసూలుచేయుటయే గాక వారు చెల్లింపవలసిన మొత్తమును శాశ్వతముగ నిర్ణయించుట లాభకరమని అభిప్రాయపడిరి. రైతులు సాగు చేయు భూముల విస్తీర్ణము అందు పండు పంట, వారు జమీందారులకు చెల్లించుచుండు మొత్తము మొదలగు విషయముల గురించిన లెక్కలను తయారుచేసి, అందుపై జమీందారులు చెల్లింపవలసిన శాశ్వత మొత్తమును నిర్ణయుంచుటకై కార వాలీసు కొంత ప్రయత్నించెను గాని కలెక్టర్లు ఎంత శ్రమపడినను పూర్తి లెక్కలు దొరకుట కష్టమయ్యెను. కలెక్టర్లు కాలమునంతను ఇందుకై వ్యర్థపుచ్చుట కష్టమయ్యెను. కలెక్టర్లు కాలమునంతను ఇందుకై వ్యర్థపుచ్చుట కత డిష్టపడక, యేదో యొకవిధమున ఆ మొత్తమును నిర్ణయించి, జమీందార్లకు శాశ్వతకౌళ్లకిచ్చెను. ఈ పద్ధతివలన ప్రభుత్వమువారికి అనుకొన్న మొత్తము సకాలమున కందుచుండెను ; కలెక్టర్లు లంచములు పుచ్చుకొనుట కవకాశము తగ్గెను ; భూమిని

గురించిన లెక్కలను తయారుచేయుటయందు వారి కాలము వ్యర్థమగుట తప్పెను. కాని రైతుల నుండి జమీందారులు పుచ్చుకొను శిస్తును శాశ్వతముగ నిర్ణయింపనందునను, భూములపై రైతులకుగాక జమీందారులకు ఆస్తి హక్కు నొసగుటచేతను ఈ పద్ధతివలన రైతులబాధ హెచ్చెను. ఇండియాలోని పరిస్థితుల నెరుగక, జమీందారులు ఇంగ్లండులోని భూస్వాములవంటివారని కారన్ వాలీసు భ్రమపడుటచే నతడీ పద్ధతిని ఆమోదించెను.

**మూడవ మైసూరు యుద్ధము :-** మంగళూరు సంధి జరిగిన తర్వాత టిప్పుసుల్తాను తన రాజ్యమును వృద్ధిజేసికొను నుద్దేశముతో మహారాష్ట్రులతోడను, నిజాముతోడను యుద్ధము జేసి అందపజయము గాంచినవాడై, ఫ్రెంచివారి సహాయమపేక్షించి, వారితో రాయబారములు జరుపుచుండెను. ఇదిగాక ఇంగ్లీషువారి మిత్రవర్గములో నొకడగు తిరువాన్కూరు రాజుతో యుద్ధము చేసి, ఇంగ్లీషువారి ఆక్షేపణలను నిరసించి, కొన్ని ప్రదేశములను జయించి తీసికొనెను. అందుపై కారన్వాలీసు నిజాము యొక్కయు, మహారాష్ట్రుల యొక్కయు సహాయమును పొంది, టిప్పుతో యుద్ధ మారంభించి మైసూరుపై దండెత్తెను. యుద్ధము క్రీ. వె. 1790 మొదలు క్రీ. వె. 1792 వరకు జరిగెను. క్రీ. వె. 1791 లో బెంగుళూరు ఇంగ్లీషువారి వశమయ్యెను; క్రీ. వె. 1792 లో వారు టిప్పు రాజధానియగు శ్రీరంగపట్టణముపైకి వెళ్లిరి. అప్పుడతడు వారితో సంధిజేసికొని, మలబారు, కొడగు, దిండిగల్లు, బారమహాలు జిల్లాలను మూడుకోట్ల రూపాయలతో కూడ నిచ్చెను. మైసూరు, కర్నాటకములకు మధ్యనున్న కొండకనుమలు ఇంగ్లీషువారి అధీనమైనందున మైసూరు సుల్తానులు కర్ణాటకముపై దండెత్తివత్తురను భయముకూడ తగ్గెను.

**సర్ జాన్ షోరు :-** కారన్వాలీసు తర్వాత గవర్నరుజనరలైన సర్ జాన్ షోరు (1793-1798) పార్లమెంటువారి యొక్కయు, డైరెక్టర్ల యొక్కయు నభిమతము ననుసరించి స్వదేశ సంస్థానములతో ననవసరమైన జోక్యమును కల్పించుకొనక, రాజ్యసంపాదనమునకై యుద్ధములందు దిగుట మానెను. కాని యిట్టి ఔదాసీన్యము హానికరమని అతని చర్యలవలననే స్పష్టమయ్యెను. ఇంగ్లీషువారి మిత్రులలో నొకడగు నిజాముపై క్రీ. వె. 1795 లో మహారాష్ట్రులు యుద్ధము చేసి, కర్డాయొద్ద నతనిని పూర్తిగ నోడించిరి. అతడెంత బ్రతిమాలినను షోరు అతనికి సహాయము చేయనందున ఇంగ్లీషు వారి యెడల విశ్వాసమునంతను నతడు కోల్పోయి, ఫ్రెంచిసేనలను పిలిపించి, వారి నాయకత్వమున తన సైన్యములను తర్ఫీదు చేయసాగెను. ఔదాసీన్యమువలన మిత్రులను కోల్పోవుట తప్ప మరియొక ఫలితము లేదని ఋజువయ్యెను. అయోధ్య విషయమై మాత్రము షోరు కొంత శ్రద్ధవహించెను. ఆఫ్గ న్రాజగు జమాన్షా హిందూ

దేశముపై దండెత్తి రానున్నాడను వదంతి వ్యాపించుటచేత, షోరు అయోధ్యలోని నవాబుసైన్యములను తగ్గించి, ఇంగ్లీషుసైన్యముల నెక్కువజేసి, వాని ఖర్చులకై యెక్కువకప్పమును చెల్లించునట్లు నవాబును ఒడబరచెను.

## 3. వెలస్లీ

వెలస్లీ (1798-1805) :- వెలస్లీ గవర్నరు జనరలుగ నున్న కాలమున బ్రిటిషువారి సామ్రాజ్యాధికారము దేశములో చాలభాగమందు వ్యాపించెను; రాష్ట్రములనేకములు వారి పాలనములోనికి వచ్చెను; స్వదేశసంస్థానాధీశులు పెక్కురు వారికి సామంతులైరి. వెలస్లీకిగల విపరీత సామ్రాజ్య కాంక్షయే దీనికి ప్రధాన హేతువు. దినదినమునకు మారుచున్న రాజకీయ పరిస్థితులు కుదుటబడుటకు బ్రిటిషు సామ్రాజ్యవ్యాప్తి తప్ప మరియొక మార్గ మతనికి కనుపించలేదు. ఇందుమూలమున శాంతి నెలకొనుననియు, శాంతి మూలమున ప్రజల ఐశ్వర్య మభివృద్ధిగాంచు ననియు అతడు నమ్మెను. బ్రిటిషు సార్వభౌమత్వము ఇంగ్లండునకేగాక ఇండియాకు కూడ నీ విధముగ లాభకారియగునని అతడూహించెను.



వెలస్లీ

ఫ్రెంచి విప్లవము :- వెలస్లీ యందు సామ్రాజ్యకాంక్ష బలవడుటకు ఫ్రెంచి విప్లవముకూడ గొప్ప కారణమయ్యెను. మహత్తరమైన యీ రాజకీయ విప్లవము క్రీ.వె.1789 లో సంభవించెను. దాని మూల మున ఫ్రాన్స్‌దేశమందు నిరంకుశ ప్రభుత్వ మడుగంటెను; ప్రజాప్రభుత్వము తాత్కాలికముగ స్థాపింపబడెను. కాని ఐరోపాలోని తక్కిన నిరంకుశ ప్రభువు లీవిప్లవముల కద్దుతగిలి ఫ్రెంచి వారితో యుద్ధములకు దిగిరి. ఉద్రేకపూరితులైన ఫ్రెంచివారు తమ యధికారమును, విప్లవ సందేశమును ఐరోపా యందంతట వ్యాపింపజేయసాగిరి. అప్పుడు ఇంగ్లీషు వారికి వారితో యుద్ధము తప్పదయ్యెను. క్రీ. వె. 1795లో ప్రారంభమైన యుద్ధము క్రీ.వె. 1815 వరకు జరుగుచుండెను. ఫ్రెంచిసేనానియగు నెపోలియన్ వారియెడల బద్ధవైరుడై, ప్రాగ్దేశములందలి వారి వ్యాపారమును, సామ్రాజ్యమును వినాశము చేయసమకట్టి, క్రీ. వె. 1798 లో ఈజిప్టుపై దండెత్తెను. అదే సంవత్సరమున వెలస్లీ ఇండియాకు గవర్నరు

జనరలుగ వచ్చెను. నెపోలియన్ ఏమి చేయునోయను భీతి అతనికి కలిగెను. స్వదేశ సంస్థానములలో కొన్నిటియందదివరకే ఫ్రెంచివారి పలుకుబడి కొంతవరకు వ్యాపించి యుండెను. నిజాముయొక్కయు, సింధియాయొక్కయు సైన్యములు ఫ్రెంచివారిచే శిక్షితములై ఫ్రెంచి సేనాధిపతులకు లోబడియుండెను. టిప్పుసుల్తాను నెపోలియన్ తోడను, ఫ్రెంచి ద్వీపమగు మొరిషస్ గవర్నరుతోడను రాయబారములు జరుపుచుండెను. వారాతనికి సహాయము పంపునట్లు చెప్పియుండిరి. ఇట్టి పరిస్థితులలో కాలవిలంబనముచేయక సంస్థానాధీశులను లొంగదీసి, ఫ్రెంచివారి పలుకుబడిని నిర్మూలము జేసి ఇంగ్లీషువారి అధికారమును వ్యాపింపజేయుట వెలస్లీకీ అత్యవసరమని తోచెను.

సైన్యసహకారపద్ధతి :- ఇందుకై అతడు సాధారణమార్గమగు యుద్ధమునేగాక, సైన్యసహకారపద్ధతి యనునొక నూతన మార్గమును కూడ ననుసరించెను. ఇంగ్లీషువారు విధించిన షరతులకు సమ్మతించు సంస్థానాధీశులకు సైన్యములనిచ్చి రక్షించు పద్ధతికి సైన్యసహకారపద్ధతియని పేరు. ఈ షరతులకంగీకరించినవారు సర్వస్వతంత్రమును కోల్పోయి బ్రిటిషువారికి సామంతులైరి. అట్టివారు తమ కొలువులందు ఇంగ్లీషువారినితప్ప తక్కిన యూరోపియనుల నెవ్వరిని చేర్చుకొనకూడదు. వారి సొంత సైన్యములను తగ్గించుకొని, వాని స్థానమున ఇంగ్లీషు సైన్యాధిపతులకు లోబడిన ఇంగ్లీషు సైన్యములను వారి రాజ్యములలో పెట్టుకొని వానికగు ఖర్చులను భరింపవలెను ; లేదా అందుకు తగిన యాదాయమును తెచ్చు రాష్ట్రములను ఇంగ్లీషువారి కియ్యవలెను. ఇతర సంస్థానములతో వారికిగల వాదప్రతివాదముల నన్నిటిని ఇంగ్లీషువారి మధ్యవర్తిత్వమున, వారి సలహాల ననుసరించి పరిష్కరించుకొనవలెను. ఇంగ్లీషువారి మిత్రులను తమ మిత్రులుగను, వారి శత్రువులను తమ శత్రువులుగను వారు పరిగణింపవలెను. 'రెసిడెంట్' అను పేరుగల ఉన్నత ఇంగ్లీషు ఉద్యోగస్థు నొకనిని వారి రాజ్యమందుంచుకొనవలెను. తమతమ ప్రజలను పరిపాలించుటలో వారు స్వేచ్ఛానువర్తులుగ నుండవచ్చును. ఈ షరతుల కంగీకరించిన సంస్థానాధీశులను సర్వకాల సర్వావస్థలయందు శత్రుభయములేక రక్షించుటకు ఇంగ్లీషు వారొడబడిరి.

నాల్గవ మైసూరు యుద్ధము :- ఆ కాలమున శత్రుభయముగలవారిలో నిజాము ఒకడు. మహారాష్ట్రులెల్లప్పుడితనిని బాధించుచుండిరి. వారి నెదిరించి యుద్ధము చేయుట కితనికి సామర్థ్యము లేకుండెను. అందుచేత నితడు వెలస్లీయిష్టము ననుసరించి సైన్యసహకారపద్ధతి కొప్పుకొని, ఫ్రెంచి సేనానాయకులను, వారు తర్ఫీదు చేసిన

సైన్యములను త్యజించెను. టిప్పూసుల్తానుమాత్రమీపద్ధతి కంగీకరింపక ఫ్రెంచివారితో రాయబారము జరుపుచుండెను. అందుచే వెలస్లీ నాల్గవ మైసూరు యుద్ధమును ప్రారంభించి క్రీ. వె. 1799 లో మాలవల్లి వద్ద టిప్పూసైన్యముల నోడించి, రాజధానియగు శ్రీరంగపట్టణమును ముట్టడించి, దాని రక్షణార్థమై స్వయముగ పోరిన టిప్పూను చంపి, దానిని పట్టుకొనెను. అంతటితో యుద్ధము ముగిసెను. అప్పుడు వెలస్లీ మైసూరు



రాజ్యమును మూడు భాగములు జేసి, ఒక భాగమును (బళ్ళారి, అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలు) నిజామున కిచ్చి, ఒక భాగమును ఇంగ్లీషుపాలనలో చేర్చి, తక్కిన భాగముపై పూర్వపు హిందూ రాజకుటుంబములోని వాని నొకనిని రాజుగ జేసెను. ఇతడు సైన్య సహకార పద్ధతి కంగీకరించి, ప్రజలను పాలించుటయందు కూడ ఇంగ్లీషువారి సలహా ననుసరించుట కొడబడెను. ఈ యుద్ధమున ఇంగ్లీషువారికి లభించిన భాగములు కోయంబత్తూరు, నీలగరి, కన్నడము జిల్లాలు. ఇందుచే మైసూరు రాజ్యమునకు చుట్టు బ్రిటీషు రాష్ట్రములేర్పడి, సముద్రతీరముతోటి సంబంధము తెగిపోయెను.

మద్రాసు రాష్ట్రము :- కర్ణాటక నవాబునకును, టిప్పుసుల్తానుకును మధ్య జరుగుచుండిన ఉత్తర ప్రత్యుత్తరములు కొన్ని మైసూరు యుద్ధకాలమున వెలస్లీ చేతిలో పడెను. ఇంగ్లీషువారిపై కర్ణాటక నవాబు కుట్రలు చేయుచుండెనను అనుమాన మతనికి కలిగెను. ఇదిగాక నవాబుల పరిపాలనము కూడ మిక్కిలి అసంతృప్తికరముగ నుండెను. అందుచేత వెలస్లీ క్రీ.వె. 1801 లో కర్ణాటక రాజ్యమునంతను ఇంగ్లీషు పాలనలో జేర్చి నవాబునకు భరణమేర్పరచెను. అదే విధముగ మహారాష్ట్ర రాజ్యమగు తంజావూరునకై పోట్లాడుచున్న యిద్దరు వారసులకు పింఛను లేర్పరచి, దానిని కూడ ఇంగ్లీషు రాష్ట్రములో కలుపుకొనెను. అదే సమయమున సహకార సైన్యముల ఖర్చుల నేటేట నిచ్చుకొనలేక వానికి బదులుగ కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురం జిల్లాలను నిజాం ఇంగ్లీషువారి కిచ్చెను. ఈ ప్రదేశములన్నియు లభించుటచేత క్రీ.వె. 1801 నాటికి సమిష్టి మద్రాసు రాష్ట్ర మేర్పడెను.

అయోధ్య :- అయోధ్య నవాబు ఇంగ్లీషువారికి చిర మిత్రుడు. వెలస్లీకి పూర్వమే అతడు ఇంగ్లీషు సైన్యమును తన రాజ్యములో నుంచుకొని యేటేట దాని ఖర్చులకై డెబ్బది యారులక్షల రూపాయలిచ్చుచుండెను. అతని రాజ్యములోని సారవంతములగు ప్రదేశములపై వెలస్లీ కన్నువేసి, క్రీ.వె. 1801 లో నతనిని బలాత్కరించి క్రొత్త సైన్యసహకారసంధి కొప్పించెను. దానికి ఫలితముగ రోహిలఖండము, గంగా, యమునా నదులకు మధ్యనున్న పరగణాలును ఇంగ్లీషు వారి వశమయ్యెను.

బాసీన్‌సంధి :- అప్పటికి మహారాష్ట్రులు మాత్రమే సైన్యసహకార పద్ధతి కొప్పుకొనకుండిరి. ఇండియాలో అర్ధభాగమునకు వారు పాలకులై, మిక్కిలి బలవంతులుగ నుండినందున వారి నాయకుడగు పీష్వాకు గాని, సింధియా హోల్కారు భాన్స్లే మొదలగు తక్కిన నాయకులకు గాని ఇంగ్లీషువారి రక్షణ కావలసియుండలేదు. కాని

మొదటి మహారాష్ట్ర యుద్ధమునాటికే వారియందు కన్పడిన పరస్పర ద్వేషము కాలక్రమమున వృద్ధియై పీష్వాను ఇంగ్లీషువారి శరణుజొచ్చునట్లు గావించెను. గాయక్వారు చాలకాలమునుండి ఇంగ్లీషు వారికి మిత్రుడు; భాన్స్లే పీష్వాపట్ల విముఖుడై యుండెను. హోల్కారు, సింధియాలు బద్ధవిరోధులై పరస్పర వినాశమును కోరుచుండిరి. అప్పటి పీష్వా అగు రెండవ బాజీరావు అసమర్థుడు. నానాఫర్నవీసు మృతిజెందెను. సింధియా బాజీరావుకు మిత్రుడై సర్వాధికారమును చెలాయించుచుండెను. హోల్కారు దాని కిష్టపడక క్రీ.వె.1802 లో పూనాపై దండెత్తి సింధియా సైన్యములను, బాజీరావును ఓడించెను. అప్పుడు బాజీరావు ఇంగ్లీషువారి శరణుజొచ్చి, బాసీన్ వద్ద వారితో సంధి జేసికొని సైన్యసహకార పద్ధతి కంగీకరించెను. అందుపై వారాతనిని వెంటబెట్టుకొని పూనాకు వచ్చి పీష్వాపీఠమందుంచిరి. స్వదేశ సంస్థానములలో నగ్రగణ్యమై ఇంగ్లీషువారితో సమానముగ యుద్ధము చేయగల మహారాష్ట్ర కూటముకూడ బాసీన్ సంధిమూలమున ఇంగ్లీషువారికి లొంగిపోయెను.

రెండవ మహారాష్ట్ర యుద్ధము :- సింధియా, భాన్స్లేలు దీని నెంతమాత్రము సహింపరైరి. మొగలాయీ సామ్రాజ్యమును వినాశము గావించి, నూరు సంవత్సరములుగ




మహారాష్ట్ర యుద్ధములను సూచించు పటము

నసమాన వైభవము ననుభవించుచున్న మహారాష్ట్రులకు నాయకుడగు పీష్వాధీనుడై, ఇంగ్లీషువారికి వశుడగుట అవమానకరమని వారు భావించి, వారి సైన్యములను గూర్చుకొని హైదరాబాదు రాజ్యము వైపు నడచిరి. వారిట్లు చేయుదురని వెలస్లీకి తెలియును. అతడుకూడ యుద్ధ సన్నాహము చేసి వారిపైకి సైన్యములంపెను. ఈవిధముగ రెండవ మహారాష్ట్ర యుద్ధమారంభమయ్యెను (1803). ఇంగ్లీషుసైన్యము లతివేగముగ ప్రయాణము చేసి దక్కనులోని సింధియా సైన్యములను అస్సెయి యుద్ధరంగమునను, భాన్స్లే సైన్యములను అరాన్ యుద్ధరంగమునను ఓడించెను. ఉత్తర ఇండియాలోని మరియొక ఇంగ్లీషు సైన్యము అచ్చటి సింధియా రాష్ట్రములపైబడి, అతని వశమందున్న ఆలిఘర్, ఆగ్రా, ఢిల్లీ పట్టణములను పట్టుకొని, లాస్వారీ యుద్ధరంగమున నతని నోడించెను. యూరోపియన్ పద్ధతుల ప్రకారము ఫ్రెంచివారాతని సేనలకు గరపిన శిక్ష వ్యర్థమయ్యెను. అప్పుడు సింధియా భాన్స్లేలు ఇంగ్లీషువారితో సంధిగావించికొని, బాసీన్ సంధి నంగీకరించుటకును, కొన్ని రాష్ట్రములను వారికిచ్చుటకును ఒడబడిరి. ఇందువల్ల కటకము, బ్రోచి జిల్లా, గంగా యమునలకు మధ్యనున్న పరగణాలు వారికి లభించెను. ఢిల్లీ పట్టణము వారి వశమయ్యెను. మొగలాయీ చక్రవర్తి వారి అధీనములోనికి వచ్చెను. కటకము లభించుటచేత బంగాళ, మద్రాసు రాష్ట్రములకు మధ్య రాకపోకలు నిరాటంకములయ్యెను.

**మూడవ మహారాష్ట్ర యుద్ధము :-** రెండవ మహారాష్ట్ర యుద్ధమీ విధముగ పరిణమించునని హోల్కారు అనుకొనలేదు. అంతయు మించిపోవువరకతడు ఉదాసీనుడై యుండి తర్వాత తన కండ్లను తెరచి, ఇంగ్లీషువారితో యుద్ధము చేయ నిశ్చయించి, వారి మిత్రులగు రాజపుత్రులపై బడెను (1804). అంతటితో మూడవ మహారాష్ట్రయుద్ధ మారంభమయ్యెను. ప్రప్రథమమున నతని వెంటనంటి రాజపుత్రస్థానము లోపలికి వచ్చిన ఇంగ్లీషుసైన్యముల నతడోడించినను అటు తర్వాత నతనికి విజయము చేకూరలేదు. ఢిల్లీని పట్టుకొనుట కతడు చేసిన ప్రయత్నము భగ్నమయ్యెను; డీగ్ యుద్ధమున నతడోడి పంజాబునకు పారిపోవలసి వచ్చెను. తన యుద్దేశములన్నియు పూర్తిగ కొనసాగు సమయము వచ్చినదని వెలస్లీ పరమానందభరితుడై యుండెను. కాని భరతపురకోటను ముట్టడించిన ఇంగ్లీషు సైన్యములు పరాజయము గాంచి వెనుకకు మరలెను. ఇంగ్లండులోని డైరెక్టర్లు, మంత్రులు వెలస్లీ యొక్క చర్యలనేకములు చట్టవిరుద్ధములనియు, అధర్మము లనియు, కంపెనీ లాభము నడుగంటజేసి, కంపెనీ అప్పులపాలు గావించు చున్నవనియు తలచి, ఉద్యోగమునుండి అతనిని తొలగించి, యుద్ధపు హడావడులు లేక నెమ్మదిగ పాలింపగలవాడని కారన్‌వాలీసును

గవర్నరుజనరలుగ నియమించిరి (1805). వెలస్లీ వెళ్లి పోయినను బ్రిటీషు సామ్రాజ్య వ్యాప్తికై అతడు చేసిన మహోపకారము శాశ్వతముగ నిలచియుండెను.

**ఉదాసీనపద్ధతి** :- డైరెక్టర్ల అభిప్రాయము ననుసరించి క్రీ. వె. 1805 మొదలు క్రీ. వె. 1813 వరకు గవర్నరు జనరలులు స్వదేశసంస్థాన వ్యవహారములలో జోక్యము కల్పించుకొనక ఉదాసీనులై యుండుటకు ప్రయత్నించిరి. రెండుమాసములు మాత్రమే పాలించి చనిపోయిన కారన్‌వాలీసు, అతని తర్వాత తాత్కాలిక గవర్నరు జనరలుగ నుండిన బార్లో (1805-1807) హోల్కారు, సింధియాలతో సంధిజేసికొని, వారిదగ్గరనుండి అదివరకు జయించి తీసికొనిన ప్రదేశములలో కొన్నిటిని వారికిచ్చి వేసి, తమ్ము నమ్ముకొనియున్న రాజపుత్రులను త్యజించిరి. క్రీ. వె. 1807 మొదలు క్రీ. వె. 1813 వరకు పాలించిన మింటో ప్రభువు మొత్తము మీద ఉదాసీనపద్ధతి నవలంబించినవాడైనను, కొన్ని సందర్భములలో సంస్థానముల వ్యవహారములందు ప్రవేశించి, బుందేల్ ఖండమునందును, బీరారునందును అల్లరులనణచి, సట్లెజినదికి తూర్పునందున్న శిక్కు రాజ్యములను ఇంగ్లీషు వారిమిత్రవర్గములో జేర్చుకొనెను. నెపోలియన్ చక్రవర్తి పర్షియా, ఆఫ్‌గన్‌స్థానము, పంజాబుల మీదుగ ఇండియాపై దండెత్తివచ్చుటకు ప్రయత్నించుచున్నాడని తెలియుటచేత నీ దేశములను పాలించుచున్న రాజుల వద్దకు ఇంగ్లీషురాయబారుల నంపి, ఫ్రెంచివారిని వారు అడ్డునట్లు సంధి జేసికొనెను. ఇదేవిధమున జావా మొదలగు తూర్పు ద్వీపములందు ఫ్రెంచివారి నోడించి ఇంగ్లీషు వారి పలుకుబడిని వృద్ధి జేసెను. బ్రిటీషు రాష్ట్రములకు వెలుపలనుండు దేశముల వ్యవహారములందు ఎట్టి జోక్యమును పుచ్చుకొనక ఇండియాను పాలించుట అసాధ్యమని యీ చర్యలవలన స్పష్టమయ్యెను.

## 4. హేస్టింగ్సు ప్రభువు

**నేపాళయుద్ధము** :- హేస్టింగ్సు ప్రభువు క్రీ. వె. 1813 మొదలు క్రీ. వె. 1823 వరకు గవర్నరు జనరలుగ నుండి, ఉదాసీన పద్ధతిని విడనాడి, వెలస్లీ పూనిన కార్యమును పూర్తి చేసెను. ఇతడు చేసిన యుద్ధములలో నేపాళ యుద్ధము మొదటిది. నేపాళరాజ్యము హిమవత్పర్వత ప్రాంతముల నున్నది. పదునెనిమిదవ శతాబ్ద మధ్యభాగమున ఘూర్కాతెగవారు దానిని జయించి, వారి బలపరాక్రమములచే తూర్పున అస్సాంవరకును, పడమట కాశ్మీరమువరకును దానిని విస్తరించిరి. వారి రాజ్యమునకు దక్షిణముగ ఇంగ్లీషు రాష్ట్రములుండెను. వారప్పుడప్పుడు వానిపైబడి ప్రజలను దోచుచుండిరి. సామోపాయమున వారు లొంగనందున క్రీ. వె. 1814 లో

హేస్టింగ్సు వారితో యుద్ధమారంభించెను. యుద్ధరంగము పర్వతమయమగుట చేతను, అందలి మార్గములు ఇంగ్లీషువారికి తెలియక పోవుటచేతను, వారి సేనానాయకులు కొందరు అనమర్థులగుటచేతను, ఘూర్కాలు యుద్ధమందతి నేర్పరులగుట చేతను ప్రథమమున ఇంగ్లీషు వారప జయము గాంచిరి. కాని క్రీ.వె.1815 లోవారు కొన్ని యుద్ధరంగములందు ఘూర్కాల నోడించి క్రీ.వె. 1816 లో వారి రాజధాని యగు కాట్మాండు సమీపమున చేరిరి. అందుపై ఘూర్కాలు సంధిజేసికొని గర్వాల్‌కుమాన్‌త్రై జిల్లాలను ఇంగ్లీషువారి కిచ్చిరి. అది మొదలు వారు ఇంగ్లీషు వారికి మిత్రులైయుండిరి.



హేస్టింగ్సు ప్రభువు

పిండారీలు:- ఈ యుద్ధము ముగిసిన తర్వాత పిండారీలతోడను, మహారాష్ట్రులతోడను యుద్ధమావశ్యకమయ్యెను. మొగలాయీ సామ్రాజ్యము క్షీణించి, బలాఢ్యులగువారచ్చటచ్చట రాజ్యములను స్థాపించుకొను కాలమందు అనేకులు వారివద్ద యుద్ధభటులుగ ప్రవేశించి, యుద్ధమే జీవనోపాయముగ కలిగియుండిరి. క్రమక్రమముగ నీ రాజ్యములలో కొన్ని బ్రిటీషు పాలనలోకి వచ్చుటచేతను, తక్కినవానిని పాలించుచుండిన రాజులు స్వంత సైన్యములను తగ్గించుకొని సైన్యసహకారపద్ధతి ననుసరించుటచేతను, యుద్ధభటులుగ నుండినవారిలో ననేకులు జీవనోపాయములు లేక గుంపులు గుంపులుగ నేర్పడి చిత్తము వచ్చినట్లు గ్రామములపైబడి ప్రజల ననేక విధములుగ హింసించుచుండిరి. వీరికే పిండారీ లని పేరు. సింధియా, హోల్కారుల రాష్ట్రము వీరికి ఉనికిపట్టు. ఈ మహారాష్ట్ర పాలకులు వారి కాశ్రయమిచ్చుటయేగాక వారిని దోపిడి నిమిత్తమై ఇంగ్లీషు రాష్ట్రముల లోనికి పంపుచుండిరి. క్రీ. వె. 1805 తర్వాత ఇంగ్లీషువా రవలంబించిన ఉదాసీన పద్ధతి వీరికి మిక్కిలి అనుకూలించెను. క్రీ. వె. 1812 లో వీరు బీహారును దోచిరి; క్రీ.వె. 1815, 1816 లో ఉత్తర సర్కారులపైబడి చెప్పరాని దుష్కార్యము లెన్నిటినో జేసిరి. వీరిని నిర్మూలించినగాని బ్రిటీషురాష్ట్రములకు శాంతికలుగనట్లుండెను. ఇందుకై హేస్టింగ్సు గొప్ప యుద్ధసన్నాహము చేసెను.

మహారాష్ట్రపాలకుల వైఖరి : ఆ సమయమున మహారాష్ట్రపాలకులందరు

ఇంగ్లీషువారిపై విరోధము వహించి యుండిరి. పీష్వా బాజీరావు బాసీన్‌సంధిని జేసికొనినందుకు మిక్కిలి వగచుచు, తిరిగి స్వాతంత్ర్యమును సంపాదించు నుద్దేశముతో తక్కిన మహారాష్ట్ర నాయకులవద్దకు రహస్యముగ రాయబారము లంపుచుండెను. హేస్టింగ్సు దీనినంతను గమనించి, పాకము ముదరక పూర్వమే మహారాష్ట్ర పాలకులను నిర్బంధించి వారినణచుటకు ప్రయత్నించెను. క్రీ.వె. 1816లో నతడు భాన్‌స్లే రాజ్యమునకు




పోషణకర్తగనున్న అప్పాసాహేబుతో సైన్యసహకారసంధి గావించుకొని నాగపూరునందొక ఇంగ్లీషు సైన్యమును జేర్చెను. క్రీ.వె. 1817లో బాజీరావును బలాత్కరించి, మహారాష్ట్ర

నాయకత్వము నతడు వదలుకొనునట్లుచేసి, వానివద్దనుండి కొంకణము మొదలగు జిల్లాలను హరించెను. అదేవిధముగ సింధియాను బెదరించి పిండారీ యుద్ధమందతడు ఇంగ్లీషువారికి సహాయము చేయున ట్లొడబరచెను. పిండారీలకు పోషకులుగనున్న మహారాష్ట్రులతో నిట్టి కట్టుదిట్టముల గావించుకొని వారిననచుటకై 1,20,000 సైన్యమును, 300 ఫిరంగులను కూర్చెను.

నాల్గవ మహారాష్ట్ర యుద్ధము : ఇంతలో పీష్వా ఇంగ్లీషువారిపై తిరగబడి (1817), పూనాలోని రెసిడెన్సీని కాల్చి, కర్కీవద్ద వారి నెదుర్కొని ఓడిపోయెను. తర్వాత మరి రెండు యుద్ధములందు కూడ నతని కపజయము కలిగెను. అందుచేత క్రీ.వె.1818లో నతడు వారి శరణుజొచ్చెను. అప్పుడు వారాతనికి సంవత్సరమున కెనిమిది లక్షల రూపాలయల మనోవర్తినిచ్చి అతని పాలనలో నుండిన రాష్ట్రములన్నిటిని తీసికొనిరి. బొంబాయి రాష్ట్ర మీ విధముగ నేర్పడెను. ఇట్లే నాగపూరులోని అప్పాసాహెబు ఇంగ్లీషువారి నెదుర్కొని, సితబాల్డి యుద్ధములో పరాజయముగాంచి (1817) పారిపోయెను. అప్పుడు హేస్టింగ్సు నర్మదానదికి ఉత్తరమున నున్న రాష్ట్రములను ఇంగ్లీషుపాలనలో జేర్చుకొని, తక్కిన భాగమునకు భాన్స్లే కుటుంబములో నొకనిని సామంతరాజుగ జేసెను. అదే సమయమున హోల్కారు సైన్యములకు మహిద్పూరు యుద్ధమున ఓటమి సంభవించెను; అందుపై నర్మదానదికి దక్షిణముననున్న రాష్ట్రములను హేస్టింగ్సు స్వాధీనపరచుకొనెను. సింధియాకూడ అజ్మీరు రాష్ట్రమును ఇంగ్లీషువారి కియ్యవలసినవాడయ్యెను. మహారాష్ట్రులందరు నీ విధముగ లొంగిపోయిన తర్వాత పిండారీల ననచుట బహు సులభమయ్యెను. వారిలో ననేకులు యుద్ధము మాని ఇంగ్లీషువారికి లోబడిరి. వారి నాయకులలో నొకడగు అమీరుఖానుడు ఇంగ్లీషువారి శరణుజొచ్చి టొంకు రాజ్యమును సంపాదించెను.

మహారాష్ట్ర రాజ్య వినాశము : నాల్గవ మహారాష్ట్ర యుద్ధముతో మహారాష్ట్రుల అధికార మంతరించెను. శివాజీ నిర్మించిన సామ్రాజ్య సౌధము కూలిపోయి నేల గలిసెను. మహారాష్ట్రుల కిట్టిగతి పట్టుట కనేక కారణములు గలవు. భారతీయులందరిలో నుండు లోపములు వారియందు కూడ నుండెను. ఏక నాయకత్వమునకు బదులు బహునాయకత్వము వారిలో వ్యాపించెను. అంతఃకలహములు, పరస్పర వైషమ్యములు వారిని విడచినవికావు. యుద్ధములు చేయుట యందును, సైన్య శిక్షణమందును, ఫిరంగులు తయారుచేయుట యందును వారు వెనుకబడి యుండిరి. నౌకాబలము యొక్క ప్రాధాన్యమును వారు గ్రహింపరైరి. వారి గుట్టులనన్నిటిని ఇంగ్లీషువారు తెలిసికొన గలిగిరి గాని ఇంగ్లీషువారి రహస్యములను వారు తెలిసికొన జాలరైరి. పాశ్చాత్యుల అభివృద్ధికి మూలకారణమగు అభినవ ప్రకృతి శాస్త్రజ్ఞాన సంపాదనమందు వారి కుత్సాహము లేకుండెను.

## ప్రశ్నలు

1. బంగాళగవర్నరుగ నున్నప్పుడు వారన్‌హేస్టింగ్సు చేసిన సంస్కరణము లెవ్వి?
2. డైరెక్టరు లెవరు ? పార్లమెంటు అనగా నేమి ?
3. రెగ్యులేటింగు ఆక్టువలన కలిగిన మార్పులెవ్వి ? అందలి లోపము లెవ్వి ?
4. మొదటి మహారాష్ట్ర యుద్ధమునకును, రెండవ మైసూరు యుద్ధమునకును కారణము లెవ్వి ? వాని ఫలితములను వివరింపుము.
5. వారన్ హేస్టింగ్సు గావించిన దౌర్జన్యము లెట్టివి ?
6. పిట్టు ఇండియా చట్టము నేల చేయవలసి వచ్చెను ? దాని మూలమున నే మార్పులు కలిగెను ?
7. కారవాలీసు కాలము నుండి ఏర్పడిన క్రొత్త సంప్రదాయమేది ? పరిపాలనా విధానమందు కారన్‌వాలీసు చేసిన మార్పులెవ్వి ? భూమిశిస్తు విధానము నతడెట్లు మార్చెను ? దానివలన (1) జమీందారులకు (2) రైతులకు (3)ప్రభుత్వమువారికి కలిగిన ఫలితము లెవ్వి ?
8. మూడవ మైసూరు యుద్ధమువలన ఇంగ్లీషువారికి కలిగిన లాభమెద్ది ?
9. ఔదాసీన్యపద్ధతి అనగా నేమి? అది ఎట్లు హానికరమయ్యెను?
10. వెలస్లీ బ్రిటీషు సామ్రాజ్యమును వ్యాప్తి జేయుట కెందుకు ప్రయత్నించెను? ఫ్రెంచివిప్లవ మెంతవరకు దీనికి కారణము?
11. సైన్య సహకారపద్ధతి యనగా నేమి? దానివలన (1) ఇంగ్లీషువారికి (2) స్వదేశ సంస్థానములకు కలిగిన లాభమేది? దాని మూలమున నష్ట మెవరికైన కలిగెనా? ఆ పద్ధతి కెవరంగీకరించిరి? ఎప్పుడు?
12. నాల్గవ మైసూరు యుద్ధ కారణములు, ఫలితములు చెప్పుము.
13. సమష్టి మద్రాసు రాష్ట్రములోని ఏయే ప్రదేశములు వెలస్లీ కాలమున వశమయ్యెను? ఎట్లు వశమయ్యెను?
14. రెండవ మహారాష్ట్ర యుద్ధ కారణములు, ఫలితములు చెప్పుము.
15. మింటో ప్రభువు ఔదాసీన్యము నెంతవరకు అనుసరించెను?
16. నేపాళయుద్ధ కారణములు, ఫలితములు వివరింపుము.
17. పిండారీ లెవరు? వారి ప్రాబల్యమునకు కారణము లెవ్వి?
18. నాల్గవ మహారాష్ట్ర యుద్ధ కారణములు, ఫలితములు చెప్పుము.
19. మహారాష్ట్రుల రాజ్య వినాశమున కేమి కారణములు ?

పండ్రెండవ ప్రకరణము

# కంపెనీ పరిపాలన

**విషయములు** :బెంటింకు ప్రభువు అభ్యంతర (Internal) సంస్కరణములు: బర్మా యుద్ధములు; ఆఫ్గనిస్థానము; సింధురాష్ట్రము; శిక్కు యుద్ధములు; పంజాబును లాగుకొనుట, డల్‌హౌసీ ప్రభువు; నిర్వారసత్వ సిద్ధాంతము. కానింగ్ ప్రభువు; సిపాయిల తిరుగుబాటు; విక్టోరియారాణి ప్రకటనము (1858)

## 1. బెంటింకు ప్రభువు : అభ్యంతర సంస్కరణములు

సంస్కరణాభిలాష : క్రీ.వె. 1823 నాటికి దేశములో అధిక భాగమునకు కంపెనీవారధికారులైరి. యుద్ధముల యొక్క ఆవశ్యకత చాలవరకు తగ్గెను. ప్రజలను చక్కగ పాలించి, వారి యోగక్షేమములకు కావలసిన సంస్కరణముల గావించుట కవకాశమేర్పడెను. ఈయవకాశము నుపయోగించుకొనవలయుననెడి అభిలాష కూడ ఇండియాలోని అధికారులలో వ్యాపించెను. దీని కనేక కారణములున్నవి. ఇరువది సంవత్సరముల కొక పర్యాయము ఇండియాలోని కంపెనీ వ్యవహారములను పార్లమెంటువారు పరిశీలించు ఆచారమొకటి యేర్పడియుండెను. ఏయే విషయములలో సంస్కరణము లావశ్యకమో వారా పరిశీలనా సమయములందు సూచించుచుండిరి. ఇది యొక కారణము. డైరెక్టర్లు ఇండియాకు పంపు ఉద్యోగస్థులను ప్రత్యేకముగ పరిపాలన విషయములలో తర్ఫీదుచేసి పంపుచుండిరి; ఇది గూడ క్రొత్త పద్ధతియే. ఇట్లు వచ్చినవారు వారి పూర్వులకంటె నెక్కువ ఉత్సాహముతో వారి పనులను చేయ దొడగిరి. ఇది రెండవ కారణము. క్రీ. వె. 1813 తర్వాత క్రైస్తవ మతబోధకులు ఇండియాకు వచ్చుటకు పార్లమెంటువారనుజ్ఞ నిచ్చిరి. ఇండియాలోని మతములను ఖండించి, క్రైస్తవమతమును వ్యాపింపజేయుటయే వీరి ముఖ్యోద్దేశమైనను, దీనిని నెరవేర్చుకొనుటలో వీరు ఇచ్చటి సాంఘికదురాచారములను గురించి ఇంగ్లండులో ప్రచారముచేయుచు, వానిని మాన్పుట కంపెనీవారి కర్తవ్యమని బోధింపదొడగిరి. దీనిమూలమునకూడ అధికారులలో సంస్కరణాభిలాష జనించెను. ఇదిగాక పందొమ్మిదవ శతాబ్ద ప్రారంభమందుండి ఇంగ్లండునందు తత్వవేత్తలలోను, అధికార వర్గములోని ప్రముఖులందును సంస్కరణాసక్తి అత్యధికముగ వ్యాపించి యుండెను;

అచ్చటి సంస్థలన్నిటిని మార్పవలెనను ఉత్సాహము వారి కపరిమితముగ నుండెను. ఇండియాలోని సంస్కరణములు కూడ కొంతవరకు దీని ఫలితమనియే చెప్పవచ్చును. ఈ సందర్భమున మరియొక విషయము కూడ గమనింపదగియున్నది. కంపెనీ ఉద్యోగస్థుల అనుభవము ఎక్కువైనకొలది బంగాళములో కారన్‌వాలీసు గావించిన మార్పులలో లోపములు వారికి స్పష్టమయ్యెను. ఇతర రాష్ట్రముల కామార్పులు వర్తింపవని వారు దృఢనిశ్చయులైరి. అందుచేతకూడ కొన్ని సంస్కరణము లావశ్యకమయ్యెను.

**పరిపాలన విధానమందు సంస్కరణములు :** పరిపాలన విధానములో నీకాలమున జరిగిన సంస్కరణములందు కొన్ని ప్రధానములుగ నున్నవి. మద్రాసు, బొంబాయి మొదలగు రాష్ట్రములలో శాశ్వత భూమిశిస్తు విధానముగాక తాత్కాలిక (Temporary) విధానము ప్రవేశపెట్టబడెను. ఇందువలన రైతుల యాదాయము వృద్ధి కాను కాను ప్రభుత్వమువారి ఆదాయము కూడ వృద్ధికాగలిగెను. ప్రభుత్వమువారు సరాసరి రైతులవద్ద నుండియే పన్నులను వసూలు చేయసాగిరి, జమీందారీ పద్ధతి ఈ రాష్ట్రములలోనికి విశేషముగ వ్యాపించలేదు. ప్రతి రైతుయొక్క భూమిని కొలిచి, సారమును బట్టి అతడు చెల్లించవలసిన శిస్తును నిర్ణయించు ఆచారమేర్పడెను. అందుచేత కలెక్టర్లు గ్రామములవెంట తిరిగి, రైతులయొక్క పరిస్థితులను చక్కగ గమనించి, ప్రజల కష్టసుఖము లెట్టివో గ్రహింపగలవారైరి. ఈ రాష్ట్రములలోని కలెక్టర్లకు రెవిన్యూ అధికారమేగాక మాజిస్ట్రేటు అధికారమును, కొంతవరకు న్యాయపరిపాలనాధికారము కూడ నొసగబడెను. కలెక్టర్ల ప్రాధాన్యమునకును, పలుకుబడికిని ఇవియే కారణములు.

**బెంటింకు ప్రభువు :** క్రీ.వె. 1828 మొదలు క్రీ.వె. 1835 వరకు గవర్నరు జనరలుగ నుండిన బెంటింకు ప్రభువు సంస్కర్తలందరిలో నగ్రగణ్యుడు. మత విషయములందు కంపెనీ వారు జోక్యము కల్పించుకొనుట ప్రమాదమని భయపడక, హిందూ సనాతనులను లక్ష్యపెట్టక, రాజా రామమోహన రాయలు మొదలగు సంస్కర్తల సహాయముతో 'సతి' (లేక సహగమనము) అను ఆచారమును మాన్పి స్త్రీ జన సంరక్షకుడయ్యెను. దారిదోపిడియే వృత్తిగా గలిగి, ప్రయాణీకులను చంపుటకు కూడ వెనుదీయక, కాళికాదేవిభక్తులను పేర ప్రజలను బాధించుచున్న 'తగ్గు'లను రూపుమాపెను. ఒరిస్సా, మధ్య పరగణాలలోని కొండజాతులలో ప్రబలియుండిన నరబలులను చాలవరకు తగ్గించెను. భారతీయులు ఉన్నతోద్యోగముల కర్హులని

ప్రకటించి వారి జీతములను కూడ హెచ్చు చేసెను. కంపెనీవారు విద్యావ్యాప్తికై ఖర్చుపెట్టదలచుకొనిన ద్రవ్యమును దేశభాషలలో విద్యగరపుటకై గాక ఇంగ్లీషు భాషలో విద్య గరపుటకై ఖర్చు పెట్టబడవలెనని ఉన్నత సభాసభ్యుడగు మెకాలేయొక్క ప్రోద్బలము చేత నితడు శాసించి, ఇంగ్లీషు విద్యయు, పాశ్చాత్య విజ్ఞానమును దేశమందు వ్యాపించుటకు కారకుడయ్యెను. దేశభాషలు వెనుకబడుటకును, విద్యావంతులు ప్రాచీన సంప్రదాయములందు విముఖులగుటకును ఇది కొంతవరకు కారణమైనను, దీనిమూలమున ప్రజలయందు జాతీయాభిమానమును, రాజకీయ



బెంటింకు ప్రభువు

విషయము లందు ఉత్సాహమును ప్రబలెను. ఇవిగాక సివిల్, మిలిటరీ ఖర్చులను తగ్గించుట యందును, కలెక్టర్ల అధికారమును పెంచుటయందును బెంటింకు మిక్కిలి శ్రద్ధవహించెను.

స్వదేశ సంస్థానములు: సంస్థానముల వ్యవహారములందు బెంటింకు ఉదాసీనపద్ధతి ననుసరించినవాడైనను, దుర్భరమగు దుష్పరిపాలనమునకు లోనైన మైసూరు, కాచార్, కొడగు రాజ్యములను బ్రిటీషు పరిపాలనము లోనికి తెచ్చెను.

## 2. బర్మా, ఆఫ్గన్‌స్థానము, సింధురాష్ట్రము

బర్మా : పందొమ్మిదవ శతాబ్ద ప్రారంభము నాటికి బర్మా రాజ్యము కొంతప్రాబల్యము గాంచెను. ఐరావతీ నదీతీరమందున్న ఆవా పట్టణపు రాజులు క్రమక్రమముగ చుట్టుపట్లనున్న పెగు, టెనాసరిం, అరకాక్ మొదలగు రాజ్యములను జయించి, బర్మాదేశమునంతను తమ యధీనము లోనికి తెచ్చుకొనిరి. వీరి రాష్ట్రమునుండి పారిపోయిన వారనేకులు బంగాళములోని బ్రిటీషు రాష్ట్రమందు చేరి, అప్పుడప్పుడు వీరి ప్రజలపైబడి దోపిడిచేయుచుండిరి. ఈ దోపిడిగాండ్రనుపట్టి ఇయ్యవలసినదని బర్మారాజు లనేక పర్యయములు ఇంగ్లీషువారిని కోరిరి; కాని ఇంగ్లీషువారీ కోరికను మన్నింపరైరి. క్రీ. వె. 1817లో వీరు బంగాళములోని ప్రదేశములు కొన్ని తమవియని చెప్పుచు గవర్నరు జనరలు కొక మర్యాదరహితమైన ఉత్తరమును వ్రాసిరి. పిండారీ యుద్ధము నందతడప్పుడు మునిగియుండుటచే నేమియు చేయక ఊరకుండెను. క్రీ.వె. 1823లో వీరు అస్సాం రాష్ట్రమును జయించి ఇంగ్లీషువారి పొలిమేరలలో చేరిరి.

క్రీ.వె. 1823లో వీరు చిట్టగాంగు సమీపమున నుండు షాపురి అను ఇంగ్లీషు లంకను పట్టుకొనిరి. అందుపై గవర్నరు జనరలు వారితో యుద్ధమునకు దిగెను.

**మొదటి బర్మా యుద్ధము :** ఈ యుద్ధము క్రీ.వె. 1824 మొదలు క్రీ.వె. 1826 వరకు జరిగెను. క్రీ.వె. 1824లో ఇంగ్లీషునౌకాదళము రంగూన్ పట్టణమును పట్టుకొనెను. కాని, దేశమంతయు అరణ్యమయముగను, జలమయముగను ఉండుటచేతను, సైన్య ప్రయాణములకు కావలసిన యేర్పాటులను చక్కగ చేయనందునను ఇంగ్లీషువారు యుద్ధము సాగించుట కష్టమయ్యెను. క్రీ.వె. 1825, 1826లో ఎంతో ప్రయాసమీద, అపరిమిత ధనమును ఖర్చుపెట్టి, వీరు బర్మా సైన్యముల నోడించి ఆవాను సమీపించిరి. అప్పుడు బర్మారాజు వీరితో సంధిజేసికొని అరకాన్, టెనాసరీం, అస్సాం, కాచారు రాష్ట్రములను, నష్టపరిహారము క్రింద కోటిరూపాయలను ఇచ్చుట కంగీకరించెను.

**రెండవ బర్మాయుద్ధము :** క్రీ.వె. 1826 మొదలు ఇంగ్లీషు వర్తకులు రంగూనుకు వెళ్లి వ్యాపారము చేయసాగిరి. బర్మారాజులు వీరికి కొన్ని చిక్కులను కలిగించుచుండిరను మిషచే డల్‌హౌసీ గవర్నరు జనరలు క్రీ.వె. 1851లో రెండవ బర్మాయుద్ధమును గావించెను. బ్రిటీషు సామ్రాజ్య వ్యాప్తియందతనికి గల విపరీత కాంక్షయే ఈ యుద్ధమునకు కారణము. ఇంగ్లీషు సేన లీ పర్యాయము చక్కగ యుద్ధముచేసి సంవత్సరము లోపల రంగూన్, ప్రోం, పెగు మొదలగు పట్టణములను పట్టుకొనెను. క్రీ.వె. 1852లో గవర్నరు జనరలు పెగూ రాష్ట్రమును వశపరచుకొని యుద్ధము నాపెను. సముద్రతీరమంతయు ఇంగ్లీషువారి వశమయ్యెను. అప్పరు బర్మా మాత్రము స్వతంత్రించి యుండెను.

**రషియనుల వలని భయము :** ఐరోపాఖండమందు ఇంగ్లీషువారికి ఒక్కొక్క శతాబ్దమందు ఒక్కొక్కరితో విరోధము ప్రాప్తించుచుండెను. పదునారవ శతాబ్దమున స్పెయిను (పోర్చుగల్) వారు, పదునేడవ శతాబ్దమున డచ్చివారు, పదునెనిమిదవ శతాబ్దమున ఫ్రెంచివారు వారికి శత్రువులైయుండిరి. వీరందరు నౌకాబలము గలిగినవారు; సముద్రముపై ఇంగ్లీషువారితో పోటీచేయుచుండినవారు. క్రీ.వె. 1815 నాటికి వీరు పరాజితులైరి. ఇంగ్లీషువారి నౌకాబలమద్వితీయమయ్యెను. సముద్రమార్గమున ఇండియాపైకి దండెత్తిరాగల వారెవ్వరు లేరైరి. పందొమ్మిదవ శతాబ్దమున రషియావారు ఇంగ్లీషువారికి విరోధులైరి. వీరు మధ్యఆసియానంతను జయించిరి. ప్రాచీన కాలమందును, మధ్యకాలమందును ఇండియాపై దండెత్తి వచ్చినవారివలె మెట్టమార్గముల నడచి, పర్షియా, ఆఫ్‌గన్‌స్థానముల మీదుగ వీరు ఇండియాపైబడి,

బ్రిటీషు సామ్రాజ్యమును నాశనము చేయుదురను భయము. అనుమానము ఇంగ్లీషువారిని పట్టి పీడింపసాగెను. క్రీ.వె. 1828లో వీరు పర్షియన్ సైన్యములనోడించి, పర్షియా దేశమున పలుకుబడి సంపాదించుకొనిరి. క్రీ. వె. 1836లో వీరి ప్రోద్బలమున పర్షియావారు ఆఫ్గనిస్థానములోని హీరటుకోటను ముట్టడించిరి. ఈ కారణముచే రషియావారియెడల ఇంగ్లీషువారికి గల అనుమాన మధికమయ్యెను.

ఆఫ్గనిస్థానము : అప్పుడు ఆఫ్గనిస్థానమును దోస్తు మహమ్మదు పాలించుచుండెను. ఇతడు క్రీ.వె. 1809లో షాషూజా అనువానిని సింహాసనము నుండి తొలగించి రాజ్యమునకు వచ్చినవాడు. రషియావారు, పర్షియావారు కలసి తనపై బడుదురను భయమితనికుండుటచే నితడు ఇంగ్లీషువారి సఖ్యమును కోరుచుండెను. కాని ఇంగ్లీషువారికిని, ఇతనికిని సంధి షరతులు కుదురలేదు. ఏమిచేయుటకు తోచక ఇతడు డోలాయమానుడై యుండగా, క్రీ.వె. 1837లో రషియా రాయబారి యొకడు కాబూలునకు వచ్చెను. అందుపై గవర్నరు జనరలగు ఆక్లండు దోస్తు మహమ్మదు యెడల అనుమానము గలవాడై, రాజ్యము నుండి అతనిని తొలగించి, క్రీ.వె. 1809 మొదలు ఇంగ్లీషువారి సంరక్షణలోనున్న షాషూజాను రాజుగ చేయుటకు నిశ్చయించుకొని, రంజితసింహునితోడను, సింధురాష్ట్రపు అమీరు తోను సంధిగావించుకొని, వారి సహాయముతో ఆఫ్గన్ దేశముపై దండెత్తి వెళ్లుటకు సమకట్టెను. అప్పటికి పర్షియావారు హీరటు ముట్టడిని వదలుకొనిరి; రషియా రాయబారి స్వదేశమునకు వెళ్ళిపోయెను; వేయి మైళ్ళ దూరమందున్న రషియనులు పర్వతములను దాటి, మార్గములోని శత్రువుల నోడించి, ఇండియాలోని బ్రిటీషు రాష్ట్రముపై దండెత్తు ట సాధ్యముకాని పని. అయినను ఆక్లండు దూరమాలోచింపక (మొదటి) ఆఫ్గన్ యుద్ధములో దిగెను.

**మొదటి ఆఫ్గన్ యుద్ధము :** షాషూజాను వెంటబెట్టుకొని సింధురాష్ట్రమునుండి బోలన్ కనుమల మీదుగ ఇంగ్లీషు సైన్యములు క్రీ.వె. 1838లో ఆఫ్గనిస్థానమును ప్రవేశించి, కాందహారు, గజనీ, కాబూలు పట్టణములను పట్టుకొనెను. దోస్తు మహమ్మదు పారిపోయి, కొంతకాలమైన తర్వాత ఇంగ్లీషువారికి వశుడయ్యెను; షాషూజాను వారు సింహాసన మెక్కించిరి. తాము వచ్చినపని చక్కగ జరిగెనని వారు సంతోషపడిరి. కాని కాలక్రమమున వారి కష్టము లధికమయ్యెను. ఆఫ్గనులందరు షాషూజాయెడల ననురాగులు కాకుండిరి. ఇంగ్లీషువారి సహాయములేక ఒక నిమిషము కూడ నతడు సింహాసనమును నిలబెట్టుకొనలేని స్థితియందుండెను; వారి సైన్యముల ఖర్చు విపరీతముగ పెరుగుచుండెను; ఆఫ్గన్ ప్రముఖులకు లంచము లిచ్చిన గాని వారి

సహాయము దొరకకుండెను. రంజిత సింహుడు మృతిజెందుటచేత శిక్కులవలన ప్రమాదము సంభవించునట్లగపడెను. ఇంగ్లీషుసైనికులు ఆఫ్గనులయెడ కొన్ని అత్యాచారములను గూడ గావించిరి. తుదకు క్రీ.వె. 1841లో వారు ఇంగ్లీషువారిపై తిరుగబడి ఇంగ్లీషు ఉద్యోగస్థులను కొందరిని చంపిరి. అప్పుడు చేయునది యేమియు లేక ఆఫ్గన్ స్థానమును వదలి వెళ్ళిపోవుటకు ఇంగ్లీషు సైనికులొడబడిరి. కాని మార్గమున ఆఫ్గన్‌లు వారిపైబడి అనేకులను చంపిరి; అనేకులు చలిబాధ కోర్వలేక చచ్చిరి. తుదకు కాబూలు నుండి బయలుదేరిన 16,000 జనములో ఒకడు మాత్రమే జలాలాబాదును చేరి, ఆ కోటలోనున్న ఇంగ్లీషు పటాలమునకు జరిగినదంతయు నివేదించెను. ఇండియాలోని ఇంగ్లీషుసైన్యముల కిదివరకెన్నడు ఇంతటి అవమానము జరుగలేదు. గవర్నరు జనరలగు ఆక్లండు ఉద్యోగమును వదలి వెళ్ళిపోయెను. అతని స్థానమున ఎల్లిన్‌బరో ప్రభువు గవర్నరు జనరలై, షాహూజాను నిలబెట్టుట సాధ్యము కాదని నిశ్చయించి ఇంగ్లీషువారి ప్రతిష్ఠను ప్రతిష్ఠాపించుటకై ఏదైన పౌరుష కార్యమును చేసి జలాలాబాదు, కాందహారులలోని సేనలు వెనుకకు మరలవలసినట్లు ఆజ్ఞాపించెను. ఈ సేన లేదోవిధముగ కాబూలునకు వెళ్ళి దానిని పట్టుకొని బజారులను కాల్చి ప్రజలను దోపిడీచేసి ఇండియాకు వచ్చి చేరెను. అదివరకే షాహూజా శత్రువులచే సంహరింపబడెను. దోస్తు మహమ్మదు తిరిగి రాజయ్యెను. ఇంగ్లీషువారికి వేలకొలది సైనికులు, కోట్లకొలది ధనమును నష్టమయ్యెను; యుద్ధమునంద జేయులను ప్రఖ్యాతిని వారు కోల్పోయిరి. శిక్కు యుద్ధములకును, సిపాయీల తిరుగుబాటునకును ఆఫ్గన్ యుద్ధములో ఇంగ్లీషువారికి కలిగిన పరాభవమే కొంతవరకు కారణమయ్యెను.

**సింధురాష్ట్రమును జయించుట :** క్రీ.వె. 1842 నాటికి సింధురాష్ట్రమును అమీరులు కొందరు పాలించుచుండిరి. మింటో ప్రభువు కాలమందుండి వీరు ఇంగ్లీషువారికి మిత్రులు. క్రీ.వె. 1839లో ఆక్లండుప్రభువు వీరిని కొంత బలాత్కరించి సైన్య సహకారసంధి కొప్పించెను. సింధురాష్ట్రమున వ్యాపారవసతు లనేకములు కలవు. దీనిని వశపరచుకొనిన యెడల శిక్కులతో రానున్న యుద్ధములందు ఇంగ్లీషువారికెంతో అనుకూలముగ నుండును. ఇదిగాక ఏదైన యుద్ధమందు శత్రువుల నోడించి ఆఫ్గన్ స్థానములో కోల్పోయిన ప్రతిష్ఠను తిరిగి సంపాదించుటకు ఎల్లిన్‌బరో ఉవ్విళ్లూరు చుండెను. ఈ కారణమువలన నతడు క్రీ..వె. 1842లో నూతన షరతులను కొన్నిటిని చేర్చి క్రొత్త సంధి కొకదానికి అమీరు లంగీకరింపవలయునని కోరెను. వారందుకు సమ్మతించియు రహస్యముగ యుద్ధప్రయత్నములు చేయసాగిరి. వెంటనే ఇంగ్లీషువారు వారిపైబడి, మియానీయుద్ధమందు వారి నోడించి, సింధు రాష్ట్రమును జయించి వశపరచుకొనిరి (1842).

## 3. శిక్కుల యుద్ధములు : పంజాబును జయించుట

శిక్కులు : శిక్కులనగా శిష్యులని యర్థము. క్రీ.వె. 1469 మొదలు క్రీ.వె. 1538 వరకు జీవించి హిందూమత సంస్కర్తయని ప్రఖ్యాతిగాంచిన నానక్ యొక్క శిష్యులే శిక్కులు. వీరందరు పంజాబులోనివారు. నానక్ తర్వాత వీరికి తొమ్మండుగురు గురువులుండిరి. నాల్గవ గురువగు రామదాసు అమృతసరమున నొక దేవాలయము నిర్మించి ఆ పట్టణమును శిక్కులకు పుణ్యక్షేత్రముగను, కేంద్రస్థానముగను చేసెను. అయిదవ గురువగు అర్జునుడు శిక్కుల వేదమగు 'ఆదిగ్రంథము' తయారు చేసెను. కుస్రూకు సహాయము చేసెనని జహాంగీరు ఇతనిని పట్టిచంపెను. ఇది మొదలు శిక్కులు మొగలాయీల యెడ బద్ధవైరులైరి. ఆరవ గురువగు హరి గోవిందుడు పండ్రెండు సంవత్సరములు కారాగృహమున గడిపెను. స్వమతమును



గురునానక్

రక్షించుటకు యుద్ధము తప్ప మార్గాంతము లేదని ఇతడు శిక్కులకు బోధించి వారిని యోధులుగ మార్చెను. తొమ్మిదవ గురువగు తెగ్ బహదూరు ఔరంగజేబు యొక్క ఆగ్రహమునకు గురియై అతనిచే చిత్రవధ గావింపబడెను. అతని కుమారుడును, పదియవగురువును అగు గురగోవిందుడు మొగలులతో యుద్ధము చేసి, శిక్కులకు సింగ్ అను బిరుదనామమిచ్చి, వారెల్లప్పుడు ఆయుధధారులై యుండవలెనని శాసించి వారినొక క్షత్రియజాతిగ మార్చెను.

శిక్కుల రాజ్యములు : ఔరంగజేబు చనిపోయిన తర్వాత పంజాబునందరాజకము ప్రబలెను. నాదరుషా అహమ్మదుషా అబ్దల్లీల దండయాత్రల వలన నీ అరాజకము వృద్ధియై, యుద్ధమే ప్రధానవృత్తిగ జేసికొనిన శిక్కులకు రాజ్యములు సంపాదించుకొనుట కవకాశమేర్పడెను. ఈ యవకాశమును వారు చక్కగ నుపయోగించుకొని క్రీ.వె. 1800 నాటికి పండ్రెండు రాజ్యములను స్థాపించుకొనిరి. ఒక్కొక్క రాజ్యము ఒక్కొక్క నాయకుని క్రింద నుండెను.

రంజిత సింహుడు : వీరిలో రంజితసింహుడొకడు. ఇతడు లాహోరునకు గవర్నరై

కాలక్రమమున తక్కిన శిక్కు రాజ్యములనన్నిటిని వశపరచుకొనెను. క్రీ.వె. 1809 ప్రాంతమున నితడు సట్లెజ్ నదికి తూర్పుననున్న రాజ్యములను జయింప ప్రయత్నింపగా ఇంగ్లీషువారాతనికి అడ్డుతగిలిరి. అప్పుడతాడా ప్రయత్నమును విరమించుకొని, సట్లెజ్ నదిని దాటిరాకుండుట కంగీకరించి వారితో సంధిజేసికొనెను. అటుతర్వాతనతడు క్రీ.వె. 1818లో ముల్తానును, క్రీ.వె. 1819లో కాశ్మీరమును, క్రీ.,వె 1823లో పెషావరును జయించి, గొప్ప రాజ్యమున కధిపతియై, క్రీ.వె. 1839 వరకు రాజ్యము చేసెను. శిక్కు సైన్యముల సౌష్ఠవము నభివృద్ధిజేయుటకై ఇతడు రెండు గొప్ప మార్పులను గావించెను.



రంజితసింహుడు

ఇతనికి పూర్వము శిక్కులు అశ్వదళములందేగాని కాల్బలమందును, ఫిరంగుల పటాలములందును విశేషముగ చేరకుండిరి. అందుచేత శిక్కులు కానివారిని కూడ శిక్కు సైన్యములలో చేర్చుకొనవలసిన అవసరముండెను. రంజితసింహుడిది యొక గొప్పలోపమని గ్రహించి సైన్యములోని అన్ని అంగములందును శిక్కులు చేరునట్లు పోత్సాహపరచి, తన సైన్యమును జాతీయ సైన్యముగ మార్చెను. ఇదిగాక యూరోపియన్ యుద్ధపద్ధతులును నేర్పుటకై యితడు నియోగించిన ఫ్రెంచి శిక్షకులనెల్లను ఇతడు తనకులోబడి యుండునట్లు చేసెనేగాని, వారికి గొప్పజాగీరులు, రాష్ట్రములు ఇచ్చి, తన్ను ధిక్కరింప గలవారినిగ జేయలేదు. ఇందుకూడ ఇతని దూరదృష్టియు, వివేకమును గన్పించుచున్నవి.

మొదటి శిక్కు యుద్ధము : రంజిత సింహుడు చనిపోయిన తర్వాత అతని యాస్థానము కుట్రలకును, అల్లరులకును నిలయమయ్యెను. రాజకుమారులు రాజ్యమునకును, ప్రముఖులు అధికార పదవులకును పోరాడసాగిరి. నాలుగు సంవత్సరములలో ముగ్గురు రాజులు, ముగ్గురు మంత్రులు ప్రాణములను గోల్పోయిరి. సైనికులు రాజులయొక్కయు, మంత్రుల యొక్కయు ఆజ్ఞలను లక్ష్యపెట్టక, స్వేచ్ఛానువర్తులై, రాజకీయ వ్యవహారములందు పాల్గొనసాగిరి. క్రీ.వె. 1846 నాటికి దిలీపసింగు అను బాలుడు రాజుగ నుండెను. వ్యవహారముల నన్నిటిని అతని పేర నతని తల్లి జరుపుచుండెను. గవర్నరు-జనరలగు హార్డింజి శిక్కు రాజ్యము నందలి

పరిస్థితులు ప్రమాదకరముగ నుండుట జూచి, వేలకొలది సైన్యమును సట్లెజ్ నదిక ఎడమవైపున చేర్చెను. ఈ సన్నాహ మంతయు పంజాబును జయించుటకే అని శిక్కు సైనికులు శంకించి, అఫ్గనులచే నోడిన ఇంగ్లీషువారిని జయించుట కష్టముకాదని భావించి, యుద్ధమునకై ఎదురు చూచుచుండిరి. దిలీపసింగుని తల్లియు, తక్కిన




శిక్కు యుద్ధములను సూచించు పటము

అధికారులును సైన్యములను లొంగదీయుటకు మార్గాంతరములేక వారిని సట్లెజ్ నది కెడమవైపున నున్న ప్రదేశములకు పంపిరి. క్రీ.వె. 1809లో జరిగిన సంధి కిది విరుద్ధమగుటచేత ఇంగ్లీషువారు యుద్ధమారంభించిరి. ముడ్కీ, ఫిరోజ్‌షా, ఆలివాల్, సోబ్రయాన్ అను నాలుగు యుద్ధరంగములందతి ఘోరమగు పోరాటము జరిగెను. అంతకు పూర్వమెప్పుడును ఇంగ్లీషువారి కింతటి దెబ్బ తగులలేదు; ఇంతటి నష్టము సంభవించలేదు. కాని ప్రతియుద్ధమందును తుదకు ఇంగ్లీషువారికే జయము లభించెను.

శిక్కు సైన్యాధిపతులలో ఐకమత్యము లేకుండుటచేతను, వారు సైనికుల యెడ ద్రోహ చింతగలవారగుటచేతను సైనికుల పౌరుషము, యుద్ధకౌశలము వ్యర్థములయ్యెను. క్రీ.వె. 1846లో ఇంగ్లీషువారు లాహోరును పట్టుకొనిరి. అప్పుడు శిక్కు ప్రభుత్వమువారు సంధిజేసికొని, సట్లెజ్, బీయాస్ నదులకు మధ్యనున్న ప్రదేశమును, కాశ్మీరమును, ఏబది లక్షల రూపాయలను ఇంగ్లీషువారి కిచ్చుట కంగీకరించిరి. ఇంగ్లీషు సైన్యమొకటి లాహోరునందుంచబడెను. ఇంగ్లీషు ఉద్యోగస్థుల సలహాల ననుసరించి దిలీపసింగు రాజ్యము చేయవలసినట్లేర్పాటు గావింపబడెను.

**రెండవ శిక్కు యుద్ధము :** ఇంగ్లీషువారి సైన్యము లాహోరునందుండుటయు, వారి ఉద్యోగస్థులు రాజువద్ద సలహాదారులగుటయు, శిక్కు సర్దారురులకును, సైనికులకును కంటకముగ నుండెను. నాయకుల మోసమేలేని యెడల మొదటి యుద్ధమందు తమకు తప్పక జయము లభించియుండునని సైనికులభిప్రాయపడిరి. ఇంగ్లీషువారి అధికారమును తొలగించుటకు ప్రముఖ లనేకులు నిశ్చయించుకొనిరి. క్రీ.వె. 1848లో ముల్తానుకు గవర్నరైన మూలరాజు తిరుగబడి, ఇంగ్లీషు ఉద్యోగస్థుల నిరువురను చంపించెను; అతని నణచుటకై లాహోరు నుండి పంపబడిన మరియొక శిక్కు సైన్యమతనితో కలసెను. అప్పుడు దేశమందంతను బ్రిటీషువారి అధికారమును స్థాపించుటయే శ్రేయోదాయకమని విశ్వసించిన డల్‌హౌసి గవర్నరు జనరలుగ నుండెను. అతడు వెంటనే యుద్ధమారంభించెను. చిలియన్‌వాలా అను చోట జరిగిన యుద్ధములో ఇంగ్లీషువారి కపరిమిత నష్టము కలిగెను. కాని గుజరాత్ అను ప్రదేశమున తర్వాత కొద్దిరోజులకు మరియొక యుద్ధము జరిగెను; అందు శిక్కులోడిపోయిరి(1849) అప్పటికి ముల్తాను కూడ ఇంగ్లీషువారి వశమయ్యెను. అంతటితో యుద్ధము ముగిసెను. దిలీపసింగున కారు లక్షల మనోవర్తినిచ్చి డల్ హౌసి పంజాబును ఇంగ్లీషు పాలనలోనికి తెచ్చెను. ఇంతటితో శిక్కుల స్వాతంత్ర్య మంతరించెను (1849).

## 4. డల్‌హౌసి ప్రభువు : నిర్వీరసత్వ సిద్ధాంతము

**డల్‌హౌసీ :-** క్రీ.వె. 1848 లో డల్‌హౌసీ ప్రభువు గవర్నరు జనరలుగ వచ్చినప్పుడు పంజాబునందు తప్ప తక్కిన దేశమందంతట బ్రిటీషువారి అధికారము వ్యాపించి యుండెను. ఇతడు రెండవ శిక్కు యుద్ధము మూలమున పంజాబును కూడ వశపరచుకొనెను. కాని ఇంతటితో నితనికి తృప్తికలుగలేదు. సైన్యసహకారపద్ధతి కంగీకరించి, బ్రిటీషు మిత్రవర్గములో చేరిన సంస్థానములను కూడ కంపెనీ పరిపాలనలోనికి తెచ్చుట కితడు నిశ్చయించెను. కంపెనీ పాలనమందుండు రాష్ట్రములను

వృద్ధిచేయుట చిక్కులకు కారణమని ఒకప్పుడు తలచిన కంపెనీ డైరక్టర్లు కాలక్రమమున వారి అభిప్రాయమును మార్చుకొనిరి. ఇండియాలోని ప్రజలను పాలించుట కష్టమైన



డల్‌హౌసీ ప్రభువు

పని కాదనియు, దానికి కావల సిన సామర్థ్యము తమ ఉదోగస్థుల కున్న దనియువారు నమ్మసాగిరి. బ్రిటీషు రాష్ట్రములలోని ప్రజలు దినదినాభివృద్ధి గాంచుచుండ సంస్థానములలోనివారు ఎక్కువ కష్టములకు పాలగుచున్నారని వారభిప్రాయవడిరి. బ్రిటీషు వా రక్షణయున్నది కదాయను ధైర్యముత సంస్థానాధీశులు దిగులు, విచారములే విధికృత్యములను మరచి, పన్నుల మూలమున లభించిన ఆదాయమును ప్రజలకొర గాక స్వసుఖములకై వినియోగించుచుండ తాము ఉదాసీనులై ప్రజలను రక్షింపకుండు ధర్మవిరుద్ధమని వారు తలచిరి. అట్టి సంస్థానములను కంపెనీ పాలనలోనికి తెచ్చు ప్రజలకు లాభకారియగునని డల్‌హౌసి నిశ్చయించెను. అందుకై అతడ నిర్వారసత్వసిద్ధాంత మనునొక సిద్ధాంతము ననుసరించెను.

నిర్వారసత్వము సిద్ధాంతము :- సంస్థానములలో కొన్ని కంపెనీవారి సృష్టింపబడినవి; కొన్నిఅట్టివికావు. మొదటి రకములో చేరిన సంస్థానములను పాలించ రాజులు పుత్రులు లేక గతించినపుడు వారి రాజ్యములు కంపెనీకి చెందవలయునన సిద్ధాంతమే నిర్వారసత్వ సిద్ధాంతము. ఔరసపుత్రులు లేనపుడు దత్తస్వీకారమ చేసికొనుటయు, దత్తపుత్రుడు సంస్థానాధీశుడగుటయు హిందువుల సనాతనాచారమ కాని డల్‌హౌసీ యీ యాచారము నంగీకరింపక, కంపెనీవారి యనుమతి లే దత్తస్వీకారము చెల్లదని వాదించి, ఔరసపుత్రులులేని రాజుల రాజ్యములను కంపె పాలనలోనికి తెచ్చెను. ఈ విధముగ బ్రిటీషుపాలనలోనికి వచ్చినవి సతారా (1848 జయత్పూరు (1849), సంబల్పూర్ (1849), బగట్ (1850), ఉదయపూరు (1852 ఝాన్సి (1853), నాగపూరు (1854) రాజ్యములు. ఇందుమూలమున బ్రిటీ సామ్రాజ్యము పెంపొందినను, ప్రజల స్థితిగతులు కొంతవరకు బాగుపడినను, తక్కి సంస్థానాధీశులలోను, ప్రముఖులలోను, జనసామాన్యమందును ఒక విధమయి బయము కలిగి సిపాయీల తిరుగుబాటునకు కారణమయ్యెను. డల్‌హౌ

వశపరచుకొనిన రాజ్యములలో అయోధ్య యొకటి. ఇది నిర్వ్యారసత్వము వలన లభించినది కాదు. నవాబుల యొక్క పరిపాలన మతృప్తికరముగ నున్నందునను. ఇంగ్లీషువారి మందలింపులను వారు గమనింపనందునను క్రీ.వె. 1856 లో డైరెక్టర్ల అనుమతితో డల్‌హౌసీ యీ రాజ్యమును బ్రిటీషు సామ్రాజ్యమున కలుపుకొనెను.



హైదరాబాదు యొక్క పరిస్థితులు కూడ నిట్లే యుండెను: కాని రాజ్యమునంతను తీసికొనుటకు బదులు బీహారు రాష్ట్రమును మాత్రము డల్‌హౌసీ వశపరచుకొనెను. మహమ్మదీయ రాజ్యములకు డల్‌హౌసీ కలిగించిన నష్టము సిపాయీల తిరుగుబాటు కాలమందు మహమ్మదీయుల విరోధమునకు కారణమయ్యెను.

**డల్‌హౌసీ యొక్క పరిపాలనము :** అనేక రాష్ట్రముల నీవిధముగ కంపెనీపాలనలో జేర్చి, వెలస్లీ, హేస్టింగ్సు ప్రభువులవలె డల్‌హౌసీ కూడ బ్రిటీషు సామ్రాజ్య కర్తలలో నొకడను ప్రఖ్యాతిని గాంచెను. కాని ఇతని కీర్తి కిది యొకటియే కారణముకాదు. ప్రజలయొక్క ఆర్థికస్థితిని బాగుచేయుట కితడెంతో శ్రమపడెను. ఇతడు తపాలా పద్ధతిని ప్రవేశపెట్టి (1854), చౌకరేట్లతో ఉత్తరప్రత్యుత్తరములు జరుగునట్లు చేసెను. క్రీ.వె. 1855లో కలకత్తా, బొంబాయి, మద్రాసు, ఆగ్రా, పెషావర్ల మధ్య తంతితీగెలను వేయించెను. కంకరతో కూర్పబడిన రోడ్లను వేయించి, అట్టి పనులను విరివిగ చేయుటకొక ప్రత్యేక ప్రభుత్వశాఖను (Public Works Department) నిర్మించెను. ఇనుపదారులను క్రమపద్ధతిని మొట్టమొదట నితడే ప్రవేశపెట్టెను. మరమ్మతులు లేక చెడిపోయిన ప్రాచీనకాలపు కాలువల నితడు బాగుచేయించుటయేకాక గోదావరి, కృష్ణ మొదలగు నదులపై ఆనకట్టలు కట్టించి, క్రొత్తకాలువలను త్రవ్వించి వ్యవసాయమున కెంతో సహాయము చేసెను. ఈ యేర్పాటుల వలన క్షామకాలములందు ప్రజలు పడు చుండిన బాధలు కొంతవరకు తగ్గెను. ఇతడు ఇంగ్లండులోని అధికారులతో విద్యావ్యాప్తి విషయమై సంప్రదించి క్రీ.వె. 1854లో క్రొత్త విద్యాపద్ధతిని ప్రవేశపెట్టెను. విశ్వ విద్యాలయముల స్థాపనము, దేశభాషల అభివృద్ధి, స్త్రీ విద్యాభివృద్ధి, ఇంజనీరింగు, వైద్యము మొదలగు వృత్తి విద్యల ప్రాధాన్యము - ఇవన్నియు డల్‌హౌసీ పరిపాలనా ఫలి తములు. స్త్రీ పునర్వివాహ చట్టమునకై యితడెంతో పరిశ్రమ చేసెను. మతమును మార్చుకొనుట వలన వారసత్వపు హక్కులకు భంగము కలుగకుండ నితడొక శాసనమును గావించెను. రాష్ట్రసంపాదనమందేగాక రాష్ట్రపరిపాలన మందుకూడ బ్రిటీషువా రెక్కువ శ్రద్ధ వహించి, ప్రాచీన సంప్రదాయములను కూడ లక్ష్యపెట్టక తమకు ధర్మమని తోచిన పనులను సాహసించి చేయవలెనని పట్టుబట్టిన వారిలో డల్‌హౌసీ యొకడు. ఇతడు క్రీ.శ. 1856లో ఇంగ్లండుకు వెళ్లిపోయెను. ఇతని స్థానమున కానింగ్ ప్రభువు గవర్నరు జనరలయ్యెను.

## 5. కానింగ్ ప్రభువు : సిపాయీల తిరుగుబాటు

**సిపాయీలు :** తూర్పిండియా సంఘమువారు ఇండియాను జయించుటకై యుపయోగించిన సైన్యములో మొదటి నుండియు రెండుశాఖలుండెను. ఒకటి

ఇంగ్లీషు సోల్జర్లతో కూడినది; మరియొక దానియందు భారతీయులు చేరియుండిరి. ఈ రెండవశాఖకే సిపాయీ సైన్యమని పేరు. సిపాయీల సంఖ్య ఇంగ్లీషు సైనికుల సంఖ్యకంటె నైదారు రెట్లధికమగుటయేగాక, యుద్ధవిషయములందు యూరోపియనులు పయోగించు పద్ధతులన్నిటిని వీరుగూడ నేర్చుకొని వారితో సమానముగ పోరాడదగియుండిరి. దేశమందు జరిగిన యుద్ధములన్నిటిలో వీరి సహాయము చేతనే ఇంగ్లీషువారు శత్రుబలములను జయించి దేశ పరిపాలకులైరని వీరు సహజ గర్వముతో నుండిరి. కొంత కాలము నుండి వీరు బ్రిటీషు అధికారులయెడ అయిష్టమును చూపసాగిరి. కాలక్రమమున నిది ద్వేషముగ మారి తుదకు 1857-58లో మహత్తరమైన తిరుగుబాటునకు హేతువయ్యెను.



కానింగ్ ప్రభువు

**తిరుగుబాటునకు కారణములు :** ఉత్తర ఇండియాలోని సిపాయిసైన్యములందెక్కువగ హిందువులలోని అగ్రవర్ణము లవారు చేరియుండిరి. అప్పటికాలమున వీరికి స్వమతాచారములం దెక్కువ పట్టుదల యుండెడిది. బెంటింకు కాలము నుండి బ్రిటీషువారు గావించిన సంఘసంస్కరణముల మూలముననుు, క్రైస్తవమతబోధకుల విపరీత ప్రచారము మూలముననుు, పాశ్చాత్య శాస్త్రములను బోధించుటకై స్థాపింపబడిన విద్యాలయముల మూలముననుు హిందూమత మడుగంటుచున్నదనియు, ప్రభుత్వమువారి యుద్దేశము దేశమందంతట క్రైస్తవమతమును ప్రవేశపెట్టుట యనియు వీరు శంకింపసాగిరి. విదేశములకు వెళ్లుటయు, సముద్రప్రయాణము చేయుటయు అప్పటి ఆచారమునకు విరుద్ధమైననుు, ప్రభుత్వమువారు సిపాయీలను నిర్బంధించి ఆఫ్గనిస్థానము, బర్మా, చైనా, పర్షియా మొదలగు దేశములకు వారిని తీసికొని వెళ్ళి, అట్లు వెళ్లుట కిష్టపడినవారిని మాత్రమే సైన్యమున చేర్చుకొనునట్లు శాసించిరి. ఇదిగాక సైనికులుపయోగించు తోటాలకు ఆవుక్రొవ్వును, పందిక్రొవ్వును పూయుచున్నారను వదంతి యొకటి బయలుదేరెను. ఈ కారణముల వలన సిపాయీల యందు పుట్టిన శంక మరింత బలపడెను.

**ప్రజలయందు అసంతృప్తి :** సిపాయీల ద్వేషము ముదురుచున్న యీ

కాలమున ప్రజాసామాన్యమందు కూడ అసంతృప్తి వృద్ధియగుచుండెను. ప్రభుత్వమువారి సంఘ సంస్కరణములు దీనికొక కారణము. డల్‌హౌసీ యొక్క సామ్రాజ్య కాంక్ష మూలమున సంస్థానములలోని ప్రముఖులు, సైనికులు వారి యుద్యోగములను గోల్పోయిరి. రైతుల మంచి కొరకును, ప్రభుత్వపు ఆదాయమును వృద్ధిచేయుటకును, కంపెనీవారు గావించిన కొన్ని చట్టముల మూలమున జమీందారులు, తాలూకాదారులు, ఇనాందారులు మిక్కిలి నష్టపడిరి. నిర్వారసత్వ సిద్ధాంతము కొందరియం దలజడి కలిగించెను. ఇట్టి సమయములో కొందరు మొగలాయీ సామ్రాజ్యమును పునరుద్ధారణ చేయుటకును, మరికొందరు మహారాష్ట్రుల ఆధిపత్యమును నెలకొల్పుటకును తరుణము ప్రాప్తించెనని తలచిరి. వీరందరు సిపాయీలలోని ద్వేషమును మరికొంత బలపరచిరి. ఇదిగాక క్రీ.వె. 1857లో దేశములోని ఇంగ్లీషు సోల్జర్ల సంఖ్య చాల తగ్గియుండెను; సేనానాయకు లనేకులు వృద్ధులుగ నుండిరి; ఆఫ్‌గను యుద్ధమందును, శిక్కు యుద్ధము లందును కంపెనీ సైన్యములు పేరుప్రతిష్ఠలను కొంతవరకు కోల్పోయినందున వారిని జయించుట కష్టముకాదని సిపాయీలనుకొనిరి. ఇన్ని సందర్భములు కలియుట చేత క్రీ.వె. 1857లో సిపాయీలు తిరుగుబాటుచేసి, ప్లాసీయుద్ధము జరిగినదాదిగ నూరు సంవత్సరములనుండి స్వహస్తములచే పెంచి, పెద్దచేసిన బ్రిటీషు సామ్రాజ్య మహావృక్షమును మూలచ్ఛేదము చేయబూనిరి.

సిపాయీల తిరుగుబాటు: ఈ తిరుగుబాటు క్రీ.వె. 1857లో మీరటు దుర్గమందున్న సిపాయీలలో ప్రారంభమయ్యెను. వారు ఇంగ్లీషు సేనానాయకులను చంపి వీరావేశముతో ఢిల్లీ పట్టణమునకు వెళ్లి దానిని వశపరచుకొని, అందలి ఇంగ్లీషువారిని కూడ చంపి, ఎచ్చటనో మూలనున్న బహదూరుషా అను మొగలాయీ చక్రవర్తికి పట్టము గట్టిరి. క్రమక్రమముగ గంగానదీ ప్రాంత ప్రదేశములలోని కోటలన్నిటిలో ఇట్లే జరిగెను. పీష్వా బాజీరావు పుత్రుడైన నానా సాహేబు కాన్‌పూరునందలి సిపాయీలకు నాయకుడై అచ్చట నుండిన ఇంగ్లీషువారి నందరిని, స్త్రీలు శిశువులతోకూడ, మృత్యువు పాలు గావించెను. అయోధ్య రాజధానియగు లక్నోలోని సిపాయీలు ఇంగ్లీషు సైన్యము లను ముట్టడించి పలువిధముల బాధించిరి. ప్రజల అసంతృప్తి ఈ రాష్ట్రమం దత్యధికముగ నుండెను. మధ్యయిండియాలో ఝాన్సీరాణియగు లక్ష్మీబాయి స్వయముగ సైన్యములను నడపి, అతిఘోరముగ పోరుచుండెను. ఇన్ని ప్రదేశములందు తిరుగుబాటులు జరిగినను ఢిల్లీని పట్టుకొనుట ప్రధాన కార్యమని గవర్నరు జనరలు

నిశ్చయించెను. కంపెనీవారి యదృష్టవశమున పంజాబు, దక్కను, దక్షిణ ఇండియాలోని సిపాయిలు కలహింపరైరి. అంబాలానుండి ఇంగ్లీషు పటాలములు వచ్చి, ఢిల్లీ సమీపమందున్న కొండ (Ridge) యందు శిబిర మేర్పరచుకొని నాలుగుమాసము లతి కష్టముతో శిబిరమును రక్షించుకొనిరి. అటుపైన, నికల్సన్ అనువాని యాధిపత్యమున పంజాబు నుండి మరికొన్ని సేనలు వారికి సహాయమైరాగా వారందరు కలిసి ఢిల్లీపైబడిరి. యుద్ధకాలమందు నికల్సన్ ప్రాణములను గోల్పోయినను ఢిల్లీ మాత్రము ఇంగ్లీషువారి వశమయ్యెను. బహదూరుషా పుత్రుల నిద్దరిని వారు చంపిరి. సామాన్యజనములో ననేకులకీ గతియే పట్టెను. తర్వాత కొద్దిరోజులకు లక్నో కూడ వారి వశమయ్యెను. అప్పటికి ఇంగ్లండు నుండి పంపబడిన సైన్యములు ఇండియాను చేరెను. అందులో కొన్నిటిని కాంబెల్ సేనానాయకుడు అయోధ్య ప్రాంతములకు దెచ్చి, కాన్‌పూరు అయోధ్య రోహిలఖండ రాష్ట్రములను జయించెను. రోస్ అను సేనా నాయకుడు మధ్యఇండియాను ప్రవేశించి ఝాన్సీ రాణి నెదుర్కొనును. ఆమె కడుసాహసముతో యుద్ధము గావించి వీరస్వర్గముగాంచెను. ఆమెకు కుడిభుజమై పోరాడుచుండిన టాంటియా టోపీ పరాజయముగాంచి, శత్రువుల చేజిక్కి, ప్రాణములను గోల్పోయెను. రోస్ మధ్యఇండియా నంతను వశపరచుకొనెను. కాలక్రమమున తక్కిన ప్రదేశములందు కూడ తిరుగుబాటుదార్లు పూర్తిగ నణచబడిరి. ఈ అణచుటలో ఇంగ్లీషు సైనికులుగ్రులై నిరపరాధులను కూడ చిత్రవధ గావించిరి. క్రీ. వె. 1859 నాటికి వారు దేశమందంతను వారి యధికారమును పూర్వముకంటె సుస్థిరముగ స్థాపించుకొనిరి. సిపాయిలందరు కలహించకపోవుటయు, కలహించిన వారందరికిని తగిన నాయకుడుగాని, ఏకోద్దేశముగాని లేకపోవుటయు, మహాయోధులగు శిక్కులు, హైదరాబాదు, గ్వాలియర్ మొదలగు గొప్ప సంస్థానములు బ్రిటీషు పక్షమందుండి వారి కెన్నటికి మరవరాని సహాయము చేయుటయు, ఇంగ్లీషు వారి నిర్మాణశక్తియు, వారి నాయకులు చూపిన జాతీయాభిమానమును, నౌకాబల సహాయముచే వారు ఇంగ్లండు నుండి సేనలను పంపగలుగుటయు వారి విజయములకు కారణమయ్యెను.

**విక్టోరియారాణి ప్రకటనము :** సిపాయిల తిరుగుబాటుకు ఫలితముగ కంపెనీపాలన మంతరించెను. ఇంగ్లండును పాలించు విక్టోరియా మహారాణి ఇండియాకు పరిపాలకురాలయ్యెను. ఉదార స్వభావురాలగు నామె ఇండియాలో శాంతి నెలకొల్ప నుద్దేశించి, క్రీ. వె. 1858లో నొక అమూల్యమగు ప్రకటనను గావించెను. దయాళువగు

కానింగ్ ప్రభువు అలహాబాదునం దొక దర్బారు గావించి అందీ ప్రకటనను చదివెను. కంపెనీవారు స్వదేశ సంస్థానములతో చేసికొనిన సంధిషరతుల ప్రకారము నడచుకొనుటకు సిద్ధపడియున్నట్లును, సంస్థానాధీశుల హక్కులను, మర్యాదలను, రాజ్యములను కాపాడునట్లును, మతవిషయములం దెట్టి జోక్యము కల్పించుకొనకుండునట్లును, జాతి మత వివక్ష లేక యోగ్యతను బట్టియే ప్రజలందరికి ఉద్యోగము లిచ్చునట్లును, చట్టములు చేయుట యందు ప్రాచీన సంప్రదాయములను గమనించునట్లును ఆమె యిందు స్పష్టముగ తెలియపరచెను. అందుచేతనే దీని నొక అభయపత్రముగ ననేకులు పరిగణించు చున్నారు.

**తిరుగుబాటు యొక్క ఫలితములు :** సిపాయీల తిరుగుబాటు మూలమున ఇండియాను పాలించు భారమును ఇంగ్లండు నేలు ప్రభువులే స్వయముగ వహింపసాగిరి. ఇందు వారికి సహాయము చేయుటకై ప్రత్యేకముగ ఇండియా మంత్రి అను పేరుతో నొక మంత్రి నియమింపబడెను. ఇతడు ఇంగ్లండులోని మంత్రిసభలో నొక సభ్యుడై, పార్లమెంటువారికి లోబడి ఇండియా వ్యవహారములను పాలింపసాగెను. సైన్యములో సిపాయీల దామాషా (Proportion) తగ్గింపబడెను, ఫిరంగుల దళములలో వారిని చేర్చుకొనుట మానిరి. అగ్రవర్ణములవారు కలహింతురను భయముచే, తిరుగుబాటు కాలమందు బ్రిటీషువారి కెక్కువ సహాయము చేసిన శిక్కులను, ఘూర్కాలను సైన్యమందధికముగ జేర్చుకొనసాగిరి. సంస్థానములను బ్రిటీషుపాలన లోనికి తెచ్చు పద్ధతిని పూర్తిగ మానివేసిరి. సంస్థానములను పేరున కనర్హములైన చిన్న చిన్న రాజ్యములు, కతియవారు, మధ్య ఇండియాలందు వందలకొలదిగ కొసవరకు నిలచి యుండుటకు సిపాయీల తిరుగుబాటే కారణము. సాంఘికాచారాములందును, మత సాంప్రదాయములందును, జోక్యము కల్పించుకొనుట ప్రమాదకరమను విషయము బ్రిటీషువారి హృదయములో దృఢముగ నాటుకొనెను. అందుచేత వారు వారి దృష్టిని సామాన్యములగు ఆర్థిక సంస్కరణ ములవైపు త్రిప్పుకొనిరి.

## ప్రశ్నలు

1. బెంటింకు ప్రభువు కాలమునుండి సంస్కరణాభిలాష కలుగుట కేమి కారణములు? బెంటింకు గావించిన సంస్కరణములను నాల్గింటిని పేర్కొనుము.

2. బర్మాలో ఏయే భాగము లెప్పుడెప్పుడు ఇంగ్లీషువారు జయించిరి ?
3. రషియనుల వలని భయము క్రీ. వె. 1815 తర్వాత ఏల కలిగెను ?
4. మొదటిఆఫ్గన్ యుద్ధమున కేమి కారణము ? ఆ యుద్ధమునకు పూర్వము ఇంగ్లీషువారెవరితో సంధి గావించుకొనిరి ? ఆఫ్గన్ యుద్ధమున - ఇంగ్లీషు వారోడిరా? గెలిచిరా ?
5. సింధురాష్ట్రమును జయించుట కేమి కారణము ?
6. శిక్కుల గురువులలో పేర్కొనదగిన వారెవరు ? రంజిత సింహుడు సంపాదించిన రాజ్యభాగములను పేర్కొనుము. ఇతడు సైన్యసౌష్ఠవము నెట్లు వృద్ధి జేసెను?
7. మొదటి శిక్కు యుద్ధమునకు కారణము లెవ్వి? అందు శిక్కు లెందు కోడిరి? దాని ఫలితములెవ్వి ? రెండవ శిక్కు యుద్ధము యొక్కకారణములు, ఫలితములు పేర్కొనుము.
8. స్వదేశ సంస్థానములను బ్రిటీషుపాలనలోనికి తెచ్చుటకు డైరెక్టరు లేల కోరిరి? నిర్వారసత్వ సిద్ధాంతములనగా నేమి ? డల్‌హౌసీ దాని నెందు కనుసరించెను? దాని వలన కలిగిన లాభమేమి ? నష్టమేమి ? ప్రజల స్థితిగతులను డల్‌హౌసీ ఎట్లు బాగుచేసెను ?
9. సిపాయీ లెవరు ? వారు గర్వపడుటకు కారణమేమి ? వారి తిరుగుబాటునకు కారణములెవ్వి? ప్రజలయందప్పుడేల అసంతృప్తి యుండెను ? సిపాయీ లోడుటకు కారణములెవ్వి ? సిపాయీల తిరుగుబాటు వలన కలిగిన ఫలితములెవ్వి ?
10. విక్టోరియా రాణి ప్రకటనములోని విశేషములను నాలుగింటిని పేర్కొనుము.

## పదమూడవ ప్రకరణము

# ప్రభువుల పరిపాలన

విషయములు :- శాంతి సంస్కరణములు; రాజ్యాంగ పద్ధతులందలి మార్పులు, క్షామములు; విద్య ; భూమిశిస్తు నిర్ణయము; ఆర్థిక నైతికాభ్యుదయము; సరిహద్దుల సంరక్షణము, దేశాభ్యుదయము.

### 1. శాంతి సంస్కరణములు

ఆర్థిక విప్లవము : ప్రభువుల పరిపాలన కాలమున (క్రీ.వె. 1858 నుండి 1947 వరకు) సరిహద్దుల సంరక్షణమునకై చేయబడిన యుద్ధములే గాని దేశము లోపల యుద్ధము లేమియు లేకుండెను. ఇందుచేత నీకాలమునకు శాంతియుగమను పేరును, సంస్కరణయుగమను పేరును సార్థకమైయున్నవి. ఈ యుగము ప్రారంభమగునాటికి మన దేశమందు మహత్తరమైన ఆర్థిక విప్లవమొకటి సంభవించి యుండెను. అనాదిగ దేశమందు పేర్గాంచిన పరిశ్రమ లనేకములు (Industries) నశించి, వ్యవసాయ మొక్కటియే ప్రజలకు ప్రధాన జీవనాధారమయ్యెను. కొంతవరకిది బ్రిటీషు సామ్రాజ్య సంస్థాపనమను రాజకీయ విప్లవము యొక్క ఫలితమని చెప్పదగియున్నది. నాణ్యములగు భోగపదార్థములను తయారు చేయుచుండిన పరిశ్రమలను పోషించు మహారాజులు, నవాబులు, భారతీయ ఉద్యోగస్థులు దేశమందు తగ్గిపోయిరి. బ్రిటీషు ఉద్యోగస్థులకును, వారి క్రింద పనిచేయుచుండిన భారతీయు లకును ఇట్టి పదార్థములు రుచింపవయ్యెను. కంపెనీ వారొకప్పుడు వీనిని విరివిగ ఇంగ్లండునకును, ఐరోపా ఖండములోని ఇతర దేశములకును ఎగుమతి జేసి దేశీయ పరిశ్రమలను పోషించుచుండిరి; కాని ఆ దేశములందలి ప్రభుత్వములీ సరకులపై సుంకములను విధించుటచేత నీ పోషణ కూడ తగ్గిపోయెను. ఇదిగాక పదునెనిమిదవ శతాబ్దపు చివరి భాగమున ఇంగ్లండులో పారిశ్రామిక (Industrial) విప్లవము సంభవించి, యంత్ర సహాయమున పదార్థముల నతి చౌకగ తయారు చేయుటకును, పొగయోడలు, ఇనుపదారుల మూలమున వాని నతిస్వల్పఖర్చులతో ఇండియా కెగుమతి చేయుటకును వీలు కలిగెను. వీనితో పోటీచేసి నిలబడుటకు భారతీయులకు సాధ్యము కాకుండుట చేతను, వీనిపై సుంకములను విధించి వ్యాపారమును నిరోధించుటకు ప్రభుత్వమువారు చాలకాలము వరకు ఇష్టపడకపోవుటచేతను

దేశములోని పరిశ్రమ లనేకములు నశించిపోయెను. వీనివలన జీవించుచుండిన వారందరు వ్యవసాయము చేయవలసినవారైరి. వ్యవసాయము ప్రధాన వృత్తియగుటకు మరికొన్ని కారణములు గూడ కలవు. క్రీ.వె. 1858 తర్వాత దేశమందు శాంతి నెలకొనుట చేత జనసంఖ్య హెచ్చెను. దీనితోబాటు బీడు ప్రదేశములు, గోభూములు, అడవులు సాగుబడిలోనికి వచ్చెను. యంత్రముల మూలమున పరిశ్రమాభివృద్ధి గాంచుచున్న ఇంగ్లీషువారికి ఇండియాలో పండు ప్రత్తి, జనుము మొదలగు ముడిపదార్థము లావశ్యకమయ్యెను. అందుకై వారెక్కువ ఖరీదుల నిచ్చుటకు సిద్ధపడి యుండిరి. రైతులకు దీనిమూలమున నధిక లాభము దొరకునట్లుండినందున వ్యవసాయమున కెక్కువ ప్రాముఖ్యము కలిగెను.

**రైతుల సంరక్షణము :-** ప్రభుత్వమువారు క్రమక్రమముగ దీనినంతను గ్రహించి వ్యవసాయాభివృద్ధికై అనేక సంస్కరణములను గావించిరి. వీనియొక్క ప్రధానోద్దేశము రైతుల సంరక్షణము. క్రీ.వె. 1858 నాటికి కొందరు రైతులు జమీందారీ భూములందును, మరికొందరు ప్రభుత్వమువారి భూములందును వ్యవసాయము చేయుచుండిరి. జనసంఖ్య వృద్ధియై, సాగుభూములకు గిరాకీ హెచ్చి, రైతులలో పోటీ అధికమగుటచేత జమీందారులు రైతులవద్ద నుండి వసూలుచేయు శిస్తుల నపరిమితము పెంచుటకును, శిస్తుల నియ్యలేనివారిని మొగమోటములేక భూముల నుండి తొలగించుటకును, నజరానాల నధికముగ విధించుటకును అవకాశమేర్పడి, రైతుల స్థితి దుర్భరమయ్యెను. దీనిని బాగుచేయు నుద్దేశముతో ప్రభుత్వమువారు క్రీ.వె. 1859 లో "బంగాళరైతుల చట్టము"ను గావించిరి. క్రమక్రమముగ నిట్టి చట్టములు ఆగ్రా, అయోధ్య, మధ్యపరగణాలు మొదలగు తక్కిన రాష్ట్రములకు వర్తించునట్లు గావింపబడెను. క్రీ.వె.1908 లో మద్రాసు రాష్ట్రములోని జమీన్ రైతులను రక్షించుటకై మరియొక చట్టము చేయబడెను. వీటికి ఫలితముగ రైతులియ్యవలసిన శిస్తులు నిర్ణయింపబడెను; జమీందారుల ఇష్టానుసారముగ వాటిని పెంచగూడదని శాసింపబడెను; శిస్తులను చెల్లించు రైతులను భూములనుండి తొలగించుటకు వీలులేదు. ఇవిగాక మరికొన్ని సౌకర్యములుగూడ రైతులకు కల్పింపబడెను.

**భూమిశిస్తు నిర్ణయము :-** రైతువారీ భూములను సాగుచేయువారి దగ్గరనుండి ప్రభుత్వమువారు వసూలు చేయు శిస్తులు క్రీ. వె. 1858 కి పూర్వము మిక్కిలి అధికముగ నుండెను. ఇది గాక, యీ శిస్తులప్పుడప్పుడు మార్పు గాంచుచుండెను. వీనిని శాశ్వతము చేయవలెనను వాద మొకటి క్రీ. వె. 1860 నుండి బయలుదేరెను;

కాని అట్లు చేయుట దేశమునకు లాభకారి కాదని క్రీ. వె. 1883 నాటికి ప్రభుత్వము వారు నిర్ణయించిరి. కర్జన్ ప్రభువు గవర్నరు జనరలుగ నున్నప్పుడు పన్నుల నిర్ణయమును గురించి ఒక ఏర్పాటు చేయబడెను (1901). రైతు పండించు పంట నుండి వ్యవసాయపు ఖర్చులను మినహాయించి శేషించిన ఫలసాయములో సగభాగము కంటె నెక్కువగ భూమిశిస్తు ఉండకూడదనియు, పంటల కెక్కువ నష్టము కలిగిన సంవత్సరములలో శిస్తును తగ్గింపవలెననియు, శిస్తుల మార్పు ముప్పదియేండ్ల కొక పర్యాయము చేయతగుననియు క్రీ. వె. 1901 లో విధింపబడెను. దీని ననుసరించి కొన్ని స్వల్పమార్పులతో ఇప్పటివరకు భూమిశిస్తు వసూలగుచున్నది.

క్షామములు : క్రీ. వె. 1858 తర్వాత దేశమునందు ఘోరమగు క్షామము లనేకములు సంభవించెను. క్రీ. వె. 1861, 1866, 1877-8, 1896-7, 1899-1990 లోని క్షామముల వలన కోట్లకొలది ప్రజలకును, పశువులకును ప్రాణనష్టమయ్యెను; లెక్కలేని జనులు రోగపీడితులైరి. వ్యవసాయమును నమ్ముకొని జీవింపదలచినవారికి కలుగు క్షామబాధను నివారించుట కనువగు మార్గములను సూచించుటకై క్రీ. వె. 1880, 1900-1 లో ప్రభుత్వమువారు రెండు కమిషనుల నేర్పరచి, వారు సూచించిన సలహాల నాధారము జేసికొని క్షామబాధను తగ్గింపదొడగిరి. అప్పటి నుండి ఏటేట నిందుకై ఒకటిన్నర కోటి రూపాయలు నిలువజేసి, కఱవు కాలమున బాధితులకు సహాయము చేయుటకును, రైతులకు ఋణము లిచ్చుటకును, జలాధారములను నిర్మించుటకును ఈ మొత్తమును వినియోగింపదొడగిరి. క్షామములే రాకుండుటకు జలాధారముల నిర్మాణము ప్రధానసాధనము. ఇందుకై అనాదిగ మన దేశమందు బావులు, చెరువులు, ఆనకట్టలు, కాలువలు నిర్మింపబడి యుండెను. క్రీ. వె. 1858 తర్వాత బ్రిటీషువారు కొంతవరకు వీటి యుపయోగమును గ్రహించి కొన్ని కోట్ల రూపాయలిందుకై ఖర్చు పెట్టిరి. ఇందుమూలమున నిర్మాణమైన జలాధారములలో పెరియార్ ఆనకట్ట (1876-1895), పశ్చిమ యమున కాలువ (1876-1882), సర్హిండు కాలువ (1870-1882), పంజాబు కాలువలు, సుక్కూరు ఆనకట్ట, మెట్టూరు ఆనకట్ట మిక్కిలి ప్రసిద్ధి గాంచియున్నవి. ఇనుపదారులుకూడ క్షామ బాధను తగ్గించుటలో మిక్కిలి యుపకరించుచున్నవి. ఇదిగాక మామూలు వర్తక వ్యాపారములను, ప్రయాణ సౌకర్యములను, సైన్యముల రాకపోకలకు కావలసిన సదుపాయములను వృద్ధి జేయనెంచి, బ్రిటీషువారు వేలకొలదిమైళ్ళ పొడవున దేశమందంతట ఇనుపదారులను నిర్మించిరి. జలాధార నిర్మాణమునకును, ఇనుపదారులు వేయుటకును కావలసిన కోట్లకొలది ద్రవ్యమును వారు ఇంగ్లండులోని సాహుకార్లవద్ద అప్పు తీసికొనిరి.



మెట్టూరు ఆనకట్ట

మెట్టూరు ఆనకట్ట

**రైతుల ఋణబాధ:-** శాంతియుగమందు రైతుల ఋణబాధ అధికమయ్యెను. పంటల ధరలు పెరుగుట చేతను, వ్యవసాయము లాభకరముగ నుండుట చేతను వారు విస్తారముగ దూరదృష్టిలేక ఋణములు చేయసాగిరి. ధైర్యముతో వారికి

ఋణములిచ్చు సాహుకార్లు కూడ నీ కాలమందు దేశములో ననేకులుండిరి. మామూలుగ వడ్డీ వ్యాపారము చేయువారే గాక ఇంగ్లీషు విద్య నభ్యసించి సర్కారు ఉద్యోగస్థులుగను, న్యాయవాదులుగను విస్తారధన మార్జించినవారు కూడ ఈ వ్యాపారము లోనిక్కిదిగిరి. భూముల ఖరీదులు పెరుగుట చేతను, భూముల తనఖాపైని ఋణము లియ్యవచ్చునను చట్టములుండుటచేతను, ఋణదాతల కనుకూలములగు ఇంగ్లీషు చట్టముల ననుసరించి ఋణముల గురించిన వివాదములను కోర్టువారు పరిష్కరించు చుండుటచేతను, వడ్డీ రేట్లకు హద్దు లేకపోవుటచేతను వడ్డీ వ్యాపారము చాల లాభకారిగ నుండెను. దీనికి ఫలితముగ రైతుల ఋణము లత్యధికము లయ్యెను. వడ్డీలను కూడ ననేకులిచ్చుకొనలేరైరి. క్రీ. వె. 1874 లో దీని మూలమున బొంబాయి రాష్ట్రమందు గొప్ప అల్లరులు సంభవించెను. అన్ని రాష్ట్రములందును రైతులనేకులు తమ భూములను కోల్పోయి సాహుకార్ల క్రింద పాలికాపులగుచుండిరి. దీనినంతను చూచి ప్రభుత్వమువారు రైతుల ఋణబాధను తగ్గించుట కప్పుడప్పుడు కొన్ని శాసనములను గావించిరి. క్రీ.వె. 1879 లో హెచ్చువడ్డీలను తగ్గించుటకు కోర్టువారి కధికార మిచ్చుచు శాసనము చేయబడెను. క్రీ.వె. 1871-79 లో గావింపబడిన తకావి శాసనముల వలనను, క్రీ.వె.1883, 1889 లో చేయబడిన మరి రెండు శాసనముల వలనను కొన్ని సందర్భములందు ప్రభుత్వమువారే రైతులకు ఋణములిచ్చు వీలు కలిగెను. క్రీ.వె. 1904 లో వీటి అన్నిటికంటె నుపయోగకరమగు సహకార పరపతి సంఘ శాసనము గావింపబడెను. దీని మూలమున రైతులు సంఘములుగ నేర్పడి సమిష్టి హామీమీద తక్కువ వడ్డీలకు ఋణములను తీసికొనుట కవకాశము కలిగెను. అది మొదలు ఈ సహకారోద్యమము ప్రబలి దేశమందంతట వ్యాపించెను.

వ్యవసాయాభివృద్ధి : వ్యవసాయము మూలవతున రైతులు సంపాదించు లాభమును వృద్ధిచేయు నుద్దేశముతో క్రీ.వె. 1904 లో ప్రభుత్వమువారు పూసా యందు వ్యవసాయ పరిశోధక సంస్థను స్థాపించిరి. క్రమక్రమముగ ప్రతి రాష్ట్రమందును ప్రత్యేక వ్యవసాయ శాఖలు క్రీ.వె. 1915 నాటికి చక్కగ నిర్మింపబడెను. ఇందు పనిచేయువారి పరిశోధనల మూలమున విత్తనములు, ఎరువులు, పరికరములు, క్రొత్త పంటలు, పశుపోషణ మొదలగు విషయములను గురించిన జ్ఞానము దినదినాభివృద్ధి గాంచుట కవకాశమేర్పడుచున్నది.

పరిశ్రమల రక్షణ : ఇంగ్లండు మొదలగు పాశ్చాత్య దేశముల లోని యంత్రాగారముల పోటీ మూలమున ఇండియాలోని పరిశ్రమ లనేకములు నశించెను.

వీనిని పునరుద్ధరించుటకు విదేశ సరకులపై సుంకములు విధించుటయే ప్రధాన సాధనమైనను స్వేచ్ఛా వ్యాపార (Free Trade) సిద్ధాంతమందు బ్రిటీషువారి కపరిమితమగు విశ్వాసమున్నందున అట్టి సాధనమును వారుపయోగించరైరి. జనుము పరిశ్రమయు, నేత పరిశ్రమయు కలకత్తా, బొంబాయి పట్టణములందు కొంతవరకు వృద్ధి గాంచగలిగెను. క్రీ. వె. 1914-1919 లో ప్రపంచ యుద్ధము జరుగుచుండినపుడు సుంకములు విధించి ప్రభుత్వపు ఆదాయమును వృద్ధి జేసికొనలవలసిన అగత్యము కలిగెను. ప్రజలయందు కూడ సుంకముల మూలమున స్వదేశపరిశ్రమలు రక్షింపబడవలెననెడి ఆందోళన మధికమయ్యెను. ఈ కారణములచే ప్రభుత్వమువారు క్రీ.వె. 1923 లో పరిశ్రమలను సంరక్షించుటకు నిశ్చయించుకొనిరి. అది మొదలిప్పటివరకు సుంకములద్వారా కొన్ని పరిశ్రమలు రక్షింపబడుచున్నవి. వస్త్రములు, పంచదార, అగ్గిపెట్టెలు, ఉక్కు, కాగితములు లోనగువాని నుత్పత్తిచేయు పరిశ్రమలిందులో ముఖ్యములైనవి.

ప్రభుత్వము వారి ఆదాయవ్యయములు : ప్రభుత్వము వారి ఆదాయవ్యయము లందుగూడ నీ కాలమున సంస్కరణము లనేకములు జరిగెను. శాంతియుగము ప్రారంభమైన తర్వాత సుమారు ఏబది సంవత్సరముల వరకు భూమిశిస్తు, ఉప్పుపన్ను, త్రాగుడుపన్ను, నల్లమందు వ్యాపారము లోనగు వాని మూలమున ప్రభుత్వమువారి ఖర్చులకు కావలసిన ఆదాయములో చాలభాగము లభించుచుండెను. ఈ పన్నుల యొక్క భార మెక్కువగ రైతులమీదను, సామాన్యజనుల మీదను పడుచుండెను. కాలక్రమమున నీ భారమును తగ్గించుటకు ప్రభుత్వము వారికి వీలు కలిగెను. కర్జన్ ప్రభువు కాలమున సూచింపబడిన యేర్పాటులవలన భూమిశిస్తు పెరుగుట మానెను. అతని కాలమున ఉప్పుపన్ను కూడ తగ్గింపబడెను. అప్పటికి దేశములోని వర్తక వ్యాపారము లభివృద్ధి గాంచు సూచనలు బయలుదేరెను. క్రీ.వె. 1916 నుండి రాబడి పన్నురేట్లు హెచ్చింపబడెను; సుంకములను కూడ ప్రభుత్వము వారధికము చేసిరి. ఈ కారణములచేత ధనికులిచ్చుకొను పన్నుల మొత్తము హెచ్చెను. దీనితోబాటు ఇనుప దారుల మూలమున కూడ ఎక్కువ ఆదాయము రాసాగెను. అవినీతికరమను కారణమున ప్రభుత్వము వారు నల్లమందు వ్యాపారమును తగ్గించుకొనినను మొత్తము మీద వారి ఆదాయము వృద్ధిపొందుచుండెను. దీనికి ఫలితముగ క్రీ.వె. 1912 నుండి వారెక్కువ ద్రవ్యమును సామాన్యప్రజల కుపయోగించు విద్య, ఆరోగ్యము, వైద్యసహాయము లోనగువానికై ఖర్చుపెట్ట గలిగిరి.

కావున క్రీ.వె. 1858 మొదలు దేశమందనేక సంస్కరణములు జరిగి ప్రజల యభివృద్ధికి తోడ్పడెనని చెప్పదగియున్నది.

## 2. రాజ్యాంగమందలి మార్పులు

రాజ్యాంగమందలి మార్పులు : క్రీ. వె. 1858 తర్వాత రాజ్యాంగమందు రెండు విధములగు మార్పులు కనబడసాగెను. దేశములోని విద్యాధికులందును, ప్రముఖులందును పరిపాలనములో పాల్గొని దేశసేవ చేయవలెననెడి ఆశ జనించి వృద్ధిగాంచెను. దీనికి ఫలితముగ బ్రిటీషు ఉద్యోగస్థుల నిరంకుశాధికార బలము తగ్గి, క్రమక్రమముగ ప్రజా ప్రతినిధుల పలుకుబడియు, అధికారమును, బాధ్యతయు హెచ్చెను. దేశమందు ప్రజాప్రభుత్వము యొక్కయు, స్వరాజ్యము యొక్కయు బీజములు నాటబడెను. ఇదియే మొదటి విధమగు మార్పు. ఇదిగాక ఇంగ్లండులోని అధికారులకును, ఇండియాలోని కేంద్ర ప్రభుత్వమునకును, రాష్ట్ర ప్రభుత్వములకును గల పరస్పర సంబంధము చాలవరకు మారిపోయెను. ఇదియే రెండవ విధమగు మార్పు.

ఇండియామంత్రి : కంపెనీ కాలమున డైరెక్టర్లును, అధికారసభయు (Board of Control) వేరువేరుగ చెలాయించుచుండిన అధికారము క్రీ.వె. 1858 తర్వాత ఇంగ్లండులోని మంత్రివర్గములో నొకడైన ఇండియామంత్రి వహించెను. గవర్నరు జనరలితనికి పూర్తిగ లోబడి దేశమును పాలింపవలసినదిగ నేర్పడెను. కంపెనీ కాలమున ఇంగ్లండులోని అధికారుల ఆజ్ఞలు ఇండియాను చేరుటకు నెలల కాలము పట్టుచుండినందున హేస్టింగ్సు, వెలస్లీ మొదలగువారు ఆ యాజ్ఞలను లక్ష్యపెట్టక తమ కిష్టము వచ్చినట్లు యుద్ధములను, సమాధానములను చేసికొనుచుండిరి. క్రీ.వె. 1870 ప్రాంతము నుండి ఇంగ్లండు, ఇండియాల మధ్య తంతి సమాచారములు జరుగుటకు వీలగుటచేత ఇండియామంత్రి ఎప్పటికప్పుడు గవర్నరు జనరలుకు ఉత్తరువు లొసగుటకును, వాటిని జవదాటక అతడు ప్రవర్తించునట్లు చేయుటకు నవకాశమేర్పడెను. ఇంగ్లండు నుండియు, ఇంగ్లీషువారి అభిప్రాయము ననుసరించియు ఇండియా పరిపాలనము జరుగుచుండిన దనుట ఇది మొదలు సార్థక మయ్యెను. సాధారణముగ ఇండియ మంత్రులందరు గవర్నరు జనరలుల కంటె నెక్కువ శక్తి సామర్థ్యములను, పలుకుబడిని కలవారగుటచే పార్లమెంటువారు వారి మాటల నెక్కువగ గౌరవించుట సంభవించుచుండెను.

ఇండియాలోని కేంద్రప్రభుత్వము : ఇండియాలోని కేంద్ర ప్రభుత్వమం దెప్పటివలె గవర్నరు జనరలు, కార్యనిర్వాహక సభ (Executive Council) అను రెండంగము లుండెను. సభలోని సభ్యులసంఖ్య క్రమక్రమముగ నెనిమిదివరకు పెరిగెను. క్రీ.వె. 1909 నుండి భారతీయులు కూడ సభ్యత్వమున కర్హులైరి. మొత్తముమీద నీ కాలమందు సభ యొక్క అధికారముకంటె గవర్నరు జనరలు యొక్క అధికారమే హెచ్చుగ నుండెను. క్రీ. వె. 1861 నుండి సభాకార్యక్రమమును నిర్ణయించు అధికార మతనిదయ్యెను. ప్రధానములగు వ్యవహారముల నన్నిటిని తంతి ద్వారా అతడు



ఢిల్లీ యందలి కేంద్ర శాసనసభా భవనము

ఇండియా మంత్రితో సంప్రదించి, సభవారితో నాలోచింపకయే తీర్మానించుట ఆచారమయ్యెను. సభ్యులుగూడ నతని యభిమానము మూలమున ఉన్నతోద్యోగములను సంపాదింపగోరి అతనితో ప్రతిఘటించుట కిష్టపడకుండిరి.

రాష్ట్ర ప్రభుత్వములు : మద్రాసు, బొంబాయి, బంగాళము, పంజాబు మొదలగు రాష్ట్రములను పాలించు ప్రభుత్వములు సమస్త విషయములందు - అల్పములు, అధికములు అను వివక్ష లేక - కేంద్ర ప్రభుత్వమునకు లోబడి పని చేయవలసి యుండెను. దేశమందంతట నొకే విధమగు పరిపాలనా పద్ధతి, చట్టములు, న్యాయ స్థానములు, విద్య మొదలగునవి వ్యాపించుట కిందుమూలమున నెక్కువ అవకాశము కలిగెను. రాజకీయముగ తామందరమొక్కరే యను భావము ప్రజల యందీకాలమున కలుగుట కిదియే ప్రధాన హేతువు. కాని యీ పద్ధతి మూలమున కొన్ని నష్టములు కూడ

ప్రాప్తించెను. ఇండియా బహుళ విస్తీర్ణము గల దేశము. ఒక రాష్ట్రమందలి ప్రజల ఆచార వ్యవహారములకును, మరియొక దానిలోని వానికిని ఎంతో భేదము కలదు. కేంద్రప్రభుత్వమునకే సమస్త అధికారముండుటచేత నీ భేదములను బట్టి అవసరమైన మార్పులను గావించుట కష్టమయ్యెను. వేగముగ జరుగవలసిన వ్యవహారములు కూడ నాలస్యముగ జరుగుచుండెను రాష్ట్రప్రభుత్వముల కెట్టి బాధ్యతయు లేకుండుటచేత వారు చురుకుగ పనిచేయరైరి. ఈ కారణములచే కాలక్రమమున రాష్ట్ర ప్రభుత్వములకు గల స్వేచ్ఛయు,బాధ్యతయు వృద్ధి చేయబడెను. క్రీ. వె. 1861 లో వాని యందు చట్టసభలు నిర్మింపబడెను. క్రీ.వె. 1870-71లో మేయో ప్రభువు గవర్నరు జనరలుగ నున్నప్పుడు కొన్ని పన్నులు విధించుటకును, కేంద్ర ప్రభుత్వము వారేటేట నిచ్చు ద్రవ్యమును కొన్ని శాఖలకై (Departments) స్వేచ్ఛగ ఖర్చు పెట్టుటకును వారి కధికారమియ్యబడెను. ఈ ఆర్థికాధికారము లిట్టన్, రిప్పన్ మొదలగువారి కాలమున వృద్ధి గాంచెను. క్రీ.వె. 1919 లో గావింపబడిన మాంటెగు - చెంస్ఫర్డ్ సంస్కరణముల మూలమున కొన్ని వ్యవహారములు, కొన్ని పన్నులు రాష్ట్రీయములని ప్రత్యేకింపబడి వానిని పరిపాలించుటలో రాష్ట్రములకు కొంత స్వాతంత్ర్య మియ్యబడెను. క్రీ. వె. 1935 లో చేయబడిన "ఇండియా ప్రభుత్వ" శాసనము వలన నీ స్వాతంత్ర్యము పూర్తిగాంచెను. రాష్ట్రీయ వ్యవహారము లన్నిటిని కేంద్ర ప్రభుత్వమువారితో నెట్టి సంబంధము లేక ఇష్టము వచ్చినట్లు పాలించు అధికార మప్పటినుండి రాష్ట్ర ప్రభుత్వములకు లభించెను. రాష్ట్ర స్వాతంత్ర్యమే ఫెడరల్ విధానమునకు ప్రధాన లక్షణము.

ప్రజాభిప్రాయానుసార పరిపాలనము : ప్రభుత్వమువారు గావింపనెంచు చట్టములు ప్రజల కిష్టములైనవో కావో తెలిసికొనుటకుగాని, సాధారణముగ ప్రభుత్వమువారిని గురించి ప్రజలేమనుకొనుచున్నారో ఎరుగుటకు గాని తగిన మార్గములు లేనందుననే సిపాయీల తిరుగబాటు సంభవించెనను అభిప్రాయము క్రీ.వె. 1858 తర్వాత బ్రిటీషు ప్రముఖు లనేకులకు కలిగెను. ఈ లోపమును పాగొట్టుటకై క్రీ.వె. 1861 లో పార్లమెంటొక శాసనమును (India Councils Act) గావించెను. దాని మూలమున కేంద్ర శాసనసభ యందును, రాష్ట్ర శాసనసభల యందును భారతీయులను కొందరిని సభ్యులుగ నియమించుటకు గవర్నరు జనరలుకును, గవర్నరులకును అధికారమియ్యబడెను. ఇట్టి శాసనసభలు క్రీ.వె. 1892 వరక దేశమందుండెను.

విద్య : కాని దేశములోని విద్యాధికుల కీసభలు రుచింపలేదు. బెంటింకు కాలమందుండి ఇంగ్లీషు విద్య దేశమందు వ్యాపింపదొడగెను. క్రీ.వె.1857 లో మద్రాసు,

బొంబాయి, కలకత్తా విశ్వవిద్యాలయములు స్థాపింపబడెను. వాటి పరీక్షలందు కృతార్థులగునట్లు విద్యార్థులను తయారు జేయుటకై అనేక పట్టణములందు కళాశాలలు స్థాపింపబడెను. ఇందుమూలమున ఉన్నత విద్యను సంపాదించినవారి సంఖ్య హెచ్చెను. ఈ విద్యావంతులలో రెండు కోరిక లుదయించెను. దేశములోని ఉన్నతోద్యోగములను సంపాదించుట మొదటి కోరిక; చట్టసభలందు ప్రాతినిధ్యము సంపాదించి దేశసేవ చేయుట రెండవ కోరిక. విక్టోరియా రాణి యొక్క ప్రకటన యందు జాతిమత వివక్ష లేక యోగ్యతను బట్టి ఉద్యోగముల నిచ్చునట్లు చెప్పబడియుండినను ప్రభుత్వము వారా సూత్రమును ఆచరణలో బెట్టరైరి. సివిల్ సర్వీసు ఉద్యోగములకు సంబంధించిన పోటీ పరీక్షలు ఇంగ్లండున జరుగుచుండెను; కొలదిమంది మాత్రమే ఆ కాలము నచటికి వెళ్ళి పరీక్షలందు ఉత్తీర్ణులగుట కవకాశముండెను. యోగ్యతగలవారనేకుల కిట్టి యవకాశము లేనందున విద్యాధికులలో నసంతృప్తి మెండయ్యెను. ఇదిగాక కళాశాలలందు నేర్చుకొను విద్య ఇంగ్లీషు విద్యగ నుండెను. ఇంగ్లండు దేశపు చరిత్ర, స్వాతంత్ర్యమునకై ఇంగ్లీషువారు నిరంకుశ ప్రభువులతో గావించిన పోరాటములు, రాజకీయ స్వేచ్ఛ నుగ్గడించు బర్కు, మిల్లు మొదలగువారి ఉద్గ్రంథములు - ఇవియే విద్యాధికుల జ్ఞానమున కాధార మయ్యెను. ఇట్టివారి యందు స్వాతంత్ర్య కాంక్ష జనించుట సహజము. బ్రిటీషువారు అధికులు, భారతీయులు హీనులు అను వాదమును వీరెంతమాత్ర మంగీకరించినవారు కారు. ఈ విద్యాధికులొకచోట గాక దేశములోని అన్ని రాష్ట్రములందును, అన్ని పట్టణములందును ఉండిరి. వారందరి భాషయు నొకటే; వారి రాజకీయాభి ప్రాయములు, ఆదర్శములు ఒక్కటిగ నుండెను. ఆసేతుహిమాచల పర్యంతము రాజకీయ విషయములందిట్టి యేకాభిప్రాయము గల విద్యాధిక వర్గము మనదేశములో పైకి వచ్చుట కిదియే మొదలు. వీరిలో కొందరు కలసి క్రీ.వె.1885 లో కాంగ్రెసు సభను స్థాపించి, ఏటేట సభను సమావేశపరచి ముఖ్యములైన విషయములను గురించి ప్రసంగింపసాగిరి.

**ఇండియన్ కౌన్సిలుల చట్టము (1892) :** వీరి ప్రయత్నములకు ఫలితముగ క్రీ.వె. 1892 లో పార్లమెంటు వారొక చట్టమును గావించిరి. దీనిమూలమున చట్టసభలలోని అధికారేతర సభ్యులలో కొందరిని గవర్నరు జనరలు నియమించుటకు బదులు మునిసిపల్ సంఘములు, జిల్లాబోర్డులు మొదలగు సంస్థ లెన్నుకొనుటకు వీలు కల్పింపబడెను. ఎన్నిక పద్ధతి దేశమందిది మొదలు ప్రారంభమయ్యెను. చట్టసభలకు చట్టములు చేయు నధికారమేగాక ప్రభుత్వము వారి ఆదాయ వ్యయ పట్టికను

(Budget) విమర్శించుటకును, పరిపాలనము గురించి ప్రశ్నలు వేయుటకును అధికార మియ్యబడెను. ఈ చట్టసభలు క్రీ.వె. 1909 వరకు పనిచేయుచుండెను. ఈ సభలేగాక, రిప్పన్ ప్రభువు కాలమున (1884) కొన్ని పట్టణములలో మునిసిపల్ సభలును, గ్రామములందును, తాలూకా లందును, జిల్లాలయందును భారతీయులతో కూడిన బోర్డులును స్థాపింపబడెను.

జాతీయోద్యమము : క్రీ.వె. 1892 చట్టము ననుసరించి స్థాపింపబడిన సభలు ప్రభుత్వము వారికిగాని, విద్యాధికులకుగాని తృప్తికరముగ నుండలేదు. ఎన్నిక పద్ధతి మూలమున సభలకు వచ్చినవారిలో ననేకులు న్యాయవాదులై యుండిరి; భూస్వాములు, వర్తకులు మొదలగువారికి ప్రవేశము చాల తక్కువగ నుండెను. ప్రభుత్వమువారి అతృప్తి కిదియే కారణము. సభలయందు ప్రజాప్రతినిధుల సంఖ్య చాల కొద్దిగనున్నందున అధికసంఖ్యాకులగు (Majority) ఉద్యోగస్థుల యొక్కయు, నియమిత (Nominated) సభ్యుల యొక్కయు అభిప్రాయములే నెగ్గుచున్నవనియు, చట్టసభలకు నిజమైన అధికారము లేదనియు విద్యాధికులతృప్తి గాంచిరి. ఇదిగాక క్రీ.వె. 1892 తర్వాత జాతీయోద్యమమును, రాజకీయాందోళనమును ప్రాబల్యము గాంచెను. మహారాష్ట్రుడును, పండితుడును, సనాతన హిందూ మతాభిమానియునగు బాలగంగాధర తిలక్ యొక్క నాయకత్వమున ప్రజలయందు గల ఉద్రేకము హెచ్చెను. అతడు గావించిన ప్రబోధము చేత బ్రిటీషువారి యెడనొక విధమైన ద్వేషభావము పుట్టి దౌర్జన్య మార్గమున వారి అధికారమును త్రుంచివేయుటలో నధర్మము లేదను అభిప్రాయము వ్యాపించెను. క్రీ.వె. 1898-1905 లో గవర్నరు జనరలుగ నుండిన కర్జన్ ప్రభువు పరిపాలన మందపరిమితమగు దక్షత గల వాడైనను విద్యాధికుల యసంతృప్తిని వృద్ధిచేయు కార్యము లనేకములను గావించెను. వానిలో బంగాళ విభజనము ముఖ్యమైనది. దీని మూలమున బంగాళరాష్ట్రము రెండు రాష్ట్రములై, బంగాళ జాతివారు రెండుగ చీల్చబడిరి. అందుపై వారు విపరీతమగు నాందోళనమును ప్రారంభించి, ఇంగ్లీషు వస్తువులను బహిష్కరించుటకు కంకణము కట్టుకొనిరి. ఇదే సమయమున దక్షిణ ఆఫ్రికాలోని భారతీయులయెడ నచటి ప్రభుత్వమువా రనేకములగు నపచారముల జేయు చుండిరి. దేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యము సంపాదించుటతప్ప వాంఛనీయము మరియొకటి లేదని వాదించువారనేకులు బయలుదేరిరి. ఇట్టి పరిస్థితులలో నూరకుండుట యనుచితమని గవర్నరు జనరలగు మింటో ప్రభువు, ఇండియా మంత్రియగు మార్లే ప్రభువు కలసి, పార్లమెంటు చేత క్రీ.వె. 1909 లో కొన్ని రాజకీయ సంస్కరణములను జేయించిరి.

మింటో - మార్లే సంస్కరణములు : వీని మూలమున చట్టసభలలోని సభ్యుల సంఖ్యయు ఉద్యోగేతరుల సంఖ్యయు హెచ్చు గావింపబడెను. రాష్ట్రసభ లన్నిటిలో ఉద్యోగేతరులధిక సంఖ్యాకు (Majority) లైరి. మహమ్మదీయులకు ప్రత్యేక ప్రాతినిధ్య మొసగబడెను. భూస్వాములకు, వర్తక సంఘములకు కూడ ప్రత్యేక ప్రాతినిధ్యము లభించెను. ఆదాయ వ్యయ పట్టికను గురించియు, ఇతర విషయములను గురించియు తీర్మానములు ప్రతిపాదించుటకు సభ్యులు హక్కు గలవారైరి. గవర్నరు జనరలు, గవర్నరులు, ఇండియామంత్రి లోనగువారియొక్క కార్యనిర్వాహక సలహాసభలందు భారతీయులకు సభ్యత్వము దొరకెను.

మాంటెగు - చెంస్ఫర్డు సంస్కరణములు (1919) : క్రీ.వె.1914 లో ప్రపంచయుద్ధము ప్రారంభమయ్యెను. ప్రజా ప్రభుత్వమును, స్వల్పజాతుల స్వాతంత్ర్యమును నిలబెట్టుటకు ఈ యుద్ధము ప్రారంభింపబడినదని బ్రిటీషు మంత్రులు ప్రకటించుటచేత నట్టి లాభము ఇండియాకు కూడ లభించునను ఆశతో భారతీయులు బ్రిటీషువారి కపరిమితమగు సహాయము జేసిరి. హిందువులు, మహమ్మదీయులు కలసి సంస్కరణ ప్రణాళిక నొకదానిని తయారుచేసిరి. తిలకు, బిసెంటు లోనగువారి యాజమాన్యమును తీవ్రమగు నాందోళనము బయలుదేరెను. అప్పుడు ఇండియా మంత్రియగు మాంటెగు ఇండియాకు వచ్చి, గవర్నరు జనరలగు చెంస్ఫర్డుతో కలసి దేశాటనము చేసి, పరిస్థితుల నన్నిటిని గ్రహించి, క్రీ.వె. 1919 లో క్రొత్త సంస్కరణములను కొన్నిటిని గావించెను. స్థానిక సంస్థల (Local Bodies) లోని ప్రజా ప్రాతినిధ్యము, అధికారము హెచ్చయ్యెను. ప్రతి రాష్ట్రమందును ప్రజాప్రతినిధులే అధిక సంఖ్యాకులుగ (Majority) నుండునట్లు శాసనసభలు స్థాపింపబడెను. రాష్ట్ర వ్యవహారములను కేంద్ర వ్యవహారముల నుండి వేరుచేసి, అట్టి వానిలో కొన్నిటిని - విద్య, ఆరోగ్యము, వ్యవసాయము, సహకారము లోనగువానిని - శాసనసభలకు బాధ్యులైన మంత్రులవశము చేయబడెను. తక్కినవి ఎప్పటి యట్లు కార్యనిర్వాహకసభ యధీనమందుండెను. ఈ విధముగ రాష్ట్ర వ్యవహారములపై అధికారము విభజింపబడుటచేత నీ ప్రభుత్వ విధానమునకు ద్వంద్వ ప్రభుత్వ (Dyarchy) మను పేరు వచ్చెను. కేంద్రశాసనసభ రెండు శాఖలుగ విభజింపబడెను. అందులోని సభ్యులలో నధిక సంఖ్యాకులు ఉద్యోగేతరులుగ నుండిరి. ప్రజాప్రతినిధుల నెన్నుకొను హక్కు ఆదాయమునుబట్టి నిర్ణయింపబడెను. క్రీ.వె. 1935 నాటికి డెబ్బదిలక్షలమందికి ఈ హక్కు ఉండెను.

గాంధీ మహాత్ముడు : క్రీ.వె. 1919 లో గావింపబడిన సంస్కరణములకును,

విద్యార్థికులాశించిన స్వరాజ్యమునకును ఎంతో దూరముండెను. అందుచేత దేశములోని ఆందోళన మరింత హెచ్చెను. అప్పటికి గాంధీ మహాత్ముడు రాజకీయ రంగమును బ్రవేశించి స్వరాజ్యోద్యమమునకు నాయకు డయ్యెను. అంతకు పూర్వమతడు ఇరువది సంవత్సరములు దక్షిణ ఆఫ్రికా యందుండి, భారతీయులచట పడుచుండిన కష్టము లను శాసన తిరస్కార రూపమగు సత్యాగ్రహము ద్వారా



గాంధీ మహాత్ముడు

కొంతవరకు తొలగించెను. భారతీయుల హక్కగు సంపూర్ణ స్వరాజ్యము నహింసతో గూడిన శాసన ధిక్కార సాధనముతో సంపాదింప నిశ్చయించెను. ఇదివరకు విద్యాధికులొక్కరే కాంగ్రెసునందును, రాజకీయోద్యమములందును పాల్గొనుచుండిరి. తన నిష్కల్మష స్వభావము చేతను, పవిత్ర జీవితము చేతను ప్రాచీనకాలపు ఋషులను స్మరణకు తెచ్చు శక్తిగల గాంధీ మహాత్ముని ప్రబోధము వలన సామాన్య జనుల యందు దేశాభిమానము జనించెను. వేలకొలది ప్రజలతని ననుసరించి శాసనధిక్కారము చేసి అతనితో కూడ కారాగృహములను ప్రవేశించిరి (1930). ప్రభుత్వమువారు నిర్బంధ శాసనము లనేకములను గావించిరి. తుదకు 1930-32 లో సంస్థానాధీశులను కొందరిని, భారతీయ ప్రముఖులను కొందరిని, బ్రిటీషు ప్రముఖులను మరికొందరిని లండను పట్టణమందు సమావేశపరచి ఇండియాకు తగిన సంస్కరణ ప్రణాళికను వారి సలహాలపై సిద్ధము చేసిరి. దాని నాధారము చేసికొని క్రీ.వె. 1935 లో పార్లమెంటు ఇండియా ప్రభుత్వ చట్టమును గావించెను. 1947 వరకు మనదేశములోని రాజ్యాంగము చాలవరకీ చట్టమును బట్టియే నడచెను.

**ఇండియా ప్రభుత్వ చట్టము (1935) :** ఈ చట్టమునందు మూడు గొప్ప మార్పు లుద్దేశింపబడెను. మొదటిది రాష్ట్ర స్వాతంత్ర్యము. ఇది క్రీ.వె. 1937 నుండి అమలులోనికి వచ్చెను. రెండవది ఫెడరల్ విధానము. మూడవది బాధ్యతతో కూడిన కేంద్రప్రభుత్వము, రాష్ట్ర స్వాతంత్ర్యము రెండు లక్షణములతో కూడియున్నది. కేంద్రప్రభుత్వమువారి యామోదముతో నెట్టి యవసరములేక తమ వ్యవహారముల నిష్టము వచ్చినట్లు పాలించుకొనుట మొదటి లక్షణము. ఈ వ్యవహారములన్నియు

ప్రజా ప్రతినిధులతో కూడిన శాసనసభలకు బాధ్యులైన మంత్రుల వశమగుట రెండవ లక్షణము. దీని మూలమున క్రీ.వె. 1919 లో ప్రవేశపెట్టబడిన ద్వంద్వ ప్రభుత్వ మంతరించెను. ఫెడరల్ విధానము కూడ గొప్ప విశేషమని చెప్పదగియున్నది. దీనివలన స్వదేశ సంస్థానములలోని ప్రజలును, బ్రిటీషు ఇండియా రాష్ట్రములలోని ప్రజలును



ఇప్పటివలె వేరు వేరు ప్రభుత్వములకు లోబడక ఒకే ప్రభుత్వమునకు లోబడుటకును, భరతఖండమున కిదివరకెన్నడులేని రాజకీయ ఏకత్వము దీని మూలమున సంప్రాప్తమగుటకును, కేంద్ర వ్యవహారములలో సైన్యము, విదేశములతోడి వ్యవహారములు తప్ప తక్కినవన్నియు ప్రజా ప్రతినిధులతో కూడిన శాసనసభలకు బాధ్యులైన మంత్రుల అధీనమగుటకును అవకాశము లేర్పడెను. ఈ కారణములచేత క్రీ.వె. 1935 లో గావింపబడిన చట్టము చాల ప్రాముఖ్యమును గాంచెను.

## 3. సరిహద్దుల సంరక్షణము

సరిహద్దులు :మూడవ బర్మాయుద్ధము : క్రీ.వె. 1858 నాటికి ఇండియా దేశమంతయు బ్రిటీషువారి అధీనమయ్యెను. తూర్పు పశ్చిమములందు దేశమునకు సముద్రములు సరిహద్దులగుటచేతను, ఇంగ్లీషువారి నౌకాబలము నెదిరింప సమర్థులగువారు ప్రపంచమందుండక పోవుటచేతను ఈ సరిహద్దులను సంరక్షించుకొనుట సులభమయ్యెను. ఉత్తరమున శత్రువుల కభేద్యమగు హిమాలయము లుండుటచేత నీ సరిహద్దునుగురించి భయపడవలసిన అగత్యము లేకుండెను. ఈశాన్యమున బర్మారాజ్యముండెను. ఇది చాల బలహీనమైనదైనను క్రీ.వె. 1885 లో దీని నేలురాజు ఫ్రెంచివారితో నొక సంధిగావించుకొని, వారికి తన రాజ్యమందు ప్రత్యేకముగ కొన్ని వ్యాపారహక్కులనిచ్చి ఇంగ్లీషువర్తకులపై జరిమానాలు విధించి వారి కనేక చిక్కులను గలిగించెను. అందుపై గవర్నరు జనరలగు డఫరిన్ ప్రభువు (మూడవ బర్మా) యుద్ధమును ప్రారంభించి రాజు నోడించి, బర్మాను బ్రిటిషుపాలనలోనికి దెచ్చెను. ఇంతటితో ఈశాన్య సరిహద్దులోని ప్రమాదమంతరించెను.

వాయవ్యసరిహద్దు:- వాయవ్యసరిహద్దునందు మాత్రము రెండువిధములగు కష్టములు సంభవించెను. ప్రాచీనకాలమందుండి ఇండియాపై దండెత్తివచ్చినవారందరు ఈ సరిహద్దులోని కనుమలగుండ దేశమును ప్రవేశించిరి. క్రీ.వె. 1858 తర్వాత ఆఫ్గనిస్థానపు రాజులుగాని, పర్షియా రాజులుగాని స్వయముగ ఇండియాపై దండెత్తివచ్చుటకు సామర్థ్యము లేనివారైనను యూరపులో బ్రిటిషువారికి విరోధులైన రషియనులయొక్కయు, జర్మనీవారియొక్కయు ప్రోత్సాహముచే నిట్టిప్రమాదము కలిగింతు రను అనుమానము బ్రిటిషువారికుండెను, ఈ సరిహద్దున కలిగిన మొదటి కష్ట మిదియే. ఇదిగాక సింధునదికిని, ఆఫ్ఘనిస్థాన్, బెలూచిస్థానములకును మధ్య సుమారు అరువదిలక్షల కొండజాతుల వారున్నారు. వీరు దృఢకాయులు. యుద్ధమే వీరికి జీవనోపాయము. మహమ్మదీయ మతమం దెక్కువ అభిమానముగలిగి

మహమ్మదీయేతరుల నెల్ల నిర్మూలము గావించుటమే పరమధర్మమని బోధించు ముల్లాల వశమందుండువారు; స్వాతంత్ర్యప్రియులు. వాయవ్య సరిహద్దులోని కనుమలన్నియు వీరిదేశమందే యున్నవి. వీరిలో కొందరు రంజితసింహునిచే జయింపబడినవారు. వారందరు బ్రిటిషుపాలనలోనికి వచ్చిరి. వారుగాక తక్కినవారు స్వతంత్రులై బ్రిటిషురాష్ట్రమును ప్రవేశించి ప్రజలను దోచుకొనసాగిరి. బ్రిటిషురాష్ట్రములోని పఠానులుకూడ దోపిడీ వృత్తిని మానరైరి. వీరిలో నేరములు చేసినవారరనేకులు స్వతంత్రులగు పఠానుల ప్రదేశములకు వెళ్లి దాగుకొనుచుండిరి. వీరందరిమూలమున సింధునది కీవలి దేశమునకు ప్రమాదము కలుగకుండ రక్షించుట చాల కష్టమయ్యెను.

రెండవ ఆఫ్ఘన్ యుద్ధము:- మొదటి ఆఫ్ఘన్‌యుద్ధము ముగిసిన పిమ్మట దోస్తుమహమ్మదు దేశమునకు రాజై బ్రిటిషువారియెడల మైత్రిగలిగి క్రీ. వె. 1863 వరకు రాజ్యముచేసి చనిపోయెను. అతని తర్వాత నతని కుమారుడు షరాలీ రాజ్యమునకు వచ్చెను. కాని ఇతనిపై సోదరులును, ఇతర దాయాదులును కలహింపసాగిరి. మధ్య ఆసియా నంతను జయించిన రషియనులు తన రాజ్యమునుకూడ మ్రింగివేయుదు రను భయమితనికుండెను, ఇట్టి ప్రమాదముల నుండి తప్పించుకొనుటకై యితడు క్రీ.వె. 1873 వరకు ఇండియాలోని గవర్నరు జనరలులతో రాయబారములు జరిపి, వారు తనకు సహాయముచేయవలసినదిగ నెంతో బ్రతిమాలెను; కాని వ్వారాతని మాటలను పెడచెవిని బెట్టిరి. అందుపై నతడు విధిలేక రషియనులతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపసాగెను. క్రీ.వె. 1876 ప్రాంతమున యూరపులో రషియావారికిని, బ్రిటిషువారికిని విరోధము హెచ్చెను. అప్పు డున్నట్లుండి బ్రిటిషు మంత్రి వర్గమువారు ఇంగ్లీషు రాయబారి నొకనిని కాబూలునకు పంప నిశ్చయించిరి. అందుకు షరాలీ సమ్మతింపలేదు. రషియా రాయబారిమాత్ర మతడు సమ్మతింపకపోయినను కాబూలును చేరి, అతనితో సంప్రతించి వెనుకకు మరలిపోయెను. బ్రిటిషువారు షరాలీ తమ్ము నవమానపరచెనని తలచి అతనితో యుద్ధమునకు పూనిరి (1878-80). గవర్నరు జనరలుగ నుండిన లిట్టన్ ప్రభువు మూడుసైన్యములను ఆఫ్ఘన్‌స్థానములోనికి పంపెను. అప్పుడు షరాలి పారిపోయి రషియా రాష్ట్రములందు మృతిజెందెను. అతని కుమారుడగు యాకుబ్ ఖానుడు ఇంగ్లీషువారికి కొంత రాష్ట్ర మిచ్చుటకును, వారి రాయబారిని కాబూలులో నుంచుకొనుటకును అంగీకరించి సింహాసన మెక్కెను. కాని ఆఫ్ఘన్ ప్రముఖులందు కిష్టపడక ఇంగ్లీషు రాయబారిని చంపిరి. అందుపై బ్రిటిషు సైన్యములు

కాబూలును వశపరచుకొనెను. యాకుబ్ ఖానుడు ఇట్టి క్లిష్టపరిస్థితులలో రాజ్యము చేయుట కిష్టపడక అధికారమును వదలుకొనెను. కొంత కాలమువరకు రాజ కుటుంబములోని వారెవ్వరు రాజ్యము నపేక్షింపరైరి. బ్రిటిషువారి కేమిచేయుటకు తోచలేదు. పర్వతమయమగు దేశమునంతను జయించి పాలించుట సాధ్యముకాని పని. కొంతకాల మీవిధముగ గడచిన తర్వాత నదివరకు రషియా రాష్ట్రములందుండిన షరాలీ సోదరుని కుమారుడు అబ్దుర్ రహిమానుడు రాజ్యముచేయుట కంగీకరించి బ్రిటిషువారితో నొక సంధిజేసికొనెను. కాబూలునందు ఇంగ్లీషు రాయబారి నొకనిని ఉంచు నుద్దేశమును బ్రిటిషువారు విరమించుకొనిరి; విదేశ వ్యవహారములన్నిటిని బ్రిటిషువారి యిష్టానుసారముగ జరుపుకొనుటకు అబ్దుర్ రహిమానుడు సమ్మతించెను. అంతటితో రెండవ ఆఫ్ఘన్ యుద్ధము ముగిసెను. ఇందుమూలమున బెలూచి స్థానపు ఈశాన్య భాగము ఇంగ్లీషువారి వశమయ్యెను.

**మూడవ ఆఫ్ఘన్ యుద్ధము :-** అబ్దుర్ రహిమానుడును (1880-1901), అతని కుమారుడు హబీబుల్లాయు (1901-1919) ఇంగ్లీషువారియెడల సఖ్యముతో నుండిరి. యూరపు ఖండమందలి రాజకీయవ్యవహారములు మార్పుగాంచుటచే ఇంగ్లీషువారును, రషియనులును మిత్రులు కావలసివచ్చెను. వీరు పరస్పరము సంప్రదించుకొని తమ మధ్యన మనస్పర్ధలు రాకుండుటకై రషియాసామ్రాజ్యమునకును, ఆఫ్ఘన్‌స్థానమునకును మధ్యనుండు సరిహద్దును క్రీ.వె. 1885-86లో నిర్ణయించుకొనిరి. ఇదేవిధముగ ఆఫ్ఘన్ స్థానపు తూర్పుసరిహద్దులును, ఇండియాలోని బ్రిటిషుసామ్రాజ్యపు వాయవ్యసరిహద్దులును క్రీ.వె. 1893లో నిర్ణయింపబడెను. పఠానుజాతులలో నెవరు ఆఫ్ఘన్‌రాజుల పలుకుబడిలో నుండవలసినదియు, ఎవరు బ్రిటిషువారి పలుకుబడిలో నుండవలసినదియు దీనిమూలమున స్పష్టమయ్యెను. క్రీ.వె. 1919లో ప్రపంచ మహాసంగ్రామము ముగియుచున్న కాలమున ఆఫ్ఘన్‌రాజగు అమనుల్లా జర్మనుల యొక్కయు, రషియన్ విప్లవకారులయొక్కయు మాటలువని, సరిహద్దును దాటి బ్రిటీషురాష్ట్రముపై దండెత్తి వచ్చెను. ఇట్లు ప్రారంభమైన మూడవ ఆఫ్ఘన్ యుద్ధము కొద్దివారములలో ముగిసెను. అప్పుడు జరిగిన సంధివలన బ్రిటిషువా రదివరకు ఆఫ్ఘన్‌రాజుల కేటేట చేయుచున్న ద్రవ్యసహాయము విరమింపబడెను; బ్రిటిషువారి ఇష్టానుసారముగ ఆఫ్ఘన్ రాజులు వారి విదేశవ్యవహారములను జరుపుకొనవలయుననెడి షరతు రద్దుచేయబడెను. అది మొదలిప్పటివరకు బ్రిటిషువారును, ఆఫ్ఘన్ రాజులును పరస్పరమైత్రితో నున్నారు.

సరిహద్దులోని కొండజాతులు :- సింధునదికి పశ్చిమముగనుండు ప్రదేశములో దక్షిణభాగమున బెలూచి జాతివారును, ఉత్తరభాగమున పఠాన్‌జాతివారును ఉన్నారు. బెలూచిజాతులవారు ఆచారములందును, సంప్రదాయములందును మార్పులేవియు జేయక, పరిపాలనమునంతను వారి నాయకులద్వారా జరుపుచు, పైవిచారణను మాత్రము బ్రిటిషు ఉద్యోగస్థులు తమచేత నుంచుకొనిరి. ఈ కారణముచేత బెలూచీలు సులభముగ వశులైరి. క్రీ.వె. 1876లో క్వెట్టా పట్టణమును, రెండవ ఆఫ్ఘన్ యుద్ధాంతమున మరికొన్ని ప్రదేశములును బ్రిటిషువారి స్వాధీనమగుటచేత, కాందహారు, క్వెట్టా, బోలన్ మార్గమున ఇండియాపై దండెత్తగల వారెవ్వరు లేరని చెప్పవచ్చును. ఉత్తరభాగముం దుండు పఠానులుమాత్రము బ్రిటిష్‌వారికి చిక్కులు కలిగించుచునే యుండిరి. క్రీ.వె. 1858 మొదలు క్రీ.వె. 1893వరకు బ్రిటిష్‌వారు స్వతంత్రులగు పఠానులతో నెట్టి జోక్యమును కల్పించుకొనకుండిరి. కాని వారప్పుడప్పుడు బ్రిటిషురాష్ట్రములను దోపిడీచేయుటచేతను, బ్రిటిషురాష్ట్రములో నేరములు జేసిన పఠానుల కాశ్రయ మిచ్చుచుండుటచేతను ఇట్టిఉదాసీనత నష్టకరముగ గన్పించెను. అందుపై బ్రిటిష్‌వారు స్వతంత్రుల ప్రదేశములందు కొన్ని కోటలను కట్టి కొంత సైన్యమును నిలిపిరి. ఇది వారి క్రోధమును మరింత వృద్ధిజేసి అనేక యుద్ధములకు కారణమయ్యెను. బ్రిటిషురాష్ట్రములోని పఠానులను ఇంగ్లీషు చట్టముల ప్రకారము పరిపాలించుటవలన వారుకూడ మిక్కిలి అసంతృప్తిని జూపసాగిరి. క్రీ.వె. 1895, 1897, 1919, 1920 లో సరిహద్దునందీ కారణముచే విపరీతముగ అల్లరులుపుట్టి యుద్ధరూపమును దాల్చెను. కర్జన్‌ప్రభువు గవర్నరుజనరలుగ నున్నప్పుడు పఠానులు నివసించుజిల్లాలను పంజాబునుండి వేరుజేసి ప్రత్యేకముగ వాయవ్యసరిహద్దు రాష్ట్రమును నిర్మించెను. అటుతర్వాతకూడ అల్లరులప్పుడప్పుడు జరుగుచుచూ వచ్చెను. పఠానుల దేశము పర్వతమయము; వారు దాగియుండు కొండగుహలను కనుగొని వారి నోడించుట సులభసాధ్యముకాదు. బ్రిటిషువారెంత జాగరూకులై యున్నను పర్షియానుండి వారు వేలకొలది తుపాకులను సంపాదించి బహు నేర్పుతో యుద్ధము చేయగలిగిరి. వ్యవసాయాది వృత్తులకు వారి కవకాశము లేదు. ఇట్టి సందర్భములో వారి మూలమున కలుగుచుండు ప్రమాదమునుండి దేశమును సంరక్షించుట అకాలపు క్లిష్టసమస్యలలో నొకటిగ నుండెను.

## 4. దేశాభ్యుదయము : ఇప్పటికాలపు సమస్యలు

ఆర్థికాభ్యుదయము:- ప్రభువుల పరిపాలన కాలమున దేశమందు శాంతి నెలకొనుటచేతను, ప్రభుత్వమువారు గావించిన సంస్కరణముల ప్రాబల్యముచేతను ఆర్థికముగ దేశము మంచిస్థితికి రాగల సూచనలగుపడెను. దేశములోని జనసంఖ్య హెచ్చెను; సాగుబడియగు పొలముయొక్క విస్తీర్ణ మధిక మయ్యెను; వ్యవసాయమున కనుకూలించు ఆనకట్టలు, కాలువలు మొదలగు జలాధారములు, రాకపోకల కనుకూలించు ఇనుపదారులు, కంకరరోడ్లు వృద్ధిగాంచెను. ఉక్కు, నేత, జనపనార లోనగు పరిశ్రమలు యంత్రసహాయమున విరివిగా జరుగుచువచ్చెను. రాక్షసిబొగ్గు, ఇనుము మొదలగు ఖనిజముల యుత్పత్తికై అవకాశము లనేకము లేర్పడెను. వర్తక వ్యాపారములందు ప్రజలకుగల సాహసము మెండయ్యెను. పూర్వముకంటె మంచి ఇండ్లలో వారు కాపురము చేయుట, ఎక్కువ బట్టలను కట్టుకొనుట, అధికముగ ప్రయాణముచేయుట, ఎక్కువ పదార్థములను వాడుట ఇవన్నియు ఆర్థికాభ్యుదయమునకు నిదర్శనములు.

విజ్ఞానాభ్యుదయము :- ప్రభువుల పరిపాలన కాలమున దేశమందు విజ్ఞానాభ్యుదయముకూడ కలిగెనని చెప్పదగియున్నది. బ్రిటిషు పరిపాలనముతో పాటు పాశ్చాత్య నాగరికతయు, ప్రకృతి శాస్త్రములును, ఆచారవ్యవహారములును, మత సంప్రదాయములును మనదేశములోనికి వచ్చెను. క్రైస్తవ మతబోధకులు మన మతములను, ఆచారములను ఖండించి ప్రజలందరిని క్రైస్తవులుగజేయు నుత్సాహముతో నుండిరి. పాశ్చాత్యవిద్యావిధానమును ప్రవేశ పెట్టిన మెకాలే మొదలగు ప్రముఖు లలోకూడ నిట్టి యుత్సాహముండెను. ఒకప్పుడు వీరి యుద్దేశములు కొనసాగునట్లగు పడినను మొత్తము మీద స్వమతములందును, స్వధర్మములందును ప్రజలకు గల అభిమాన మీ కాలమున హెచ్చెను. దీనికి ప్రఖ్యాతిగాంచిన మతసంస్కర్తల యొక్కయు, సంఘసంస్కర్తలయొక్కయు ప్రబోధమే ప్రధానకారణము. వీరు మన మతమందును, సాంఘికాచారములందును గల లోపములను నవరించి వానియందు కాలానుగుణములగుమార్పులనేకములు గావించిరి. ఇట్టి సంస్కర్తలలో రాజా రామమోహన రాయలు (1774-1833), స్వామీదయానందసరస్వతి (1825-1883), సర్ సయ్యదు అహమ్మదు (1813-1898), రామకృష్ణపరమహంస (1833-1886), స్వామి వివేకానందుడు, గాంధీ మహాత్ముడు పేర్కొనదగియున్నారు. రామమోహన రాయలు విగ్రహారాధనమును, బహుదేవతాపూజలను ఖండించి, పరిశుద్ధమగు ఆస్తిక

మతమును బోధించి బ్రహ్మసమాజమును స్థాపించెను. దయానందుడు హిందువుల దుర్గతి కంతకు వారు వేదములకు విరుద్ధముగ నడచుటయే కారణమనియు, వర్ణ భేదములు, విగ్రహారాధనము లోనగునవి వేద విరుద్ధములనియు, హిందువులు నమ్మదగిన గ్రంథ మొక్క వేదమే అనియు, అట్టి నమ్మకముగల మతాంతరులనుకూడ హిందూ సంఘములో జేర్చుకొనవచ్చుననియు బోధించి ఆర్యసమాజమును స్థాపించెను. సర్ సయ్యదు అహమ్మదు మహమ్మదీయులకు నాయకుడై వారి మతములోని లోపము లనేకములను సవరించి ఇంగ్లీషువిద్యయందు వారదివరకు గనుపరచుచుండిన ఔదాసీన్యమును పోగొట్టి వారి పురోభివృద్ధి కెంతో పాటుబడెను. మహాయోగియగు రామకృష్ణ పరమహంస స్వానుభవముచే సర్వమతములందలి సత్యములను దెలిసికొని, ఒక మతముకంటె మరియొక మతము గొప్పయని కాని, తక్కువయనికాని చెప్పుట పొరబాటనియు, ఏ మతమందు పుట్టిన వాడా మతములో నుండుటయే శ్రేయస్కరమనియు బోధించెను. వివేకానందు డితని శిష్యులలో నగ్రగణ్యుడు. ఇతడు ఖండాంతరములకు వెళ్లి హిందూమతము యొక్క యత్కృష్టతను విదేశీయుల కెరుకపరచెను; పాశ్చాత్య నాగరికతయందు విద్యాధికులకు గల వ్యామోహమును పోగొట్టెను. గాంధీమహాత్ముడు పాశ్చాత్య సంప్రదాయములలోని లోపములను బహిరంగపరచి, అహింసయు, సత్యమును, సహనమును ఆధారములుగ నుండు భారతీయ సంప్రదాయముల ననుసరించుటయే మనము తరించుటకు సాధనమని బోధించెను. ఇట్టి సంస్కర్తల ప్రబోధమువలన ప్రజలయందాత్మవిశ్వాసము కలిగి, నాగరికతయందు హిందూదేశము ఇతర దేశములతో తులతూగగలదను భావ మంకురించెను. మతమందేగాక విద్యలందును, కళలందును ఈ కాలమున క్రొత్తమార్పు లనేకములు కలిగెను. అజంతాగుహలలోని సంప్రదాయముల ననుసరించి బంగాళ రాష్ట్రమందును, ఆంధ్రరాష్ట్రమందును చిత్రలేఖనము వృద్ధిగాంచెను. ప్రాచీనకాలపు శిల్పములు శిథిలములు గాకుండ రక్షింపబడుటకై కర్జన్ ప్రభువుగావించిన ఏర్పాటుల మూలమున చారిత్రక పరిశోధనము వృద్ధికాసాగెను. విశ్వవిద్యాలయములందు శాస్త్రజ్ఞులనేకులు ప్రకృతి శాస్త్ర రహస్యములను కనుగొనుచున్నారు. పాశ్చాత్య వాఙ్మయ సంబంధము మూలమున దేశభాషా వాఙ్మయము క్రొత్తస్వరూపమును ధరించగలిగెను. గద్యరచన, నవలలు, వ్యాసములు, సాంఘిక నాటకములు లోనగువానిని దేశభాషలలో నూతనశైలి ననుసరించి వ్రాయు గ్రంథకర్తలనేకులు బయలుదేరిరి. ఈ నిదర్శనములన్నిటినిబట్టి దేశమందొక నూతన వికాసమును, చైతన్యమును కలిగినవని చెప్పవచ్చును.

## ప్రశ్నలు

1. దేశములోని పరిశ్రమలు నశించుటకు కారణములెవ్వి? వ్యవసాయమున కెక్కువ ప్రాముఖ్య మేల కలిగెను ? జమీందారీ రైతులను ప్రభుత్వమువా రెట్లు రక్షించిరి ? ఈ కాలములో భూమిశిస్తునిర్ణయమందేమార్పుల గావించిరి ? క్షామబాధను తగ్గించుటకు ప్రభుత్వమువా రేమిచేసిరి ? క్షామములు రాకుండుటకై వా రేమిచేసిరి? రైతుల ఋణబాధ హెచ్చుటకు కారణములెవ్వి? దానిని నివారించుటకు ప్రభుత్వమువారు చేసిన ఏర్పాటులెవ్వి ? పరిశ్రమ లిటీవల నభివృద్ధిగాంచుట కేమి కారణములు ?
2. క్రీ.వె. 1858 తర్వాత ఇండియామంత్రి అధికార మెట్లు పెరిగెను ? ఎందుకు పెరిగెను ? గవర్నరుజనరలు అధికార మెట్లు మారెను ? ఎందుకు మారెను? రాష్ట్రప్రభుత్వముల స్వాతంత్ర్య మీ కాలమున నెట్లు వృద్ధిగాంచెను ? విద్యావ్యాప్తివలన కలిగిన ఫలితములెవ్వి ? 1861, 1892లో శాసనసభలయం దెట్టిమార్పులు గావింపబడెను? మింటో-మార్లే సంస్కరణ కారణములెవ్వి ? వాని మూలమున కలిగిన మార్పులెవ్వి ? మాంటెగు - చెంస్ఫర్డు సంస్కరణ ములకు కారణములెవ్వి ? వానిమూలమున కలిగిన మార్పులెవ్వి ? క్రీ. వె.1935లో గావింపబడిన ఇండియాప్రభుత్వ చట్టములోని విశేషములెవ్వి?
3. రెండవ అఫ్ఘన్ యుద్ధమునకు కారణములెవ్వి ? దాని ఫలితము లెవ్వి? సరిహద్దులలోని కొండజాతు లెట్టివారు ? వారివలన ప్రమాదము లేల కలిగెను?
4. దేశమందీకాలమున గలిగిన విజ్ఞానాభ్యుదయమునకు కారణములెవ్వి? గొప్ప సంస్కర్తలను నలుగురను బేర్కొనుము. వారు గావించిన సంస్కరణము లెట్టివి? ఇప్పుడు మన మెదుర్కొనవలసిన సమస్యలెట్టివి ?

# అనుబంధము

# I

## స్వాతంత్ర్యమునకై మనము గావించిన పోరాటము

**విషయములు :-** భారత జాతీయ కాంగ్రెసు (Indian National Congress). విదేశవస్తు బహిష్కరణము, ఖద్దరు ఉద్యమము, సత్యాగ్రహము, స్వాతంత్ర్యమునకై పోరాటములు, ప్రముఖులగు జాతీయనాయకులు-వారు చేసిన సేవ, త్యాగము, మహాత్మాగాంధి, భారతస్వాతంత్ర్యము, రెండు డొమినియన్లు, స్వరాజ్య సంస్థాపనము.

**స్వాతంత్ర్యమునకై పోరాటము :-** ఎవరి దేశమును వారే పరిపాలించుకొనుట స్వాతంత్ర్యము; దానిని పరాయి దేశములవారు పాలించుట పారతంత్ర్యము. పూర్వకాలమున పరాయిదేశములవారు కొందరు మనదేశముపై దండెత్తివచ్చి మనలను జయించి పరిపాలింపదలచిరి. అట్టివారిలో అలెగ్జాండరు నాయకత్వమున వచ్చిన గ్రీకులొకరు. కాని, మన వారు వారి నెదిరించి తుదకు వారి అధికారమును నాశముచేసిరి. అట్టిపనిని చేసినవాడు చంద్రగుప్త మౌర్యుడు. అదే విధముగ పరాయివారగు హూణుల ప్రయత్నములను యశోధర్ముడణచెను. పరాయివారుగా వచ్చిన మహమ్మదీయులను తొలికాలమున చాళుక్యులును, రాజపుత్రులును, తర్వాత కాలమున విజయనగర చక్రవర్తులును ఎదుర్కొనిరి. శివాజీ నాయకత్వమున మహారాష్ట్రులును, గురుగోవిందుడు మొదలుగువారి నాయకత్వమున శిక్కులును మహమ్మదీయులపై తిరుగబడివారి సామ్రాజ్యములను కూలద్రోసిరి. పూర్వకాలముననుఁ, మధ్యయుగముననుఁ మనవారు స్వాతంత్ర్యమునకై పోరినట్లు ఈ కాలములో కూడ బ్రిటీష్‌వారి పరాయి ప్రభుత్వమును తొలగించి, స్వరాజ్యమును సంపాదించుటకు మనవారు పోరి సంపూర్ణవిజయము గాంచిరి. పారతంత్ర్యము మనకెన్నడు గిట్టనది కాదు. దానిని నిర్మూలముచేయుటకు అవసరమైనప్పుడెల్ల మనము పోరాడుచుంటిమి. ఇటీవలి కాలమున బ్రిటిషువారితో మన మందులకై కావించిన పోరాటము ఇట్టిదే.

**స్వాతంత్ర్య పోరాటమునకు కారణములు :-** ఎవరి దేశమును వారు పాలించుకొనుటకై వారు చేయు పోరాటమునకు కారణము లుండవలసినది లేదు. స్వాతంత్ర్యము వారి జన్మహక్కు. అందుకై పోరుట సహజము. కాని బ్రిటిష్ పరిపాలనము

తొలగించుటకు మనము గావించిన పోరాటమునకు ప్రత్యేక కారణములుగూడ కొన్ని గలవు. ఆ పాలనములో ననేకదోషము లుండెను. బ్రిటీష్‌వారు మన దేశమును పాలించుటలో వారి లాభమును, వారి ప్రతిష్ఠను నిలబెట్టుకొనుటయు కోరిరేకాని మన లాభము కాదు. వర్తకముచేసి, ధనమును గడించుటకు వారు మన దేశమునకు వచ్చిరి. దేశ పరిపాలకులైన తర్వాత కూడ ధనమును సంపాదించి దానిని తమ దేశమునకు తీసికొనిపోవుటయే వారి ప్రధానోద్దేశముగ నుండెను. ఇది ప్రజలయందు అసంతృప్తి కలిగించెను. ఇంగ్లండులోని పరిశ్రమలను రక్షించుకొనుటకై వారు మన దేశములోని నేత మొదలగు పరిశ్రమలు క్షీణించునట్లు చేసిరి. వానిని పునరుద్ధరించుటకు కావలసిన ఏర్పాటులను చేయరైరి. ప్రజలు వారి జీవనోపాధికి ఒక వ్యవసాయముమీదనే ఆధారపడవలసి వచ్చెను. అందులో గూడ రైతులకు కావలసిన సదుపాయములను వారు సకాలమున చేసియుండుటలేదు. పన్నులబాధ, ఋణబాధ అధిక మయ్యెను. క్షామము లనేకములు సంభవించెను. జమీందారీ భూములను సేద్యముచేయు రైతులు మరికొన్ని బాధలనుగూడ అనుభవింప వలసినవారైరి. గనులలోను, మిల్లులలోను పనిచేయు కూలివాండ్రకు అవసర మైన సదుపాయములను చేయుటయందు వారు శ్రద్ధ వహించి యుండలేదు. ఇదిగాక కూలిపని దొరకక కోట్లకొలది జనులు కష్టపడవలసి వచ్చెను. వారికి పనులను కల్పించుటకు తగిన ప్రయత్నమును బ్రిటిష్ ప్రభుత్వమువారు చేయరైరి. అందుచేత సామాన్యజనులందఱిలో బ్రిటీష్‌పరిపాలనము అసంతృప్తిని కలిగించెను. విద్యయందును, ఆరోగ్యమందును ప్రజలు వెనుకబడి పోయిరి. వారి అభివృద్ధికి కావలసిన ధనమును బ్రిటీష్‌వారు ఖర్చు పెట్టరైరి. ఇదిగాక తాము తెల్లవారగుటచేత గొప్ప జాతివారనియు, భారతీయులు హీనజాతివారనియు భావించి, అట్టిభావముతోనే వారు దేశమును పాలించిరి. భారతీయుడెంత విద్యావంతు డైనను గొప్ప ఉద్యోగముల కర్హుడు కాకపోయెను. ఉన్నత పదవుల నన్నిటిని బ్రిటిష్ వారే అనుభవించుచుండిరి. విదేశములకు వెళ్ళిన భారతీయులను అచ్చటివారీకారణముచేత చులకనభావముతో చూచి, అగౌరవపరచుచుండిరి. అట్టి యగౌరవము బ్రిటీష్‌పాలనలో నుండిన దక్షిణ ఆఫ్రికా మొదలగు దేశములలో జరుగుచుండినను దానిని తొలగించుటకు ప్రభుత్వమువారు తగిన ప్రయత్నము చేసియుండలేదు. ఇది భారతీయుల పరువుమర్యాదల కెంతో భంగకరముగ నుండెను. ఇదంతయు విద్యావంతులలో అసంతృప్తి కలిగించెను. మన దేశసంప్రదాయములు, ఆచారములు బ్రిటిషువారెఱుగరు. అందుచేత న్యాయపరిపాలనమునకు వారుచేసిన ఏర్పాటులు కాలయాపనతోడను,

ధన వ్యయముతోడను కూడుకొన్న వయ్యెను. తరతరములుగా మన దేశమం దుండిన గ్రామపంచాయతీలు వెనుకబడెను. ఇదిగాక తమ అధికారమును నిలుపుకొనుటకు బ్రిటిష్ వారు భారతీయులలో పరస్పర విభేదములను కల్పించి వృద్ధిచేసిరి. అందువలన కూడ ప్రమాదము లనేకములు సంభవించెను. ఇట్టి కారణము లెన్నియో యున్నందున వారి ప్రభుత్వమును తొలగించి స్వరాజ్యమును సంపాదించుటకు మనవారు పోరాటము గావించిరి.

**భారత జాతీయ కాంగ్రెసు (Indian National Congress)** :- స్వాతంత్ర్య పోరాటమును సాగించిన సంస్థ భారత జాతీయ కాంగ్రెసు. దీనిని స్థాపించిన వారు ఇంగ్లీషు విద్యలలో ఆరితేరిన భారతీయులు. వీరు విద్యాధికులైనను ప్రభుత్వము వారు వీరికి తగిన పదవులనిచ్చి గౌరవించినవారు కారు. ఇదిగాక బ్రిటీష్పరిపాలనములో అనేకలోపము లుండుటను వీరు గుర్తించిరి. ఆ లోపములను పోగొట్టి, దేశమున కంతకు లాభకరమైన సంస్కరణములను ప్రవేశపెట్టుటకు విద్యాధికులందఱు కలిసి పనిచేయుట అవసర మని వీరు తలచిరి. వీరు వివిధరాష్ట్రములో నివాసముచేయుచు, వివిధభాషలు మాట్లాడువారైనను వీరందఱికి ఇంగ్లీషుభాష సామాన్యభాష అయ్యెను. అందుచేత వీరు కలసి సభలు, సమావేశములు జరుపుట సులభమయ్యెను. ఇట్టి విద్యాధికులు కొందఱు క్రీ.వె. 1885లో కాంగ్రెసు సంస్థను స్థాపించిరి. అప్పటి కాలమున వీరి యుద్దేశము స్వాతంత్ర్యమును సంపాదించుట కాదు. దేశమున కంతకు సంబంధించిన రాజకీయ విషయములను కలసి ఆలోచించి, తమ అభిప్రాయములను బ్రిటీష్వారికి తెలిపి, దాని మూలమున అవసరములైన సంస్కరణములను చేయించుటయే వీరి ఉద్దేశము. వీ రాకాలమున కోరిన మార్పు లలో కొన్ని గమనింపదగియున్నవి. భారతీయులకు ఉన్నతోద్యోగములను వీరు కోరిరి. శాసనసభలో ప్రజాప్రతినిధులకు ఎక్కువ ప్రవేశ ముండవలెనని వీరు చెప్పిరి. ప్రభుత్వమువారు సైన్యములకును, తదితరశాఖలకును చేయుఖర్చులు తగ్గింపవలెననియు, విద్య దేశమందు విరివిగా వ్యాపింపవలెననియు వీరు సూచించిరి. ప్రభుత్వమువారిని ధిక్కరించుటగాని, వారిపై తిరుగుబాటు చేయుటగాని అప్పటి కాంగ్రెసు నాయకుల అభిమతము కాదు. ప్రజల అభిప్రాయమును తెలిసికొనక ప్రభుత్వమును జరుపుట ప్రమాదకరమని బ్రిటిషువారిలోకూడ కొంద ఱాకాలమున తలచి యుండిరి. అందుచేత వారు కాంగ్రెసు

సంస్థాపనమును ఆమోదించిరి. క్రీ. వె. 1885 నుండి సుమారు ముప్పది సంవత్సరముల కాలము ఇట్టి యుద్దేశముతోడనే కాంగ్రెసు పనిచేసెను.

**అతివాదులు, మితవాదులు** :- కాంగ్రెసువారు కోరిన మార్పులు సామాన్యములైనను అట్టివానిని కూడ ప్రవేశ పెట్టుటకు బ్రిటిషువారు సిద్ధపడరైరి. వారు చేసిన మార్పులలో క్రీ.వె. 1892లో గావింపబడిన ఇండియన్ కౌన్సిలుల చట్ట మొక్కటియే గమనింపదగి యున్నది. దీనిమూలమున శాసనసభలలో కొందఱు భారతీయులు సభ్యులగుటకు వీలుకలిగెను. కాని అధికారమంతయు బ్రిటిషువారి చేతియందే ఉండెను. దీనినంతయును చూచి, భారతీయ నాయకులలో కొందఱు ప్రజలలో జాతీయభావమును రగులజేసి విపరీతమైన ఆందోళన గావించి, స్వరాజ్యమును సంపాదించుటకు ప్రయత్నించుటయే ఉత్తమమని తలచి అట్టి ప్రయత్నములలోనికి దిగిరి. వారిలో బాలగంగాధర తిలక్ సుప్రసిద్ధుడు. ఇతడు మహారాష్ట్రుడు. మొగలాయి సామ్రాజ్యమును తొలగద్రోసినవారు మహారాష్ట్రులు. ఆ సామ్రాజ్యానంతరము దేశములో చాలభాగమును వారు పాలించిరి. అందుచేత వారిలో స్వాతంత్ర్యాభిమాన మత్యధికముగ నుండెను. కావుననే తిలక్ స్వరాజ్యోద్యమమునకు ప్రథమ నాయకుడయ్యెను. ఇతడు ఇంగ్లీషు విద్యలందును, భారతీయ విద్యలందును సమానమైన పాండిత్యము గలవాడు జాతీయ సంప్రదాయములను నిలువబెట్టదలచినవాడు. "కేసరి" అను వార్తాపత్రికను ప్రచురించి, దానిమూలమున ప్రజలలో గాఢమైన దేశాభిమానమును వృద్ధిజేసెను. పరాయివారి పరిపాలనమును తొలగించుటకు దౌర్జన్యము నుపయోగించుటలో అధర్మము లేదని ఇతడు బోధించెను. అనేకులు ఇతనికి శిష్యులైరి. వీరందరికి అతివాదులను పేరువచ్చెను. వీరుకూడ కాంగ్రెసులో సభ్యులై, స్వరాజ్య సంపాదనమే కాంగ్రెసుయొక్క ఉద్దేశ్యముగ నుండవలెనని ప్రచారము చేసిరి. కాని మఱికొందఱు నాయకులందు కంగీకరింపక, సామాన్యసంస్కరణములతో తృప్తిచెందియుండిరి. అట్టివారికి మితవాదులను పేరు వచ్చెను. ఈ రెండుపక్షములవారికి కాంగ్రెసు సమావేశములలో వాదప్రతివాదము లతితీవ్రముగ జరుగసాగెను. క్రీ.వె. 1907లో జరిగిన సమావేశమందు ఘర్షణ విపరీత మయ్యెను. దాని ఫలితముగ కొన్ని సంవత్సరములవఱకు అతివాదులు కాంగ్రెసును వదలవలసిన వారైరి. క్రీ.వె. 1916 వఱకు కాంగ్రెసువ్యవహారములు మితవాదుల చేతులలో నుండెను.

జాతీయోద్యమాభివృద్ధి :- కాని తిలక్ పక్షము వారికే దేశమందు పలుకుబడి అధిక మయ్యెను. కర్జన్ ప్రభువు క్రీ.వె. 1905లో గావించిన బంగాళ రాష్ట్ర విభజనము ప్రజలలో ఆందోళనము కలిగించెను. తమ అసంతృప్తిని బ్రిటీష్‌వారికి తెలియజేయుటకై బంగాళరాష్ట్రములోని ప్రజలు సురేంద్రనాథ్ బెనర్జీ నాయకత్వమున స్వదేశీ ఉద్యమమును ప్రారంభము చేసి బ్రిటీష్‌వస్తువులను బహిష్కరించు టకును, భారతీయ వస్తువులను వాడుటకును తీర్మానిం


వివేకానందుడు

చుకొనిరి. అదే సంవత్సరమున ఏషియాజాతులవారిలో నొకరగు జపాన్ వారు యూరోపియన్ జాతులలో నొకరగు రష్యావారిని గొప్పయుద్ధములో పూర్తిగ నోడించిరి.


దాదాభాయి నౌరోజి

ఇది భారతీయుల ఉద్రేకమును, జాతీయా భిమానమును వృద్ధిజేసెను. దక్షిణ ఆఫ్రికాలోని భారతీ యులను అచ్చటి తెల్ల ప్రభుత్వము వారు అనేక విధములఅగౌరవ పఱచుటయు, వారి స్థితిగతులను బాగు చేయుటకు మహాత్మా గాంధీ సత్యాగ్రహోద్యమమును నడుపుటయు క్రీ.వె. 1909 తర్వాత జరిగెను. ఈ ఉద్యమము భారతదేశములోని ప్రజలలో నూతనోత్సాహమును, బ్రిటిషు ప్రభుత్వము వారి యెడల ఎక్కువ విరోధమును కలిగించెను. 1914 లో మొదటి ప్రపంచయుద్ధము ప్రారంభమై 1919 వఱకు సాగెను. యుద్ధకాలములో ధరలు పెరుగుట చేతను, పన్నులధిక


అనిబిసెంటు



సురేంద్రనాథ్ బెనర్జీ

మగుటచేతను ప్రజల నేకకష్టముల నను భవింప వలసెనవారైరి. వీనికి తగిన ప్రతిఫలము వారి కెట్టిదియు లభింపలేదు. ప్రజలను, నాయకులను తృప్తి పఱచు టకు క్రీ.వె. 1919 లో బ్రిటిషు వారు కొన్ని వారు కొన్ని రాజకీయసంస్కరణములు గావించిరి. కాని, స్వరాజ్యవాదు లెవ్వరికి అది తృప్తికలిగింపలేదు. అందరిలో స్వరాజ్య కాంక్ష అధికమయ్యెను.



రాజడ్రే

జాతీయనాయకులు :- క్రీ.వె. 1885 తర్వాత కాంగ్రెసు ఉద్యమమును, స్వరాజ్యోద్య మమును నడిపిన నాయకులలో ప్రఖ్యాతి గాంచిన వారెందరో కలరు. వారిలో దాదాభాయి నౌరోజీ, గోపాలకృష్ణ గోఖలే, అరవింద ఘోష్, బిపిన్ చంద్రపాల్, సురేంద్రనాథ్ బెనర్జీ, లజపతిరాయి, అనిబిసెంటు,తిలక్ ముఖ్యముగ పేర్కొ నదగి యున్నారు. క్రీ.వె. 1919 తర్వాత నాయ కత్వమును వహిం చినవారిలో మహాత్మా గాంధీగాక, చిత్తరంజ న దాసు, మోతీలాల్ నెహ్రూ మొదలైనవా రెందరో ఉన్నారు. రాజకీయ ములలో ఎక్కువగ ప్రవేశింపక పోయినను మరికొందరు నాయకులు ప్రజల యందు గాఢమగు దేశాభి మానమును,



లజపతిరాయి



గోపాలకృష్ణ గోఖలే



తిలక్



చిత్తరంజన్‌దాసు



మోతీలాల్ నెహ్రూ

మతాభిమానమునుపురికొల్పి, స్వాతంత్ర్య ప్రియులుగచేసిరి, స్వామి వివేకానందుడు, రానడే, మదనమోహనమాలవ్య మొదలగువారట్టివారు ఇట్టి నాయకులనేకులు కలసి పనిచేయుటచేతనే స్వరాజ్యము లభించెను.

మహాత్మాగాంధీ:- మన నాయకులందఱిలో మహాత్మాగాంధి అగ్రగణ్యుడు. స్వరాజ్యమును మనము సంపాదింపగలుగుటకు వీరి నాయకత్వమే ప్రధాన కారణము. ఈయన క్రీ.వె. 1869 లో కాతియవార్‌లోని పోర్‌బందరు పట్టణమున పుట్టి, పందొమ్మిదవ ఏట లండను వెళ్ళి, న్యాయవాది పరీక్షయందు కృతార్థుడై భారతదేశమునకు తిరిగివచ్చెను. అటు తర్వాత క్రీ.వె. 1893లో ఒకానొక కేసును నడిపించుటకు దక్షిణ ఆఫ్రికాకు వెళ్లెను. కేసు ముగిసిన తరువాత కూడ ఇరువది సంవత్సరములు వీరు అచటనే ఉండిరి. అచ్చటి భారతీయులు పడుచుండిన బాధలను నివారించుట కుపాయమును గురించి వీరు ఆలోచించి, ఆలోచించి



గాంధీ మహాత్ముడు

తుదకు ప్రభుత్వమువారు భారతీయుల నవమానపరచుటకు చేసిన చట్టములను శాంతియుతముగ తిరస్కరించుటయే ఉత్తమమార్గమని నిర్ణయించిరి. ఈ శాంతియుతతిరస్కారమునకే సత్యాగ్రహ మని పేరు. అధికారమును దుర్వినియోగము చేయువారిని అణచుటకు మహాత్మాగాంధి కనిపెట్టిన వజ్రాయుధమే ఈ సత్యాగ్రహము.

వీరి నాయకత్వమున దక్షిణ ఆఫ్రికాలోని భారతీయులనేకులు --- స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు, హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు శాసనతిరస్కారముగావించి, అధికారులు పెట్టిన బాధలనన్నింటిని సహించి కారాగృహములలో కాలము గడపి, జాతీయగౌరవమును నిలువబెట్టిరి. ఇట్టిత్యాగమును, పట్టుదలను దక్షిణ ఆఫ్రికాలోని తెల్ల ప్రభుత్వమువారు చూచి, ఆశ్చర్యపడి, తుదకు మహాత్మాగాంధీతో రాజీచేసుకొని, భారతీయులపై అదివఱకుండిన నిర్బంధములను కొన్నిటిని తొలగించిరి. సత్యాగ్రహసాధనమున ఇంతటి గొప్ప విజయము సంపాదించి, మహాత్మాగాంధి క్రీ.వె. 1914లో భారతదేశమునకు వచ్చెను. క్రీ.వె. 1914 మొదలు క్రీ.వె. 1919 వఱకు జరిగిన మొదటి ప్రపంచయుద్ధములో ఈయన బ్రిటిషు ప్రభుత్వమున కెంతో సహాయము చేసెను. కాని యుద్ధము ముగిసిన తర్వాత బ్రిటిషు వారి నిరంకుశత్వము మఱింత వృద్ధిగాంచెను. దానిని చూచి, మహాత్మగాంధి సత్యాగ్రహసాధనము నుపయోగించి, భారతదేశమునకు స్వరాజ్యము సంపాదించుటకు నిశ్చయించెను. ఆ నిశ్చయము సులభముగ కొనసాగుటకై ఈయన కాంగ్రెసులో ప్రవేశించి, కాంగ్రెసు నాయకులు తనతో ఏకీభవించునట్లు చేసికొని, కాంగ్రెసునకు ప్రధాన నాయకుడై 1919 నుండి జాతీయోద్యమము నడపెను.

**గాంధీనాయకత్వమున కాంగ్రెసులో కలిగిన మార్పులు :-** గాంధీనాయకత్వమున కాంగ్రెసులో కొన్ని ప్రధానములైన మార్పులు కలిగి, స్వరాజ్యసంపాదనము సులభతర మయ్యెను. క్రీ.వె. 1920 లో నాగపూరునందు జరిగిన సమావేశములో కాంగ్రెసుయొక్క ఆశయము స్వరాజ్యమును శాంతిసాధనమున సంపాదించుట యని గాంధియొక్క ప్రేరేపణచేత నిర్వచింపబడెను. అది మొదలు కాంగ్రెసు స్వరాజ్యమునకై పోరెను. సాధారణముగ ఇతర దేశము లన్నిటియందును స్వాతంత్ర్యమును సంపాదించుటకై పోరిన జాతీయాభిమానులు - పరాయిప్రభుత్వములపై యుద్ధములను జేసి, రక్తపాతము గావించియుండిరి. మారణాయుధములతో యుద్ధము చేయవలసిన అవసరములేక సత్యాగ్రహ మను శాంతిపూర్వకమగు ఆయుధముతో యుద్ధము చేసి, అధికారుల నోడించి, స్వరాజ్యమును సంపాదింపవచ్చునని మహాత్మాగాంధి కాంగ్రెసునకు నచ్చజెప్పెను. ఈ ఆయుధము నుపయోగించియే తుదకు కాంగ్రెసు స్వరాజ్యమును సంపాదించెను. వారి నాయకత్వమున కాంగ్రెసులో కలిగిన రెండవ మార్పు ఇదియే. క్రీ. వె. 1919కు పూర్వము క్కాంగ్రెసుసంస్థయందు విద్యాధికులు, సామంతులు మాత్రమే చేరుచుండిరి. సామాన్య ప్రజలు,రైతులు, కార్మికులు దానియందు

ప్రవేశించిన వారు కారు. మహాత్మాగాంధి ఈ లక్షణమును గూడ మార్చెను. స్వరాజ్య సంపాదనమునకు విద్యాధికులు మాత్రము పాటుబడిన చాలదనియు, ప్రజలందరు స్వాతంత్ర్య సమరమున పాల్గొనవలెననియు ఆయన ప్రబోధము చేసెను. దాని ఫలితముగ లక్షల కొలది సామాన్యు లందులో చేరిరి. వారిలో అనేకులు పల్లెటూళ్లలో నివాసము చేయుచుండిన రైతులు, కూలివాండ్రు, పురుషులతోపాటు స్త్రీలు కూడ లక్షలాదిగ అందులో చేరిరి. దీనిమూలమున కాంగ్రెసుయొక్క స్వరూపము పూర్తిగమారిపోయెను. స్వరాజ్యమును తుదకు మనదేశములో సంపాదించిన వారు సామాన్య ప్రజలైరి. వారిలో స్వరాజ్య కాంక్షను కల్పించి, వారిని గూడ మహాత్మగాంధీ దేశాభిమానపూరితులుగ జేసెను. వారి నాయకత్వమున జరిగిన మార్పులలో ఇది మూడవది.

## గాంధీనాయకత్వములోని మఱికొన్ని విశేషములు

స్వదేశీ ఉద్యమము :- గాంధీమహాత్ముని నాయకత్వములోమఱి రెండు విశేషములుగలవు. సామాన్య ప్రజల స్థితిగతులను చక్కబఱచుటయేవారి ప్రధానోద్దేశ్యము. స్వరాజ్యము దానికొకసాధన మని వారి అభిప్రాయము. బ్రిటిష్ పరిపాలన మూలమున సామాన్యప్రజలు వారి వృతులను కోల్పోయిరి. కుమ్మర్లు, కంచర్లు, సాలెవాండ్రు ,చర్మకారులు, కంసాలులు, వడ్రంగులుమొదలైనవారి పనులకు గిరాకీ తగ్గెను. విదేశములనుండి పింగాణీ పాత్రలు, ఇనుపసామానులు, వస్త్రములు, పాదరక్షలు మొదలైనవస్తువులు వచ్చుట చేత దేశములోని ప్రజలు అట్టి వస్తువులను కొనసాగిరి. ఆ కారణమున మన దేశములో మనవారు తయారు చేసిన వస్తువులను కొనువారి సంఖ్య తగ్గెను. మన కార్మికులు కుల వృత్తులను వదలుకొనవలసిన వారైరి. వారి దారిద్ర్యమున కిది యొక ప్రధానకారణము. మహాత్మాగాంధీ దీనిని గ్రహించి, మన దేశమందుత్పత్తియైనవస్తువులను మనము వాడుట ఉత్తమ మని ప్రబోధము చేసెను. ఒక్కొక్కప్పుడు వీని ఖరీదు లెక్కువగ కనుపించినను, ఇవి ఎక్కువ కాలము మన్నునవి యగుట చేతను, ఈ ఎక్కువ ధరల ననుభవించు వారు మనదేశపు పనివాండ్రే అగుటచేతను స్వదేశ వస్తువులను కొనుట ధర్మమని వారు చెప్పిరి. వారి ప్రచారము వలన స్వదేశీ ఉద్యమము మిక్కిలి వృద్ధిగాంచి సామాన్య జనుల స్థితి గతులు కొంతవఱకు చక్కబడెను.

ఖద్దరు ఉద్యమము : - స్వదేశీ ఉద్యమములో ఖద్దరు ఉద్యమమును ఒక

భాగము. ఎవరికి కావలసిన వస్త్రములను వారేతయారు చేసికొనుట ఉత్తమ పద్ధతి యని మహాత్మగాంధి గారి ఉపదేశము. బట్టలు నేయుట అందఱు నేర్చుకొనక పోయినను చేతితో నూలువడకుట అందఱి విధి యని వారు బోధించిరి. చేతి నూలుతో చేతి మగ్గములమీద నేయబడు వస్త్రమునకు ఖద్దరని పేరు. ఇదికూడ సామాన్యుల స్థితిగతులు బాగుపడుట కొక గొప్ప సాధనము వస్త్రములకు గూడ మనము విదేశములపై ఆధారపడుట మన పారతంత్ర్యమున కొక లక్షణమనివారు భావించిరి. వారి ప్రచారము వలన ఖద్దరును ధరించు అలవాటు దేశమందంతట వ్యాపించెను: అనేకులకు ఇది యొక వృత్తిని కల్పించెను. నిరాండంబరముగ జీవింపవలయు నను పాఠమునుగూడ దీనిమూలమునమన వారు నేర్చికొనిరి.

స్వాతంత్ర్యమునకై పోరాటములు :- క్రీ.వె. 1919 లో మహాత్మాగాంధి సత్యాగ్రహ సాధనమున స్వాతంత్ర్య పోరాటమును ప్రారంభించెను. దానిలో స్త్రీలు, పురుషులు,వృద్ధులు, యువకులనేకులు వేలకు వేలుగ శాసనతిరస్కారము గావించి, పోలీసుల లాఠీదెబ్బలకు గుఱియై కారాగృహములలో బంధింపబడిరి. తుదకు మహాత్మగాంధి కూడ ఆఱు సంవత్సరముల శిక్షను అనుభవింపవలసి వచ్చెను. ఈ పోరాటము 1920 -1924 లో జరిగెను. క్రీ. వె 1930 -31 లో మఱియొక పర్యాయము మహాత్మాగాంధి సత్యాగ్రహోద్యమమును సాగించెను. దాని నణచుటకు బ్రిటిషువారు. కఠినమైన చట్టము లనేకముల నేర్పరచి, ప్రజలను భయకంపితులజేసి, శాసన తిరస్కారము గావించిన వారిని నానాబాధలుపెట్టిరి. కాని, ప్రజల ధైర్య సాహసములు తగ్గినవి కావు. వారి నోడించుట సులభ సాధ్యము కాదని వారు గ్రహించి మహాత్మునితో రాయబారములు జరిపి రాజీ చేసికొనిరి. అటుతర్వాత లండనులో కొన్ని సభలనుజేసి, క్రీ. వె. 1935లో పార్లమెంటు వారొకచట్టమును గావించి, క్రొత్త పరిపాలనాక్రమమును దేశములో ప్రవేశపెట్టిరి. దీని ననుసరించి కాంగ్రెసు నాయకులు1937 లో శాసనసభలను ప్రవేశించి, కొన్ని రాష్ట్రములలో మంత్రులై, దేశ పరిపాలన బాధ్యతను వహించిరి. క్రీ. వె. 1939 లోరెండవ ప్రపంచ సంగ్రామము ప్రారంభమయ్యెను. అందుమీదట బ్రిటిషు ప్రభుత్వమునకును, కాగ్రెసునకునుతీవ్రమైన అభిప్రాయ భేదములు కలిగెను. భారతదేశము సంపూర్ణ స్వాతంత్ర్యము గల దేశమని ప్రకటింప వలసినదని కాంగ్రెసువారు కోరిరి. బ్రిటిషు వారు దానిని నిరాకరించిరి. అంతటితో కాంగ్రెసువారు మంత్రిపదవులను వదులు కొనిరి.

**1942 ఆగష్టు విప్లవము** :- వారట్లు వదలుకొనిన తర్వాత గూడ

మూడుసంవత్సరముల కాలము వారికిని, బ్రిటిషువారికిని సంప్రదింపులు జరుగుచునే యుండెను. వాని మూలమున ఎట్టిఫలమును లేకపోయెను. క్రీ. వె. 1942 నాటికి యుద్ధములో బ్రిటిషువారికి అనేక నష్టములు, ప్రమాదములు కలిగెను. మలయా, సింగపూరు, బర్మా మొదలగురాష్ట్రములనుండి వారిని జపాను వారు తరిమి వేసిరి. భారతదేశముపై దండెత్తివచ్చుటకుగూడ వారు సన్నాహము చేయుచుండిరి. కాంగ్రెసువారి సహాయముండిన గాని, భారతదేశమును రక్షించుటకు సాధ్యము కాదన్న భయము బ్రిటిషు వారికి కలిగెను. ఆ సహాయమును సంపాదించుటకు ఇంగ్లండు నుండి క్రిప్సు అను మంత్రి ప్రత్యేకముగ మనదేశమునకువచ్చి, కాంగ్రెసు వారితో రాయబారములు జరిపెను. కాని కాంగ్రెసువారు కోరిన స్వరాజ్యము నిచ్చుట కతడంగీకరింపలేదు. అందుచేత నతని రాయబారము భగ్నమయ్యెను. అప్పుడు మహాత్మాగాంధి దేశ పరిస్థితులను గమనించి, స్వరాజ్య సంపాదనమునకు సత్యాగ్రహము తప్ప వేఱు సాధనము లేదని తీర్మానించుకొని, కాంగ్రేసును దానికి ఒప్పించి, దానిని ప్రారంభించుటకు పూర్వము రాజప్రతినిధితో సంప్రదింపదలచెను. అట్టి సంప్రదింపులు జరుగుటకు పూర్వమే ప్రభుత్వమువారు ఆయనను, ఇతర కాంగ్రెసు నాయకులను కారాగృహములలో బంధించిరి. దానివలన ప్రజలలో కలిగిన క్రోధావేశ మింతింతకాదు. నాయకులు లేరని నిరుత్సాహపడక వారు అనేక ప్రదేశములందు ప్రభుత్వము పై తిరుగబడి గొప్ప విప్లవమును లేవదీసిరి. కొన్ని చోట్ల బ్రిటిషు ప్రభుత్వ మంతరించెను. కాని కొసకు ప్రభుత్వము వారతిక్రూరముగ విప్లవము నణచిరి.

**1945 తర్వాత సంప్రదింపులు** : - ఆగస్టు విప్లవము వలన బ్రిటిషు వారొక గుణపాఠమును నేర్చుకొనిరి. నాయకులున్నను లేకున్నను ప్రజలు తిరుగుబాటు చేయగలరనియు, వారు దౌర్జన్యమును కూడ సాధనముగ నుపయోగింప సిద్ధ పడియున్నారనియు, అట్టివారిని అణచి శాశ్వతముగ భారతదేశమును పాలించుట సాధ్యము కాదనియు వారు గ్రహించిరి. అందుచేత 1945 లో యూరపుఖండమున యుద్ధము ముగిసిన వెంటనే వారు కాంగ్రెసు నాయకులను చెఱనుండి వదలిపెట్టి వారితోడను, మహాత్మాగాంధితోడను సంప్రదింపులు ప్రారంభించిరి. అది చక్కగ జరుగుటకు క్రీ.వె. 1946 లో ఇంగ్లండునుండి ముగ్గురు మంత్రులు మన దేశమునకు వచ్చి, ఒక స్వరాజ్య ప్రణాళికను తయారు చేసిరి. కాని అది అమలులోనికి రాకపూర్వమే దేశమందు మఱియొక ప్రమాదము సంభవించెను.





క్రిప్సు　　పెథిక్ లారెన్సు　　అలెగ్జాండరు

(1946 లోఇండియాకు వచ్చి ఒక స్వరాజ్య ప్రణాళికనుతయారుచేసిన ముగ్గురు బ్రిటీషు మంత్రులు)

మహమ్మదాలీ జిన్నా : - మొదటి నుండియు కాంగ్రెసువారు జరుపుచుండిన స్వరాజ్య సమరముపట్ల మహమ్మదీయులు ఎక్కువ ఉత్సాహమును చూపినవారుకారు



మహమ్మదాలీ జిన్నా

వారిలో అధిక సంఖ్యాకులు మహమ్మదాలీ జిన్నా నాయకత్వము నంగీకరించిరి.జిన్నాకడు సమర్థుడు ; బహు పట్టుదల గలవాడు. భారత దేశము నుండి బ్రిటిషువారుతొలగి పోయి స్వరాజ్యము స్థాపింపబడిన యెడల అధికారమంతయు అధిక సంఖ్యాకులగు హిందువుల పరమగుననియు, అల్ప సంఖ్యాకులగు మహమ్మదీయులు వారికి దాస్యముచేయవలసినవారగుదురనియు-భ్రమపడి, భారతదేశము రెండు ఖండములుగ విభాగము కావలెననియు, అందులో మహమ్మదీయుల సంఖ్య అధికముగ నుండు రాష్ట్రములన్నియు ఒక ఖండముగ పాకిస్థాన్ అనుపేర ప్రత్యేక రాజ్యము కావలెననియు, అట్టి విభాగమున కంగీకరించినగాని బ్రిటిషువారు తొలగిపోవుటకు తాను సమ్మతించుట లేదనియు అతడు వాదింపసాగెను. బ్రిటిషు వారు అతని వాదమునకు సానుభూతి చూపుచుండిరి. అందుచేత దేశమంతయు ఒకే రాజ్యముగ

నుండవలెనా, లేక రెండు రాజ్యములు కావలెనా అన్న సమస్య యొకటి ఏర్పడెను. ముగ్గురు బ్రిటిష్ మంత్రులు తయారు చేసిన ప్రణాళికలో దేశమంతయు ఒకే రాజ్యముగ నుండవలె ననియు, మహమ్మదీయు లధిక సంఖ్యాకులుగ నుండు ప్రదేశములు కొన్ని వ్యవహారములను కలసి చక్కబెట్టు కొనవచ్చుననియు ఒక రాజీ పద్ధతి సూచింపబడెను. కాని ఇది జిన్నాకు గాని, మహాత్మాగాంధీకిగానీ తృప్తికరము కాదయ్యెను. అందుచేత మంత్రుల రాయబారము నిష్ఫలమయ్యెను.

**దారుణమైన హత్యాకాండ :** - జిన్నాయొక్క ఆశయము పాకిస్థాన్ సంపాదనమే. రాజీమార్గమున నది లభించునట్లతనికి తోచలేదు. అందుచేత దౌర్జన్యము నుపయోగించుటకు అతడును, అతని యనుచరులును, మహమ్మదీయ ప్రజలలో అనేకులును సిద్ధపడిరి. దాని ఫలితముగ క్రీ.వె. 1946లో కలకత్తా, నవకాళి, టిప్పరా,పంజాబు మొదలగు ప్రదేశములలోఅధిక సంఖ్యాకులగు మహమ్మదీయులు అల్ప సంఖ్యాకులగు హిందువులపైబడి, ఎన్నటికి మరువరాని అత్యాచారములను, దారుణకృత్యము లనేకములను గావించిరి. దానికి జవాబుగా బీహారులో అధిక సంఖ్యాకులగు హిందువులు అల్పసంఖ్యాకులగు మహమ్మదీయులను హత్యగావించిరి దేవమంతయు రక్తపాత మగునట్లుండెను.

**స్వాతంత్ర్య ప్రకటనము :** - ఇదంతయు బ్రిటిషువారికి గూడ విసుగుకలిగించెను. రెండవ ప్రపంచ యుద్ధమందు పేరునకు వారు గెలిచిరన్న మాటయేకాని, వారు అపారమైన నష్టమును పొందిరి. విదేశములను పాలించుటకు కావలసిన సైన్యములు, నౌకాబలము,ఉద్యోగస్థుల సమృద్ధి వారివద్ద లేకపోయెను. తీవ్రమైన స్వరాజ్యకాంక్షగల భారతీయులను అణచి, పూర్వమువలె పాలించుట సాధ్యముకాదని వారు తీర్మానించుకొనిరి. దాని కనుగుణముగ వారొక ప్రకటనను జేసి, 1947ఆగష్టు15వ తేదీన, ఏమి జరిగిననుసరే, తాము ఇండియాపై తమకుగల అధికారమును వదలుకొనునట్లును, మమమ్మదీయు లధిక సంఖ్యాకులుగనుండు ప్రదేశములను మహమ్మదీయుల సంస్థయగు ముస్లింలీగుపరము చేయుటకును తక్కిన భాగములను కాంగ్రెసుపరము చేయుటకును తాము సిద్ధపడియుండినట్లు తెలిపిరి.ఈ దేశ విభజనకు విధిలేక కాంగ్రెసు వారంగీకరించిరి. దేశములో రక్తపాతము తప్పుటకు వారికి ఇంకొక మార్గము కనుపించలేదు. అందుపై బ్రిటిష్ వారు 1947 జూలైలో స్వాతంత్ర్య శాసనము నొకదానిని చేసి దానిననుసరించి ఆగష్టు 15 వ తేదీన తమ అధికారమును పూర్తిగ వదులు కొనిరి. తమ దేశమును తామే పరిపాలించుకొను హక్కు భారతీయులను భవింపగలవారైరి.

1947, ఆగష్టు 15 వ తేదీ : వారు చేసిన ప్రకటన ప్రకారము1947 ఆగష్టు 15 - వ తేదిన బ్రిటిషువారు నూటయేబది సంవత్సరముల కాలము మనదేశమం దనుభవించిన అధికారమునంతను వదులు కొనిరి. మహాత్మాగాంధీగారి నాయకత్వమున ముప్పది సంవత్సరములుగ కాంగ్రెసువారు జరిపిన స్వాతంత్ర్య పోరాటము విజయవంత మయ్యెను. భారతదేశమునకు పారతంత్ర్యము తొలగి స్వరాజ్యము సిద్ధించెను.

రెండు డొమినియన్లు : - స్వాతంత్ర్య శాసనమును బట్టి దేశము ఇండియా, పాకిస్థానము అను పేర రెండు స్వతంత్రరాజ్యములుగ నేర్పడెను. కాని ఇంగ్లండు దేశమును పాలించు రాజు తాత్కాలికముగ నీ రెండు రాజ్యములకు రాజుగ నుండుటకు కాంగ్రెసువారు, లీగువారు అంగీకరించిరి. రాజ్యములు సర్వ స్వతంత్రములైనను ఇంగ్లండుతో కొంత సంబంధము తప్పినది కాదు. పేరునకు ఇంగ్లండు రాజును తమ రాజుగ నంగీకరించి పరిపాలన స్వాతంత్ర్యము ననుభవించు చుండిన కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండు దక్షిణ ఆఫ్రికా మొదలగు దేశములకు డొమినియన్‌లు (Dominions) అను పేరుండెను. ఆ సంప్రదాయమునుబట్టి ఇండియా, పాకిస్థానములకు కూడ డొమినియ న్‌లను పేరు వచ్చెను.



**1947, ఆగస్టు 15-వ తేదీ :-** వారు చేసిన ప్రకటన ననుసరించి 1947 ఆగస్టు 15-వ తేదీన బ్రిటీష్‌వారు ఇండియాపై సుమారు 150 సంవత్సరములుగ వహించి యుండిన అధికారమును పూర్తిగ వదలుకొనిరి. భారతీయులు కాంగ్రెస్ యాజమాన్యమున అఱువది సంవత్సరములుగ సాగించిన స్వాతంత్ర్య సమరము విజయవంతముగ ముగిసెను. భరతఖండమున స్వరాజ్యము స్థాపింపబడెను. దీనితో ఇండియా చరిత్రయందు నూతనశక మారంభమయ్యెను.

# II

# స్వతంత్ర భారతదేశము

**విషయములు :-** సమస్యలు. సంస్థానముల సమస్య. రాజ్యాంగ నిర్మాణము. కాందిశీకుల పునరుద్ధరణము. ఆర్థిక సమస్య. పంచవర్ష ప్రణాళిక. అంతర్జాతీయ రంగము. నూతన చైతన్యము.

**సమస్యలు :-** స్వాతంత్ర్య సంస్థాపన కాలమందును, అటుతర్వాతను జాతీయ ప్రభుత్వమువా రనేక క్లిష్టసమస్యల నెదుర్కొనవలసినవారైరి. వానిలో కొన్ని రాజకీయ సమస్యలు; కొన్ని సాంఘికములు; మరికొన్ని ఆర్థికములు. ఇవిగాక అంతర్జాతీయ సమస్యలను గూడ కొన్నిటిని వారెదుర్కొనవలసి వచ్చెను. వీని నెదుర్కొనుటలో మొత్తము మీద ప్రభుత్వమువారు తెలివితేటలతోడను, దూరదృష్టితోడను, నేర్పుతోడను ప్రవర్తించిరి. సమస్యలన్నియు పూర్తిగ పరిష్కారము కాకపోయినను, పరిష్కారము కాగలవని చెప్పదగిన పరిస్థితులేర్పడెను.

**సంస్థానముల సమస్య :-** బ్రిటీష్‌వారి పరిపాలన కాలములో వారు స్వయముగ పాలించుచుండిన మద్రాసు, బొంబాయి వంటి రాష్ట్రములు కొన్నియు, రాజులు, మహరాజులు, నవాబుల మూలమున పరోక్షముగ వారు పాలించుచుండిన మైసూరు, హైదరాబాదు, బరోడా మొదలైన సంస్థానములు కొన్నియు నుండెను. వారి అధికారము తొలగిన తర్వాత సంస్థానముల స్థితి ఎట్టిదిగ నుండవలెనను విషయములలో కొన్ని సంవత్సరములనుండి వాదోపవాదములు జరిగెను. తుదకు క్రీ. శె. 1947లో బ్రిటీషువారు ఇండియా స్వాతంత్ర్య చట్టమును చేసినప్పుడు సంస్థానములు సర్వస్వామ్యముకల రాజ్యము లనియు, ఇష్టమున్నయెడల వానివాని వీలును బట్టి అవి ఇండియాలోగాని, పాకిస్థాన్‌లోగాని చేరవచ్చుననియు ప్రకటించిరి. దాని మూలమున క్లిష్ట సమస్య

ఏర్పడెను. దేశములో సుమారు ఆరువందల సంస్థానము లుండెను. అవి ఎందులోను చేరక ప్రత్యేక రాజ్యములుగ నుండుటకు తీర్మానించుకొనినయెడల దేశము ఇండియా, పాకిస్థాన్ అను రెండు రాజ్యములుగ చీలిపోవుటయే గాక వందలకొలది రాజ్యములుగ చీలి, అంతర్యుద్ధములకును, విదేశీయుల దండయాత్రలకును గురియగుట తప్పదు. ఇట్టి విభజనము వలననే బ్రిటీషువారు, ఇతర పరాయివారు దేశము నిదివరలో సులభముగ జయించిరి. ఇదిగాక బ్రిటీషుపాలన కాలములో దేశములోని వర్తక వ్యాపారములు, రైళ్ళు మొదలైన ప్రయాణసాధనములు స్వతంత్రరాజుల ఆటంకమునకు గురిగాక జరుగుచుండెను. ప్రజల ఆర్థికాభివృద్ధికి నిరాటంకమైన ఇట్టి సంబంధము అత్యావశ్యకము; కాని, సంస్థానములు స్వాతంత్ర్య ప్రకటనము చేసినయెడల ఆర్థికముగ గూడ దేశము వెనుకబడిపోవుట తప్పదు. ఈ కారణములచేత సంస్థానముల సమస్య ఒకటి ఏర్పడెను.

సర్దార్ పటేల్ :- కేంద్రమం దేర్పడిన స్వాతంత్ర్య ప్రభుత్వములో నాయకత్వము వహించిన ప్రముఖులలో నొకడగు సర్దార్ పటేల్ యొక్క దూరదృష్టి, చాకచక్యము, వ్యవహార దక్షతల మూలమున ఇట్టి చిక్కులేవియు సంభవింపక సమస్య చాలవరకు పరిష్కారమయ్యెను. ఇందుకై పటేలు మూడు మార్గముల ననుసరించెను. ఇండియాను అనుకొనియున్న సంస్థానములన్నియు బ్రిటీషు పరిపాలన కాలమందు జరిగినట్లు ఇప్పుడుకూడ ఇండియా కేంద్రప్రభుత్వమునకు రక్షణ, విదేశ వ్యవహారములు, రాకపోకల సాధనముల విషయములలో లోబడి ప్రవర్తించునట్లు ఏర్పరచెను. సంస్థానాధీశులలో ననేకులు దీనికి 1947 ఆగస్టు 15వ తేదికి పూర్వమే అంగీకరించి ఇండియాలో చేరిరి. తక్కినవారు తర్వాత నంగీకరించిరి. కనుక దేశములో అనేక స్వతంత్ర రాజ్యము లేర్పడు ప్రమాదము తప్పెను. ఇట్టి కలయికకు అక్సెషన్ (Accession) అని పేరు. కాని సంస్థానములలో అనేకములు మిక్కిలి చిన్నవి. వేయి రూపాయల సంవత్సరాదాయము లేనివి



సర్దార్ పటేల్

కూడ వానిలో కొన్ని కలవు. అట్టివి ప్రజల సౌఖ్యమునకు కావలసిన ఏర్పాట్లు చేయుట సాధ్యముకాని పని. పటేల్ దానిని గ్రహించి చిన్న సంస్థానము లనేకములను సమీపమందుండు రాష్ట్రములలో కలిపి (Merger) అట్టి సంస్థానాధీశులకు నిర్ణీతమైన ఆదాయమును కల్పించి అధికారము నుండి వారిని తొలగించెను. ఇది రెండవ మార్గము. మరియొక మార్గమును కూడ పటేల్ ఈ సందర్భమున అనుసరించెను.చిన్న సంస్థానము లనేకములు ఒకటి ప్రక్కన నొకటిగ నున్నప్పుడు వానినన్నిటిని కలిపి ఒక సంయుక్త సంస్థానముగ (Union) నిర్మాణము గావించెను. ఈవిధముగ సౌరాష్ట్ర యూనియన్, వింధ్య ప్రదేశ్ యూనియన్, రాజస్థాన్ యూనియన్ మొదలైనవి స్థాపింపబడెను.ఇదికూడ చిన్న సంస్థానముల సమస్య పరిష్కారమగుటలో ఎక్కువగ తోడ్పడెను. ఇవిగాక ప్రజల యోగక్షేమము లభివృద్ధి గాంచుటకు కావలసిన రాజకీయ, ఆర్థిక సంస్కరణము లనేకములను పటేల్ సంస్థానములలో ప్రవేశపెట్టెను.

**రాజ్యాంగ నిర్మాణము :-** స్వరాజ్యము స్థాపింపబడిన తర్వాత పరిష్కరింపబడిన సమస్యలలో క్రొత్త రాజ్యాంగ నిర్మాణము కూడ ప్రధాన స్థానమును వహించుచున్నది. ఇందుకై బ్రిటీష్ పరిపాలన కాలములో తుది భాగమందు (1946 డిసెంబరు 9 తేదీన) ఒక రాజ్యాంగ నిర్మాణ పరిషత్తు సమావేశమయ్యెను. అది మూడు సంవత్సరముల కాలము పాటుబడి, రాజ్యాంగ చట్టము నొకదానిని నిర్మించెను. ఈ చట్టము 1950, జనవరి 26వ తేదీన అమలులోనికి వచ్చెను. ప్రస్తుతము మన దేశపరిపాలన మీచట్టము ననుసరించియే జరుగుచున్నది. దీని మూలమున భారతరాజ్యము సర్వస్వామ్యము గల ప్రజారాజ్యమయ్యెను. ప్రజలందరికి జాతి, మత, వర్ణ, కుల వివక్షత లేక సమానమైన హక్కు లనేకములు లభించెను. ఫెడరల్ పద్ధతి ననుసరించి కేంద్రప్రభుత్వమునకును, రాష్ట్రప్రభుత్వములకును సంబంధ మేర్పడెను. కేంద్రమందును, రాష్ట్రములందును వయోజనులందరు ఎన్నుకొనిన శాసనసభలు, అట్టి సభలకు బాధ్యులైన మంత్రివర్గములు అధికారములోనికి వచ్చెను. నిష్పక్షపాతముగ న్యాయపరిష్కారము చేయుట కవకాశము గల ఉన్నత న్యాయస్థానము లేర్పడెను. ప్రజాభిప్రాయానుసారముగను, ప్రజల యోగక్షేమము లభివృద్ధి యగునట్లును పరిపాలనము జరుగుట కిప్పుడు సాధ్యమగుచున్నది.

**కాందిశీకుల పునరుద్ధరణము :-** ఇండియా, పాకిస్థాన్ అని భారతదేశము రెండు ప్రత్యేక రాజ్యములుగ విభాగమైన కారణమున కాందిశీకుల సమస్య యొకటి ఏర్పడెను. లక్షలకొలదిమంది మహమ్మదీయేతరులు పాకిస్థానమును వదలి, సమస్త బాధ

లనుభవించి, ఇండియాలోనికి కాందిశీకులుగ రావలసిన వారైరి. ఇప్పటికి కూడ అలాంటివారు కొందరు తూర్పు పాకిస్థానము నుండి ఇండియాకు వచ్చుచున్నారు. 1951 నాటికి కాందిశీకుల సంఖ్య సుమారు ఎనభైలక్షలు. వీరందిరిని పునరుద్ధరించు భారము జాతీయ ప్రభుత్వమువారు వహించి, వారికి భూములనిచ్చి, వృత్తుల కల్పించి, వారు సుఖముగ జీవించుటకు కావలసిన వసతు లనేకములను కల్పించిరి. ఈ పునరుద్ధరణ ప్రయత్నమింకను సాగుచునేయున్నది. ఇందుకై ఇప్పటివరకు సుమారు 224 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టబడెను.

ఆర్థికసమస్య :- ఆర్థికముగ మనదేశము వెనుకబడిన దేశములలో నొకటిగ నున్నది. ఎవరో కొద్దిమంది తప్పతక్కిన ప్రజలందరు దారిద్ర్యబాధ ననుభవించువారుగ నున్నారు. దీనిని తొలగించుట అత్యవసరమన్న విషయమునుజాతీయ ప్రభుత్వమువారు గ్రహించి, దానికి కావలసిన కార్యక్రమము నొకదానిని "పంచవర్ష ప్రణాళిక" అను పేరుతో 1950లో తయారుచేసిరి. అప్పటినుండి ఆ ప్రణాళిక అమలులోనికి వచ్చెను. దీని మూలమున ఆర్థిక సమస్య క్రమక్రమముగ పరిష్కారమై., ప్రజలు సుఖముగ జీవించుట కవకాశ మేర్పడునని చెప్పవచ్చును.

పంచవర్ష ప్రణాళిక :- దేశము ఆర్థికముగ వృద్ధియగుటకు ఏలాటి పనులు జరుగవలసి యున్నదో ఈ ప్రణాళిక వివరించుచున్నది. ఈ పనులన్నియు అయిదు సంవత్సరముల కాలములో పూర్తి కావలసియున్నందున దానికి పంచవర్ష ప్రణాళిక అను పేరు పెట్టబడినది. అందులోని ప్రధాన సూచనలు, కార్యకలాపములు ఈ క్రింది విధముగ నున్నవి :

1. మన దేశములో వ్యవసాయము ప్రధానవృత్తిగానున్నది. ఇదిగాక ఇటీవలి కాలములో ఆహారపదార్థములు, జనుము, ప్రత్తి మొదలైన వాటిలో మన కెంతో కొరత ఏర్పడినది. అందుచేత వ్యవసాయమును అభివృద్ధి చేయుట అత్యావశ్యకమని ప్రణాళిక నిర్ణయించుచున్నది. ప్రస్తుతము బీడుగా ఉన్న ప్రదేశములనుండి 71/2 లక్షల ఎకరాల భూమిని సాగులోకి తెచ్చుట; గొప్ప నీటి సదుపాయముల (Major Irrigation Schemes) మూలమున 120 లక్షల ఎకరాలకు నీటిపారుదల కల్పించుట; రసాయనిక ఎరువులు, ఉత్తమములైన విత్తనములు ఉపయోగించి 1,60,000 టన్నుల ఆహార పదార్థములను ఎక్కువగ పండించుట; దేశములోని పశు సంపదను వృద్ధిచేయుట; వ్యవసాయదార్లకు వారు సాగుచేయు పొలములపై ఆస్తిహక్కులను కల్పించుట; వారికి చౌకవడ్డీలతో అప్పులనిచ్చుట; వారికి కావలసిన ఇతర సదుపాయములను కల్పించుట

ఈలాటి సూచనలను ప్రణాళిక చేసియున్నది. వీనిమూలమున ఆహారపదార్థముల ఉత్పత్తి 7.6 మిలియన్ల టన్నులు, ఎక్కువ అగును. అదే విధముగ నూనెగింజలు 40 లక్షల టన్నులు, ప్రత్తి 1.26 మిలియన్ బేళ్లు, జనుము 2.09 మిలియన్ బేళ్లు ఎక్కువగును. ఆహార పదార్థముల విషయము లలో విదేశములపై ఆధారపడవలసినది లేకపోవును. ఈ వ్యవసాయాభివృద్ధికి 361 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టబడును.

2. దేశములోని నదులలోనుండు జలములలో చాల భాగము ఇప్పుడు వ్యర్థమగుచున్నది. నదులపై గొప్ప ఆనకట్టలు కట్టి నదీజలములను వ్యవసాయమునకు ఉపయోగించుటకును, వానినుండి విద్యుచ్ఛక్తిని సృష్టించుటకును పంచవర్ష ప్రణాళిక అనేక సూచనలను చేసియున్నది. ఈ సూచనల ఫలితముగ భక్రానంగల్ ప్రాజెక్టు, దామోదరలోయ ప్రాజెక్టు, హీరాకుడ్ ప్రాజెక్టు మొదలైనవి నిర్మింపబడును. వీనికిగాను 266 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టబడును. ఈ ప్రాజెక్టుల మూలమున ఇప్పటికంటె 1,594 వేల కిలోవాట్ల ఎక్కువ విద్యుచ్ఛక్తి వాడుకలోనికి రాగలదు.

3. ఇటీవలి కాలమున దేశములోని అడవుల వైశాల్యము చాలవరకు తగ్గిపోయెను. అనాలోచితముగ చెట్లను కొట్టివేయుట జరిగెను. ఈ నష్టమును పూరించుటకును, క్రొత్తచెట్లను పెంచుటకును 10 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టబడును. చేపలను ఎక్కువగ పెంచుటకును, పట్టుటకును, చేపల పరిశ్రమను వృద్ధిచేయుటకును ప్రణాళిక సూచనలను చేసియున్నది.

4. పరిశ్రమల విషయములో భారతదేశము మిక్కిలి వెనుకబడియున్నది. అందుచేత వాని అభివృద్ధికై 233 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టబడును. క్రొత్త ఉక్కు,, ఇనుము కర్మాగారములు, రైలు ఇంజన్లను, విమానములను. నౌకలను తయారుచేయు కర్మాగారములు, రసాయనిక ఎరువులు తయారుచేయు కర్మాగారములు, సిమెంటు, పంచదార, కాగితము మొదలైనవానిని తయారుచేయు కర్మాగారములు స్థాపింపబడును. ఈలాటి భారీపరిశ్రమలు కాక, కొన్ని స్వల్ప పరిశ్రమలకు, ఖద్దరు మొదలైన కుటీర పరిశ్రమలకు కొంతధనము కేటాయింపబడి యున్నది. ఈలాటి పరిశ్రమాభివృద్ధి మూలమున దేశములో తయారగు వస్త్రములు, పంచదర, కాగితము, గ్లాసు, నూనెలు, సిమెంటు, ఇనుము, ఉక్కు మొదలైనవి ఎన్ని రెట్లో వృద్ధియగును.

5. రవాణా సౌకర్యములను వృద్ధిచేయుటకు ప్రణాళిక అనేక సూచనలను చేసియున్నది. రైళ్ళకుగాను 400 కోట్ల రూపాయలు, రోడ్లకుగాను 108 కోట్లరూపాయలు, సముద్ర తీరపు రేవులకు 20 కోట్ల రూపాయలు, పోస్టు టెలిగ్రాఫ్ సౌకర్యములను

వృద్ధిచేయుటకు కొన్ని కోట్ల రూపాయలు ఖర్చుపెట్టబడును. 2000 జనాభాగల ప్రతి గ్రామమందు ఒక పోస్టు ఆఫీసు, 5000 జనాభాగల ప్రతి గ్రామమందు ఒక టెలిగ్రాఫు ఆఫీసు పెట్టబడును.

6. ప్రజల ఆరోగ్యము, గృహవసతులు, విద్య అభివృద్ధి యగుటకు కూడ సూచనలు చేయబడియున్నవి. వెనుకబడిన జాతులయొక్కయు, హరిజనుల యొక్కయు అభివృద్ధికిగాను ప్రణాళిక కొన్ని ప్రత్యేక సూచనలు చేసియున్నది.

మొత్తముపైన పంచవర్ష ప్రణాళిక కాలమున (1951 ఏప్రిల్ మొదలు 1956 ఏప్రిల్ లోపల) 2069 కోట్ల రూపాయలను ప్రభుత్వమువారు ఖర్చుపెట్టి ఆర్థికాభివృద్ధికి ప్రజల సౌఖ్య సౌభాగ్యముల అభివృద్ధికి తోడ్పడెదరు.

**అంతర్జాతీయరంగము** :- స్వరాజ్య సంస్థాపనానంతరము భారతదేశము అంతర్జాతీయరంగమందొక విశిష్టమైన స్థానమును ఏషియా, ఆఫ్రికా ఖండములలోని ప్రజలు ముందుకు వచ్చుటకు కావలసిన కార్యక్రమములలో భారతదేశము నాయకత్వము వహించెను. దేశముల మధ్య ఏర్పడు వివాదములను యుద్ధసాధనమునగాక శాంతి సాధనమునను, సంప్రదింపుల సహాయమునను పరిష్కరించుకొనుట ఉత్తమ పద్ధతి యని ప్రబోధము గావించుటలో భాతర ప్రభుత్వము ప్రశంసింపదగిన కృషి చేసెను. పక్షపాతమనునది లేక, సమభావముతో అంతర్జాతీయ సమస్యల నన్నిటిని పరికించగల ప్రభుత్వము భారత ప్రభుత్వ మొక్కటియే యను కీర్తి ప్రతిష్ఠలను భారతదేశము గడింపగలిగెను.

**నూతన చైతన్యము** :- ఎన్ని సమస్యలున్నను వాని నెదుర్కొని సవ్యముగ పరిష్కరించుకొనగలమను ధైర్యము ప్రజలలోను, ప్రజానాయకులలోను ప్రస్తుతము కనుపించుచున్నది. ప్రాచీనకాలమందు దేశమున కుండిన వైభవము, కీర్తి ప్రతిష్ఠలు తిరిగి రావలెనను ఉత్సాహము అందరిలో నున్నది. దారిద్ర్యము, అజ్ఞానము, అనారోగ్యము మొదలైన లోపములను పోగొట్టుటకు అందరు సిద్ధముగ నున్నారు. ఎందులోనుగూడ ఇతర దేశములలోనివారికంటె భారతీయులు తీసిపోవువారు కారనియు, ప్రపంచమున కంతకు మార్గదర్శకులుగ నుండదగిన వారనియు ప్రదర్శింపవలసిన సమయము వచ్చెనని అందరు భావించుచున్నారు. దేశాభిమానము, స్వాతంత్ర్యము, సమత్వము, సౌభ్రాతృత్వము ప్రజల ఆదర్శములగుచున్నవి. నూతన చైతన్య లక్షణము ఇదియే.

# కాలప్రణాళిక

## హిందూమహాయుగము

సుమారు క్రీ. పూ.

3500 - 2500 సింధునదీ ప్రాంతపు నాగరికత కాలము

2500 పూర్వ యుగము.

2500 ఆర్యుల రాక; ఋగ్వేద కాలము.

1400 మహాభారత యుద్ధము.

623 - 543 బుద్ధుని జీవితకాలము.

618 - 546 వర్ధమాన మహావీరుని జీవిత కాలము.

603 - 551 బింబిసారుని పాలనము.

551 - 519 అజాతశత్రుని పాలనము

518 - 330 పంజాబు పారసీకుల వశమందుండుట.

403 మహాపద్మనందుడు మగధ రాజ్యమునకు రాజగుట.

327 అలెగ్జాండరు దండయాత్ర.

322 మౌర్య రాజ్యస్థాపనము

322 - 298 చంద్రగుప్తుని పాలనము.

304 సెల్యూకసు చంద్రగుప్తునితో సమాధానము చేసికొనుట.

298 - 274 బిందుసారుని పాలనము.

274 - 236 అశోకుని పాలనము.

230 క్రీ. వె. 225 శాతవాహన చక్రవర్తుల పాలనము.

184 మౌర్యసామ్రాజ్యము క్షీణించుట.

200 - 50 ఇండోగ్రీకులు అధికారమందుండుట.

సుమారు క్రీ. పూ.

184 - 72 శుంగరాజుల పాలనము.

170 ఖారవేలుడు రాజ్యమునకు వచ్చుట.

160 - 140 మీనాండరు పాలనము.

72 - 27 కణ్వ వంశీయుల పాలనము.

సుమారు క్రీ. వె.

20 - 60 వింధవర్ణుడు.

90 - 120 గౌతమీపుత్ర శాతకర్ణి.

120 - 155 వశిష్ఠపుత్రపులుమావి.

120 - 162 కనిష్కుని పాలనము.

165 - 195 యజ్ఞశ్రీ.

క్రీ. వె.

320 గుప్త సామ్రాజ్య స్థాపనము.

320 - 335 చంద్రగుప్తుని పాలనము.

335 - 385 సముద్రగుప్తుని పాలనము.

350 విష్ణుగోపుడు సముద్రగుప్తు నెదిరించుట.

385 - 413 చంద్రగుప్త విక్రమాదిత్యుని పాలనము.

405 ఫాహియాను ఇండియాకు వచ్చుట.

455 హూణులు గుప్తరాజ్యముపై దండెత్తుట.

510 గుప్తసామ్రాజ్య మంతరించుట.

530 యశోధర్ముడు హూణుల నోడించుట.

550 చాళుక్య రాజ్య స్థాపనము.

575 - 600 సింహవిష్ణువు.

604 ప్రభాకర వర్ధనుడు మరణించుట.

606 - 647 హర్ష వర్ధనుని పాలనము.

609 - 642 రెండవ పులకేశి పాలనము.

620 రెండవ పులకేశి హర్షు నోడించుట.

630 హ్యూయన్‌సాంగ్ ఇండియాకు వచ్చుట.

642 పల్లవులు పులకేశి నోడించి చంపుట.

సుమారు క్రీ. వె.

700 - 1000 రాజపుత్రుల ప్రాబల్యము.

750 రాష్ట్రకూటులు తమ యధికారమును స్థాపించుకొనుట.

750 పల్లవుల సామ్రాజ్యము క్షీణించుట.

757 - 800 కృష్ణరాజు.

సుమారు క్రీ.పూ.

978 కల్యాణచాళుక్యులు తమ అధికారమును స్థాపించుట.

985 - 1018 రాజరాజు పాలనము.

1076 -1126 విక్రమాంకుడు.

1086 -1118 కులోత్తుంగ చోళుని పాలనము.

## మహ్మామ్మదీయ మహాయుగము

క్రీ. వె.

570 - 632 మహమ్మదునబీ.

711 మహమ్మదు కాసిము యొక్క దండయాత్ర.

712 అరబ్బులు సింధు రాష్ట్రమును జయించుట

976 సబక్తజిన్ గజనీ పట్టణమున కధిపతియగుట

997 - 1030 గజినీమామూదు పాలనము.

1008 గజినీమామూదు ఆరవ దండయాత్ర.

1024 గజినీమామూదు సోమనాథపురమును ముట్టడించుట.

1186 ఘోరీ మహమ్మదు పంజాబును స్వాధీనపరచుకొనుట.

1191 - 1193 స్థానేశ్వర యుద్ధములు.

1194 మహమ్మదుఘోరీ జయచంద్రునోడించి కన్యాకుబ్జమును పట్టుకొనుట.

1197 మహమ్మదుబిన్ భక్తియారు బీహారమును జయించుట.

1206 ఘోరీమహమ్మదు చనిపోవుట.

1206 -1290 బానిస రాజుల పాలనము.

1206 -1210 కుతుబుద్దీనుని పాలనము.

1290-1320 ఖిల్జీల పాలనము.

1296 -1316 అల్లాయుద్దీనుని పాలనము.

1296 -1304 మంగోలుల దండయాత్రలు.

1299 -1304 అల్లాయుద్దీను రాజపుత్రులతో జరిపిన యుద్ధములు.

1308 -1310 అల్లాయుద్దీనుని దక్షిణదేశ దండయాత్ర.

1309 ఓరుగల్లును పాలించుచుండిన కాకతీయులు అల్లాయుద్దీనుకు సామంతులగుట.

1320 -1412 తుఘ్లకుల పాలనము.

1325 -1351 మహమ్మదు బిన్ తుఘ్లకు పాలనము.

1336 విజయగనర స్థాపనము.

1336 -1486 సంగమ వంశీయులు విజయనగరమును పాలించుట.

1346 బహమనీ రాజ్య స్థాపనము.

1351 -1388 ఫిరోజిషా పాలనము.

1398 టైమూరు ఇండియాపై దండెత్తి వచ్చుట.

1414 -1450 సయ్యదు వంశీయుల పాలనము.

1421 -1448 రెండవ దేవరాయలు.

1450 -1526 లోడీవంశీయుల పాలనము.

1466 -1481 మహమ్మదు గవాను మంత్రిగా నుండుట.

1484 ఇమాదుషా బీరారునందు స్వతంత్రించుట.

1486 -1505 సాళువ వంశీయులు విజయనగరమును పాలించుట.

1489 యూసఫ్ అదిల్‌షా బిజాపుర రాజ్యమును స్థాపించి స్వతంత్రుడగుట.

1498 నైజాముల్ ముల్కు భారీ అహమ్మదు నగరమును స్థాపించుట.

1505 తుళువ నరసనాయడు విజయనగర రాజ్యము నపహరించుట.

1509 -1530 కృష్ణదేవరాయల పాలనము.

1520 రాయచూరు యుద్ధము.

1526 బాబరు పానిపట్టు యుద్ధమునందు ఇబ్రహీము లోడీ నోడించి మొగలాయీ రాజ్యమును స్థాపించుట.

1565 తాళికోట యుద్ధము.

1574 బీరారు అహమ్మదు నగరములో కలిసిపోవుట.

## మొగలాయీల కాలము

1504 బాబరు ఫర్గానా రాజ్యమును కోల్పోయి కాబూలు రాజ్యమును జయించుట.

1526 మొదటి పానిపట్టు యుద్ధము : మొగలాయీ రాజ్యస్థాపనము.

1526-1530 బాబరు పాలనము.

1527 కాణ్వాహా యుద్ధము.

1529 గోగ్రా యుద్ధము.

1530 -1540; 1555 హుమాయూనుని పాలనము.

1539 చౌసాయుద్ధము.

1540 కనోజి యుద్ధము - హుమాయూను ఓడిపోయి దేశభ్రష్టుడగుట.

1540-1545 షర్షా పాలనము.

1542 అక్బరు జననము.

1545 -1555 షర్షా సంతతివారి పాలనము.

1555 హుమాయూను సికందరుషాను సర్ హిందువద్ద నోడించి, ఢిల్లీ సింహాసనమును మరల నధిష్ఠించుట.

1556 -1605 అక్బరు చక్రవర్తి పాలనము.

1556 రెండవ పానిపట్టుయుద్ధము, హేమూ ఓడిపోవుట మొగలాయీ రాజ్యము స్థిరపడుట.

1558 -1576 అక్బరు ఉత్తర హిందూస్థానమును జయించుట.

1580 -1596 అక్బరు వాయవ్య రాష్ట్రములను జయించుట.

1596 -1601 అక్బరు దక్కనులోని రాజ్యములను జయించుట.

1600 అక్బరునకు అహమ్మదు నగర రాజ్యములో చాలభాగము వశమగుట.

1605 -1627 జహాంగీరు పరిపాలనము.

1606 కుస్రూ జహాంగీరుపై తిరుగబడుట.

1608 ఇంగ్లీషు రాయబారి యగు హాకిన్సు జహాంగీరును సందర్శించుట.

1611 జహాంగీరు నూర్జహానును వివాహమాడుట.

1614 జహాంగీరునకు చిత్తూరురాణా యగు అమరసింహుడు సామంతుడగుట.

1615 సర్ తామస్ రో అను ఇంగ్లీషురాయబారి జహాంగీరుని సందర్శించి సూరతు మున్నగు ప్రదేశములందు వర్తకశాలలను కట్టుకొనుట కనుజ్ఞవడయుట.

1627 -1658 షాజహానుని పాలనము.

1627 శివాజీ జననము.

1631 అహమ్మదునగర రాజ్యము మొగలాయీ రాజ్యముతో నేకమగుట.

1635 గోలకొండ నవాబు షాజహానునకు సామంతుడగుట.

1638 షాజహాను కాందహారు కోటను స్వాధీనపరచుకొనుట.

1653 ఔరంగజీబు దక్కనునకు రాజప్రతినిధి యగుట.

1657 షాజహాను జబ్బుపడుట; అతని నలుగురు కుమారులు రాజ్యమునకై పోరాడుట.

1658 ఔరంగజీబు సముగర్ అనుచోట దారా నోడించుట.

1658 -1707 ఔరంగజీబు పాలనము.

1658 -1681 ఔరంగజీబు రాజపుత్రులతో యుద్ధము సేయుట.

1659 అఫ్జుల్ ఖానుడు శివాజీపైకి వెళ్లుట.

1660 ఔరంగజేబు షేస్త ఖానుని శివాజీపైకి పంపుట.

1664 శివాజీ సూరతు రేవును దోచుకొనుట.

1666 షాజహానుని మరణము.

1667 శివాజీ చెఱనుండి తప్పించుకొని పూనాను చేరుట.

1674 శివాజీ పట్టాభిషిక్తుడగుట.

1675 శిక్కుల గురువగు టెగ్ బహదూరు దుర్మరణము నొందుట.

1680 శివాజీ కాలధర్మము నొందుట.

1681 -1707 ఔరంగజీబు దక్కనులోని రాజ్యములతో యుద్ధము చేయుట.

1686 ఔరంగజీబు బిజాపురమును ముట్టడించి, వశపరచుకొనుట.

1687 ఔరంగజీబు గోలకొండ రాజ్యమును జయించుట.

1689 మొగలాయీలు శంభాజీని పట్టుకొని చిత్రవధ గావించుట.

1691 -1698 మొగలాయీలు జింజికోటను ముట్టడించుట.

1707 -1712 బహదూరుషా పాలనము.

1708 -1749 సాహూపాలనము.

1713 - 1719 ఫరుక్ సయ్యరుపాలనము

1714 -1720 పీష్వా బాలాజీ విశ్వనాథుడు.

1719 -1748 మహమ్మదుషా పాలనము.

1720 -1740 మొదటి బాజీరావు.

1724 నైజాముల్ ముల్కు హైరాబాదు రాజ్యమును స్థాపించుట.

1739 నాదరుషా దండయాత్ర.

1740 -1761 బాలాజీ బాజీరావు.

1748 -1754 అహమ్మదుషా పాలనము.

1754 -1759 రెండవ అలంఘీరుని పాలనము.

1761 మూడవ పానిపట్టు యుద్ధము.

1807 షా ఆలం చక్రవర్తి కాలధర్మ మొందుట.

1862 మొగలాయీ చక్రవర్తియగు రెండవ బహదూరుషా మరణించుట.

## బ్రిటీషువారి పాలనము

1453 తురుష్కులు కాన్‌స్టాంటినోపిలును పట్టుకొనుట.

1498 వాస్కోడిగామా కళ్లికోటను చేరుట.

1509 -1515 పోర్చుగీసు గవర్నరగు అల్బూకర్కు ఆర్మజు, గోవా, మలాకా మున్నగు ప్రదేశములను జయించుట.

1595 డచ్చివారి వ్యాపారము ప్రాగ్దేశములతో నారంభించుట.

1600 తూర్పు ఇండియా సంఘము స్థాపితమగుట - పోర్చుగీసువారి అధికార మంతరించుట.

1608 తూర్పు ఇండియా సంఘపు వర్తకులు ఇండియాకు వచ్చుట.

1611 మచిలీపట్టణమునందు ఇంగ్లీషు వర్తకశాల ఏర్పడుట.

1612 ఇంగ్లీషువారు పోర్చుగీసువారిని స్వాలీయుద్ధమునందోడించుట. సూరతునందు ఇంగ్లీషువారు వర్తకశాల నేర్పరచుకొనుట.

1623 అంబాయనా హత్యలు.

1639 చంద్రగిరి రాజునొద్దనుండి ఇంగ్లీషువారు మద్రాసునందు సెంటు జార్జికోటను కట్టుకొనుట కనుజ్ఞ బడయుట.

1650 ఇంగ్లీషువారు హుగ్లీయందు వర్తకశాల నేర్పరచుకొనుట.

1661 బొంబాయి ఇంగ్లీషువారి వశమగుట.

1664 ఫ్రెంచి తూర్పు ఇండియా సంఘము స్థాపితమగుట.

1690 ఔరంగజేబు కలకత్తాలో ఇంగ్లీషువారు విలియంకోటను కట్టుకొనుట కనుజ్ఞ నిచ్చుట.

1746 -1748 మొదటి కర్ణాటక యుద్ధము.

1746 ఫ్రెంచివారు మద్రాసును పట్టుకొనుట.

1749 -1755 రెండవ కర్ణాటక యుద్ధము.

